# అల్పజీవులు

నవల

వాసమూర్తి



తెలుగు వెలుగు ప్రచురణ

ఈ రచయిత ఇతర రచనలు

అబల (నవల)
అల్లరిగోపీ అద్భుతయాత్ర (బాలసాహిత్యం)
సుకుమార సేనుడు (,,)
సూర్యం కథ (,,)

మొదటి ముద్రణ 1000 ప్ర
డిసెంబరు, 1962

మొదటి 160 పేజీలు మా
భారతీ ప్రెస్, రాజమండ్రి
మిగిలినవి
కె. వి. స్టేట్ ఆఫ్టర్ కేర్ -
ప్రింటింగ్ ప్రెస్, రాజమం
ముద్రించబడ్డాయి



వెల : అయిదు రూపాయిలు

తెలుగు వెలుగు
పబ్లికేషన్స్
వారణాసివారి ఇల్లు
కూచిమంచి అగ్రహారం
అమలాపురం

# ముందుమాట..

ఇది డాక్యుమెంటరీ (వార్తాచిత్రపు) టెక్నిక్‌తో సాగిన రచన. అంటే ఒక నిమ్న మధ్యమవర్గ కుటుంబ జీవితం యథా తథంగా చిత్రించడానికే ఇందులో ప్రయత్నం జరిగింది. సహజంగా ఇందులో ప్రత్యేకంగా కథ కోసంగానీ, పాత్ర చిత్రణకుగానీ, ఒక సమస్యా, సిద్ధాంతం ప్రతిపాదించడానికి గానీ కృషి జరగలేదు. ఇది ఒక మాదిరిగా తెలుగు నవలారచనలో కొత్త ప్రయోగమే. ఇందులో అక్కడక్కడ ఎదురయ్యే చర్చలూ, వాదాలూ తరచుగా వినవచ్చేవే. పాఠకులు ఈవిషయం దృష్టిలో పెట్టుకుంటారనే ఆశిస్తున్నాను........

కొన్ని కారణాల వలన ఈనవల స్వయంగా ప్రచురించడానికి సాహసించవలసి వచ్చింది. తత్ఫలితంగా వచ్చే వ్యయప్రయాసలకు సిద్ధపడినా అనుకోని అవాంతరాలు వచ్చి, అంచనాలు తారుమారై తరుచు నిరాశా నిస్పృహలకు కావలసి వచ్చింది. ఇటు నాజీవితంలోనే ఒక విషమ ం ఎదుర్కోవలసి వస్తోంది. అటు దేశానికే విపత్కర పరి తి ఎదురైంది. అందువలన కలతజెందిన మనస్సుతోనే ఈ నవలను పాఠకుల ముందుంచుతున్నాను.......

ఈ నవల వ్రాతప్రతి ఎంతో ఓర్పుతో చివరివరకూ జాగ్రత్తగా చదివి — నాదస్తూరీ చాలా పాడుగా ఉంటుంది — అక్కడక్కడ దొర్లిన చిన్నపొరబాట్లు నా దృష్టికి తెచ్చి సహాయపడి, అంతటితో ఊరుకోక ఈ నవల ప్రచురణకు ప్రోత్సాహమిచ్చిన విశ్వసాహిత్యమాల సంపాదకుల శ్రీ మహీధర జగన్మోహనరావుగారికీ, చక్కని ముఖచిత్రం గీసి ఇచ్చిన నా మిత్రులు శ్రీ పేరి సుబ్బారావుగారికీ, ముద్రణ వ్యవహారభారం వహించిన నా సోదరుడు వారణాసి రామసూర్యనారాయణకూ నా ప్రత్యేక కృతజ్ఞత తెలుపుకోవలసి ఉంది .......

.... వాసమూర్తి

అంత ఇరుకూ అంత విశాలమూ కాని వీధి. ఆ వీధి మధ్యలో ఉంది రామలింగంగారి ఇల్లు. చుట్టూ పెద్ద ప్రహారీ గోడ. గోడపైన గాజుపెంకులు. ఆ గోడకు ఎన్నేళ్ళయిందో సున్నంవేసీ, మరమ్మతుచేసీ. నల్లగా గారబట్టి ఉంది. చాలా చోట్ల బెల్లు ఊడిపోయి ఇటుకలు కనిపిస్తూ ఉంటాయి. ఆ గోడకి పెద్ద కర్రగేటు. అందులో చాలా చెక్కలు లేవు. గేటు తీయనక్కరలేకుండానే కుక్కలు ధారాళంగా వస్తూ పోతూ ఉంటాయి. ఆ కుక్కలను తరుముతూ ఉండడం ఇంటి ఆయనకు ఒక ముఖ్యమైన పనీ, కాలక్షేపం కూడా. ఇంటి ముందర కుడివైపు బాదంచెట్టూ, ఎడమవైపు సపోటాచెట్టూ ఉన్నాయి. ఆ వీధిలో పిల్లల దృష్టి ఎప్పుడూ ఆ రెండు చెట్ల మీదా ఉంటాయని వేరే చెప్పనక్కర్లేదు. వాళ్ళ దృష్టిలో ఇంటి ఆయన రెండో యమధర్మరాజని కూడా చెప్పనవసరం లేదు.

రామలింగంగారి ఇల్లు మేడ. పాతకాలపుపద్ధతి మేడ. పైకప్పు పెంకుటిది. క్రిందభాగాన సన్నటి అరుగులూ, ఆ అరుగుల చివర నల్లగచ్చుచేసిన రెండు పెద్ద స్తంభాలూ. ప్రధానద్వారంపైన 'ఇహా దంపతీ చిరం వర్ధేతామ్' అని ాసి ఉంటుంది. పురాతనపు నగిషీ చెక్కిన తలుపులద్వారా

హాలులోకి ప్రవేశిస్తాము. హాలులో ఒకవైపు పెద్ద చెక్కల గాదె. రెండోవైపు పెద్ద భోషాణం. ఆ భోషాణం ప్రక్క పేము అల్లిన కర్రపడకకుర్చీలో పడుకొని బొజ్జ తోముకుంటూ ఎప్పుడూ సగం మూసిన కనురెప్పల మధ్యనుంచి వీధివైపుకు చూసే ఎర్రపంచమాత్రంకట్టుకున్న నల్లని స్థూలాకారమే ఇంటి ఆయన – రామలింగంగారు. ఆయనభార్య కామాక్షమ్మ అందచందాలు కాక కట్నకానుకలు చూసి చేసుకున్న సంబంధం కావడంవల్ల మొగుడి కన్నివిధాలా అనుకూలం గానే ఉంటుంది – వైశాల్యంలోనూ, కాటుకచాయలోనూ. తన వడ్డాణం, వంకెలూ, కంటే, కాసులపేరూ అందరూ చూసి పొగడాలనే కోరికతో వాటిని ఎప్పుడూ విడిచి ఉండదు. ఆ దంపతుల కొక్కడే కొడుకు వెంకటేశ్వర్లు తల్లిదండ్రుల రూప సారాన్ని పుణికి పుచ్చుకున్నాడు. నల్లగా లావుగా ఎత్తుగా ఉంటాడని మీరు గ్రహించే ఉంటారు. పొట్టిగా కత్తిరించిన క్రాపింగు, బంగారుఫ్రేము కళ్ళజోడు, సిల్కుపంచె, సిల్కు లాల్చీ ధరించి ఉంటాడు. నిరంతరం నమిలే కారాకిళ్ళీతో పళ్ళు గారపట్టి ఉంటాయి. రామలింగంగారూ, కామాక్షమ్మ గారూ కోడలిని మాత్రం ఎంచి తెచ్చుకున్నారు. కోడలు అన్నపూర్ణ సన్నగా, తెల్లగా, కొంచెం పొట్టిగా ఉండి జాజిపూవులా నాజూకుగా ఉంటుంది. ఆ యింటివారి మధ్య ఆమె తిరుగుతూంటే కారుమబ్బులమధ్య మెరుపుతీగ మెరిసిన ట్లుంటుంది. కొడుకూకోడలూ ఎప్పుడూ మేడమీదే మకాము.

వెంకటేశ్వర్లు తూగుటుయ్యాలలో ఊగుతూ రేడియో వింటూ ఉంటాడు. ఇంటివారి దైవభక్తికి నిదర్శనంగా ఇంటినిండా దేవుళ్ళపటాలే. ఇంటివారి దొంగల భయానికి చిహ్నంగా ఇంటికి చాలా తక్కువకిటికీలూ, అవైనా చిన్నవిగా ఉంటాయి. ఇంట్లో ఏదో ఊపిరాడనట్లుంటుంది. కొడుకు జ్ఞానం వచ్చిన తరువాత ఎలెక్ట్రిసిటీ తెప్పించి, ట్యూబులైట్లూ, రేడియో పెట్టించాడు. గృహిణీ, గృహయజమానీ పిల్లికి బిచ్చంవేసే-వారు కాకపోయినా కొడుకు చేయించిన ఖర్చును గొప్పగా చెప్పుకుంటూ ఉంటారు. ఇంతకీ మనకి ఇంటివారితో అంత ఎక్కువ ప్రమేయం లేదు. మరి ఇక్కడే ఇంతసేపు ఎందుకు ఆగా నంటే ఆ ఆవరణలో ప్రవేశించినవా రెవరైనా ముందు ఇంటిఆయన అడిగే సవాలక్షప్రశ్నలకి సమాధానం ఇస్తేకాని ఆ ఆవరణలో అద్దెకున్నవారిదగ్గరికి పోలేరు.

కుడివైపు బాదంచెట్టు ఆకులు తొక్కుతూ ప్రక్కకు పోతే సందులా ఉంటుంది. ఆ ప్రక్కన ఇంటివారు కట్టెలూ, ఇతరకలపా, సామగ్రీ పెట్టుకుందుకు ఒక రేకుషెడ్డు వేసుకున్నారు. ఇప్పుడు ఆ రేకుషెడ్డులోనే కొంత ఖాళీచేసి రెండు తడకలు కట్టి మునిసిపాలిటీలో బిల్లుకలెక్టరుగా పనిచేస్తున్న ఒక అరడజను పిల్లల తండ్రికి ఎనిమిదిరూపాయిల కద్దెకిచ్చారు. ఆ బిల్లుకలెక్టరు ఉన్నకాస్తస్థలం చాలక నులకమంచాలూ అవీ ఆ సందులోనే పెట్టుకుంటాడు. కాబట్టి కాస్త జాగ్రత్తగా నడవాలి. నడిస్తే మేడకు వెనకాల ఇంటికి వస్తాం. ముందు

చరిత్ర ప్రసిద్ధమైన తూముకాలువ అడ్డువస్తుంది. ఈ తూము కాలువ లెవ రెంతవరకు బాగుచేయాలి అనే విషయంపై ఇళ్ళలో అద్దెకున్నవారిలో — తరుచు ఇంటివారితో కూడా — చిన్నయుద్ధాలు రేగుతూంటాయి. అందుకే ఆ తూముకాలువను చరిత్ర ప్రసిద్ధమైనది అనవలసివచ్చింది. దానిమీాద దాటేందుకు నాపరాళ్ళు పెట్టి ఉన్నాయి కాని అవి పగిలిపోయి ఉండడం వల్ల కదులుతూ పరాకు చెప్తుతూ ఉంటాయి. ఇప్పుడు మేడ వెనక ఇంట్లో అద్దెకున్నవాళ్ళను కలుసుకోగలం. అది కేవలం పెంకుటిల్లే. అదికూడా తనవయస్సు చెప్పుకోవడానికి ఏమీా సిగ్గుపడదు. అందులో మూాడువాటాలు. అవతలివైపు చివరి వాటాలో ఒక ప్లీడరుగుమాస్తా ఉన్నాడు. ఆయనా భార్యా పిల్లలూ కూడా చీటికీమాటికీ తగాదాకి తయారయ్యేరకం. వాళ్లంతట వాళ్లే ఎదుటి వసారాలో ప్రక్క-వాటాలవాళ్లతో సంబంధం లేకుండా ఒక వెదురుతడక అడ్డం కట్టుకున్నారు. మధ్యవాటాలోఉన్న పి. డబ్ల్యు. డి. గుమాస్తా రామకృష్ణమూర్తి ఈ చివర వాటాలో ఉన్న శ్రీహరి కొంచెం సఖ్యంగానే ఉంటారు. అందువల్ల వాళ్ళు తమ వాటాలమధ్య తడకలేమీా అడ్డు కట్టుకోలేదు. ఈ చివర వాటాలో ఉన్న శ్రీహరితోనే మనకు ముఖ్యంగా పని.

*    *    *

ఒకరోజు —

"ఏమే తొమ్మిదవుతోంది వంట అయిందా లేదా?"

అని కేకేశాడు శ్రీహరి, ప్రైవేట్లనుంచి అప్పుడే తిరిగి వస్తూ, "ఎక్కడివంటండీ! చస్తోంటేనూ ఈ పచ్చికట్టెలతో! పొగతో కళ్ళు చిల్లడిపోతున్నాయి కాని కూరముక్కలుమాత్రం ఉడకడం లేదు," అని వంటింట్లోనుంచే జవా బిచ్చింది వరలక్ష్మి వెదురువిసనకర్రతో పొయ్యి విసిరివిసిరి చేయిలాగి చీరకొంగుతో కళ్లు ఒత్తుకుంటూ. "ఎట్లా మరి? అవతల టైమయిపోతోంది. రోజూ ఆలస్యంగావెళ్తే హెడ్మాష్టారు ఊరుకుంటాడా? అసలు ఎప్పుడయింది టైముకు వంట!" అని విసుక్కున్నాడు శ్రీహరి – కాంపోజిషన్ పుస్తకాల కట్టలో నుంచి ఒక పుస్తకం తీసి త్వరగా దిద్దుతూ. "నేనేం కాళ్ళు జాపుకొని కూర్చోలేదు. తెల్లవారుజామునుంచీ ఒక్కనిమిష మేనా ఊపిరి తీసుకోకుండా కొట్టుకు చస్తూంటే ఇట్లా ఉంది. నన్నేం చెయ్యమంటారు? ఈ పొయ్యా, కట్టెలూ చూస్తున్నారా? అంతగా తొందరైతే అన్నం మాత్రం ఉడికింది ఆవకాయ వేసి పెట్తాను రండి" అంది కొంచెం చిరాకుతో వరలక్ష్మి. "అదే పడెయ్యి, వస్తున్నాను"అని శ్రీహరి రెండు పుస్తకాలుమాత్రందిద్ది కట్టకట్టేసి కాళ్లుకడుగుకొని వచ్చాడు.

వరలక్ష్మి పీటవేసి, కంచంపెట్టి, అన్నం వడ్డించింది. ఆవకాయకూడా వేసి, నేతిగిన్నె దగ్గరపెట్టి మళ్లావెళ్లి పొయ్యి దగ్గర కూచ్చుంది. శ్రీహరి అన్నం కలుపుకుతింటూ అన్నాడు, "కూర దేవిగారికే కాబోలు!" వరలక్ష్మి పొగవల్ల నీళ్లుకారుతున్న కళ్ళతో అతనికేసి కష్టంగా చూసింది. "ఊఁ, నా

కోసమే ! ఈ కూరంతా నేనే తింటాను ! దెప్పడంమాత్రం బాగా చేతనైంది" అని మళ్ళీ పొయ్యి విసరడం మొదలు పెట్టింది. శ్రీహరి ఆవకాయ అన్నం తినేసి, "పోనీ పులుసేనా అయిందా ?" అని అడిగాడు. "ఒక్కనిమిషం ఉండండి, పోపు వేగించి కూర తిరగమోత పెట్టేస్తాను"అని ఆమె కూరముక్కలు పొయ్యిమీదనుంచి దింపింది. ఇంతలో "వదినా, వంట అయిందా ? కాలేజీ టైమవుతోంది" అంటూ రాధాకృష్ణ వచ్చాడు. "అయినంత అయింది, నాయనా, కంచంపెట్టుకో" అంది వరలక్ష్మి. రాధాకృష్ణ పీటవేసుకొని కంచం పెట్టుకోగా వరలక్ష్మి అతనికికూడా వడ్డించి వచ్చి, పొయ్యిమీద గిన్నెలో నూనెవేసి మిరపకాయముక్కలూ అవీ వేస్తోంది. ఇంతలో అవతలిగదిలోనుంచి "ఊఁ ఊఁ అమ్మా ఊఁ ఊఁ" అంటూ ఏడుపు వినిపించింది. "నీకుకూడా టైమయిందా, నాన్నా ? ఉండు, ఉయ్యాలల్లోంచి ఊడి పడ కొక్కనిమిషం"అని పోపు వేగిస్తోంది వరలక్ష్మి. దబేలుమని చప్పుడూ, పెద్దపెట్టున ఏడుపూ. "బాబు పడ్డట్టున్నాడే, వెళ్ళి తియ్యి ముందు" అన్నాడు శ్రీహరి. "ఎట్లా చచ్చేది ? ఇటు ఈ పోపు మాడి పోతుందో ఏమో" అని పొయ్యిలోనుంచి రెండు కట్టెలు ఇవతలకు లాగి పరుగెత్తి వెళ్ళింది వరలక్ష్మి. బాబు ఉయ్యాల లోంచి క్రిందపడి లేచి కూర్చొని పెద్దగా ఏడ్చేస్తున్నాడు. వరలక్ష్మి "ఏమంత అర్జంటు వచ్చిందిరా నాన్నా – వచ్చే లోగా పడిపోయావు ? ఆ సూరీడు ఎక్కడికి తగులడిందో

వెధవపెత్తనాలూ ఇదీనూ. ఒక్కక్షణం ఇంటిపట్టున ఉండదు" అని తిట్టుకుంటూ పిల్లవాడిని ఎత్తుకొని సముదాయిస్తూ వంటింటివైపుకు నడిచింది. "పిల్లదాని నెందుకే తిట్టావు? అదేం చేస్తుంది — కుర్రముండ? వాడి ని టియ్యి" అంది. దొడ్లో తులసిమొక్కముందు కూర్చున్న అత్తగారు. మనుమరాలికి ఆవిడ పేరే పెట్టారు. అందువల్ల ఆపిల్ల నేమన్నా ఆవిడ ఊరుకోదు. వరలక్ష్మి పిల్లవాడిని ఆవిడకిచ్చి వచ్చి పోపువేగించి, కూర తిరగమోతవేసి, వేడివేడిగానే వడ్డించింది భర్తకీ మరదికీ. అది చల్లారడానికి విసనకర్రపెట్టి వాళ్ళకంచాలమీద విసరడం మొదలుపెట్టింది. "ఏమేవ్ కోడలా, వీడు నాదగ్గర ఉండడం లేదే. నువ్వే తీసుకో తల్లీ," అని కేకేసింది అత్తగారు. "వస్తున్నా నుండండి ఒక్కనిమిషం, పులుసులో కూడా పోపు పెట్టి వస్తాను. ఆలస్యమయితే వీరు లేచిపోతారు" అంటూ ఆ పనికూడా చూడసాగింది వరలక్ష్మి. అవతల బాబు కక్కటిల్లిపోతున్నాడు. ముందు పిల్లవాణ్ణి తీసుకోమన్నారు శ్రీహరీ రాధాకృష్ణా. వరలక్ష్మి వెళ్ళి పిల్లవాడిని తీసుకువచ్చి, రెండో చేతితో పులుసు పోపుపెట్టి వడ్డించింది. శ్రీహరీ రాధాకృష్ణా భోజనంచేసి లేచారు. "అమ్మ! ఒక పరీక్ష అయింది!" అని వరలక్ష్మి ఒక నిట్టూర్పు విడిచి నేలమీద కూలబడి పిల్లవాడికి పాలివ్వసాగింది.

శ్రీహరి బట్టలువేసుకొని, కాంపొజిషను పుస్తకాలకట్ట సైకిలుకారియర్ కి కట్టుకొని "వెళ్తున్నాను"అని కేకేసి సైకిలు

బయటికి తీశాడు. వరలక్ష్మి పిల్లవాడికి పాలిస్తూనే లేచి వచ్చింది. శ్రీహరి సైకిలుచైన్ ఊడిపోతే దానిని సరిచేస్తు న్నాడు. "ఆ డొక్కుసైకిలుతో బాధ పడేకన్న శుభ్రంగా ఓ కొత్తసైకిలు కొనుక్కోకూడదూ ? దానికి రిపేరులేని రో జంటూ ఉందా అని" అంది వరలక్ష్మి. "దాని జీవితం నా జీవితం ఒకటే. ఏదో ఇట్లాగే నెట్టుకు రావాలి. నా మొగానికి కొత్తసైకిలు కూడానా! పోనీ పెద్దకబుర్లు చెపుతావు — మీా నాన్నచేత ఏదో పండగ వంకపెట్టి కొత్తసైకిలు ఇప్పించ రాదూ"అన్నాడు శ్రీహరి భార్యవంక కనుకొలకుల్లోనుంచి చూస్తూ. "మావాళ్ళ కా స్తోమతు ఉంటే నా రాత ఇట్లా ఎందుకుంటుంది ?" అంది వరలక్ష్మి కొంచెం బాధగా. "అవును లేకపోతే హాయిగా ఏ గొప్ప ఉద్యోగినో చేసుకొని సుఖంగా ఉందువుకాదూ" అంటూ చిరునవ్వుతో సైకిలు తీసుకొని నడిచాడు శ్రీహరి. వరలక్ష్మి బుంగమూతి చేసుకుంది. ఇంతలో 'ఆవేళ షష్టుతారీఖు, జీతం వస్తుంది' అని జ్ఞాపకంవచ్చి "ఏమండీ" — అని కేకేసి, పౌడరుడబ్బా కొనుక్కురండని చెపుదా మనుకొని, మరది దగ్గరకు వస్తూండడం చూసి చెప్ప డానికి సిగ్గుపడి ఊరుకుంది. రాధాకృష్ణ వచ్చి, "వదినా, ఈ వేళ అన్నయ్యకు జీతం వస్తుంది. నాకు చిల్లరఖర్చుకు కాస్త డబ్బిప్పించు. ఇంతవరకు ఇచ్చింది అయిపోయింది," అని నసిగాడు. "మళ్ళీ ఏమన్నా హిందీ సినీమా వచ్చిందేమిటి ?" అని అడిగింది ఆమె. రాధాకృష్ణ తల వంచుకున్నాడు! "చాలా

గొప్పదికాదూ ?'' అని ఆమె నవ్వింది. రాధాకృష్ణ నవ్వుతూ "సరే వస్తాను వదినా. టాటా బాబూ''అంటూ అన్నకొడుకు చేయి ఊపి వెళ్ళిపోయాడు. వరలక్ష్మి కొంచెంసేపు అటుకేసే చూసి లోపలికి వచ్చింది.

ఇంతలో సూర్యావతి తన బొమ్మలు తీసుకొని, తిప్పు కుంటూ లోపలికి వచ్చింది. "అమ్మా, అన్నం పెడ్తావా ?'' అంటూ. "తీరుబడి అయిందా తల్లీ ? పెట్టాను అన్నయ్యని కూడా రానియ్యి'' అంది వరలక్ష్మి. మాటలోనే వచ్చాడు వెంకటరమణ గంతులువేసుకుంటూ, సినీమాపాటలు తనకు వచ్చినరీతిని పాడుకుంటూ. గుమ్మంలో అడుగుపెట్టగానే పుస్తకాలసంచి ఒకమూల గిరవాటువేసి "అమ్మా అన్నం''అంటూ పెద్ద కేకవేసి, చొక్కా విప్పి, "వివాహ భోజనం'' అని పాడుతూ పెరట్లోకి వెళ్ళాడు. కాళ్ళు కడుగుకు వచ్చాడు. వరలక్ష్మి "ఏమండి, అత్తయ్యా, భోంచేస్తారా?''అని అడిగింది తులసిచెట్టుదగ్గర జపంచేస్తున్న అత్తగారిని ఉద్దేశించి. అది జపమో, ఎండలో కూర్చోవడమో తెలియదుకాని పొద్దున్నే స్నానంచేసి పట్టుబట్ట కట్టుకొని తులసమ్మదగ్గర చేరుకుంది ముసలావిడ. ఇంట్లో పనికేసి కన్నెత్తైనా చూడదు. పైగా తగని ఛాదస్తం. ఆవిడకుతోడు పక్కింటి రామకృష్ణమూర్తిగారి తల్లికూడా చేరుతుంది. ఇద్దరూ తమ కోడళ్ళనుగూర్చి చెప్పు కుంటూ అక్కసు తీర్చుకుంటూ ఉంటారు. వరలక్ష్మి మడిగా

వంట చేసి, అత్తగారికోసం వేరుగా ఉంచి మిగిలినవారికి వడ్డిస్తుంది. ఆవిడ తనంతట తనే వడ్డించుకు తింటుంది. అయినా సరే "భోజనం చేస్తారా?"అని కోడ లడగాలి. తను తినకుండా ముందు తినకూడదు. పొరబాటున తిందంటే తప్పక దెప్పి తీరుతుంది. "ఇంట్లో పెద్దది ఉందన్నమాటేనా లేదు. ఈ ముసలిపీనుగు ఎప్పుడు వదిలిపోతుందా అని చూస్తూఉంటారు" అంటూ. సూరమ్మగారు లేచి వచ్చింది. వడ్డించుకొని తిండి ప్రారంభించింది.

వరలక్ష్మి పిల్లవాడికి పాలివ్వడం అయింది. వాడిని తీసుకువెళ్ళి అవతల గదిలో కూర్చోబెట్టి వాడిముందు లక్కపిడతలూ, గిలగిచ్చకాయలూ, బొమ్మలూ అవీ పడేసి వచ్చింది. సూర్యావతికీ, వెంకటరమణకీ కలిపి పెట్టసాగింది. వాళ్లు తనకు ముందు ముద్దపెట్టమంటే తనకు ముం దంటూ పోటీపడుతూ ఉంటారు. గోరుముద్దలుచేసి ఒకసారి సూర్యానికి, ఒకసారి వెంకటరమణకీ పెటుతోంది వరలక్ష్మి. వెంకటరమణ అన్నం తింటూ బళ్లో విశేషా లెన్నో చెపుతాడు. వాడు చెపుతూంటే తల్లి ఊ కొట్టాలి. లేకపోతే "ఎందుకు ఊ కొట్టవు?" అని సంజాయిషీ అడుగుతాడు. వాళ్ళ భోజనా లయినతరువాత వరలక్ష్మి తనకుకూడా భర్తకంచంలో వడ్డించుకొని తింది. తరువాత కంచాలూ అవీ కడిగి, అంట్లు దొడ్లో పడేసి వంటిల్లూ పొయ్యీ శుభ్రంగా కడిగి — ఏపూటకాపూట కడగకపోతే అత్తగారు ఒప్పుకోదు, అనాచారం ఎక్కువై

పోయిం దంటుంది – వంటింటితలుపు దగ్గరబెట్టి ఇవతలకు వచ్చింది. అత్తగారు వంటఇంటి ఇవతల నేలమీద కొంగు పరచుకొని పడుకుంది. వెంకటరమణ ప్రక్కవాటాలో పిల్లలతో ఆడుకోవడానికి వెళ్ళిపోయాడు. సూర్యావతి గదిలో ఒకమూల బొమ్మలు పెట్టుకొని వాటితో ఆడుకుంటోంది.

వరలక్ష్మి ఇవతల గదిలోకి వచ్చి వారపత్రిక తీసుకొని మంచంమీద పడింది. తెల్లవారుజామున ఐదుగంటలకు లేచింది మొదలు కాస్త నడ్డివాల్చడానికి ఆమె కదే తీరిక. పత్రికపేజీలు తిప్పుతూనే ఉందికాని ఏ కథా చదవలేకపో తోంది. ఆమె మనస్సు ఎక్కడికో పోతోంది. పుట్టింటిమీదికి దృష్టి మళ్ళింది – మరీ శ్రమ అయిన రోజుల్లో ఆమెకు తప్పక పుట్టిల్లు జ్ఞాపకం వస్తుంది. లోపలినుంచి ఏదో బాధ ఉబికి వచ్చింది. అమ్మా నాన్నా ఎట్లా ఉన్నారో! నెలకో ఉత్తర మైనా రాయరు – తనుమాత్రం రాస్తోందా? ఎప్పటికప్పుడు రాయా లనుకోవడమేగాని ఏదో అశ్రద్ధ. ఆడదాని జీవితం ఇంతే కాబోలు. పుట్టింటినుంచి అత్తవారింటికి రావడమంటే ఒకమాదిరిగా పుట్టింటితో సంబంధం వదులుకోవడమే నన్న మాట. కాపురానికివచ్చిన మొదటిఏడు మాత్రమే పండగ లంటూ ముచ్చటలంటూ రెండుమూడుసార్లు పుట్టింటికి వెళ్ళింది. తరువాత ఏడాది కొకమారు వెళ్ళడం అరుదైంది. ఇప్పటి కప్పుడే పుట్టింటికివెళ్ళి రెండున్నరేళ్ళు కావస్తోంది. అమ్మ ఒంట్లో ఎట్లా ఉందో! నాన్నగారు ఎట్లా ఉన్నారో!

అన్నయ్యలూ పిల్లలూ ఎట్లా ఉన్నారో. అక్కయ్యలు — అన్నట్లు వాళ్లెట్లా ఉన్నారో! ఇద్దరూ తనలాగే తమ సంసారాల్లో మునిగి తేలుతూ ఉంటారు. తనలాగే అప్పుడప్పుడు తమ అక్కచెల్లెళ్ళనుగురించి తలపోస్తారు. మళ్ళీ ఇంటిపనులలో ఇతర వ్యాపకాలతో మరచిపోతారు. ఒకనాడు కట్టకట్టుకు తిరిగిన అక్కచెల్లెళ్ళేనా తామిప్పుడు? ఆ చిన్నతనపురోజుల్లో ఎంత బాగుండేది! తండ్రి సంసారంపరిస్థితి చాలా హీనమైనా అప్పుడదాక స్వేచ్ఛ. ఎంత నిశ్చింతగా వెళ్ళేవి ఆరోజులు! ఆ రోజులన్నీ వెళ్ళిపోయాయి. తలచుకుంటే గుండెలో ఏమిటో కెలికినట్లవుతుంది. ఇప్పుడో కుడితిలోబడ్డ ఎలుకలా ఏదో జీవితం గడుస్తోంది. ఈ జీవితంలో సుఖమూ స్వేచ్ఛా ఏమిటి? ఎందుకో ఏమి బాముకుందామనో పెళ్లి అంటే ఉబలాట పడతారు అందరూ. తనూ పెళ్ళి అంటే ఎంత సిగ్గుపడేది! ఎంత సంబరపడేది! పెళ్ళి అంటే బాజాలూ, పలకీలూ, చుట్టాలూ, పాటలూ, సరసాలూ ఇవేగా అనిపించేది. తల్లిదండ్రులకు ఆడపిల్లలపెళ్ళి ఎంత గడ్డుసమస్యో తన కేమి తెలుసు? ముందు అక్కల పెళ్ళిళ్ళు అయ్యాయి. బావలతో సరసాలతో బలే సరదాగా గడచిపోయాయి. తరువాత తనవంతు. ముందు పెళ్ళిచూపులతంతు. చూపుల కెంతో మంది వచ్చేవారు. ఎగా దిగా చూసేవారు. అడ్డమైనపరీక్షలు చేసేవారు. తగని సిగ్గేసేది. పెళ్ళి అంటే సగం ఉత్సాహం చచ్చిపోయేది. ఒకొక్కళ్లు లేచి నడవమనేవారుకూడా — పశువులసంతలో

పశువును పరీక్షచేస్తున్నట్లు. చివరికీ సంబంధం. నచ్చాడా అని తల్లి అడిగితే తను అవు ననలేదు కా దనలేదు. అయినా కాక పోయినా తను పెద్ద ఉత్సాహం చూపలేదు. చివరి కీ సంబంధమే అయింది. పెళ్ళి వేడుకలతో వినోదాలతో బాగానే జరిగింది. ఈ కొత్తజీవితంలోకి వచ్చిపడింది. తాను చిన్నతనంలో కలలుగన్నదానికీ ఇప్పటి జీవితానికీ ఏమైనా పోలిక ఉందా ? అందరి జీవితాల్లోనూ ఇంతేనేమో ? — ఏమో కొందరు అదృష్టవంతు లుండకూడదూ సర్వసౌఖ్యాలూ అనుభవిస్తూ ? తప్పకుండా ఉంటారు. తనను చూడడానికి వచ్చినవారిలో ఇద్దరు కుర్రాళ్లు చాలా అందంగా ఉన్నారు. తనకు ఆ సంబంధాలయితే ఎంతబాగుండు ననుకొంది అప్పుడు. వాళ్లు చూసి వెళ్ళినతరువాత కొన్నాళ్లు ఎన్నో తీయని కలలు కంది తను. ఇప్పుడా కుర్రాళ్ళు — ఇంకా కుర్రాళ్ళేమిటి! — ఏవో పెద్ద ఉద్యోగాలు చేస్తూ గొప్ప సంబంధాలు చేసుకొని హాయిగా జీవితాలు గడుపుతూ ఉంటారు. వాళ్ళభార్య లెంత అదృష్టవంతులో !

— బాబు మెల్లగా మంచందగ్గరికి పాకి వచ్చి లేచి నిలబడి తల్లి కొంగు లాగుతూంటే వరలక్ష్మి మళ్ళీ ఈ లోకంలోకి వచ్చింది. పిల్లవాడి నెత్తుకుంది. వాడి కళ్ళల్లోకి చూసేటప్పటికి ఆమెలో ఆనందతరంగం లేచింది. బాబును గుండె కదుముకొని పదే పదే ముద్దాడింది. ఉన్నట్లుండి తను 'మావాళ్ళ కా స్తోమతు ఉంటే నా రాత ఇట్లా ఎందు

కుంటుంది' అన్నప్పుడు భర్త 'అవును, లేకపోతే హాయిగా ఏ గొప్ప ఉద్యోగినో చేసుకొని సుఖంగా ఉందువు కాదూ' అన్న మాటలు జ్ఞప్తికి వచ్చాయి. ఒక్కసారి శూలం గుచ్చినట్లయింది ఆమెకు. తనకు ఇంతకుముందే వచ్చిన ఆలోచనలు గుర్తుచేసుకొని అపరాధం చేసిన దానిలా బాధపడ సాగింది. ఛాఛా తన కెటువంటి పాడు ఆలోచనలు కలిగాయి! తనకేమిటి? ఈ భర్తా, మరదీ, ఈ పిల్లలూ వీళ్లూ ఉండగా తను ఏం కోరుకుంటుంది? ఆయన ఎంత మంచివాడు! కోపంతో అనలేదు ఆ మాటలు. ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఆమె దృష్టి చిలకకొయ్యకున్న భర్త చొక్కామీదికి పోయింది. దాని బుజానికి చిరుగుంది. ప్రాయశ్చిత్తానికన్నట్లుగా ఆ చొక్కా తీసి, సూదీ దారం తెచ్చి బాగుచేయడం మొదలుపెట్టింది ఆమె. భర్తమాటలు మళ్ళీ తలపుకు వస్తున్నాయి. కుట్టుతూంటే కన్నీళ్లు వేలుమీద పడ్డాయి. వెంకటరమణ ఇంట్లోకి వచ్చాడు. "అమ్మా, బాబు నొకసారి ఎత్తుకోవద్దూ" అంటూ తల్లిదగ్గరికి వచ్చాడు. ఆమె చటుక్కున వేలితో కన్నీళ్లు తుడిచేసుకొని నవ్వుతూ, "వద్దు నువ్వు పడేస్తావు బడిలో ఏమీ ఇంటిపని ఇవ్వలేదూ?" అని అడిగింది. "చూచిరాత ఉంది" అని వెంకటరమణ పుస్తకాలసంచి తెచ్చుకొని, నేలమీద కూర్చొని, పాఠ్యపుస్తకం పలకా పైకి తీసి, పుస్తకంలోనుంచి చూసి రాయడం మొదలుపెట్టాడు. అవతల సూర్యావతి తన బొమ్మలతో ఏవో కబుర్లు చెబుతోంది.

కాళ్లమీద పడుకోబెట్టుకొని, వాటికి 'నీళ్లు పోస్తోంది'. వరలక్ష్మి కొంతసేపు దాని ఆట చూసింది. మళ్ళీ వెంకటరమణకేసి చూసింది. వాడు నేలమీదికి వంగి పెదవులు బిగించి, కనుబొమలు ముడిచి, ఎంతో దీక్షతో అక్షరాలు వ్రాస్తున్నాడు. తల్లిచేతుల్లోనుంచి బాబు క్రిందికి జారి అన్నగారిదగ్గరికి పాకి వాడిని పట్టుకొని లేచి నిలబడుతున్నాడు. తల్లివైపు తిరిగి 'దా, దా,' అంటూ చేయి ఊపుతున్నాడు. ఆ దృశ్యం చూస్తూ వరలక్ష్మి తన బాధ లన్నీ మరచిపోయింది.

## ౨

శ్రీహరి ఎంతత్వరగా వెళ్దా మనుకున్నాడో అంత ఆలస్యం కాసాగింది. సైకిల్ చెయిన్ నాలుగుసార్లు ఊడింది. ఇంకొకటి ఏదోకూడా వదులైనట్లుంది. ఒకటే దడదడచప్పుడు. చెయిన్ సరిచేసుకొని ఆ సైకిలు ఎంతవేగంగా వెళ్ళగలదో అంతవేగంగా తొక్కుతూ, ఆయాసపడుతూ తననుదాటి దూసుకుపోతున్న కార్లూ, మోటర్ సైకిళ్ళూ, స్కూటర్లూ, కొత్తసైకిళ్ళమీద పోతున్నవారికేసి అసూయగా చూస్తూ బడి చేరబోతూంటేనే మూడోగంట అయింది. అటెండంస్ రిజిష్టరు హెడ్ మాష్టరుదగ్గరికి వెళ్ళిపోతుందేమోనన్న కంగారుతో శ్రీహరి మరికాస్తబలంగాతొక్కి, స్కూలు చేరుకొని,

సైకిలు బడిచూరుక్రింద పెట్టి — ఆ చిన్న మిడిల్‌స్కూలుకి సైకిలుషెడ్డు లేదు — లోపలికి పరుగెత్తాడు. రిజిష్టరు ఇంకా ఇవతలే ఉంది. ఈవేళ హెడ్‌మాష్టరు ఇంకా రాలేదు. "అమ్మ! బతికి పోయాను" అని ఒక్క నిట్టూర్పు విడిచి, సంతకంచేసి శ్రీహరి స్టాఫ్‌రూంలోకి నడిచాడు. హెడ్‌మాష్టారు ఇంకా రానందువల్ల మూడో బెల్లయినా మాష్టర్లింకా క్లాసులికి కదలలేదు. కబుర్లు చెప్పుకుంటున్నారు. శ్రీహరి కూడా కాస్త అలసట తీర్చుకుందామని ఒక కుర్చీలో కూలబడ్డాడు.

"ఏం శ్రీహరీ, నువ్వుకూడా ఓ టికెటు కోస్తావుకాదూ" అని అడిగాడు ప్రక్కనే కూర్చున్న సెకండు 'సి' మాష్టరు నరసింహారావు పురుగునుచూసిన బల్లిలా చలనంలోకివచ్చి. నరసింహారావుకు 'అదృష్టం' మీద విపరీతమైన విశ్వాసం. అదృష్టం ఎప్పుడు వస్తుందో ఎవరు చెప్పగలరు? దానికోసం ప్రయత్నం చేస్తూనే ఉండాలి. ఈ విశ్వాసంతోనే అతను ప్రతి లాటరీకీ కట్టూ ఉంటాడు. ఇదివరకు క్రాస్‌వర్డ్స్ పజిల్స్ నియమం తప్పక కట్టేవాడు. క్రాస్‌వర్డు పజిల్స్ నిషేధించబడి నప్పుడు నరసింహారావు ప్రభుత్వాన్ని దుమ్మెత్తిపోశాడు. "ఇది ప్రజాస్వామ్యం కాదు. నియంతృత్వమే. చూస్తే రేపు ఎంతమంది పిల్లల్ని కనాలో — అన్నట్లు అదప్పుడే మొదలు పెట్టారు కూడా వీళ్ళమ్మకడుపు కాలా! — ఎంత అన్నంతినాలో ఎంతసేపు నిద్రపోవాలో, ఎప్పుడు భార్యదగ్గరికి — అన్నీ

కంట్రోలు చేసేటట్లున్నారు" అని కంఠం నొప్పిపెట్టేటట్లు తన తోడి ఉపాధ్యాయులముందూ, తనను పొరబాటున పలుకరించినవాళ్ళముందూ ఆవేశంతో ఉపన్యాసా లిచ్చాడు. ఏమైనా ఈ 'రాఫిల్స్' వంకని తనబోటివారికి ప్రభుత్వం కొంత అవకాశ మిచ్చినందుకు అదే గుడ్డిలో మెల్ల అనుకొని శాంతించాడు. పోనీ తను లాటరీలకు కట్టడంతో ఊరుకోడు. కనిపించినవాడిచేతకూడా కట్టిస్తేకాని ఊరుకోలేడు. చాలా లాటరీ ఏజంట్లకు సబ్ ఏజంటుగా పనిచేస్తాడు. వచ్చే కమీషనుతో తనవంతు టిక్కెట్లు కొనుక్కుంటాడు. ఇంతవరకూ అదృష్టం అతన్ని ఒక్కసారైనా వరించలేదు. అయినా అదృష్టంపట్ల అతని విశ్వాసం వీసమంతైనా సడలలేదు సరికదా మరింత బలపడుతూనే ఉంది. ఇంకానయం. ఇదివరకు క్రాస్‌వర్డ్ పజిల్స్ ఉన్నప్పుడు ఏమాటలు తగిన వంటూ అందరినీ చర్చలలోకి లాగేవాడు. ఇంటర్‌లాకర్స్, లాకర్సుతో పెర్ముటేషన్ టేబిల్సు తయారుచేసుకోవడంలో కాంపొజిషన్లు దిద్దడం మానేసేవాడు. పాఠాలుకూడా సరిగా చెప్పేవాడుకాడు. హెడ్‌మాస్టారు కేకలేస్తే దున్నపోతుమీద వర్షం కురిసినట్లే ఏమీ పట్టించుకునేవాడుకాడు. శ్రీహరికి ఇటువంటివాటిలో అంత ఆసక్తిలేదు. పిల్లలు పుట్టకముందు నాలుగైదుసార్లు లాటరీలలో తన అదృష్టం పరీక్షచేసి చూసుకున్నాడు. తన దదృష్టజాతకం కాదని నిర్ధారించుకున్నాడు. మళ్ళీ వాటి జోలికి పోవడంలేదు. కాని నరసింహారావు జలగలా పట్టు

కుంటున్నాడు. ఎప్పటికప్పుడు శ్రీహరి ఎట్లాగో తప్పించుకుంటూ వస్తున్నాడు. ఈ సారికూడా "చూదాం" అన్నాడు. "చూడా మంటే కాదు. ఈసారి కట్టెయ్యాలిసిందే. నాలుగు టికెట్లు కోసెయ్యి. ఛాన్సు చూసుకో, లక్షరూపాయలు ఫస్టు ప్రైజు. ఆమధ్య నెల్లూరుదగ్గరే ఒకామెకు వచ్చింది —" అంటూ చెప్పుకుపోతున్నాడు నరసింహారావు. అతని బాధ పడలేక క్లాసుకు పరుగెత్తాడు శ్రీహరి.

క్లాసుకి వెళ్లేసరికి అక్కడో చిన్న కుస్తీపోటీ జరుగుతోంది. క్లాసులీడరూ, మరోకుర్రాడూ కిందపడుతున్నారు. మీదపడుతున్నారు. జుట్టుపట్టుకుంటున్నారు. మిగతా పిల్లలు కొందరు క్లాసు లీడరునీ, కొందరు ఎదురు తిరిగిన కుర్రాణ్ణీ సమర్థిస్తున్నారు. అరుస్తున్నారు. శ్రీహరి హడలిపోయాడు. హెడ్ మాష్టారు ఇదిచూస్తే! ఎదరకు పరుగెత్తి ఇద్దరు పిల్లల్నీ విడదీశాడు. "ఎవళ్లస్థలాల్లో వాళ్లు కూర్చోండి. ముందు హాజరు తీసుకుంటాను" అని హాజరు తీసుకున్నాడు శ్రీహరి. వెంటనే లీడరు లేచి "మాష్టారూ వీడు సైలెంటుగా కూర్చోమంటే కూర్చోడం లేదండీ. ఊరికే గొడవ చేస్తున్నాడండీ. పేరెక్కించానని తిటుతున్నాడండి. వీళ్లందరూ కూడా మాట్లాడారండి"అని పేర్లురాసిన కాగితం ఒకటి అందిచ్చాడు. శ్రీహరి పేర్లు చదివి వాళ్లనందరినీ బెంచి ఎక్కమన్నాడు. "మాష్టారూ—"అని వాళ్లేదో చెప్పబోతూంటే, "ముందు బెంచెక్కి మరీమాట్లాడండి"అని ఉరిమాడు శ్రీహరి. వాళ్లు

బెంచి ఎక్కారు. లీడరుతో పోట్లాడిన కుర్రాడు "మాష్టారూ, లీడరు తనవాళ్ల పేర్లెక్కించడం లేదండీ. కావాలని మాపేర్లే ఎక్కించాడండి"అన్నాడు. బెంచిమీద ఎక్కిన కుర్రాళ్లు కూడా "అవునండి మాష్టారూ"అన్నారు. కొందరు కుర్రాళ్లు లీడరుని సమర్థిస్తూ "కాదండీ, అంతా అబద్ధం"అంటూ అరవ సాగారు. పక్క క్లాసునుంచి ఒకకుర్రాడు వచ్చి, "మాష్టారూ, పిల్లల్ని గొడవ చేయించొద్దని చెప్పమన్నారండి మా మాష్టారు"అన్నాడు. అట్లా అనడం శ్రీహరికి అవమానంగా అనిపించింది. తను క్రమశిక్షణ కాపాడలేనట్లు – అవతల ఆయనకే అది చేతనైనట్లు! ఉడుకుబోతుతనంతో "అట్లాగే, పో"అని ఆ కుర్రాణ్ణి పంపేసి, "ఎవళ్లైనా నోరెత్తారంటే వీపు చిట్లేస్తాను, జాగ్రత్త"అని అరిచాడు. ఆడపిల్లలు తమకేసి చూసి మళ్లీ వాళ్లలోవాళ్లు మెల్లగా నవ్వుకుంటూ ఉండడం చూసి బెంచీమీదవాళ్లకి ఉక్రోషం పొంగుకు వచ్చింది. "ఆడపిల్లలుకూడా చాలా మాట్లాడారండి. లీడరు వాళ్ల పేర్లెక్కించలేదండి" అన్నాడు బెంచిమీద తిరుగుబాటు నాయకుడు. దానితో ఆడపిల్లలందరూ ఒక్కసారిగా లేచి, "ఏయ్, మా మాటెందుకెత్తుతారు సిగ్గులేకుండా. మాష్టారూ మా ఆడపిల్లలజోలికి ఈ మగపిల్లల్ని రావద్దని గట్టిగా బుద్ధి చెప్పరేమండీ"అంటూ అరిచారు. లీడరు కూడా "మాష్టారు ఆడపిల్లల పేర్లెక్కించొద్దన్నారు లేవోయ్"అన్నాడు బెంచి మీద ప్రత్యర్థికేసి చూస్తూ. "అవును. ఆడపిల్లలు ఏమిచేసినా

మాష్టర్లేమీ చేయరు. అదే మగపిల్లలుచేస్తే వీపు విమానం మోతెక్కిపోతుంది'', అని గొణిగాడు ఎవడో వెనకనుంచి. శ్రీహరి చిరాకుతో “నోరు మూసుకుంటారా లేదా'' అని బెంచిమీదఉన్న నలుగురినీ నడ్డిమీద నాలుగు వాయించాడు. క్లాసు నిశ్శబ్దమైంది. ఆవేళపాఠం చెప్పుదామని పుస్తకం తెరచి పేజీ వెదకసాగాడు శ్రీహరి. లోపల వెనకాల బెంచీ కుర్రవాడన్నమాట మెదులుతూనే ఉంది. నిజమే, ఆడపిల్లల్ని మాష్టర్లు ఏమీ చేయరు. వాళ్లని కొట్టడానికి వీలులేదు. బెంచిమీద నిలబెట్టడానికి అంతకన్న వీలులేదు. తిట్టే వాళ్లు కళ్లనీళ్లాయుధం ఇట్టే ఉపయోగిస్తారు. అది అట్లా ఉంచి మాష్టర్లకెట్లాగైగా ఆడపిల్లలంటే పక్షపాతమే. శ్రీహరికి కూడా అంతే. అందులోనూ ఆడపిల్లలందరిలో ఒక పిల్ల అంటే అతనికి ఎంతో అభిమానం. ఆపిల్లపేరు మాధవి. గుండ్రటి మొగం, చారెడేసి కళ్లు, తెల్లగా చాలా అందంగా ఉంటుంది. ఉద్యోగస్తుల పిల్ల. తల్లికూడా చదువుకున్నదట. మాధవి చక్కని దుస్తులు వేసుకొని, మొగానికి పౌడరు అద్దుకొని, రెండు జడలతో, స్టాకింగ్సూ, బూట్సుతో టిక్కు టక్కు మంటూ వస్తుంది. ఆ పిల్లను చూస్తూంటే ఎన్నోసార్లు ఎత్తుకొని ముద్దాడాలనిపిస్తూ ఉంటుంది శ్రీహరికి. కాని తను మాష్టరాయె. అందువల్ల ఆపిల్ల మెత్తటి బుగ్గలు మాత్రం మెల్లగా గిల్లి ఊరుకుంటాడు. మధ్యమధ్య ఆలోచన కలుగుతూ ఉంటుంది— 'ఈ పిల్లే ఇంత అందంగా ఉంది—

ఈపిల్ల తల్లి ఇంకా ఎంత అందంగా ఉంటుందో! ఈ పిల్ల తండ్రి ఎంత అదృష్టవంతుడు! తన కీపిల్ల ట్యూషను దొరికితే బాగుండును'—అంతలో వెనక బెంచీమీద కుర్రాడన్న మాట ములుకులా గుచ్చుకోవడంవల్ల బెంచిమీదవాళ్ళని కూర్చోమని చెప్పి పాఠం ప్రారంభించాడు.

రీసెస్ వేళకు శ్రీహరి అలసిపోయి స్టాఫ్‌రూం చేరుకున్నాడు. సెకండు 'బి' మాష్టరు గోపాలరావు టీకి పోదామా అన్నాడు. ఇంటిదగ్గరనుంచి ఫ్లాస్కులో కాఫీ, టీలు తెచ్చుకున్నవాళ్లూ, మధ్యాహ్నం అసలు ఏమీ పుచ్చుకోని శ్రీహరి వంటివారు తప్ప మిగిలిన అందరు దగ్గరఉన్న ఖాతా హోటలుకి వెళ్లారు. శ్రీహరి స్టాఫ్‌రూంలోనే కొంతసేపు పేపరు తిరగవేయసాగాడు. నరసింహారావు తన ఫ్లాస్కు తీసి టీ తాగబోతూ ఒక కుర్రవాడిచేత గాజుగ్లాసు తెప్పించి దానిలో కొంత పోసి శ్రీహరి కందియ్యబోయాడు. వద్దన్నాడు శ్రీహరి. "మొహమాటపడకు తీసుకో"అని గ్లాసు శ్రీహరి దగ్గర పెట్టాడు నరసింహారావు. "మొహమాటంకాదు. నాకు కాఫీ, టీ అలవాటు లేవు. నువ్వే తాగెయ్యి. లేకపోతే మరో కరికియ్యి"అని ఆ గ్లాసు తీసుకోలేదు శ్రీహరి. "తీసుకోవోయి ఇస్తున్నప్పుడు పుచ్చుకోకపోవడం మర్యాదకాదు. తీసుకో. నా టీకూడా చల్లారిపోతోంది", అని బలవంతాన గ్లాసు శ్రీహరి చేతిలోపెట్టి, తన కప్పులోకూడా పోసుకొని తాగసాగాడు నరసింహారావు. ఈవేళ లాటరీటికెటు కొయ్యడం

తప్పదనుకుంటూ "నువ్వు బలవంతం చేశావుగాబట్టి తాగుతున్నాను. నాకు కాఫీ టీలు అలవాటు చేసుకోవడం ఇష్టం లేదు"అంటూ అందిచ్చిన టీ తాగాడు శ్రీహరి.

"పొదుపు చేస్తున్నావన్నమాట,"అని నవ్వాడు నరసింహారావు. "ప్రొద్దుటినుంచి సాయంకాలం వరకూ క్లాసులో ఏకధాటీగా అరవాలి. కాంపొజిషన్లూ అవీ దిద్దాలి. ఈ పద్ధతి నియమాలు పెట్టుకున్నావంటే అట్టేకాలం పనిచేయలేవు సుమా", అన్నాడు.

"పోనీ మరోఫలహారమైనా తీసుకుంటూ ఉండాలి" అన్నారు. అరటిపళ్ళు ఆరగిస్తున్న తెలుగు పండితులు ఆచార్లుగారు.

"అది కాదండీ, ప్రొద్దుటి భోజనం సాయంత్రం భోజనం ఈ లోపుగా ఏమీ తీసుకోకుండా ఉంటేనే ఆరోగ్యం బాగా ఉంటుంది" అన్నాడు శ్రీహరి.

"అప్పుడే అజీర్ణంటోయి!"అన్నారు ఆచార్యులుగారు. "ఈ కాలపువాళ్ళ దార్ఢ్యాలే అట్లా ఉన్నాయనుకో. నాకిప్పుడు ఏభై దాటాయి. అయినా నేను తిన్నంత మీరు తినలేరు. నేను చేసినంత పనీ మీరు చేయలేరు. మా తండ్రుల కాలంలో అయితే ఒక్కొక్కరు శేరుబియ్యపు అన్నం తినేవారట. పట్టుదలవస్తే ఒక గెల అరటిపళ్ళు ఒకరే తినేసేవారుట. అందుకే ఆ కాలపువాళ్లు నూరేసేళ్లు బ్రతికారంటే ఆశ్చర్యం

ఏముంది ? ఈ కాలంవాళ్ళమాటే చెప్పాలి. పాతికేళ్ళకే ముసలాళ్ళలా అయిపోతున్నారు."

హోటలుకు వెళ్ళినవా రందరూ తిరిగి వచ్చారు. శ్రీహరి కాంపొజిషన్ పుస్తకాలు దిద్దడం మొదలుపెట్టాడు. వచ్చినవారు బల్లమీద ఉన్న వార్తాపత్రికలు తలో కాగితం తీసుకున్నారు చదవడానికి. ఒకరు అన్నారు: "చూశారా, రష్యావాళ్ళు చంద్రమండలానికి మనుష్యుల్ని పంపే సన్నాహంలో ఉన్నారుట. అప్పుడే పంపించారని కూడా ఒక జర్మన్ పత్రిక కథనముట."

"అట్లాంటి వార్త లెవడికి కావాలి? వాళ్ళు చంద్ర మండలం చేరుకుంటేనేం అంగారక గ్రహం చేరుకుంటేనేం మనకేమి ఒరిగింది? మన మిక్కడే ఉంటాము గదా. మన కవసరమైన వస్తువుల ధరలుమాత్రం రష్యావాళ్ళకన్న ముందు గానే చంద్రగోళం అందుకునేట ట్లున్నాయి. మన జీతాలు పెంచే ప్రయత్నం ఏమైనా ఉంటే చెపుదూ చల్లనివార్త చెవులకి" అన్నాడు నరసింహారావు.

"అదేమీ లేదు. మొన్నటిసారి పెంచాముగదా పెంచము అని ఆర్థికమంత్రిగారు ఖచ్చితంగా చెప్పారు. ప్రభుత్వందగ్గర డబ్బు లేదట" అన్నాడు ఇంకొక మాష్టరు. తనదగ్గర ఉన్న కాగితంలో గుంటూరు సభలో ఆర్థికమంత్రి మాష్టర్ల కోరికలను గురించి మాట్లాడిన ముక్కలు చదివి వినిపించాడు.

"మనదగ్గరకి వచ్చేసరికి ప్రభుత్వానికి డబ్బుండదు,

అందరికీ మాష్టర్లే లోకువ. అందుకే బ్రతకలేక బడిపంతు లన్నారు. ఊరికే అన్నారా?'' అని నిట్టూర్చాడు మరో మాష్టరు.

''ఒకసారి పెంచారయ్యా, నిజమే కాదనం. అందరికీ తలో పదో పన్నెండో చొప్పున పెరిగాయనుకో జీతాలు. కాని వాటితోబాటు ధరలుకూడా మరింత పెరిగాయి మొర్రో అంటే వినిపించుకోదేం ప్రభుత్వం. ఇంగ్లీషువాళ్ళు చెప్తారు గాడిదను త్వరగా పరుగెత్తించడానికి దానిమీద కూర్చున్న వాడు ఒక కర్రచివర ముల్లంగిదుంప కట్టి గాడిదముందు వేలాడేస్తాడట. ఆ దుంప నందుకోవడానికి ఆ గాడిద పరుగెత్తు తుంది. పాపం దానికేం తెలుసు. అది ఎంత త్వరగా పరు గెత్తితే అంత త్వరగానూ ఆ దుంపకూడా ఎదరకు పోతోందని. ఆ తంతుగానే ఉంది మన జీతాల పరిస్థితి. అసలు కమ్యూనిజం రావాలయ్యా — అప్పుడు మన అవసరాలన్నీ ప్రభుత్వమే తీరుస్తుంది,''అన్నాడు సన్నగా పొడుగ్గా ఉండి అస్థిపంజరాన్ని స్ఫురింపజేసే అప్పులరాయుడు సుబ్బారావు.

''కమ్యూనిజం వస్తే మన పీక నొక్కేస్తారయ్యా. ఇప్పుడు నువ్వు ఇట్లా ప్రభుత్వాన్ని పడతిట్టున్నా నిన్నెవరూ ఏమీ చేయడంలేదు. అదే కమ్యూనిష్టు ప్రభుత్వంలో ఇట్లా చేయగలవా? నోరెత్తితే రహస్య పోలీసులు అర్ధరాత్రివేళ వచ్చి తీసుకుపోతారు. తరువాత నీ ఐపుండదు'' అన్నాడు సెకండు 'బి' మాష్టరు గోపాలరావు.

"కడుపునిండా తిండీ, కట్టుకుందుకు చాలినంత గుడ్డా, తలదాచుకుందుకు కొంపా, రోగం రొచ్చూ వస్తే ఉచిత వైద్యం, ఇవి ఉంటే ఇంకేమి కావాలి ? ప్రభుత్వాన్ని తిట్ట వలసిన పనేముంటుంది అసలు?" అని అడిగాడు సుబ్బారావు.

"మాన్ డజ్ నాట్ లివ్ బై బ్రెడ్ ఎలోన్" అన్నాడు ఆ స్కూలులోని సెకండరీగ్రేడు అసిస్టెంటుగా పని చేస్తున్న సోషల్‌స్టడీస్ బి. ఇడి.

"అయ్యా తమరు బి. ఏ., బి. ఇడి., అని అందరికీ తెలుసండీ." ఇక్కడున్నది తెలుగువాళ్లే కాని మరెవరూ కారుకా. ఆ ఏడ్చేదేదో తెలుగులో ఏడిస్తేనేం ? – ఇంతకీ నువ్వనేది మనిషికి కూడూ, గుడ్డా, కొంపాతో సరిపోదంటావు. మరి ఏం కావాలి ? చదువుకుందుకు పుస్తకాలా ? రష్యాలో పుస్తకాలు లేవేమిటి ? నువ్వు ముక్కుమూసుకొని దేవుణ్ణి ధ్యానించుకోవా లనుకుంటా వనుకో. ప్రభుత్వాని కేమి ప్రమాదం వచ్చింది ? అది నిన్ను అర్ధరాత్రివేళ అరెస్టు చేయవలసిన అగత్యం ఏమి ఉంటుంది ?" అని గట్టిగా అడిగాడు సుబ్బారావు, వాదనలో ఆవేశంవచ్చి బల్లమీదకి వంగుతూ.

బి. ఏ. బి. ఇడి.ని సమర్థించాడు హిందీ పండితుడు : "ఏమయినా స్వేచ్ఛ ఉండదు. స్వేచ్ఛ అంటే ఇదీ అని నిరూపించలేం. కాని అది లేకపోతే దాని విలువ తెలిసి వస్తుంది" అన్నాడు.

"అయితే ఈ ప్రభుత్వం జీతాలు పెంచకపోయినా, మరేమి చేయకపోయినా నోరు మూసుకు ఊరుకోండి" అన్నాడు సుబ్బారావు విసురుగా చెయ్యి ఊపుతూ.

"అట్లా నేననడంలేదు. మన బాధలు గురించి చెప్పుకోకపోతే ఎట్లా? మన కోరికలు తీర్చడానికి కాకపోతే ప్రభుత్వం మరిదేనికి? మన బాధలు పోయినా పోకపోయినా పైకి చెప్పుకొని ఏడిస్తే కాస్త గుండెబరువు తగ్గుతుంది. అదీ వీలులేదు కమ్యూనిష్టుప్రభుత్వంలో. లోపల్లోపలే కుళ్ళుకు చావాలికాని గట్టిగా మూలగడానికి కూడా వీలుండదు. వెనకటి కాలంలో ఒక నవాబు తన ఆగ్రహానికి గురైన వాళ్ళని గోనెసంచుల్లో కుట్టించి చెఱువులో పడేయించే వాడట. చచ్చేవాడు ఎట్లాగైనా చస్తాడు. కాని పాపం గిజగిజ లాడడానికి కూడా వీలులేదన్నమాట ఆ అభాగ్యుడికి. అట్లా ఉంటుంది కమ్యూనిజంలో మనస్థితి" అన్నాడు గోపాలరావు.

"అయితే రష్యాలో ఉన్న కోట్లాది జనం గోనె సంచుల్లో కుట్టిన శవాల్లా ఉన్నారంటావా?" అని కోపంగా ప్రశ్నించాడు సుబ్బారావు.

"ఇంతెందుకు రేపు ఎలెక్షన్లు వస్తాయి. అప్పుడు కమ్యూనిష్టులకు ఓటేసి గెలిపిస్తావా, చెప్పు, ఒట్టేసి చెప్పు" అని ఎదురు ప్రశ్నించాడు గోపాలరావు.

"ఏమో నాయిష్టంవచ్చినట్లు చేస్తాను. నేను పైకి చెప్పనూకూడదు, నువ్వు అడగనూకూడదు. అసలు ఆ

పోటుకు వస్తే ఈ ఎలెక్షన్లు సరిగ్గా జరుగుతున్నాయా అని? ఎలెక్షన్లు వచ్చినప్పుడు సిద్ధాంతాలూ, ఆదర్శాలూ అన్నీ మరచిపోయి వీడు మనకులంవా డవునా కాదా, లేక మన కులంవాళ్ళతో ఒప్పందం చేసుకునేవా డవునా కాదా అనేది చూసేకా ఓట్లు వేసేది. పెద్దపెద్దలందరూ వేదికలెక్కి పెద్ద కబుర్లు చెపుతారుకాని మన ఎలక్షన్లన్నీ పూర్తిగా ముఠాపద్ధతినీ కులపద్ధతినే జరుగుతాయి. అందుకే విప్లవం రావాలంటాను—" అని ఆవేశంతో చెప్పాడు సుబ్బారావు.

శ్రీహరి కాంపోజిషన్లు దిద్దుకుంటూనే ఉన్నాడు. ఈ కబుర్లలో అతను అంతగా జోక్యం కలిగించుకోడు. కారణం కాంపోజిషను కట్టలు దిద్దకపోతే పేరుకుపోతాయి. రెండవది వాదనకు నిలబడ్డ తాహతుకానీ, ధైర్యంకానీ అతనిలో లేదు. అందువల్ల తనపని తాను చూసుకుంటూ మధ్యమధ్య ఆసక్తి కలిగినప్పుడు వింటూ ఉంటాడు.

తక్కిన మాష్టర్ల వాగ్వాదాల్లో కొత్త ఏమీలేదు. రోజూ ఉన్న కంఠశోషే. అందులో 'సీరియస్‌నెస్' ఏమీ క్రమమూ లేదు. పిపీలికాది బ్రహ్మపర్యంతం సమస్త విషయాల మీద చర్చలు చేస్తారు. ఒకొక్కప్పుడు ఎక్కడ బయలు దేరారో కూడా మరచిపోతారు. వంకాయల ధరతో ప్రారంభించి యు. ఎన్. ఓ. లో వీటో ఉండాలా అక్కర్లేదా అనే వరకూ వెళ్ళిపోతారు. ఇంతకీ ఎందుకు వచ్చింది ఈ విషయం అని వాళ్ళలో వాళ్ళే ప్రశ్నించుకొని ఆశ్చర్యపోతారు.

మధ్యాహ్నం ఫస్టుబెల్లయింది. ఈలోపుగా నరసింహారావు రాఫిల్ టికెట్ల పుస్తకం తీసి మాష్టర్ల పేర్లు రాసి ఒక్కొక్కళ్ళ కొక్కొక్కటీ, కొందరికి రెండేసి మూడేసి ఇచ్చాడు — వాళ్ళ సమ్మతి అదివరకు తీసుకునే.

"నువ్వొక్కడయ్యా యములాడిలా తగులుకుంటావు, జీతం పూర్తిగా ఇంటికి తీసుకువెళ్లే ఆనందం లేకుండా చేస్తావు" అన్నాడు గోపాలరావు.

"నావల్లే ఆ ఆనందం పోతోందా?" అని అడిగాడు నరసింహారావు కొంచెం వేడితో.

"నీవల్లే అనడంలేదు. అసలే అప్పులు మోపై ఏడుస్తున్నాం. దానికితోడు ఈ రూపాయికూడా పోతే—".

"రేపు లక్షరూపాయలు వస్తే కులుకుతావేం?"

"లక్షరూపాయలు వస్తుందని గారంటీ ఏమిటి?"

"నువ్వు కట్టే రూపాయికి లక్షరూపాయలు గారంటీగా రావాలేం?— ఏం శ్రీహరీ నీపేర రెండుటికెట్లు కొయ్యనా?" అని రాయడం మొదలుపెట్టాడు నరసింహారావు.

"వద్దు బాబూ నాకేమీ వద్దు" అన్నాడు శ్రీహరి.

"వద్దంటే కుదరదు" అని నరసింహారావు ఒక టికెటు కోసి శ్రీహరికిచ్చాడు. శ్రీహరి తీసుకున్నాడు. ఏంచేస్తాడు?

"అరే అట్లా ఏదో కొంపమునిగిపోయినట్లు మొగం పెట్టావేం? రేపు పదివేలు వస్తుందనుకో —" అన్నాడు నరసింహారావు.

"నాకు పదివేలు అక్కర్లేదు, పాతికవేలూ అక్కర్లేదు. ఇల్లా బతికితేచాలు" అన్నాడు శ్రీహరి కొంత ఉడుకుతో.

"డబ్బంటే అంత చేదా ?" అని అడిగాడు నరసింహారావు.

"అంత ధనవంతుడివా ?"అని అడిగాడు సుబ్బారావు. "ఎప్పుడూ అప్పుచేయలేదూ— అప్పుడు మరో పదిరూపాయలు ఎట్లాగో వస్తే బాగుండు ననిపించదూ ?"

"దేవుడిదయవల్ల ఇంతవరకు అప్పుచేయవలసిన అవసరం రాలేదు. ఇకముందు కూడా రాదనుకుంటాను"అన్నాడు శ్రీహరి.

"అయితే నువ్వు అదృష్టవంతుడివే నిజంగా. నీ జీతంతో ప్రైవేట్లమీద వచ్చేదానితో నీకు సరిపోతోం దన్నమాట. నీ కెట్లా సరిపోతోందో కాని మాకు ఖర్చులకీ రాబడికీ ముడి పెట్టేసరికి తలప్రాణం తోకకు వస్తోందంటే నమ్మ" అన్నాడు సుబ్బారావు.

"ఏముంది మధ్యాహ్నం మనలా కాఫీ టీలు త్రాగడు. ఏమీ తీసుకోడు కూడా. ఇట్లాంటి పొదుపు లేవో చేస్తూ ఉంటాడు" అన్నాడు నరసింహారావు.

"ఏమి పొదుపులుచేసినా లాభంలేదయ్యా. మన జీవితాలు సంసారసాగరంలో అంచువరకు మునిగి నడిచే నావల వంటివి. ఏమాత్రం మొగ్గినా పడవ బుడుంగు మనవలసిందే. మావి ఓటుపడవలు. ఎన్నోచిల్లులూ, బెజ్జాలూ ఎప్పటికప్పుడు

వాటి నేదో విధంగా కప్పుకుంటూ వస్తాం. చేతులు పడిపోయే టట్లు లోపలికి వచ్చిన నీటిని బయటికి తోడుతూ ఉంటాము. ఎంతకాలం ఇట్లా చేయగలమో భగవంతుడి కెరుక! ఎటువచ్చీ నీ నావ మంచి కండిషనులో ఉందనుకో. కాని ఎంతకాలం అట్లా ఉంటుంది? నువ్వుమాత్రం అప్పులు చేయకుండా తప్పించుకోగలవా? ఏమినమ్మకం? పైగా తుఫానులువస్తే మావీ నీవీ అన్నీ తలక్రిందులుకావడం ఖాయం," అని అంతలో వైరాగ్యధోరణిలో పడిపోయి నీరసంగాఅన్నాడు సుబ్బారావు.

అంతకుముందే అక్కడికి వచ్చిన ఇంటర్ మీడియేట్ పాసయిన సెకండరీ గ్రేడ్ అసిస్టెంటు సుందరరావు అన్నాడు: "ఏమిటయ్యా ఎప్పుడుచూసినా అప్పులూ ఖర్చులూ ఇదేగోల! రోజూ ఉన్న దేకదా. గొంతుక చించుకుంటే ఏం వచ్చింది? ఇక్కడ ఉన్నంతసేపైనా సరదాగా మాట్లాడండి. అందమైన ఆడపిల్లలనుగురించి మాట్లాడండి బాగుంటుంది." సుందరరావు ఇంకా పడుచువాడు. అతను ఎక్కువగా 'సెక్సు'ని గురించి మాట్లాడుతూ ఉంటాడు. తెలుగుపండితులదగ్గర చేరి "ఏదీ ఆచార్లుగారూ, తారాశశాంకంలో బృహస్పతి వెళ్ళిపోయిన తరువాత తార చంద్రుడికి తలంటిపోయడం, తరువాత చేసిన చేతలూ ఉన్నఘట్టం చదివి వినిపించండి. చదివితే మీరే చదవాలి. మీరు చదువుతూంటే ఒళ్లు గగుర్పొడుస్తుంది" అన్నాడు.

ఆచార్లుగారు ముసిముసినవ్వులు నవ్వుతూ "ఇప్పుడు

కాదనాయనా, ఇక్కడ చదవడం బాగుండదు. పిల్లలు వింటారు – " అన్నారు.

"పోనీ ఇంటికి రామా ?"

"ఆఁ ఎందుకు ?" అన్నారు ఆచార్లుగారు కంగారుగా. ఆయన కొత్తగా మూడో పెళ్ళి చేసుకున్నారు. ఫర్లాయి మగపురుగును ఇంటిదరికి చేరనీయడం ఆయనకు ఇష్టంలేదు." ఎప్పుడో అప్పుడు చదివి వినిపిస్తానులే.

ఇంతలో సెకండు బెల్లయింది. మాస్టర్లందరూ లేచారు. రిజిష్టరులో సంతకాలు చేసి తమతమ క్లాసులికి నడిచారు.

శ్రీహరి ప్రక్క క్లాసులోనుంచి గోపాలరావు ఇవతలకు వచ్చి శ్రీహరిని రమ్మని సైగచేశాడు. శ్రీహరి బైటకు నడిచాడు. గోపాలరావు గుసగుస లాడాడు: "చూడు శ్రీహరీ ఆ సుందరరావు, ఆ మాటలు! అందమైన ఆడపిల్లల్ని గురించి మాట్లాడాలట. వాడు మాష్టరుగా ఉండదగినవాడేనా ? కొత్త కాపురం. పెళ్లాం పురిటికి పుట్టింటికి వెళ్తే ఆ కొంపలకీ ఈ కొంపలకీ తిరుగుతున్నాడంటారు. ఎంతవరకు నిజమో తెలియదుకాని వాడి వాలకం అల్లాగే కనిపిస్తోంది. ఇంకా వాడ్ని గురించి ఎన్నో ఉన్నాయి.

"అయితే హెడ్‌మాష్టారు ఏమీ చేయరేం ? ఆయనకు తెలియదా ఈ విషయం ?"అని అడిగాడు శ్రీహరి.

"తెలియకేంకాని వాడి బావమరది కౌన్సిలర్ ఆయె. కొంచెం దూరపుచుట్టం మొకడు ఎం. ఎల్. ఏ. ఆయె. వాడిని

ఎవరూ ఏమీ చేయలేరు. ఆ ధీమాతోనే వీడి ఆగడాలు. బడిలో తారాశశాంకం చదివి వినిపించమంటాడు చూడు వాడి తెగువ !"

"మాష్టర్లకి ఇట్లాంటి బుద్ధు లుండడం ఎంత తప్పు !" అన్నాడు శ్రీహరి. ఇంతలో హెడ్ మాష్టారు వస్తున్న అలికిడై ఎవరిక్లాసుల్లోకి వాళ్లు పరుగెత్తారు.

సాయంత్రం స్కూలయిపోగానే జీతాలకోసం ఎదురు చూడసాగారు మాష్టర్లందరూ. జీతాలు పంచడంలో ఇంకా కొంచెం ఆలస్య ముంది కాబట్టి అందరూ స్టాఫ్‌రూంలో కూర్చున్నారు. గోపాలరావు నవ్వుతూ అన్నాడు: "మన ప్యూను ఎక్కడేనా కనిపిస్తున్నాడేమో చూడండి. కనిపించడు. జీతాలరోజు స్కూలు ఎగ్గొట్టేస్తాడు. అప్పులవాళ్ళు గద్దల్లా కాచుకుని చేతిలో జీత మంతా ఎగరదన్నుకుపోతా రని–".

మధ్యలో సుందరరావు అడ్డు చెప్పాడు: "ఉండ వయ్యా నీ అప్పులవాళ్ళూ నువ్వూను. కానీయండి ఆచార్లు గారూ ఇందాకా తారాశశాంకంలో నేను చెప్పిన ఘట్టం వినిపించండి. ఇప్పు డిక్కడ పిల్లలెవరూ లేరు".

ఆచార్లుగారు నశ్యంపట్టులాగి, గొంతుక సవరించుకొని శ్రోతలు కోరినట్లుగా అర్థస్ఫోరకంగా విడమరిచి చదివి వినిపించారు. ఆయన వినిపిస్తూఉంటే అక్కడ చేరిన వాళ్ళందరిలో నరాలు బిగువయ్యాయి. గుండె వేగం హెచ్చింది. మొగాలు వికిలినవ్వుతో విచ్చుబోతున్నాయి. తన కిట్లాంటివి ఇష్టం

లేదన్న గోపాలరావు, అప్పులవాళ్ల బారినుంచి తప్పించుకోవ డానికి ఎప్పుడూ ఉపాయా లాలోచిస్తూ ఉండే సుబ్బారావు వగైరాలు, కాంపోజిషను పుస్తకాలు ఇంకా అట్లాగే ఉన్నాయే అని ఆదుర్దాపడే శ్రీహరి వగైరాలు కూడా తమని తాము మరచిపోయి ఉద్రేకంలోపడి కొట్టుకుపోయారు.

“పద్యపఠనం పూర్తవగా, “చూడండోయి, మనలో జీవం లేచి రాలేదూ ? ఇట్లాంటివి వింటే కాటికి కాళ్ళు చాచు కున్న ముసలి తొక్కైనా బ్రతికితీరా లనిపిస్తుంది. ఆచార్లు గారంటే ఏమనుకున్నారు ? రసజ్ఞులు. ఏభై యో పడిలో పడినా ముచ్చటగా మూడో పెళ్ళి చేసుకున్నారు. ఏమండీ ఆచార్లుగారూ మళ్ళీ తండ్రి కాబోతున్నారని విన్నాను –” అని అడిగాడు సుందర్రావు.

ఆచార్లుగారు కొంచెం గర్వంగా చిరునవ్వు నవ్వుతూ అన్నారు : “అందులో విశేషమేముంది. ఏదో భగవంతుడి దయ –”.

“ఇప్పటి కప్పుడే –” అన్నాడు సాభిప్రాయంగా సుందర్రావు.

“దేవుడి దయవల్ల పన్నెండుమంది. ఎనమండుగురు మగపిల్లలూ నలుగురు ఆడపిల్లలూ” అని చెప్పారు ఆచార్లు గారు. తన ఘనకార్యానికి తానే సంతోషిస్తూ.

"పరవాలేదు మగపిల్లలే ఎక్కువకాబట్టి 'బాలెంస్ ఫేవరబుల్' గానే ఉంది" అని నవ్వాడు సోషల్ బి. ఇడి.

"ఏమండోయి ప్రభుత్వందృష్టిలో పడతారు జాగ్రత్త. ఇది కుటుంబ నియంత్రణ యుగం" అన్నాడు గోపాలరావు.

"ఏమిటయ్యా ఈ కుటుంబ నియంత్రణ? దేవుడిస్తున్న పిల్లల్ని ఎవ రాపగలరు? గొడ్డువాళ్ళకు పిల్లలు పుట్టమన్నా పుట్టారా? భగవంతుడు ఎట్లా తలిస్తే అట్లా జరుగుతుంది. వీళ్ళెవరయ్యా మధ్య అట్లా కాదనడానికి? పిల్లలు పుట్టించ లేనివాళ్ళ ప్రభుత్వమయ్యా ఇది" అన్నారు ఆచార్లుగారు వికటాట్టహాసం చేస్తూ.

"బలేమాట అన్నారండీ ఆచార్లుగారూ, అక్షర లక్ష లివ్వవలసిన మాట. లేకపోతే వీళ్ళకెందుకు చెప్పండి. ఎవ ళ్ళెట్లా ఉంటే? క్రాసువర్డు పజిల్సు నిషేధించారు. లాటరీలు కట్టుబాటు చేస్తారట. ఏమి న్యాయం చెప్పండి! అన్నిటిలో వీళ్ళజోక్యమేనా?" అని అడిగాడు అదృష్టవాది నరసింహారావు.

ఇంతలో జీతాలు ఇస్తున్నారు రమ్మని కబురు వచ్చింది. అందరూ లేచి వెళ్ళారు. శ్రీహరికూడా జీతం తీసుకొని నరసింహారావుకు రూపాయి ఇచ్చి బయటికినడిచాడు కాంపౌజిషనుకట్ట సైకిలుకారియరుకు కట్టుకొని.

# ౩

శ్రీహరి ముందు సైకిలుషాపుకు నడిచాడు. "వీరయ్యా చెయిన్ వదులైనట్లుంది. కొంచెం బిగించు. ఇంకా ఏదో కూడా వదులైనట్లుంది. డడదడ కొట్టుకుంటోంది. కాస్త చూడు"అన్నాడు. "ఇదుగో బాబుగారూ, ఒక్క నిమిషంలో చూస్తాను," అని చెప్పి కూర్చుందుకు ఒక మురికి స్టూలు ఎదర పెట్టాడు వీరయ్య. శ్రీహరి స్టూలు పైన దులిపి దాని మీద కూర్చున్నాడు. వీరయ్య సైకిలు చూడసాగాడు. శ్రీహరి ఏమీ తోచక రోడ్డుమీద వచ్చేపోయే కార్లూ, స్కూటర్ల కేసీ, జనం కేసీ చూస్తున్నాడు. అనుకోకుండా అతని దృష్టి స్త్రీలమీద పడింది. వాళ్లు కట్టిన చీరల రంగులు, వాళ్లు నడిచే తీరు, వాళ్ల రూపురేఖలు గమనిస్తున్నాడు. అందంగా తోచినవారికి మనసులోనే మంచి మార్కులు వేస్తున్నాడు. లేనివారిని ఎర్రసిరాతో కొట్టివేస్తున్నాడు. అట్లా చూస్తూనే అతనిదృష్టి ఎదట ఉన్న సినిమా పోస్టర్లపై తారల వక్షోజసంపదమీద ఆగింది. వీరయ్య సైకిలు రిపేరు చేస్తూ ఏహో కబుర్లు చెపుతున్నాడు. వాటికి శ్రీహరి పరధ్యానంగా ఊకొడుతున్నాడు. "అయింది బాబుగారూ" అని వీరయ్య సైకిలు స్టాండుమీద ఉండగానే పెడలు వేగంగా తొక్కి బ్రేకులువేసి ఆపాడు. శ్రీహరి ఉలిక్కిపడి లేచి తన ఆలోచనను తనే విస్మపోయి ఎంత అయిం దని అడిగాడు.

రెండురూపాయిలని చెప్పాడు వీరయ్య. శ్రీహరి ఏ అర్ధరూపాయో అవుతుం దనుకున్నాడు. "చెయిన్ రెండులింకు లూడదీసి, శుభ్రంగా ఒకసారి ఆయిల్‌లో కడిగేశాను బాబుగారు. కోన్‌లు అరిగిపోయాయి – " అంటూ చెప్పుకు పోతున్నాడు వీరయ్య. శ్రీహరి మాట్లాడకుండా రెండురూపాయిలు తీసి వాడి కిచ్చి ముందుకు సాగాడు. కిరాణాకొట్టుకు పోయి కొన్ని అవసరవస్తువులూ నెలకు కావలసిన బియ్యమూ కొని రిక్షాలో వేయించుకొని పోసాగాడు. మధ్యలో అతనికి ఒకటి జ్ఞాపకం వచ్చింది. ముందు రోజు సాయంత్రం భార్య పౌడరు డబ్బా గట్టిగా దులుపుకుంటూ ఉండడం అతను చూసి ఉన్నాడు. కొనేనా మానేనా అని సందేహించి, చివరకి తెగించి ఒక పౌడరుడబ్బా కొన్నాడు. మళ్ళా ఏదో తోచి వంద మల్లెపూలు కూడా కొన్నాడు.

ఇల్లు చేరుకొని కర్రగేటు తప్పించి రిక్షావాడిని తెచ్చిన సామాను మేడ వెనకాల మొదటి వాటాలో ఇచ్చి రమ్మని పంపాడు. రామలింగంగారు ఎదరకువచ్చి "అప్పుడే జీతాలిచ్చేశారేమిటినాయనా ?" అని అడిగారు తెలిసే. "అవునండి" అని శ్రీహరి అక్కడికక్కడే ఇంటిఆయనకు పదిహేను రూపాయి లిచ్చేశాడు. "అయ్యో, అంత తొందరేమిటి నాయనా. తరువాత ఇవ్వవచ్చు. మునిగిపోయిందేమీ లేదు" అంటూనే ఆయన మూడు ఐదురూపాయిల కాగితాలు అందుకొని "నువ్వొకడవు సత్యకాలపు మనిషిలా వున్నావు

నాయనా. ఆ బిల్లుకలెక్టరు చూడు మూడు నెలలనుంచి అద్దె ఇవ్వలేదు. ఇక ఆ ప్లీడరుగుమాస్తా చూడు. ఇంట్లో ఉండి కూడా డబ్బు మనీఆర్డరు చేస్తూఉంటాడు,'' అంటూ మెల్లగా లోపలికి నడిచాడు. శ్రీహరి రిక్షావాడిచేత బియ్యపుబస్తా పట్టించుకొని నడిచాడు.

ఇంటి పక్కసందులోనుంచి వెళుతూంటే బిల్లుకలెక్టరు భార్య పిల్లలను చావబాదుతోంది. ఈవేళ మొదటిసారిగా శ్రీహరి విమర్శకదృష్టి ఆమెమీద పడింది. లోతుకుపోయిన మెరుపులేని కళ్ళూ, పీకుకుపోయిన దవడలూ, పైకి పొడుచుకు వచ్చిన బొమికలూ, చింపిరిజుట్టూ, పాలిపోయిన పెదవులూ ఆమెను చూస్తే శ్రీహరికి వెగటుపుట్టుకువచ్చింది. 'అబ్బ ఏమిరూపం ! ఈమెతో ఎట్లా కాపురం చేస్తున్నాడో ఆయన, ఇందరు పిల్లలు కూడాను' అని ఆశ్చర్యపోతూ త్వరగా తన వాటాకు వెళ్ళి, సైకిలు స్టాండువేసి, రిక్షావాడి భుజంమీద నుంచి బియ్యంబస్తా దింపి వాడికి డబ్బులిచ్చి పంపేశాడు.

వరలక్ష్మి వచ్చి సామాన్లు చూసుకుంటోంది. శ్రీహరి ప్రక్కగదిలోకి నడిచి, చొక్కా విప్పుకుంటున్నాడు. వరలక్ష్మి సామాన్లు ఒక్కొక్కటే లోపల పెడుతోంది. శ్రీహరి కాళ్లు కడుగుకు వచ్చాడు. వరలక్ష్మి అతనికూడా వచ్చింది. "ప్రొద్దున్న మీతో చెబుదా మనుకున్నానండీ పౌడరుడబ్బా తెమ్మని. పౌడరు బొత్తిగా అయిపోయింది –" అని ఆమె అంటూండగా శ్రీహరి సంచీలోనుంచి పౌడరుడబ్బా పైకి

తీసి ఆమెచేతిలో పెట్టాడు. ఆశ్చర్యంతో సంతోషంతో ఆమె మాట్లాడలేకపోయింది. మల్లెపూల పొట్లం కూడా తీసి ఇచ్చాడు. అది చూసి ఆమె నవ్వింది. "ఎంత మంచివారండీ మీరు" అంటూ. శ్రీహరి హఠాత్తుగా ఆమెను దగ్గరకు తీసుకొని పెదవులమీద గట్టిగా ముద్దు పెట్టేసుకున్నాడు. వరలక్ష్మి ఒక్కసారి బిత్తరపోయింది. "వదిలెయ్యండి. అదే ? ఎవరేనా చూస్తారు, సిగ్గుకూడాను," అని గిలగిల కొట్టుకొని విడిపించుకొని దూరంగా నిలబడి భర్తకేసి పెద్ద కళ్ళతో చూసింది. కాపురానికి వచ్చిన మొదటి ఏడే కాని తరువాత పట్టపగలు ఇటువంటి సరసా లెన్నడూలేవు. ఇన్నేళ్ళ ఈవేళ హఠాత్తుగా ఈ చర్య ఆమెకు ఆశ్చర్యమూ భయమూ కలగజేసింది. భర్తకళ్ళలో ఏదో కొత్తదనం ఇంకా తాండవమాడుతూండడం చూసి ఇప్పుడే వస్తా నుండండి అని అవతలకు పరుగెత్తింది. శ్రీహరి మంచంమీద కూలబడి తన చర్యకు తానే కొంచెం సిగ్గుపడ్డాడు. ఏమిటీ తనలో మార్పు. ఎందుచేత వచ్చింది.?. కారణం తోచింది. తారాశశాంకం లోని ఘట్టం వినడంవల్ల ఈ ఉత్తేజమేదో ఆవహించిం దని. మనస్సు కుదురుపడేందుకు కాంపొజిషన్ల కట్ట తీసి పుస్తకాలు దిద్దడం ప్రారంభించాడు. కాని మనస్సు పుస్తకాలమీద నిలవడం లేదు. కలం ముందుకు సాగడంలేదు. పేజీమీద రాత అర్థం కావడంలేదు. మనస్సులో తారాశశాంకంలోని ఘట్టాలు తిరుగుతున్నాయి. బజారులో నడిచివెళ్ళిన అందమైన

స్త్రీలు మెదులుతున్నారు. సినీమా పోస్టర్లలోని తారల వక్షోసంపద మెరుపులా మెరుస్తోంది మధ్యలో. వళ్ళంతా బిగువుగా ఉంది. రక్తం వడిగా పరుగిడుతోంది. ఏదో చేసెయ్యాలనిపిస్తోంది మధ్యలో. కాంపొజిషనుకట్ట ప్రక్కకి విసిరేసి లేచాడు.

వరలక్ష్మి వచ్చింది. భర్తదృష్టి ఎందుకో తన శరీరం అంతటా ప్రాకుతున్నట్లనిపించి కొత్తపెళ్ళికూతురులా సిగ్గు పడుతూ భర్తకు కొంచెం దూరంగా నిలబడే "ఏమండీ, ఈ వేళ సినీమాకు వెళ్దామా" అంది. "సైమాట్లే లేదే. ఇంకా వంట అయి ఉండదేమోకూడా" అన్నాడు శ్రీహరి. ఇంతలోకి రాధాకృష్ణ కూడా వచ్చాడు. "వచ్చినతరువాత భోంచేద్దా మండి" అంది వరలక్ష్మి. "ఎక్కడికి వదినా ?" అని అడిగాడు రాధ. సినీమా కని చెప్పింది వరలక్ష్మి. "అయితే ఇంకేం వెంటనే బయలుదేరండి వదినా. నేనుకూడా రా వద్దూ" అన్నాడు రాధ. "మేము తెలుగు సినీమాకు వెళ్దామనుకుంటు న్నాం. నువ్వువస్తావా" అని చిరునవ్వు నవ్వింది దామె. "మీరు తెలుగు సినీమాకు వెళ్ళండి. నేను హిందీదానికి వెళ్తాను" అన్నాడు రాధ. "ఒరేయి రాధా, నువ్వు సైకిలు పట్టుకెళ్ళు. రిక్షా ఒకటి ఇక్కడికి పంపించి వెళ్ళు" అని చెప్పి "ఇదుగో నీ ఖర్చులికి వాడుకో" అని తమ్ముడి చేతిలో ఐదురూపాయిలు పెట్టాడు. "వస్తాను వదినా, రిక్షా పంపుతాను, రెడీకండి" అని రాధాకృష్ణ గబగబా తయారై సైకిలు తీసుని వెళ్ళిపోయాడు.

వరలక్ష్మి అత్తగారిదగ్గరికి వెళ్ళి "ఏమండీ అత్తయ్యా సినీమాకు వెళ్దా మంటున్నారు. మీరుకూడా తెమలండి" అంది. "నాకేమిటే సినీమాలూ నాటకాలూ తల్లీ. మీ రెళ్ళిరండి" అంది ఆవిడ. వరలక్ష్మి తెరపినబడి పిల్లలకు ముందే అన్నం పెట్టి ఉండడంవల్ల వాళ్ళను త్వరగా తయారుచేసి, తనుకూడా ఉన్నవాటిలోకి కాస్త నాజూకైన చీరా జాకెట్టూ కట్టి, పౌడరద్దుకొని, మల్లెపూలదండ పెట్టుకొని తయారైంది. శ్రీహరి కూడా తయారుగా ఉన్నాడు. వీధిగేటుదగ్గరికి వచ్చేసరికి రిక్షా తయారుగా ఉంది. దానిలో సినీమాహాలు చేరారు.

ఆట మొదలెట్టే టైము సమీపించింది. శ్రీహరి రిక్షా వాడికి డబ్బిచ్చి భార్యను ఆడవాళ్ళవైపు బెంచీటికెటు కొనుక్కోమని డబ్బివ్వబోయాడు. జనం ఇంకా కొందరు లోపలికి పోతూనే ఉన్నారు — ఆడవాళ్ళు ఒకవైపునుంచి, మగవాళ్ళు ఇంకోవైపునుంచి. కొంతమంది దంపతులు ఫస్టుక్లాసు టికెట్లు కొనుక్కొని మగవాళ్ళవైపునుంచే లోపలికి వెళుతున్నారు. వరలక్ష్మి అట్లాంటి దంపతులకేసి చూస్తూ నిలబడడం చూసి శ్రీహరికి ఏమితోచిందో "ఉండు, టికెట్లు పుచ్చుకువస్తాను" అని ఫస్టుక్లాసు టికెట్లు కొనుక్కువచ్చాడు. అది చూసి వరలక్ష్మి పెద్దకళ్లు చేసింది —"అయ్యో అంత ఖరీదుటికెట్లే!" అంటూ. "టైమైపోతోంది రా"అని శ్రీహరి ఆమెను కూడా తీసుకొని పురుషులవైపునుంచి లోపలికి తీసుకెళ్ళాడు. ఫస్టుక్లాసులో ఇద్దరూ పక్కపక్కనేకూర్చున్నారు. వెంకటరమణను

శ్రీహరి తనప్రక్క కూర్చోబెట్టుకున్నాడు. సూర్యావతిని వరలక్ష్మి తనదగ్గర కూర్చోబెట్టుకొని, బాబును ఒళ్లోపెట్టుకొని కూర్చుంది. ఈవేళ తను తన భర్తతోబాటు ఇతర గొప్ప దంపతులలాగే కూర్చున్నందుకు ఒకవైపు గర్వమూ మరో వైపున ఎప్పుడూ మూడోక్లాసులో ప్రయాణం చేసేవాడు మొదటితరగతి పెట్టెలో ప్రయాణం చేస్తున్నప్పుడు అనుభవించే విధంగా సంకోచమూ పీడిస్తోంది. ఆట మొదలైంది. కాని మరికొంతసేపటికే ఆమె ఫస్టుక్లాసు ఆనందం అనుభవించకుండా చేసింది బాబు ఏడుపు. వాడిని సముదాయించడానికి ప్రయత్నం చేసింది కాని వాడు ఏడుపు మానలేదు. ప్రక్కవాళ్ళు విసుగుకుంటున్నారు. ఇక చేసేదిలేక బాబునెత్తుకొని బయటకు నడచి, వాడిని బుజంమీద పడుకోబెట్టుకొని, మెల్లగా జోకొట్టూ పక్కనుంచే సినిమా చూడ సాగింది వరలక్ష్మి. మునుపటిక సమయం ఆమె అట్లాగే గడపవలసివచ్చింది. కొడుకు నెన్నోసార్లు తిట్టుకుంది. ఇటు సూర్యావతి కాసేపు సినిమా చూసి "నాన్నా నిద్దరొస్తోంది" అంది. శ్రీహరి వెంకటరమణను భార్య ఖాళీచేసిన కుర్చీలో కూర్చోబెట్టి, సూర్యావతిని తనఒళ్లోకి తీసుకొని, ఆమె తల తనచేయిమీద ఆన్చి ఎట్లాగో పడుకోబెట్టాడు. అంతఖరీదు పెట్టి ఫస్టుక్లాసు టికెట్లుకొన్న ప్రయోజనమే లేకపోయింది.

సినిమా అయిపోయింది. కలలోనుంచి మేలుకున్నట్లైంది వాళ్ళకు - మధ్య మధ్య పిల్లలవల్ల పాట్లు నల్లులు

కుట్టుతున్నట్లున్నా౽. ఇవతలకు వచ్చినతరువాత శ్రీహరి రిక్షాకేకేశాడు. రిక్షావాడు సమయం కనిపెట్టి పదణాలు అడిగాడు. వరలక్ష్మి "అంత ఖరీదు టికెట్లు కొనవలసిందికాదు. ఎంత డబ్బు దండగైందో. ఇంకా ఈ ఆముదంకూడా ఎందుకు ? నడిచిపోదాం పదండి" అంది. అట్లాగే ఇద్దరూ నడుస్తూ ముందుకు సాగారు. వరలక్ష్మి చేతిలో చంటిపిల్లవాడుండడం వల్ల శ్రీహరి ఒక్కొక్కప్పుడు వెంకటరమణనీ సూర్యావతినీ కూడా ఎత్తుకొని, కొంతదూరం వెంకటరమణని నడిపిస్తూ, మధ్యలో సూర్యావతినికూడా వరలక్ష్మి ఎత్తుకుంటూ, తిప్పలు పడుతూ పోతున్నారు. దారిలో ధనవంతుల యిళ్ళదగ్గర ట్యూబులైట్ల వెలుతురులో, ఫానులక్రింద చక్కని సోఫాలూ, టీపాయ్‌ల మీద పూలకుండీలు, గోడలకు చక్కని చిత్రాలు, గుమ్మాలకు సిల్కుతెరలూ ఆ దృశ్యం చూస్తూ వరలక్ష్మి ఆగిపోయేది. వరలక్ష్మితో బాటు శ్రీహరి కూడా ఆగి కొన్ని క్షణాలు ఆ యిళ్ళకేసి చూసి మళ్లీముందుకు నడుస్తున్నాడు.

"చూడండి వాళ్ళయిళ్లు ఎంత బాగున్నాయో, అట్లాంటి ఒక కుర్చీకూడా కొనుక్కోలేము మనము"— అని "పోనీలెద్దురూ వాళ్ళ అదృష్టం వాళ్ళది. పెట్టిపుట్టారు, మన మెందుకు అసూయపడాలి" అంటూ ముందుకుసాగింది వరలక్ష్మి.

శ్రీహరి ఏమీ మాట్లాడకుండా నడుస్తున్నాడు.

"ఏమండీ ఆసినిమాలో నాయకుడు నాయకీ అట్లా

పాడుతూ గంతులేస్తూ ఒకరినొకరు తరుముకుంటూ తోటల్లోనూ మేడమీద తిరుగుతుంటారే అట్లా నిజంగా ఎవళ్లేనా ఉంటారాండీ" అని అడిగింది వరలక్ష్మి.

"ఏమో గొప్పవాళ్ళుంటారేమో. వాళ్ళకి పెద్ద తోటలూ మేడలూ ఉంటాయి కాబట్టి. కాని ఎవళ్ళూ పాడతా రనుకోను" అన్నాడు శ్రీహరి.

ఇంతలో వాళ్ళ పక్కనుంచి సైకిలుమీద వెళ్తున్న రాధ చూసుకోకుండా కొంచెం ఎదరకుపోయి, సందేహం వచ్చి, తిరిగిచూసి, సైకిలుదిగి వెనక్కి వచ్చాడు, "ఇదేమిటన్నయ్యా, నడిచివస్తున్నారేం, రిక్షా చేసుకోక" అన్నాడు.

"ఊరికేనే - కాస్త కాళ్ళు సాగుతాయని నడుస్తున్నాం" అన్నాడు శ్రీహరి.

వెంకటరమణని సైకిలుమీద కూర్చోబెట్టుకొని, నడిపించుకుంటూ వాళ్ళతోనే నడిచాడు రాధ.

ఇంటికిచేరి పిల్లలను పడుకోబెట్టి, శ్రీహరీ, రాధా, వరలక్ష్మి ముగ్గురూ భోజనాలు చేశారు. రాధ ఎదర వరండాలో పక్కవేసుకొని ఇట్టే నిద్రలో మునిగిపోయాడు. శ్రీహరి తన గదిలో మంచంమీదికి చేరాడు. వరలక్ష్మి వంటింట్లో అన్నీ సర్ది గొళ్ళెంపెట్టి వచ్చింది. గదిలోకివచ్చి, తలుపువేసి అక్కడే నిలబడి భర్తకేసి చూసింది. భర్త చూపులో సాయంత్రం కనిపించిన ఘాతుకమృగపు దృష్టి మళ్ళీ తోచింది ఆమెకు. ఆమెలో కూడా ఉద్రేకం దానితో

బాటే సిగ్గూ భయమూ ఆవహించాయి. దీపం తగ్గించి జంకుతూ మెల్లగా దగ్గరకు వచ్చింది. శ్రీహరి ఆమెను ఒక్కసారిగా దగ్గరకు లాగుకొని బాహువులలో ఇరికించి వేశాడు. "అబ్బా, అంత గట్టిగా లాగకండీ," అని అతను కొద్దిగా వదలగా అతని రొమ్ములోకి వీలుగా సర్దుకుంటూ వరలక్ష్మి అడిగింది: "ఏమండీ సినిమాచూసి వచ్చినప్పుడల్లా ఏదోలోకంలోనుంచి పడిపోయిన ట్లనిపించడం లేదండీ?" శ్రీహరి విస్మయంతో కనుబొమలు చిట్లించి "ఎందుకు?" అన్నాడు. "ఆ మేడలూ, ఆ మెట్లూ, ఆ పెద్దహాలులూ, కుర్చీలూ, సోఫాలూ, నౌకర్లూ, డాన్సులూ మన మెప్పుడైనా నిజంగా జీవితంలో చూడగలమా అని? ఆ సినిమాలో వాళ్ళ సుఖాలూ కష్టాలూ కూడా గొప్పగా ఉంటాయి కదండీ?"

"మనలాంటివాళ్ళ మందరం కాలక్షేపానికే సినిమాలకు వెళ్తాంకాబట్టి సినిమాలవాళ్ళు మంచి మంచి వన్నీ చూపిస్తారు" అని శ్రీహరి చిరునవ్వుతో మళ్ళీ అన్నాడు: చూడబోతే నీకు జీవితంలో కూడా ఆ సినిమాల్లో ఉన్న ట్లుగా ఉండాలని కోరిక ఉన్నట్లుందే. నీకూ పెద్దమేడలో ఉండాలనీ, నైలాన్‌చీరలు కట్టాలనీ, కార్లలో తిరగాలనీ, నౌకర్లూ చాకర్లూ ఉండాలనీ ఉందికాదూ?"

"అట్లాంటివన్నీ కోరుకుందుకు నేను వెర్రిదాన్ననుకున్నారా?" అంది వరలక్ష్మి చిరుకోపంతో మూతి పొడుగు

చేసి. "నాకు పెద్ద మేడలూ, భవనాలూ, కారూ గీరూ కావాలని కోరిక ఏమీ లేదు. కనీసం ఉండేందుకు ఒక చక్కటి చిన్న ఇల్లూ, కట్టుకుందుకు శుభ్రమైన బట్టలూ, కాలక్షేపానికో చిన్న రేడియో ఉంటే ఎంత బాగుండును! పిల్లల సరదాలేనా అన్నీ తీర్చలేకపోతున్నాం. ఈ ఇరుకు కొంప చూడండి – ఎంత అవస్థ పడుతున్నామో, మనం చిరిగిపోయిన బట్టలే కట్టుకు తిరగవలసి వస్తోంది——" అంటూ భర్త బనీను చిరుగులో వేలు పెట్టి తిప్పసాగింది ఆమె.

శ్రీహరి కళ్ళల్లో పట్టుదల ప్రవేశించింది. "ఉండు నీ కోరికలు తీరుతాయి చూడు" అన్నాడు.

"ఎట్లా? అంది వరలక్ష్మి భర్త మొగంలోకి ఆశ్చర్యంగా చూస్తూ.

"ఈ ఉద్యోగంలో ఉన్నంతకాలం ఇట్లాగే ఉంటుంది. మంచి ఉద్యోగం – ఇంతకంటె పెద్ద ఉద్యోగం సంపాదిస్తే మనమూ సరదాలు తీర్చుకోవచ్చు, సుఖంగా ఉండొచ్చు."

"మనకు పెద్ద ఉద్యోగం వస్తుందా అండి?"

"ఎందుకురాదూ. నేను బి. ఏ తెలుగు పాసై రెండేళ్లైంది. ఎప్పటికప్పుడు ఇంగ్లీషుకీ, గ్రూపుకీ కట్టాలనుకుంటూనే అశ్రద్ధ చేస్తూ వచ్చాను. రేపటినుంచి దీక్షగా చదువుతాను. బి. ఏ అయిన తరువాత ఎం. ఏ కూడా పాసవచ్చు. అప్పుడు ఏ కాలేజీలోనో, ఏ కంపెనీలోనో ఉద్యోగం సంపాదించుకోవచ్చు. చాలామంది అట్లా చేస్తున్నారుకూడా. మామూలు

బడిపంతుళ్లుగా ఉన్నవారు లెక్చరర్లయిపోతున్నారు. అప్పుడు చూడు మనంకూడా చక్కని డాబాల్లో ఉండొచ్చు. కొంత కాలమైనతరువాత మనమే సొంతంగా ఒక డాబా కట్టించుకో వచ్చుకూడా—"

"అదుగో మనవీధి మొగన ఎవరో కట్టుకున్నారు చూడండి చిన్నడాబా ఎంతో అందంగా – అట్లాగే మనమూ కట్టుకోవాలండీ. ముందు చిన్న తోటకూడా వేసుకోవాలి. మధ్యహాలులో ఒక ఎలెక్ట్రిక్ ఫానూ, రేడియో పెట్టుకోవాలి. అప్పుడు ఎంత బాగుంటుంది ?" అంది వరలక్ష్మి కలలమీద తేలిపోతూ.

"అప్పుడు చూడు నేను చక్కని సూట్లు కుట్టించుకో వచ్చు. నీకు నైలాన్ చీరలు—"

"ఉఁహూఁ నాకు నైలాన్ చీరలంటే ఇష్టం లేదండీ – ఒళ్ళంతా కనిపిస్తుంది—"

"పోనీ సిల్కుచీరలూ జార్జెటు చీరలూ కొంటాను. మన రమణకీ, సూర్యానికీ, బాబుకీ కూడా మంచి బట్టలూ, బూట్సూ సాక్సూ కొందాము—" అని అతను అంటూండ గానే వరలక్ష్మి "ముందు మీరు ఆ పాత డొక్కుసైకిలు అవతల పడేసి మంచి కొత్తసైకిలు కొనుక్కోవాలండీ ఆ డొక్కుసైకిలు చూస్తే నాకు డోకొస్తుంది" అంది.

శ్రీహరి ఆనందంతో విప్పారిన మొగంతో "కొత్త సైకిలేమిటి, ఎప్పుడో స్కూటరు కొనేస్తాను. నిన్ను దాని

మీాద కూర్చోబెట్టుకొని టింగురంగా మంటూ - ''అంటూం డగా ఆ కల్పన తలచుకొని పొంగిపోయి వరలక్ష్మి నవ్వేసింది. ఆమె నవ్వుచూసి శ్రీహరీ నవ్వేశాడు. చటుక్కున ఆమెను మళ్ళీ గట్టిగా నొక్కిపట్టి పెదవులమీాద దీర్ఘంగా ముద్దా డాడు. సాయంత్రపు ఆవేశం మళ్ళీ అతనిని ఆవహించింది.

వరలక్ష్మి భూమిమీాదికి దిగింది. ''ఏమండీ అవి అన్నీ సరేకాని, ముందు నా చేతులు బొత్తిగా బోసిగా ఉంటున్నాయండీ,—ఒక్క గాజులజత—'' అని ఆమె అంటూనే ఉంది అతను తన నోటితో ఆమె నోరు నొక్కేశాడు. బాహువులలో బంధించివేశాడు. వరలక్ష్మి వివశురాలై పోయింది.

తెల్లవారుజామున ఐదుగంటల ప్రాంతాలకు మెలకువ వచ్చింది శ్రీహరికి. ఒకటి రెండు నిమిషాలు అట్లాగే చీకట్లో పైకిచూస్తూ ఉండిపోయాడు. రాత్రిచూసిన సినిమాలో ఘట్టాలూ, దారిలో వస్తూండగా కనిపించిన ధనవంతుల ఇళ్ల దృశ్యాలూ, వరలక్ష్మి తనూ కలిసి కన్న కలలూ, తను చెప్పిన మాటలూ జ్ఞాపకంవచ్చాయి. ఇట్లా పడిఉంటే లాభంలేదు. చదవాలి. బి. ఏ లో మిగిలిన పార్టులికి కట్టెయ్యాలి. తరువాత ఎం. ఏ కూడా చదివేయాలి—ఎక్కడ

లేని ఉత్సాహం పొంగి వచ్చింది శ్రీహరికి. చటుక్కున లేవబోయాడు. వరలక్ష్మి అతనికి దగ్గరగా—తల అతని బుజంమీద ఆనుకొని—ఎడమచేయి అతని మెడమీదనుంచి పోనిచ్చి పడుకొని ఉంది. మెల్లగా ఆమెచేయి తీయబోయాడు శ్రీహరి. ఆమె కొంచెం కదిలి నిద్రలోనే అతనిని మరింత పెనవేసుకుంది. శ్రీహరి కొద్దిగా చిరాకుపడి ఎట్లాగో ఆమె చేతులు విడిపించి మంచందిగి వచ్చాడు.

చన్నీళ్ళతో మొగం కడుగుకొని వచ్చి టేబిల్‌దగ్గర హరికేన్ లాంతరు పెట్టుకొని ఎప్పటినుంచో మూలబడిన ఇంగ్లీషు పుస్తకాలు తీశాడు. షేక్స్పియరుది ఆంటొనీ అండ్ క్లియోపాత్రా చదవడం మొదలుపెట్టాడు. హుషారుగా సాగుతోంది చదువు. మరో అరగంటకి వరలక్ష్మి లేచింది. పుస్తకపఠనంలో లీనమై ఉన్న భర్తకేసి చూసి మెల్లగా నవ్వి గది ఇవతలకు వచ్చింది. మంచంమీద ముసుగుదన్ని ఉన్న మరదిని లేపడానికి ప్రయత్నించింది. ఓ పట్టాన లేవ లేదు రాధ. "లే లే చదువుకో. మీ అన్నయ్య చూడు ఎట్లా చదువుతున్నారో" అంది వరలక్ష్మి. "అబ్బ, రాత్రి సినిమాకి వెళ్ళొచ్చాంగదా. పైగా పరీక్ష లిప్పుడప్పుడే ఎక్కడ ?" అని ఇంకొక ప్రక్కకు తిరిగి ముసుగు గట్టిగా తన్నాడు రాధ. ఈ సందడిలో వెంకటరమణ లేచాడు. వరలక్ష్మి వాడిదగ్గరికి పరుగెత్తి "పడుకోరా, అప్పుడే లేస్తావేం ?" అంది. "అమ్మా నేను కూడా చదువుకుంటాను" అన్నాడు

వాడు. "నీ బి. ఏ చదువుకు తెల్లవారుగట్లలేచి చదవకపోతే పరవాలేదులే, పడుకో" అంది వరలక్ష్మి నవ్వుతూ. "కాదమ్మా, పాఠం అప్పజెప్పాలి. మాష్టారు కొట్టేస్తారు లేకపోతే" అని లేచి కూర్చున్నాడు రమణ. "సరే" అని ఆమె వాడి కళ్లు నీళ్ళతో తుడిచి, తీనుకువెళ్ళి భర్తప్రక్క కూర్చోబెట్టి నిప్పు అంటించడానికి వంటింట్లోకి వెళ్ళింది. అత్తగారు తన మంచం మీదే కూర్చొని మేలుకొలుపు పాడసాగింది. సూర్యావతి లేచి మామ్మఒడిలో చేరి మేలుకొలుపులు వింటోంది. శ్రీహరి తనప్రక్క కనుబొమలుముడిచి గంభీరంగా తన రెండోతరగతి పుస్తకం చదువుతున్న కొడుకునుచూసి చిరునవ్వు నవ్వకుండా ఉండలేకపోయాడు. జీవితం ఎంతో ఆనందమయ మనిపించింది అతనికి. తలుచుకుంటే ఏమి చేయలేం ? అనుకున్నాడు పైకి ఉబికిన ఆత్మవిశ్వాసంతో.

మరి కాసేపటికి వర్షం దిగింది. వర్షం వచ్చిందంటే ఆ యింట్లో యాతనే. ఇల్లంతా కురుస్తుంది. కప్పు తిరగేసి ఎన్నో ఏళ్ళయింది. కప్పుకున్న దుప్పటిమీద రెండు మూడు చోట్ల పడడంతో రాధకూడా లేవవలసి వచ్చింది. ముసలమ్మ మనుమరాలిని వర్షంపడనిచోటికి చేర్చి కూర్చుంది. శ్రీహరి లేచాడు. వరలక్ష్మికూడా వచ్చింది. ముందు బాబుమీద ఎక్కడ చినుకులు పడతాయో అని ఉయ్యాలమీద గొడుగు విప్పిపెట్టింది. తరువాత భర్తా, తనూ, మరదీ కలిసి ఏమీ తడిసిపోకుండా వస్తువులూ మంచాలూ అవీ పొడిచోట్లకు

జరిపారు. వర్షంకురిసి ఇల్లు చెరువయిపోకుండా కురిసేచోట పళ్లాలో, గిన్నెలో పెట్టారు. "ఈవేళ పొద్దున్నే తయారైంది వర్షం. సాయంత్రంవరకూ పట్టుకు పీడిస్తుందేమో. ఆ యింటి ఆయనకు చెప్పారా అండీ ఇల్లు తిరగేయించమని" అంది వరలక్ష్మి. "చెప్పకపోవడమేమిటి ? 'అయ్యయ్యో, నువ్వు చెప్పాలా నాయనా, నాకు తెలియదూ ఇదుగో వచ్చేవారం చేయిస్తాను. పెంకు కొనాలి, మేస్త్రి రావాలి, నిన్నవస్తానన్నాడు. దగాచేశాడు' అంటూ ఎంతో మర్యాదగా కబుర్లు చెపుతాడుకాని క్రియమాత్రం శూన్యం"అన్నాడు శ్రీహరి.

అతను పెద్ద బాధపడుతున్నట్లు లేదు. ఇల్లంతా ఏక ధారగా వర్షం కురిసినా అతని కీవేళ చిరాకు కలిగేటట్లులేదు. అంత ఉత్సాహం పొంగుతోంది అతనిలో. ఇంకా టేబిలు దగ్గరే పుస్తకంమీదికి వంగి నిష్ఠతో చదువుతున్న రమణను చూసి "చూడు రాధా నీ కొడుకుని చూసేనా బుద్ధితెచ్చుకో ఎట్లా చదువుతున్నాడో చూడు తెల్లారగట్లే లేచి" అని మరదిని ఆక్షేపించింది వరలక్ష్మి. కొడుకుదగ్గరకువెళ్ళి పుస్తకంలోని మాటలతోబాటు వాడి పెదవులు కదులుతూంటే ఒక్కసారి వాడిని రొమ్ముకదుముకొని తలమీాద ముద్దుపెట్టుకుంది. తరువాత వంటింట్లోకి వెళ్ళిపోయింది. "ఏరా వెధవాయ్. నాకు చీవాట్లు పెట్టిస్తావా? ఈవేళ పబ్లిక్ ఎగ్జామినేషన్ ఏమిటి నీకు?"అని రాధ రమణ నెత్తిమీద ఒకటి మెల్లగా మొట్టాడు. పళ్ళపొడి తీసుకొని వర్షంవల్ల బయటికి పోవడానికి

వీలులేదుకాబట్టి వంటింటి గుమ్మంలోనుంచే బయటికి మొగాలు కడుక్కున్నారు శ్రీహరీ, రాధా. వంటింట్లోనే ఒకప్రక్క నీళ్ళు పోసుకున్నారు. పొడిదుస్తులు వేసుకొని "ఈ యింటి ఆయనకు ఇట్లాకాదులే. నేను బుద్ధిచెపుతాను" అని రాధ కాస్త పొడిచోటుకు కుర్చీ లాగుకొని పుస్తకం తెరచాడు. వెంకటరమణ చెల్లెలితో కలిసి అన్నం తిని, "నాన్నా బడికి వెళ్తాను" అన్నాడు. "వర్షంలో బడి ఏమిటిరా?" అని చెప్పి వాడిని మానిపించేటప్పటికి తాతలు దిగి వచ్చారు. చదువంటే కొడుక్కున్న శ్రద్ధ చూసి శ్రీహరి గుండె గర్వంతో పొంగింది. "వీడు రేపు పెరిగి పెద్దవాడై ఏమవుతాడో? తప్పక పెద్దచదువులు చదివి గొప్ప ఉద్యోగి అవుతాడు" అనుకున్నాడు. రమణ "నాన్నా కాగితపు పడవలు చేసిపెట్టవూ, చెల్లాయి నేను వేసుకుంటాం" అన్నాడు. శ్రీహరి వాడికి కాగితం పడవలూ, మర పడవలూ చేసి ఇస్తున్నాడు. రమణా, సూర్యావతీ పడవలు ఎదర నీళ్ళలో వదులుతూ అవి అటూ ఇటూ పోతూంటే, మునిగిపోతూంటే చప్పట్లు కొడుతున్నారు. వరలక్ష్మి బాబుకు నీళ్ళుపోసి, తుడిచి, పాలుబట్టి తీసుకువచ్చి భర్త కిచ్చింది. శ్రీహరి వాడి నెత్తుకొని రమణ కింకా పడవలు చేసి ఇస్తూ బాబుకు చూపిస్తూ తనూ చంటిపిల్లవాడిలా కాగితంపడవల కేసిచూసి ఆనందిస్తున్నాడు.

హఠాత్తుగా అతనిదృష్టి ఎదురుమేడపై కిటికీనంటి

పెట్టుకొని బయటపడుతున్న వర్షంధారకేసీ, పిల్లలువిడుస్తున్న కాగితప్పుపడవలకేసి చూస్తున్న ఇంటివారి కోడలిమీద పడింది. 'ఎంతఅందంగా ఉంది!' శ్రీహరి ఇదివరకెన్నడూ ఆమె మొగం సరిగా చూడలేదు. చాలా అందమైనదని మాత్రం విన్నాడు. ఈనాడు చూశాడు. ఏదో బాధ ఆమె కళ్ళల్లో ఉన్నట్లు తోచింది అతనికి. చటుక్కున ఇద్దరికళ్లూ కలిశాయి. ఆమె సిగ్గుపడి కళ్ళు దించేసుకుంది. శ్రీహరి కాగితప్పుపడవలకేసి దృష్టి మరల్చాడు. 'ఆమెలో ఏదో వేదన ఉంది. ఆకళ్ళు చెపుతున్నాయి. ఏమి వేదన అయిఉంటుంది? లక్షాధికారి కోడలాయె. ఏమి లోటు ఉండగలదు? భర్త సరిగా చూడడంలేదా? సరిగా చూడకుండా ఎట్లా ఉంటాడు! అంత అందకత్తెను పువ్వుల్లో పెట్టి పూజిస్తాడు ఎవడైనా. నిజంగా భర్త ప్రక్కన ఆమె నిలబడితే కాకిముక్కున దొండ పండున్నట్లు ఉంటుంది. – అదీ? అటువంటి భర్తతో ఏమి ఆనందం ఉంటుంది ఆమెకు? అన్నీఉన్నాయి కాని నిజమైన ఆనందంలేదు. బంగారు పంజరంలో చిలక!' అనుకోకుండా మళ్ళీ పైకిచూశాడు అతను. మళ్ళీ ఇద్దరికళ్లూ కలిశాయి. ఒక్కక్షణం మాత్రం అతనికేసి చూసి తరువాత సిగ్గుపడుతూ వెనక్కి వెళ్ళిపోయిం దామె. 'తనకేసి అట్లా చూసిం దెందుకు? నిశ్చయంగా ఆమె ఏదో చెప్పా లనుకుంటోంది. కాని చెప్ప లేదు. – అంతకుముందు కూడా తనకేసి చూస్తూ ఉందేమో!' అట్లాగే అనిపించింది అతనికి. వెంటనే తన్ను తాను తెలుసు

కున్నాడు. 'ఛఛ ఇవేం ఆలోచనలు తనకు ? తప్పుకూడాను. పెళ్ళాం పిల్లలు ఉన్నవాడు పరాయి ఆడదానిని గురించి ఇట్లా ఆలోచించవచ్చా ? పైగా తనేమిచేయగలడు ఆమె బాధ తొలగించడానికి ? ఇంతకీ ఆమె బాధపడుతోందని ఎక్కడ ఉంది ? అదంతా తన ఊహేనేమో. – ఇట్లాంటి ఆలోచనలతో సమస్యలలో పడితే ఇక చదువుసాగినట్లే' అని తనలోతాను నవ్వుకొని లేచి బాబును వెంకటరమణకిచ్చి తన గదిలోకివెళ్ళి బల్లదగ్గర కూర్చొని పుస్తకం చదవసాగాడు. చదువుతుండగా అతనికళ్ళు బల్లమీద ఉన్న అద్దంలోని తన ప్రతిబింబంమీద పడ్డాయి. అద్దం చేతిలోకి తీసుకొని తన మొగం పరిశీలించుకోసాగాడు. ఇంతకుముందు ఇంత పరిశీలనతో తన మొగం చూసుకోలేదు అతను. తలలో రెండు తెల్లవెంట్రుకలు కనిపించాయి. అవి పీకేశాడు. బుగ్గలమీద చేయిరాసుకుంటూ అటూ ఇటూ వివిధకోణాల్లో చూసుకుంటున్నాడు. పరవాలేదన్నట్లు ఏదో సంతృప్తి కలిగింది.

"అన్నయ్యా ఆ పక్క ఉండే బిల్లుకలెక్టరుగారు వచ్చారు" అని చెప్పాడు రాధ లోపలికివచ్చి. శ్రీహరి కంగారుగా అద్దం పెట్టేసి ఇవతలకు వచ్చాడు.

బిల్లుకలెక్టరు అతనికి నమస్కారం పెట్టాడు. ముఖపరిచయమేకాని ఎన్నడూ అతనితో మాట్లాడలేదు శ్రీహరి. "నమస్కారం. ఏం ఇట్లావచ్చారు ? రండి ఈ మంచంమీద కూర్చొండి" అన్నా డతను. బిల్లుకలెక్టరు ఉపోద్ఘాతం ఏమీ

లేకుండా తిన్నగా విషయానికి వచ్చేశాడు: "ఐదురూపాయి లవసరం వచ్చాయి సార్. చాలా ఇబ్బందిలో ఉన్నాను. జీత మప్పుడే అయిపోయింది. ఎట్లాగో కాపాడాలి మీరు. మీ మేలు మరచిపోను. సర్దుబాటుచేస్తే—"అంటూ ఎంతో వినయంతో, ఎంతో దీనంగా అడిగాడు. అతని మొగం చూస్తే భయంవేస్తుంది. ఒక్కనాడూ కడుపునిండా తిండి తిన్న పాపాన పోయినట్లు లేడు. జీవితపు నిరాశా, నిస్పృహా అతనిలో మూర్తీభవించినట్లున్నాయి. ఐదురూపాయి లనేసరికి శ్రీహరి తటపటాయించాడు. ఇప్పటికే తను లాటరీటిక్కెట్టు కొని, సినిమాకు ఫస్టుక్లాసు టికెట్లు కొని లేనిపోని దర్జాకు పోయి డబ్బు తగలేశానని బాధపడుతున్నాడాయె. తనేమీ శ్రీమంతుడు కాదాయె. తనజీవితం కూడా కాగితపు పడవ లాంటిది. గట్టిగా గాలేస్తే మునిగితీరుతుంది. ఈ ఐదు రూపాయిల బరువుకూడా పడితే తన 'బడ్జటు' తలక్రిందు లయిపోదూ! "పోనీ ఒక్క మూడురూపాయిలయినా సార్. ఎట్లాగో సర్దుకుంటాను. చాలా ఇబ్బందిలో ఉన్నాను సార్" అన్నాడు బిల్లుకలెక్టరు. శ్రీహరి మాట్లాడకుండా లోపలకు వెళ్ళి మూడురూపాయిలు తెచ్చి బిల్లుకలెక్టరుచేతిలోపెట్టాడు. "వచ్చేనెల జీతంలో తప్పక ఇస్తాను సార్" అని అతను మరీ మరీ నమస్కారంచేసి శిథిలావస్థలో ఉన్న గొడుగు విప్పుకొని వె...

శ్రీహరి వెనక్కివచ్చి కూర్చున్నాడు. కంగారుగా

ప అద్దం సరిగా నిలబెట్టాడు. తను అద్దంలో అంత పరిశీలనగా చూసుకోవడం రాధ కంట బడలేదుకదా. 'ఛఛ ఇంకెప్పుడూ ఇట్లా ప్రవర్తించకూడదు. జాగ్రత్తగా ఉండాలి—వరలక్ష్మి చూస్తే!'—వరలక్ష్మి వచ్చింది అటు. "ఈ వర్షంలో బడి ఉండదేమోనండి" అంది వరలక్ష్మి. "వర్షం ఇట్లాగే ఉంటే ఉండదు. కాని తీరా సమయానికి కొంచెం తెరిపి ఇస్తుందేమో" అన్నాడు శ్రీహరి.

అట్లాగే బడివేళకి వర్షం ఉధృతం కొంచెం తగ్గింది. అందువల్ల త్వరగా భోంచేసి, సైకిలూ గొడుగు తీసుకొని త్వరగా స్కూలు చేరుకున్నాడు శ్రీహరి. అప్పటికే చేరిన మాష్టర్లు వర్షం గురించీ, పంటలపై దాని ప్రభావం గురించి, వాతావరణంలో మార్పులు మీదుగా హైడ్రోజనుబాంబు పరీక్షలను చర్చిస్తున్నారు. శ్రీహరి వెళ్ళిన కాసేపటికే మూడోబెల్లు అయింది. శ్రీహరి క్లాసుకి వెళ్ళిపోయాడు.

మరికాసేపటికి హెడ్‌మాష్టారు దగ్గరనుంచి కబురు వచ్చింది. శ్రీహరి క్లాసును లీడరును చూస్తూ ఉండమని చెప్పి హెడ్‌మాష్టారి దగ్గరికి వెళ్ళాడు. హెడ్‌మాష్టారి గదిలో మరో పెద్దమనిషి కూర్చొని ఉన్నాడు. శ్రీహరి వెళ్ళి హెడ్‌మాష్టారి ఎదుటికి వెళ్ళి నిలబడ్డాడు.

"మాష్టారూ, నిన్న వీరబ్బాయిని కొట్టారట. రాత్రి జ్వరంకూడా వచ్చిందట, అట్లా ఎందుకు కొట్టారు ? ఏమైనా

అల్లరిచేస్తే నాదగ్గరకు కబురంపించాలిగాని" అన్నారు హెడ్‌మాష్టారు కొంచెం తీక్ష్ణంగా.

"వీరబ్బాయి ఏవరో తెలియదండీ" అన్నాడు శ్రీహరి తెల్లబోతూ.

"వీరు రామచంద్రరావుగారు. లారీ ఓనర్. మీ క్లాసులో ఆ సుధాకర్ వీరబ్బాయే" అని చెప్పారు హెడ్ మాష్టారు.

"నేనేమీ గట్టిగా కొట్టలేదండీ" అన్నాడు శ్రీహరి.

"గట్టిగానో మెల్లగానో కొట్టారా లేదా? మాష్టారూ మీరు పిల్లలని కొట్టవచ్చా అసలు" అని అడిగాడు రామచంద్రరావుగారు.

"నే నూరికే కొట్టలేదండి. లీడరు చెప్పాడు క్లాసులో చాలా అల్లరిచేశాడని".

"ఆ లీడరు ఎవడండీ? ఎవడో రిక్షాలాగే వాడి కొడుకటగా. మావాడు చెప్పాడు. అట్లాంటివాడు చెప్పిన దానినిబట్టి మావాడిని కొట్టడమా—"

"వాడు రిక్షావాడికొడుకో ఎవరో నాకు తెలియదండీ. వాడు క్లాసులీడరు. పేరు రాసి ఇస్తే—"

"అల్లరి చేస్తే నాకు కబురంపించవద్దండీ?" అని అడిగారు హెడ్‌మాష్టారు మళ్ళీ.

"అసలు మాష్టర్లు పిల్లలని కొట్టవచ్చా అని నే నడుగుతున్నాను. ఏమైనా కొంచెం ఎవ రెవరో తెలుసుకొని మరీ

వ్యవహరించాలండీ మాస్టారూ. మీరు ప్రైవేట్లుకూడా చెపుతారటగా ?" అని అడిగాడు వచ్చిన ఆయన.

శ్రీహరి మాట్లాడలేదు.

"మీరు ప్రైవేట్లు చెప్పవచ్చా ? మానేజిమెంటు పర్మిషన్ తీసుకున్నారా ? మీ మీద ఎవరైనా రిపోర్టు ఇస్తే మీపని ఏమవుతుంది ? జాగ్రత్తగా ఉండాలి మాస్టారు" అన్నాడు రామచంద్రరావుగారు.

"నేను కనుక్కుంటానులెండి రావుగారూ. మీ అబ్బాయి అని తెలియదు. ఇంకెప్పుడూ అట్లా కొట్టరులెండి. మీరు వెళ్ళిరండి. శ్రీహరిగారూ మీరు క్లాసుకు వెళ్ళవచ్చు" అని శ్రీహరిని పంపేసి రామచంద్రరావుగారిని కూడా కొంతవరకు సాగనంపి వచ్చేశారు హెడ్ మాస్టారు.

శ్రీహరి అవమానంతో క్రుంగిపోతూ క్లాసుకు నడిచాడు. వెళ్ళి కుర్చీలో కూలబడ్డాడు. లీడరు "వీళ్ళు అల్లరి చేశారండీ" అని ఒక కాగితం అందిచ్చాడు. 'హుఁ' అంటూ విసుక్కొని కాగితం నలిపి చుట్టచుట్టి అవతలకు పారవేశాడు శ్రీహరి. లోపల మంటరేగుతోంది. సుధాకర్ కేసి చూశాడు. వాడు తనకేసి నిర్లక్ష్యంగా చూస్తున్నట్లనిపించింది అతనికి. 'జాగ్రత్త మాస్టారూ నేనెవరో తెలుసా' అన్న గర్వం అతని కళ్ళలోనుంచి తొణికిసలాడుతున్నట్లు తోచింది. తనొక్కడే ప్రైవేట్లు చెపుతున్నాడా ?

మిగతా మాష్టర్లు మాత్రం చెప్పడం లేదూ? తన ఉద్యోగం తీయించేస్తారా? శ్రీహరికి కళ్ళనీళ్ళు తిరిగాయి. పిల్లలు చూస్తారేమోనన్న భయంతో తలవంచుకొని కొంచెం సర్దుకున్నాడు. తరువాత పాఠం మొదలుపెట్టాడు. లోపలి బాధ ఒక్కసారి పైకి ఉబికి రెండో మాట ముద్దయిపోయింది. పిల్లలందరూ మాష్టారికేసి చిత్రంగా చూశారు. శ్రీహరి తేనిదగ్గు తెచ్చుకొని, కొద్దిసేపు తరువాత పైకి గంభీరత వహించి పాఠం సాగించాడు. కాని ఆవేళ పాఠం సరిగా చెప్పలేకపోయాడు. లోపల అవమానం రగులుతూనే ఉంది.

ఇంటర్వల్లో స్టాఫ్‌రూంకు నడిచాడు. సుధాకర్ తనను తృణీకరింపుతో చూస్తున్నాడనే భావం అతనిలో పాతుకుంది. 'తను ఈనాడు నాడికి అలుసయ్యాడు రేపు మరికొందరికి కావచ్చు. మరికొన్నిరోజులికి పిల్లలందరికీ అలుసవవచ్చు. ఛీ వెధవ మాష్టరీ!' ఒకమూల మౌనంగా కూర్చొని తనలో తాను ఏదో మథనపడుతున్నట్లున్న శ్రీహరిని చూసి గోపాలరావు అడిగాడు: "ఏం శ్రీహరీ, అట్లా ఉన్నావు? హెడ్‌మాష్టారు పిలిచారట. ఏమన్నారేమిటి?" శ్రీహరి మాట్లాడదలచుకోలేదు. కాని గోపాలరావు సుబ్బారావు వగైరాలు గుచ్చి గుచ్చి అడగగా చెప్పక తప్పిందికాదు. "ఓస్ దానికే ఇంత ఇదయిపోతే ఎట్లా? ప్రైవేట్లు చెప్తున్నావని రిపోర్టు ఇస్తానని బెదరిస్తే బెదరి పోవడమే? రామచంద్రరావుగారు ఇట్లా ఫిర్యాదు చేయడానికి

వచ్చాడని తెలియగానే ఆయనకో నమస్కారం పడేసి 'ఓహో మీఅబ్బాయి అని తెలియదుసుమండీ. ఇంక అట్లా చేస్తానా? ఇప్పుడు తెలిసిందికా. ఇకముందు మీ వాడిని నావాడినిగానే చూసుకుంటా'నని తైరుకొట్టేసి ఉంటే ఆ రావుగారు ఐస్సైపోయి 'ఊరికే చెప్పడానికి వచ్చానండీ, మీ మీద కోపంవల్ల కాదు. ఆనక ఒకమారు మాయింటికి రాగలరా, మావాడి చదువు విషయం మీతో మాట్లాడాలి — అంటే ప్రైవేటు చెప్పుదురుగాని అని సూచనన్న మాట —' అని చక్కాపోవును. శ్రీహరీ, లోపల ఏమి ఉన్నా పైకి తియ్యనిమాటలు మాట్లాడడం, పెద్ద తలకాయలని తోచిన వాళ్ళకు కనబడ్డప్పుడల్లా వాళ్ళ మొగాన ఒక నమస్కారం పడెయ్యడం నేర్చుకోవాలోయ్. ఇన్నాళ్లనుంచి మాష్టరీ చేస్తున్నావు. ఇప్పటికైనా తెలుసుకోవాలి ఏదో ముక్కుకు సూటిగా పోతానంటే కుదరదు," అని సలహా ఇచ్చాడు నరసింహారావు.

"ఇదుగో శ్రీహరీ, పాఠాలు చదవలేదనీ, హోంవర్కు చేసుకురాలేదనీ, కాంపోజిషన్ రాయలేదనీ ఎప్పుడూ కొట్టకు. అది ప్రమాదం. చదువులంటే వాళ్ళకులేని ఆ దుగ్ధా నీకెందుకు? మన జీతప్పురాళ్ళకోసం మనం వస్తున్నాం. వాళ్ళేమో పరీక్షలు పాసవడానికి వస్తున్నారు. నిజమైన చదువు లెవరికీ అక్కరలేదు—ఏ కొద్దిమందికో తప్ప. ఇంతకీ తెలివైనవాడికి నువ్వు చెప్పకపోయినా ఫరవాలేదు, తెలియని

వాడికోసం బుర్రకొట్టుకున్నా లాభంలేదు. పాసయ్యేవాడు నువ్వు వద్దన్నా పాసయి తీరుతాడు. అంటే అసలు పాఠాలు చెప్పడం మానేసెయ్యమనికాదు, అంత పెద్దగా ప్రాణాలు అరగదీసుకోవద్దనే నేను చెప్పేది. పైగా ఈ పరీక్షల దృష్టి వల్లే మనకి ఈ ప్రైవేట్లన్నా దొరుకుతున్నాయనుకో, లేకపోతే మన పనేంకావలసింది ? ఇదీ ఒకందుకు మేలే” అన్నాడు గోపాలరావు.

“పాఠం చదవలేదని కొట్టలేనుగా. అల్లరిచేశాడని కొట్టాను” అన్నాడు శ్రీహరి.

“అల్లరిచేశాడనే కొట్టావు. కాని పెద్దవాళ్ళ పిల్లలున్నప్పుడు జాగ్రత్తగానే ఉండాలి. ఏ ఆఫీసరు కొడుకునో కొ ట్టా వ ను కో అప్పు డేమన్నా ఉందా ?” అన్నాడు నరసింహారావు.

“మరెట్లా ? వా డల్లరి చేస్తూంటే వాడి నూరుకొని మిగిలినవాళ్ళని కొ ట్టే క్లాసులో గోల బయలుదేరదూ ?”

“అక్కడేనోయ్ టాక్టిక్స్ ఉపయోగించాలి. నేను చూడు ఏమిచేస్తానో. మా క్లాసులో ఓ మొద్దావతారం ఉంది. చెప్పులుకుట్టేవాడి కొడుకు. గేదెదూడలా ఉంటాడు. క్లాసులో ఏమాత్రం అల్లరిజరిగినా ముందు వాడిని దబదబా నాలుగు బాదేస్తాను. దానితో క్లాసు కిక్కురుమనకుండా ఉంటారు. ‘బీట్ ది డాగ్ అండ్ త్రెటెన్ ది లయన్’అన్నారు. నువ్వూ అట్లాగే చేయాలి” అన్నాడు నరసింహారావు.

శ్రీహరి కీ సూచన నచ్చలేదు. అట్లాచేయడం చాలా అన్యాయ మనిపించింది. సుధాకర్ అంటే, వాడి తండ్రి అంటే, అతనిలో మండుకుపోతోంది. కాని ఏమిచేయగలడు ? మధ్యాహ్నం క్లాసులో పిల్లలు మాట్లాడుతున్నారు. మాట్లాడ వద్దని గట్టిగా అరిచాడు శ్రీహరి. పిల్లలు ఒక్కక్షణం నిశ్శబ్దంగా ఉండి మళ్లా గుసగుసలాడుతున్నారు. క్లాసు కందిరీగల పుట్టాలా ధ్వనిస్తోంది. సుధాకర్ ప్రక్కవాడితో మాట్లాడు తున్నాడు. ప్రొద్దున్న జీవితం ఆనందమయం అనిపించింది. కాని ఇప్పుడు జీవితం ఎంతో హీనమనిపిస్తోంది. అందులోనూ మాష్టరీ. – రామచంద్రరావుగారి మాటలూ బెదిరింపులూ మనస్సులో శూలంలా గుచ్చుకుంటూనే ఉన్నాయి. హెడ్ మాష్టారు తనను సమర్థించే బదులు ఆ పెద్దమనిషినే వెనకేసుకురావడం పుండుమీద కారం చల్లినట్లుగా ఉంది.

బడి విడవగానే సాయంత్రం ప్రైవేట్లున్న ఇళ్లవైపుకు బయలుదేరాడు శ్రీహరి – 'ప్రైవేట్లు చెప్పవచ్చా" అని అడిగాడు రామచంద్రరావుగారు. ప్రైవేట్లు మానేస్తే మంచిదేమో. మానేస్తే డబ్బు ఇరకాటమో ? మనస్సు బాగా లేదు కాబట్టి ఈవేళకి ప్రైవేట్లు మానేద్దా మనుకొని తిన్నగా యింటికి దారితీశాడు.

ఇంటికి వెళ్లేసరికి అక్కడ పెద్ద గోలగా ఉంది. తమ్ముడు రాధ ఇంటికప్పెక్కి కూర్చున్నాడు. ఇంటిఆయన ఇవతలకు దిగుతావా దిగవా అని కేకలేస్తున్నాడు. ప్రక్కవాటాల్లో

వాళ్ళు అందరూ బయటకు వచ్చి అందరూ తలోమాటా ఆడుతున్నారు. శ్రీహరిని చూసి ఇంటిఆయన దగ్గరకు పరుగెత్తుకువచ్చి "నాయనా శ్రీహరీ, మీతమ్ముణ్ణి దిగమను. పెంకునేతగాళ్లే చేయాలిగాని చేతకానివాళ్లు చేయబోతే పెంకులు నలిగిపోతాయి, మేస్త్రీకి కబురంపిస్తానులే, దిగిరమ్మను" అని చెప్పసాగాడు.

"ఏమిటిరా రాధా అది ?" అని అడిగాడు తమ్ముడిని శ్రీహరి నీరసంగా.

"అవునన్నయ్యా, రాత్రి మళ్ళీ వర్షం కురిసేటట్లుంది. రాత్రి నిద్రపోవాలా అక్కర్లేదా ? అందువల్ల నేనే సర్దుతాను. ఈయన మేస్త్రీని పిలిపించేటప్పటికి నేను పిల్లలతండ్రినవుతాను" అని పెంకులు సర్దుతున్నాడు రాధ.

"ఏమండీ దిగుతారా దిగరా. మీయిల్లేంకాదు. పెంకులుపోతే నష్టపోయేది మేము. దిగండి ముందు" అని అరిచాడు ఇంటిఆయన కొడుకు వెంకటేశ్వర్లు.

"దిగను" అన్నాడు రాధ.

"దిగుతారా దిగరా, లేకపోతే—"

"లేకపోతే ఏంచేస్తారయ్యా" అంటూ రంగంలోకి దూకాడు ప్లీడరుగుమాస్తా. "ఏంచేస్తారంట ? అద్దె కావాలేం ? ఇంటికి రిపేరుమాత్రం చేయించనక్కర్లేదూ ? ఎన్నేళ్ళయింది రిపేరుచేసి. ఇదుగో శ్రీహరిగారూ మనమే ఒక మేస్త్రీని పనివాళ్ళనూ తీసుకువచ్చి ఇల్లు తిరగేయించేద్దాం.

ఆపైన అద్దెలో విరగ్గోస్తేసరి. చేతనైతే కోర్టులో దావా వేసుకుంటారు" అన్నాడు.

రామలింగంగారికి ప్లీడరుగుమాస్తా అంటే భయం. మెత్తనివాడు కాబట్టి శ్రీహరి దగ్గరికే చేరి "ఇదుగో నాయనా, తమ్ముడిని దిగమని చెప్పు. పెంకులు పోతాయి. అసలే తక్కువగా ఉన్నాయి—" అని చెప్తూంటే

శ్రీహరి ఒక్కసారి బుస్సుమని లేచాడు. "ఎన్ని సార్లండీ బాగుచేయిస్తాను ఇదే బాగుచేయిస్తాను అని చెపుతూ వచ్చారు. కాని ఇంతవరకు ముహూర్తం కుదరనే లేదా? ఇంట్లో ఉన్నవాళ్ళు మనుష్యులనుకుంటున్నారా పశువులనుకుంటున్నారా, అద్దె తీసుకోవడం వరకేనా మీ బాధ్యత" అని గట్టిగా అరిచాడు.

ఎన్నడూ గట్టిగా మాట్లాడని శ్రీహరి ఇట్లా కస్సుమని లేచేసరికి ఇంటాయన నోరు తెరచుకొని నిలబడిపోయాడు.

కొడుకు వెంకటేశ్వర్లు "ఇల్లు మీదన్నట్లు మాట్లాడుతున్నారే! కష్టంగా ఉంటే ఖాళీచేయండి. అంతేకాని—"

"ఖాళీ చేయం" అన్నాడు శ్రీహరి ఇంకా గట్టిగా.

"అయితే మేము బాగూ చేయించం" అన్నాడు వెంకటేశ్వర్లు.

"మేము అద్దె ఇవ్వం. చేతనైతే కోర్టులో ఫిర్యాదు చేసుకోండి. చెల్లించవలసిన కోర్టుద్వారా చెల్లిస్తాం" అన్నాడు ప్లీడరుగుమాస్తా.

ఇంటిఆయన రామలింగంగారు తేరుకొని శ్రీహరి చేతులు పట్టుకొని "నాయనా రేపే తిరగేయిస్తాను. చేతిలో చెయ్యేసి చెపుతున్నాను. ఒరే వెంకటేశ్వర్లు, ఇప్పుడే వెళ్ళి మేస్త్రీని పిలుచుకురా మాట్లాడుదాం" అని ఇంకా పోట్లాటకి సిద్ధమవుతున్న కొడుకును చెయ్యిపట్టుకొని వెనక్కి లాగారు.

"దిగి రారా" అని కేకేశాడు శ్రీహరి.

రాధ దిగివచ్చాడు. ఎవళ్ళ యిళ్ళలోకి వాళ్ళు నడిచారు.

తనట్లా ఇంటిఆయనమీద కేకలువేసినందుకు తనే ఆశ్చర్యపోయాడు శ్రీహరి. ఏమైనా కొంత కోపం బయట పడడంవల్ల గుండెలోని ఒత్తిడి కొంత తగ్గింది. ఇంట్లోకి నడిచి కుర్చీలో కూలబడి కొంచెంసేపు ఆలోచనలో పడిపో యాడు. ముందురోజు సాయంత్రం ప్రైవేట్లు చెప్పలేదు. ఈవేళకూడా వెళ్ళకపోతే ఏమన్నా అనుకుంటారేమోనని ఆలస్యమయితే అయింది వెళ్ళిరావడం మంచిదని మళ్ళీ సైకిలు తీసుకొని వెళ్ళాడు. రెండుచోట్ల "మాస్టారూ. కొన్నాళ్ళు ప్రైవేట్లు ఆపుచేద్దామనుకుంటున్నామండీ. కొంత లెక్క సర్దుబాటు కావడం కష్టంగా ఉంది. మేమే కబురంపు తాము మళ్ళీ ప్రైవేటు ఎప్పటినుంచి ప్రారంభించవచ్చో" అని ఐదేసి రూపాయిలు చేతిలో పెట్టేశారు. వాళ్లు డబ్బుకు ఇబ్బంది పడేవారు కారే. ఎందుకు ఇట్లా మానిపించారో అర్థంకాక శ్రీహరి మూడో చోటికివెళ్ళి అక్కడి ఇద్దరిపిల్లలకూ

ప్రైవేటు చెప్పి ఆ పదిరూపాయిలు తీసుకొని ఇంటికి వచ్చాడు. పొద్దున్న ఉన్న ఉత్సాహానికి బదులు ఇప్పుడు అతనిలో నీరసం మాత్రం మిగిలింది. పెందరాళే భోజనంచేసి మంచం మీదికిచేరి పుస్తకం తీసుకున్నాడు. కాని మనస్సు సరిగా పనిచేయలేదు. బడిలో సంఘటనలు తలచుకుంటూ బాధ పడుతూ ఆలోచనలో మునిగిపోయాడు.

౨౪

రాత్రి అతని అహాన్ని సంతృప్తిపరచే ఒకటి రెండు కలలు వచ్చాయి. ఒకసారి తను హెడ్‌మాష్టారిని నిలదీసి అడిగినట్లూ, హెడ్‌మాష్టారు అధారిటీ చలాయించబోతే తాను ఎదిరించినట్లూ, మాష్టర్లందరూ తనతో కలిసినట్లూ, దానితో హెడ్‌మాష్టారు తగ్గి అతనిని ప్రాధేయపడినట్లు కలవచ్చింది. ఇంకొకసారి తను రామచంద్రరావుని ముష్టి యుద్ధంలో చిత్తుచేసినట్లూ, రావుగారు చేతులు పైకెత్తి మొరపెట్టినట్లూ క్లాసులో పిల్ల మాధవి అది చూసి చప్పట్లు కొట్టినట్లు కలవచ్చింది. ఆ మాధవే ఇంటివారి కోడలిగా మారిపోయింది. రామచంద్రరావే ఇంటివారి కొడుకుగా అయిపోయాడు. అంతలోనే హెడ్‌మాష్టారిక్రింద మారి పోయాడు.

మళ్ళీ వర్షం ప్రారంభమయింది. ప్రొద్దున్న అన్ని చోట్ల లేదుకాని కొన్నిచోట్ల కప్పు కురుస్తోంది. అందువల్ల శ్రీహరీ వాళ్లూ లేచి మళ్ళీ కొంచెం మంచాలు కదిపీ, అక్కడ వస్తువు లిక్కడకు మార్చి, గిన్నెలూ పళ్లేలూ పెట్టవలసి వచ్చింది అంతలో వర్షపుహోరులోనుంచే ఎవరిదో సన్నగా ఏడుపు వినిపించింది. శ్రీహరి వినలేదు మొదట్లో, వరలక్ష్మి అతనిదృష్టికి తీసుకువచ్చింది. "ఎవరూ ఏడుస్తున్నది ?" అని వరండాలోకి వచ్చారు శ్రీహరీ, వరలక్ష్మి. ప్రక్కయింటిలో ఉన్న పి. డబ్ల్యు. డి. గుమాస్తా రామకృష్ణమూర్తి భార్యాకూడా ఇవతలకు వచ్చారు. "బిల్లు కలెక్టరు ఇంటిలోనుంచి వినిపిస్తోంది" అన్నాడు శ్రీహరి. "అవును భార్యనేమైనా కొట్టాడేమో" అన్నాడు రామకృష్ణమూర్తి "కాదండీ, అట్లా తోచడంలేదు. 'అయ్యో నాయనా' అని వినిపిస్తోంది. ఆఖరిపిల్లవాడికి రెండురోజుల నుంచి జ్వరంట. ఏమన్నా ప్రాణంమీదికి వచ్చిందేమో" అంది వరలక్ష్మి తనభర్తతో. "చూసివద్దామా" అని శ్రీహరీ రామకృష్ణమూర్తి ఇద్దరూ గొడుగులు వేసుకొని ప్రక్కకు నడిచారు.

బిల్లుకలెక్టరు ఇంటిలో హరికేన్‌లాంతరు వెలుగుతోంది. పిల్లలు అటూ ఇటూ అస్తవ్యస్తంగా పడుకొని ఉన్నారు. వారిమధ్య చాపమీద కూర్చొని ఆఖరిపిల్లవాడిని ఒళ్లోపెట్టుకొని ఏడుస్తోంది భార్య. బల్లుకలెక్టరు దుఃఖానికి

శిల్పంలో రూపం కల్పించినట్లు కూర్చొని ఉన్నాడు. పిల్లవాడు పోయాడేమో అనుకున్నారు శ్రీహరీ రామకృష్ణ మూర్తి. కాని వాడి డొక్క లింకా ఎగురుతూనే ఉన్నాయి. పొట్టమాత్రం సూరీగుమ్మడికాయ అంత ఉంది.

"ఏమండీ ఏమైంది ?" అని అడిగాడు శ్రీహరి.

"రెండురోజులనుంచి జ్వరం అండీ. చాలారోజుల నుంచి ఆరోగ్యం బాగుండడంలేదండీ వీడికి" అని చెప్పాడు బిల్లుకలెక్టరు.

"మరి వైద్యం చేయించడం లేదూ ?"

"చేయించకేం తెలుగువైద్యం చేయిస్తున్నామండి. చేయగలిగిందంతా చేశానన్నాడు వైద్యుడు. కర్మ ఎట్లా జరగాలో అట్లా జరుగుతుంది" అన్నాడు నిర్లిప్తంగా బిల్లు కలెక్టరు.

"అదేమిటండీ. మంచి డాక్టరు కెవరికైనా చూపించక పోయారా" అని అడిగాడు రామకృష్ణమూర్తి.

"డబ్బుండొద్దండీ——"

"అయితే పిల్లాడిప్రాణం పోతోంటే చూస్తూ ఊరు కుంటారా. ఇప్పుడైనా మించిపోయింది లేదు" అన్నాడు శ్రీహరి.

బిల్లుకలెక్టరు మాట్లాడలేదు. అతనిభార్య 'నా తండ్రిని రక్షించండి బాబూ. మీకాళ్ళకి మొక్కుతాను.

ఇంట్లోఉన్న కొద్ది గిన్నే తప్పాలా అమ్మి తీరుస్తాను. పిల్లాడు బ్రతికితే చాలు'' అని ఏడ్చింది.

శ్రీహరీ రామకృష్ణమూర్తీ తమలోతాము ఆలోచించుకొని "మేము పిలుచుకువస్తా ముండండి'' అని ఇద్దరూ అర్ధరాత్రివేళ వర్షంలో నడిచివెళ్ళారు. వరలక్ష్మి రామకృష్ణమూర్తి భార్యా వచ్చి బిల్లుకలెక్టరు భార్యదగ్గర కూర్చున్నారు. శ్రీహరీ రామకృష్ణమూర్తి దగ్గరవీధిలోనే ఉన్న డాక్టరు ఇంటితలుపు తట్టారు. అరగంటతట్టి, అరిస్తేకాని డాక్టరు తలుపు తియ్యలేదు. విషయం చెప్పారు శ్రీహరీ రామకృష్ణమూర్తీ. "ఇంతరాత్రివేళవచ్చి చేసేది ఏమీలేదు. నా కిప్పటివరకూ మరికొన్ని అర్జంటుకేసులతో సరిపోయింది. ఇప్పుడే నిద్రపట్టింది. మందు ఇస్తాను పట్టుకువెళ్ళి వాడేమనండి. ప్రొద్దున్నేవచ్చి ఎట్లాఉన్నదీ చెప్పండి. అవసరమైతే వచ్చి ఇంజక్షన్లూ అవీ ఇస్తాను'' అని ఒకమందు మూడుపొట్లాలు కట్టి ఇచ్చాడు డాక్టరు.

శ్రీహరీ రామకృష్ణమూర్తీ తిరిగి వచ్చారు. బిల్లుకలెక్టరు ఏమీ ఉత్సాహం చూపలేదు. వరలక్ష్మి తోడ్పడగా బిల్లుకలెక్టరు భార్య మందు పాలలో కలిపి పిల్లవాడి గొంతుకలో కష్టంమీద పోసింది. కొంతసేపున్నతరువాత, "మీరుకూడా మేలుకొని ఉండడం ఎందుకు ? ఇంత చేశారు చాలండీ, మేము కూర్చుంటాములెండి. అవసరమైతే లేపు

తాను మిమ్మల్ని" అని శ్రీహరి వాళ్ళనూ పంపేశాడు బిల్లుకలెక్టరు.

శ్రీహరి మనస్సంతా పాడయిపోయినట్లయింది. గుండెలమీద ఏదో బరువున్నట్లుంది. 'బ్రతుకెంత బాధాకరం!' నిద్రపట్టదేమో అనుకున్నాడు కాని అతనికి తెలియకుండానే అతనికి బాగా నిద్ర పట్టేసింది. మళ్ళీ తెల్లవారు సమయాన బిల్లుకలెక్టరు ఇంట్లోనుంచి అరుపులు వినిపించి అతనికి మెలకువ వచ్చింది. అప్పటికప్పుడే అంతా అయిపోయింది. శ్రీహరి వాళ్ళూ వెళ్ళి సానుభూతి తెలియజేశారు. బిల్లుకలెక్టరు నిశ్చలమైన కళ్ళతో నిలబడి ఉన్నాడు. అతని నోటంట ఒక్క శబ్దం రావడంలేదు. శ్రీహరి ఇంటికి తిరిగి వచ్చి, కాలకృత్యాలన్నీ తీర్చుకొని ఈవేళైనా ప్రొద్దున్న ప్రైవేట్లకు పోకపోతే బాగుండదని త్వరగా సైకిలు తీసుకొని వెళ్ళిపోయాడు.

కాని అతని మనస్సులో కల్లోలంగానే ఉంది. ఆ చచ్చిపోయిన పిల్లవాడిపట్ల పాపం అని కూడా అనిపించలేదు. సానుభూతినికూడా హరించేసింది వాడి వికృతరూపం. బిల్లుకలెక్టరూ, అతనిభార్యా యొక్క నిస్సహాయత మాత్రం శ్రీహరి మనస్సులో ముల్లుపెట్టి కెలికినట్లు చేస్తోంది. 'తమ రక్తంలో రక్తం, తమప్రేమ ఆశలు గూడుకట్టుకున్న సంతానం అట్లా చచ్చిపోతూంటే చూస్తూ ఊరుకోవలసి వచ్చింది. సరియైన వైద్యం చేయిస్తే ఆకుర్రవాడు బ్రతికి

బాగుండునేమో. - రేపు ఇంకా మిగిలినపిల్లలకు వస్తే ! —ఛ ఛ—అట్లాగే తనబాబు వెంకటరమణా సత్యావతికీ'— శ్రీహరి వణికిపోయాడు. ఏమిటీ జీవితం ? అతనిసైకిలు మరో సైకిలును గుద్దేయబోయింది. "ఏమిటయ్యా ఆ తొక్కడం ! ఇది నడిరోడ్డా మరేమన్నానా" అని కోపంగా అని వెళ్ళి పోయాడు అవతలసైకిలువాడు. శ్రీహరి ఆలోచనల నణచేసుకొని ప్రైవేట్లు కుర్రవాళ్ళ ఇళ్ళకు వెళ్ళాడు. పాఠం చెప్పడం కష్టంగా ఉంది. లోపలి ఆలోచనలు పైకిరావాలని ప్రయత్నిస్తున్నాయి. కాని వాటికి దారి దొరకడంలేదు. 'పూర్తిగా ఆలోచించుకుందుకు కూడా తీరికలేని జీవితం !'

ప్రైవే ట్లయిపోగానే ఇంటికి పరుగెత్తాడు. బిల్లుకలెక్టరు ఇంటిలో నిశ్శబ్దం—మనుషులు బ్రతికిఉన్నారా లేక చచ్చిపోయారా అన్నట్లు. - బిల్లుకలెక్టరు లేడు. భార్యాపిల్లలూ మాత్రం ఎక్కడివాళ్ళక్కడ కూలబడి ఉన్నారు. బిల్లుకలెక్టరు భార్య ఏడవడంలేదు. గోడకానుకొని నిద్రపోతోంది. శ్రీహరి ఇంటికిచేరి భార్యతో త్వరగా వడ్డించమని చెప్పి, రెండుమూడు కాంపొజిషను పుస్తకాలు దిద్ది, మళ్ళీ నాలుగు మెతుకులు నోట్లోవేసుకొని బడికి పరుగెత్తాడు.

క్లాసులో పిల్లలు అల్లరిచేస్తున్నారు. లీడరు కొందరు పిల్లలని బెంచి ఎక్కమంటున్నాడు వాళ్లు ఎక్కమంటున్నారు. వాళ్ళలో సుధాకర్ కూడా ఉన్నాడు. శ్రీహరికి ఏమి చేయాలో తోచలేదు. అందరినీ కూర్చోమన్నాడు. హోం

వర్కు చేశారా అని అడిగాడు. సగంమంది మాత్రమే చేశారు. అదృష్టవశాత్తూ వాళ్ళలో సుధాకర్ లేడు. శ్రీహరి వాళ్ళను లీడరు నిచ్చి హెడ్‌మాష్టారి దగ్గరికి పంపాడు. మరి కాసేపటికి లీడరు తిరిగివచ్చాడు. "హెడ్‌మాష్టారు వీళ్ళ నందరినీ బెంచిమీద నిలబెట్టించమన్నారండి. మిమ్మల్ని ఒకసారి రమ్మన్నారండి" అన్నాడు. అట్లాగే ఆ పిల్లలని బెంచిమీద ఎక్కించి, లీడరును క్లాసు చూస్తూ ఉండమని చెప్పి, శ్రీహరి హెడ్‌మాష్టారి దగ్గరికి వెళ్లాడు.

"ఏమిటండీ శ్రీహరిగారూ, అందరినీ నాదగ్గరికి పంపిస్తే ఎట్లా? అందరు మాష్టర్లూ అస్తమానమూ ఇట్లాచేస్తే నేను మరొకపని చేసుకోనక్కర్లేదా? మీక్లాసు విషయం మీరే చూసుకోవాలి" అన్నారు హెడ్‌మాష్టారు.

"మరి పనిష్‌మెంట్ ఇస్తే—" అని ఆగిపోయాడు శ్రీహరి.

"అదా!—కొట్టొద్దన్నానుగాని బుస్సుమన వద్దన్నానా?"

శ్రీహరి ఇంకా ఏదో చెప్పబోతూండగా "డోన్ట్ వర్రీ, డూ యువర్ డ్యూటీ" (చింతించకండి, మీ కర్తవ్యం చేయండి) అని చెప్పి హెడ్‌మాష్టారు గుమాస్తాను కేకేశారు.

'ఏమిటీ సలహా?—బుస్సుమనాలా? కాని ఒకటి రెండు బుస్సులకే పిల్లలు గ్రహించేస్తారు ఇది కోరలు తీసేసిన పామని. వాళ్ళకు లెక్క ఏముంటుంది. మరి ఏం

చేయాలి ? నరసింహారావు చెప్పిన చిట్కా అమలుపరచాలా?
అట్లా ఎప్పుడూ చేయలేదు. అట్లాచేయడం అన్యాయం. -
హుఁ. తనకెందుకు ఇంత వ్యథ ? ఎవరెట్లాపోతే తనకేం ?
పాఠం చెప్పుకుపోవడమే తన కర్తవ్యంగా చూసుకోవాలి.
ఏవో పిట్టకథలూ ఆకబుర్లూ ఈకబుర్లూ పనికొచ్చేవి అయినా
కాకపోయినా చెప్పి పిల్లలను ఆకర్షించాలి. వాళ్ళు ఇంటి
దగ్గర చదివినా చదవకపోయినా చదువులో ఏమీ శ్రద్ధ
తీసుకోకపోయినా తనంత పట్టించుకో కూడదు. తనుకూడ
'షోవర్కు' (పైకి డాబు) ప్రారంభించాలి—'

శ్రీహరి క్లాసుకు వచ్చాడు. తరువాత ఎప్పుడో
అతనికి తెలిసింది తనదగ్గర ప్రైవేట్లు చెప్పించుకుంటూ ఆవేళ
నుంచీ మానేసిన ఇద్దరు పిల్లలూ గోపాలరావు దగ్గర చేరా
రని. వాళ్ళకి పాసు గారంటీ ఆశపెట్టాడట గోపాలరావు.
ఈవార్త వినగానే శ్రీహరి బుర్ర కొన్నిక్షణాలు పనిచేయ
లేదు. తరువాత పిచ్చికోపం పొంగివచ్చింది. దొంగల్లోనైనా
ఒక కట్టుబాటు ఉంటుంది. వీళ్ళలో అదీ లేదు. ఉత్తనీచులు.
తలచుకుంటున్నకొద్దీ అతనిలో కోపం పెరిగిపోతోంది కాని
తన నిస్సహాయతకూడా మొగంలోకి తేరిపార చూస్తోంది.
తేలుకుట్టిన దొంగలా తను నోరుమూసుకు కూర్చోవలసిందే..
కోపం బయటికిపోయేదారిలేక లోలోపలే దహించివేస్తోంది..
మధ్యాహ్నం రీసెస్ వేళ గోపాలరావు ఏమీ తెలియనట్లే,
ఎంతో స్నేహం ఉట్టిపడుతున్నట్లే మాట్లాడాడు. శ్రీహరికి
నవ్వాలో ఏడవాలో తెలిసిందికాదు.

సాయంత్రం ఒకటే ప్రైవేటు కాబట్టి కొంచెం త్వర గానే ఇంటికి చేరుకున్నాడు. ఇంటికి వెళ్ళేసరికి ఇల్లు నానా చిందరవందరగా ఉంది. ఇంటియజమాని ఇల్లు తిరగేయించాడు. సగం భాగం తిరగెయ్యడం అయింది. అంత వరకూపడ్డ దుమ్ము తుడుస్తోంది వరలక్ష్మి. శ్రీహరికోసం వరండాలోనే కుర్చీవేసి ఒక ఉత్తరం అందించింది "మీ చెల్లెలుదగ్గరనుంచి వచ్చింది" అంటూ. శ్రీహరి కనుబొమలు ముడిచి త్వరగా ఉత్తరం చదివాడు. "ఏమిటి చెయ్యమంటారు నన్ను ? నాదగ్గర రక్తమాంసాలుతప్ప ఇంకేమీలేవే పీక్కు తినడానికి" అని గొణిగాడు.

వరిలక్ష్మి ఇల్లు శుభ్రంచేయడం పూర్తిఅయింది. శ్రీహరి లోపలికివెళ్ళి తనగదిలో చొక్కా కండువా తీసి చిలకకొయ్యకు తగిలించి, దొడ్లోకిపోయి కాళ్ళు కడుగుకు వచ్చి మంచంమీదికి వాలాడు నీరసంగా. తల్లి సూరమ్మ గారు లేచివచ్చి కొడుకుగదిలో తలుపుకుజేరబడి కూర్చుంది. రాధాకృష్ణ వచ్చి గడపదగ్గర నిలబడ్డాడు అక్క ఉత్తరం మీద అన్నయ్య ఏమంటాడో విందామని.

"చూశావురా నాయనా, నీచెల్లెలిని నానాబాధలు పెట్టున్నారట. నానామాటలూ అంటున్నారట. ఒకత్తే అది ఏంజవాబు చెప్పగలదు ? రెండుమూడేళ్ళనుంచి పండగలకు అతగాడిని తీసుకువచ్చి బట్టలూ అవీ పెట్టలేదనేకా ఇదంతా.

అందుకోసం దానిని కోసిపెట్టారా ? ఎట్లాఉందో వెర్రిపిల్ల ! దానినిచూసి ఎంతకాలం అయిందో" అంటూ కంటతడి పెట్టసాగింది సూరమ్మగారు.

శ్రీహరి విసుగు అంతా హరించిపోయింది. చెల్లెలిని గురించి ఆలోచన అతనిగుండెను బరువుచేసింది. ఇన్నాళ్ళూ ఇంచుమించుగా తను చెల్లెలిమాట మరచేపోయాడు. చిన్నప్పుడు ఎంత చలాకీగా ఉండేది రాజ్యం! తను ఎంత గారాబం చేసేవాడు. ఇప్పుడు అత్తింటి చాకిరీతో, ఎత్తిపొడుపు మాటలతో ఏమి బాధ పడుతోందో !

"ఏరా నాయనా ఏంచేదామంటావు ?" అని అడిగింది మళ్ళీ తల్లి.

"ఏంచేయడమేమిటి అన్నయ్యా, బావకి గూటించి ఉత్తరం రాసెయ్యి. లేకపోతే నాకు డబ్బియ్యి, నేను వెళ్ళి బాగా గడ్డిపెట్టి వస్తాను. పండగలకు పిలవలేదనీ ముచ్చటలు జరపలేదనీ అక్కయ్యను కోసిపెట్టారా ? అవమానపుమాట లంటారా ? ఇవతలవాళ్ళు మనుష్యులు కాదనుకున్నారా," అన్నాడు రాధ కోపంగా. 'గతిలేనివాళ్ళ సంబంధం చేసుకుంటే ఇట్లాగే ఉంటుంది'—'మీ అన్నయ్య ఇంట్లో గంజి తాగి కాలక్షేపం చేస్తారటగా' అంటూ వాళ్ళన్నమాటలు (రాజ్యం రాసింది) అతని పడుచునెత్తురును ఉడికేటట్లు చేశాయి.

శ్రీహరిలో కూడా అవమానం, కోపం పొంగుతున్నా తాను చేయగలిగిందికూడా ఏమీలేదని తెలిసివస్తోంది. వరలక్ష్మికూడా అక్కడికివచ్చి నిలబడింది. "పోనీ ఒకసారి వెళ్ళి చూసి రారాదండీ" అంది. "ఉట్టిచేతులతో వెళ్ళి చూసివస్తేమాత్రం ఏంలాభం ? పైగా వాళ్ళమాటలకి నాకు కోపంవచ్చి నే నేమన్నా అంటే మధ్యని బాధపడేది చెల్లాయి. తొందరపడి ఏమైనాచేస్తే దానిసంసారం చెడగొట్టినవాళ్ళ మవుతాం. మర్యాదగానే రాయాలి ఉత్తరం" అంటూ నిట్టూర్చాడు శ్రీహరి.

"మర్యాదగా రాస్తే గ్రహించేవాళ్ళయితే ఇట్లా ఎందుకు ప్రవర్తిస్తా రన్నయ్యా ? వాళ్ళవి రాతిగుండెలు. అందుకే అక్కయ్యమీద ఒంటరిదానినిచేసి సాగిస్తున్నారు రంపపుకోత" అని అన్నయ్య అట్లా దిగజారిపోయినందుకు కోపంతో ఇవతలకు వచ్చేశాడు రాధ.

వరలక్ష్మి తనపని చూసుకోసాగింది. శ్రీహరి అట్లాగే మంచంమీదపడి ఆలోచలో మునిగిపోయాడు. ఎదురుగుండా బల్లమీద తను చదవదలచుకున్న పుస్తకాలు ఉన్నాయి కాని వాటికేసి చూడబుద్ధే వేయడంలే దతనికి. వరలక్ష్మి భోజనానికి పిలిస్తే వెళ్ళి చేసి వచ్చాడు. ఆలోచనల ధాటికి గిలగిల కొట్టుకుంటూండగా అతనిలో అంతలో మళ్ళీ తిరుగు బాటు తలెత్తింది. ఈజీవితానికి లొంగి ఉండవలసిందేనా ? ఉత్సాహం శక్తిఉన్నంతవరకు పోరాడితీరాలి అనుకొని లేచి

పుస్తకాలుతీసి చదవడం మొదలుపెట్టాడు. పట్టుదలగా చదువుతున్నాడు. 'ఆంటొనీ అండ్ క్లియొపాత్రా' మొదటి అంకం పూర్తిచేశాడు. కొద్దిసేపటికి తన్నుతాను మరచిపోయి రసవాహినిలోపడి కొట్టుకుపోయాడు. వరలక్ష్మి వచ్చినది కూడా అతనికి తెలియదు.

బాబు నిద్రలో లేచి ఏడుపు మొదలుపెట్టాడు. వరలక్ష్మి ఊరుకోబెట్టడానికి ప్రయత్నిస్తోంది కాని వాడు ఊరుకోవడంలేదు. "జ్వరం తగిలిందండీ బాబుకి. ప్రొద్దుటి నుంచీ ముసముస లాడుతూనే ఉన్నాడు జలుబుతో—" అంటోంది వరలక్ష్మి. ఎత్తునుంచి క్రిందికి తోసేసినట్లైంది శ్రీహరికి. త్వరగావచ్చి బాబు ఒంటిమీద చేయివేసి చూశాడు. ఒళ్ళు వెచ్చగా ఉంది. కొద్దిగా ఆయాసపడుతు న్నాడు బాబు. శ్రీహరికి గుండెలో గుండె లేదు. ప్రొద్దున్న బిల్లుకలెక్టరు కొడుకు పోవడం ఇంకా మనస్సుముందు ఉంది. చెడ్డ భయం వేసింది. "ఇప్పుడే వెళ్ళివస్తాను ఉండు డాక్టరు దగ్గరికి" అని బయలుదేరాడు. రాధ ఏమిటన్నయ్యా అని అడిగాడు. శ్రీహరి చెప్పాడు. "నేనువెళ్ళి మందు పట్టుకు వస్తాను నువ్విక్కడే ఉం డన్నయ్యా" అని చెప్పి వదినగారిని లక్షణాలన్నీ అడిగి తెలుసుకొని, సైకిలు తీసుకొని పరుగెత్తాడు రాధ. శ్రీహరి గుండె దడదడ కొట్టుకుంటోంది. "ఏమిటీ పరీక్ష భగవాన్! మా కీమాత్రం శాంతికూడా ఉంచవా? మేము ఏంతప్పు చేశామని" అని తనలోతాను అనుకున్నాడు.

అతనిలో ఒకవిధమైన కోపం పొంగింది. ఎవరిమీదో అతనికే స్పష్టంగా తెలియదు. భగవంతునిమీదా ? సమాజంమీదా? తనమీదేనా ? తమజీవితం ఇట్లా చీకట్లతో, భయాలతో ఎందుకు ఇంత నిండిఉండాలి ? తాముమాత్రం శాంతిసౌఖ్యాలకు నోచుకోకూడదా అనేదే అతనిని పట్టుకున్నది.

రాధ వచ్చాడు. "కంగారుపడవద్దని చెప్పారన్నయ్యా డాక్టరుగారు. జలుబుజ్వరం అయి ఉంటుందన్నారు. రెండు పొట్లా లిచ్చారు. పొద్దున్నే తనదగ్గరకు తీసుకురమ్మన్నారు. ఏమాత్రం భయంలేదని చెప్పారు" అని పొట్లాలు వదినకు అందిచ్చాడు. శ్రీహరిగుండె కొంచెం కుదుటబడింది కాని కుర్రవాడి ఆయాసం చూస్తూంటే అతనిలో శంకా, భయమూ ఇంకా పూర్తిగా పోలేదు. రాత్రి నిద్ర పోలేకపోయాడు. మాటిమాటికి లేస్తూ బాబుఒళ్ళు పట్టి చూస్తున్నాడు. గుండెలమీద యూకలిప్టస్ ఆయిల్ రాస్తున్నాడు. ఆరాత్రి ఒక యుగంగా గడిచింది.

శ్రీహరి ప్రొద్దున్నే కాలకృత్యాలన్నీ తీర్చుకున్నాడు. బాబుకి ఇంకా జ్వరం ఉంది. జలుబు ఏమీ తగ్గలేదు. భార్యచేత పిల్లవాడిని తీసుకొని డాక్టరుదగ్గరికి పోదామంటే ప్రైవేట్లు పోతాయామె. ఇప్పటికప్పుడె ఈ వారంలో రెండు రోజులు మానేశాడు. ఇంకా మానేస్తే మరికొందరు తన దగ్గర ప్రైవేట్లు వదిలేస్తారేమో. తనే వదినగారితో వెళ్ళి బాబుని డాక్టరుకి చూపించి వస్తానన్నాడు రాధ. "స

జాగ్రత్తగా పరీక్ష చేయించు, ఇంజక్షన్లు ఇవ్వవలసివస్తే ఇమ్మని చెప్పు. అవసరమైతే నా దగ్గరికి వచ్చి కబురు చెప్పు," అని తనే డాక్టరు దగ్గరికి పోలేకపోయినందుకు 'ఛీ పరాధీనపు బ్రతుకు !' అని తనను తానే తిట్టుకుంటూ ప్రైవేట్లకు వెళ్ళిపోయాడు శ్రీహరి.

తొమ్మిదిగంటలకి ఆదుర్దాతో ఇంటికి తిరిగి వచ్చేసరికి బాబుకి రాత్రికన్న కొంచెం నయంగా ఉన్నట్లుంది. రాధ చెప్పాడు : "ఇంజక్షన్లు అవసరం లేదన్నారన్నయ్యా, చాలా మామూలు జలుబూ జ్వరం ట. సాయంత్రానికి బాగా ఖులాసాగా ఆడుకుంటాడని చెప్పారు డాక్టరుగారు." శ్రీహరి గుండెలో కమ్ముకున్న కారుమబ్బులు తొలగిపోయాయి. భయపడిన ప్రమాదం తొలగిపోవడమే అతనికి ఒక ఆనందంగా పరిణమించింది. బాబుని తీసుకొని ముద్దాడుతూ అటూ ఇటూ తిరగసాగాడు. యాదృచ్ఛికంగా అతనిదృష్టి ఎదురుమేడపైకి పోయింది. ఇంటివారి కోడలు కిటికీ దగ్గర నిలబడి ఉంది. ఆమెకళ్లు కలిశాయి, చటుక్కున తలవంచుకొని వెనక్కి తప్పుకుంది. మళ్ళీ చూసేసరికి ఇంటివారికొడుకు వెంకటేశ్వర్లు కిటికిలోంచి చూస్తున్నాడు. శ్రీహరికేసి కోపంతో ఉరిమినట్లు చూశాడు. తరువాత అతనే ఆ కిటికీకి సగంభాగం తెర కట్టేశాడు. శ్రీహరికి నవ్వువచ్చింది. 'సొంత ఆస్తిని గట్టిగానే కాపలా కాసుకుంటున్నాడు' అనుకున్నాడు.

వరలక్ష్మి కేకెయ్యగా బాబుని ఉయ్యాలలో పడుకోబెట్టి, వెళ్ళి భోంచేసి బడికి బయలుదేరాడు.

బిల్లుకలెక్టరు భార్య అప్పుడే బయటనుంచి తిరిగి వచ్చిన కొడుకును అడుగుతోంది : "ఏరా కనిపించారా ?" అని. "లేదమ్మా, అంతటా వెతికాను" అని చెప్పాడు ఆ కుర్రవాడు. "త్వరగా అన్నంతిని మళ్ళీ వెతికిరారా" అని చెప్పి రెండో కుర్రవాడిని కూడా వెతకడానికి వెళ్ళమని చెప్తోంది తల్లి. పిల్లలు పోయినప్పుడల్లా బిల్లుకలెక్టరు ఒకరోజు ఎక్కడికోపోయి చివరికి తిరిగిరావడం అలవాటు. శ్రీహరికి చాలా జాలి వేసింది. తను ప్రమాదంనుంచి బయటపడ్డాడు కాబట్టి తిరిగి ఇతరులపట్ల సానుభూతి చూపగలుగుతున్నాడు.

బడికి వెళ్ళేసరికి మాధవి అతనిదగ్గరికి వచ్చి, కొంచెం ప్రత్యేకంగా పిలిచి, "మాస్టారూ, మానాన్నగారు మిమ్మల్ని ఒకసారి రమ్మన్నారు" అని చెప్పింది. శ్రీహరి జీవితంలో చీకటిపోయి తిరిగి పగలు వస్తున్నట్లుంది. "అట్లాగేనమ్మా" అని చెప్పాడు.

అట్లాగే సాయంత్రం మాధవి ఇంటికి వెళ్ళాడు. మాధవి తండ్రి అతనిని మర్యాదచేసి "మా అమ్మాయికి ట్యూషను చెప్పడానికి మీకు తీరుబడి అవుతుందా మాస్టారూ ? మా అమ్మాయి మీదగ్గరే చదువుకుంటా నంటోంది మీరు బాగా చెప్తారుట" అన్నాడు. శ్రీహరి ఒప్పుకోక ఏంచేస్తాడు ? మాధవి తండ్రి "ఈవేళే ఒక

అరగంట కూర్చొని వెళ్లండి. నెలకు పదిహేనురూపాయిలు ఇస్తాను" అని చెప్పి బయటకు వెళ్ళిపోయాడు. శ్రీహరి అరగంటపైగా మాధవికి ప్రైవేటు చెప్పాడు. మాధవికి నిజంగా ప్రైవేటు అక్కర్లేదు. సరదాకి తప్ప, పదిహేను రూపాయిలు తనకు ఊరికేనే ఇస్తున్నట్లనిపించింది శ్రీహరికి. మాధవితల్లిని చూడగలుగుతాననుకున్నాడు కాని ఆమె కనిపించలేదు. మాధవి ప్రైవేటు అయినతరువాత మిగిలిన సాయంత్రం ప్రైవేటుకు వెళ్ళి అది అయిపోయిన తరువాత ఇంటికి వెళ్ళాడు దారిలో మల్లెపూలదండ ఒకటి కొని.

ఇంటికి వెళ్లేసరికి బాబు బాగా ఖులాసాగా ఉన్నాడు. గుమ్మందగ్గర నిలబడి తండ్రివైపుకు చేయి ఊపుతున్నాడు. శ్రీహరి సైకిలు స్టాండువేసి, వాడి నెత్తుకొని ఇంట్లోకి నడిచాడు. వరలక్ష్మి ఎదురైంది. "ఏం ఇల్లు తిరగెయ్యడం పూర్తి అయిందా ఈవేళ" అని అడిగాడు శ్రీహరి. "ఆ, అయిపోయిందండీ. రాధ సాహసంచేశాడు కాబట్టే జరిగింది లెండి," అంది వరల

"మరదిని మెచ్చుకుంటావు కాని నన్ను మెచ్చుకోవేం? నా కేకలకు హడలిపోయి వెంటనే బాగుచేయించా రనవేం ?"

"అబ్బో, గొప్పపని చేశారులెండి ! కాని ఎన్నడూ లేనిది నిన్న అట్లా కేకలేశారేమిటి ? నిజంగానే ఇంటిఆయన భయపడ్డారుసుమండీ"

శ్రీహరి చిరునవ్వుమాత్రం నవ్వి ఊరుకోని మల్లెపూల దండ భార్యమీదికి విసిరాడు. ఆమె అది తలలో పెట్టుకోని అతనికేసి కనుబొమల మీదుగా కొంటెచూపు చూసింది. ఇంతలో వెంకటరమణవచ్చి "నాన్నోయి, అమ్మేం తాయిలం చేసి దాచిపెట్టింది నాన్నా" అని చెప్పాడు.

"దాచుకోవడం దేనికో" అన్నాడు శ్రీహరి.

"నాకోసమే! బ్రహ్మరాక్షసి అంత కడుపూ ఊరంత నోరు ఉన్నాయి కదూ నాకు," అంటూ నవ్వుతూ వెళ్ళి కొబ్బరి లస్కోరా ఉండలు పట్టుకువచ్చి భర్తకు రెండిచ్చి, రమణ కో ఉండా, సూర్యావతి కో ఉండా ఇచ్చింది. శ్రీహరి ప్రాణం లేచివచ్చింది. హాయిగా తిని, మంచినీళ్ళు త్రాగి కూనిరాగం తీస్తూ తన గదిలోకి వెళ్ళి పుస్తకం తీశాడు. వరలక్ష్మి అటువచ్చి, "ముందు ఆ పుస్తకంకాదు, ఈపుస్తకం చదవండి" అని ఒక పెద్ద పుస్తకం అతని చేతిలో పెట్టింది.

"ఇదేమిటి?" ఇది రాఘది, వాడి 'సబ్జెక్టు' వేరు. నా కవసరం లే దన్నాడు" శ్రీహరి.

"అయినా చదవండి, పరవాలేదు."

"నీ కేమన్నా మతిపోయిందా? చదువుల సంగతి నీకేం తెలుసు? వాడిపుస్తకం నన్ను చదవమంటా వేమిటి?"

"అబ్బ, చదవండి, పుస్తకం వెదకండి. చాలా విషయాలు తెలుస్తాయి" అని నవ్వింది వరలక్ష్మి.

"ఊఁ తెరిచాను—తెరిస్తే?"

"ఇంకా తెరవండి"

"హో! నీ ఆ ఏమిటి? నా కర్థం కావడం లేదు."

వరలక్ష్మి దగ్గరికి వచ్చి పుస్తకం మధ్య తెరచి చూపించింది. అక్కడ ఒక కాగితం ఉంది. ఆ కాగితం మీాద పెన్సిలుతో గీసిన కొన్ని పూలు, ఒక కొమ్మమీాద రెండు పిట్టలూ, వెనక చందమామా ఉన్నాయి. మధ్యగా పెద్ద గుండ్రని అక్షరాలతో చక్కగా వ్రాయబడి ఉంది 'వాసంతి' అని.

శ్రీహరి తెల్లబోయాడు "ఏమిటిది?" అని అడిగాడు.

"ఇంకా బోధపడలేదా?- అయ్యోరామ, ఆమాత్రం గ్రహించ లేనివారు బళ్లో పిల్లలకు పాఠా లెట్లా చెపుతున్నా రండీ? మీా తమ్ముడు చదివిన కాసేపు అంత ధ్యానంతో చదివేది ఈ మూా డక్షరాలే".

"ఏమిటి చెపుదూా పొడుపుకథలు వేయడం మాని" అన్నాడు శ్రీహరి.

"మీా రాధాకృష్ణుడు ఈ వాసంతి అనే రాధను ప్రేమిస్తున్నా డన్న మాటండీ! ఇప్పటికైనా తెలిసిందా? నే నెప్పుడు చూసినా మీా తమ్ముడు ఈ పుస్తకమే ఎదర పెట్టుకు ఉంటున్నాడు. నేను దగ్గరకు వస్తే పేజీ తిప్పేస్తు న్నాడు. ఈవేళ దుమ్ము దులుపుతూంటే ఈ పుస్తకం క్రిందకి బోర్లా పడింది. పైకి తీయడంతో ఈ కాగితం కంటబడింది.

ఫొటో దొరకలేదు కాబోలు ఈ పేరు చూసుకునే సంతృప్తి పడుతున్నాడు పాపం" అంది వరలక్ష్మి.

"అయితే ఇదా చదువుతున్నది వీడు! రానియ్యి చెప్తాను" అన్నాడు శ్రీహరి కొంచెం కోపంగా.

"అబ్బో పెద్దరికం చలాయించ జూస్తున్నారే! అయితే అన్నగారు చేస్తున్న దేమిటో?"—(శ్రీహరి ఉలిక్కిపడ్డాడు. 'ఒకవేళ తను ఇంటివారి కోడలిని చూడడం వరలక్ష్మి కంటబడలేదు కదా కొంపతీసి!")— "మీరు బి. ఏ పాసై పోతాను. ఎం.ఏ పాసై పోతాను అని అంటున్నారు గదా ఏది ఆ బి. ఏ చదువు ఎంతవరకూ వచ్చింది?" అని అడిగింది వరలక్ష్మి చిలిపిగా చూస్తూ.

"నన్నే ఎత్తిపొడుస్తున్నావూ ! చూడు ఎట్లా చదువుతానో. ఈయేడు బి. ఏ. పూర్తిచేయకపోతే చూడు. శ్రీహరి అంటే ఏమను కున్నావు ?"

ఇంతలో బిల్లుకలెక్టరు కుర్రవాడు వచ్చి "మా నాన్న నిన్నటినుంచీ ఇంటికి రాలేదండీ. మా అమ్మ మీతో చెప్పమం దండీ, వెతికి తీసుకు వస్తారేమో నని" అని చెప్పాడు శ్రీహరితో. శ్రీహరి సైకిలుమీద ఊరంతా గాలించాడు. చివరికి ఒక సత్రవులో స్తంభాని కానుకొని పిచ్చివాడిలా కూర్చొని ఉన్న బిల్లుకలెక్టరును కనుక్కొని, ఎట్లాగో ఊరడించి ధైర్యంచెప్పి, రిక్షామీద ఇంటికి చేర్చాడు. తను చేసిన పనికి శ్రీహరి గర్వం చెందాడు. అంతకు ముందు తనను చుట్టు

ముట్టిన భయాలూ, బాధలూ, నిరాశలూ తలచుకొని నవ్వు కున్నాడు. జీవితమంటేనే వెలుగు నీడల కలయిక. ఎండలో నుంచి వస్తేనే నీడసుఖం తెలిసేది. జీవితంలో సుఖదుఃఖాలు రెండూ ఉంటేనే 'ఎక్సైట్ మెంటు'! శ్రీహరి ఇప్పుడు మళ్ళీ ఆశావాది.

రాధాకృష్ణ వాసంతిని ప్రేమించాడు. ఇది వాసంతికి తెలియదు. తానెందరో కాలేజీ కుర్రవాళ్ళ గుండెల్లో తుఫానులు లేవదీస్తున్నానని మాత్రం ఆమెకు తెలుసు. అందుకే ఆమె కంత గర్వం – తనమీాద పడి నశించే పురుగుల్ని దీపం చూసినట్లు. కొంచెం జాలిపడుతూ ఉంటుంది కూడా. అట్లాఅని తన ఆకర్షణ తగ్గించు కుంటుందా? పువ్వును తన అందం దాచుకోమంటే సాధ్యమా? ఆమె ఆకర్షణ తెచ్చి పెట్టుకున్నది కాదు. ఆమె ప్రతి కదలికలో ఒయ్యారం ఒలుకుతూ ఉంటుంది. ప్రతి మాటలో మాధుర్యం తొణికిసలాడుతూ ఉంటుంది. ఆమె వాలు కన్నులలో మనస్సులకు మత్తుకలిగించే దేదో ఉంది. ఎప్పుడూ చిరునవ్వుల వెన్నెల వెదజల్లుతూ ఉంటుంది. ఆమె అంటే తోడి కాలేజీ విద్యార్థులు ఉద్వేగం చెందుతారంటే ఆశ్చర్యం ఏముంది? పడుచు కవులు ఆమె నూహించే కవిత్వా లల్లుతారు. నవకథకులు

ఆమెనే తమ నాయికలకు ఆధారంగా చేసుకుంటారు. కాని ఎవరూ ఆమెతో చనువు తీసుకోవడానికి జంకుతారు. ఎవరి నెంత దూరం ఉంచాలో ఆమెకు తెలుసు. పెదవులు చిరునవ్వు లందిస్తున్నా కళ్ళు జాగ్రత్త సుమా అని చెప్తుతాయి. పైగా పెద్ద ఉద్యోగి కూతురు.

ఆమెయొక్క అనేక ఆరాధకులలో రాధ ఒకడు. ఆమెను చూడని రోజు అతనికి బెంగగా ఉంటుంది. ఆమె ప్రతి కదలికా అతను గమనిస్తూనే ఉంటాడు. ఎప్పుడైనా తన కొక చిరునవ్వు ప్రసాదిస్తుందేమో అని ఎదురుచూస్తూ ఉంటాడు. ఇంటిదగ్గర కాగితంమీద ఆమెపేరు చెక్కి అది చూసుకొని ఆమెనూ తననూ గురించి ఎన్నో మధుర సన్నివేశా లల్లుకొని స్వప్న సీమలలో కెగిరిపోతాడు. ఆమె పేరే ఒక కావ్యంలా తోస్తుం దతనికి. అందులోని ప్రతి అక్షరమూ ఒక రసగుళిక. ఆమెను ఆధునికపు హంగులలో ఆకర్షించుకోవడానికి అతను ధనవంతుడు కాదాయె. అక్కడికీ క్రాపింగు ఏవిధంగా ఉంటే బాగుంటుందో అని ప్రయోగాలు చేసి చివరికి మొదటి పద్ధతికే వచ్చాడు. అప్పుడప్పుడు స్నేహితుల సిల్కు బ్లౌజులు ఎరువు తీసుకొని, ధరించి, ఎడమచేయి పంట్లాము జేబులో పెట్టుకొని, కుడిచేతిలో సిగరెట్టు కాలుస్తూ ఆమె ముందునుంచి వెళ్ళాడు. ఆమె దృష్టి తనున్న దిశగా ఉందని తోచినప్పుడు కళను గురించీ, కవిత్వాన్ని గురించీ, అంతర్జాతీయ రాజకీయాలను గురించీ, ఇంగ్లీషు హిందీ

సినిమాలను గురించీ స్నేహితులతో ఇంగ్లీషులో తీవ్రంగా చర్చిస్తాడు. అతను కాలేజీ నాటక సంస్థలో ఒక కార్యదర్శి. ఆమె కాలేజీ విద్యార్థి సంఘంలో సహాయ కార్యదర్శిని. ఈ సంఘాల కార్య కలాపాలను పురస్కరించుకొనో, మరే వంకనో అప్పుడప్పుడు ఆమెను పలకరించడానికి ప్రయత్ని స్తాడు. సహజ దరహాసంతో ఆమె అతనితో రెండు మాటలు మాట్లాడితే అతను స్వర్గంలో తేలిపోతాడు. ఇన్ని చేసినా తనొక అందగాడైనా, డబ్బున్న మిగతా కాలేజీ కుర్రవాళ్ళ ముందు తను ఓడిపోతున్నట్లు బాధ పడుతున్నాడు. తన తపస్సు ఎన్నటికైనా ఫలిస్తుందో, అసలు ఫలించనే ఫలించ దేమో అని నిస్పృహ చెందుతూ ఉన్నాడు. అయినా వాసంతిని ప్రేమించకుండా ఉండలేకపోతున్నాడు.

స్నేహితులతో బాటు ఊరంతా తిరిగి, వాసంతి దర్శనం ఆరోజుకు ఇక కాదని తేల్చుకుని ఇంటికి చేరుకున్నాడు. శ్రీహరి భోజనానికి లేవబోతున్నాడు. రాధకూడా త్వరగా పోయి కాళ్లూచేతులూ కడుగుకొని భోజనానికి కూర్చున్నాడు. కొంతసే పున్నతరువాత శ్రీహరి మెల్లగా అడిగాడు: "ఏరా బాగా చదువుతున్నావా?" అని. ఇట్లా అడుగుతూంటే అతని లోనే ఏదో అతనిని వెక్కిరించిన ట్లయింది.

"బాగానే చదువుతున్నా నన్నయ్యా" అన్నాడు రాధ, ఎన్నడూ అడగని అన్నయ్య ఈ వేళ ఇట్లా అడుగు తున్నా డేమా అని ఆశ్చర్యపోతూ,

"బాగా అంటే ఈ ఏడు పూర్తిగా పాసవుతుందా, అని."

"ఊఁ," అన్నాడు రాధ సందేహిస్తూ.

"క్లాసుకూడా రావాలి. మన లాటివాళ్ళు పైకి రావా లంటే క్లాసు రాకపోతే ఎందుకూ పనికిరాదు. క్లాసు వచ్చే అవకాశం ఉందా ?"

"ఏమో ఎట్లా చెప్పగలను ? కాని బాగానే చదువు తున్నా నన్నయ్యా ?" అని నసిగాడు రాధ.

"ఎవళ్ళో నువ్వు అంత బాగా చదవడం లేదని అన్నా రులే. చదువుకన్న ఇతర విషయాల మీద నీ దృష్టి ఎక్కువ పడుతోందని అన్నారు."

రాధ చాలా కంగారు పడిపోయాడు; "ఎవరు చెప్పా రన్నయ్యా ?" అని అడిగాడు.

"ఎవరైతేనేంలే. నువ్వు ధ్యానం చదువుమీద ఉంచు తున్నావా అని?"

ఎవరు చెప్పిఉంటారా అని ఆలోచించసాగాడు రాధ. ఎవరూ అటువంటివారు తోచలేదు. "వాళ్లు చెప్పినది ఉత్త దన్నయ్యా. బాగానే చదువుతున్నాను" అన్నాడు. వదిన గారు నీగుట్టు అంతా నాకు తెలుసులే అన్నట్లు చూస్తూ చిరునవ్వు నవ్వుతూ ఉండడంతో అతనిగుండె అదిరిపడింది. 'ఒకవేళ వదిన ఎప్పుడైనా తను వాసంతిపేరు ధ్యానిస్తూ ఉండగా చూసిందేమిటి ?' త్వరగా అన్నం తినేసి లేచి

పోయాడు. ఇవతలకువచ్చి తనపుస్తకాలు తీశాడు. వదిన వంటింట్లోనే కొంచెం ఇవతల నిలబడి అదేచిరునవ్వుతో తన కేసి చూస్తూ ఉండడం గమనించి పుస్తకం ధ్యానంతో చదువుతున్నట్లు నటించసాగాడు. ఆమె కొంచెం అటు తిరగ గానే పెద్దపుస్తకం తెరచి చూశాడు. కాగితం అక్కడే ఉంది. వదిన చూస్తోందేమో అని వెనక్కిచూసి చటుక్కున కాగితం తీసేసి జేబులో దాచుకున్నాడు. తరువాత శ్రద్ధ గానే చదువు ప్రారంభించాడు. వరలక్ష్మికూడా భోంచేసి వచ్చి, "అబ్బో రాధ ఈవేళ చాలాగొప్పగా చదివేస్తు న్నాడే! అయితే క్లాసు తప్పదన్నమాటే!" అని నవ్వింది.

"పో వదినా నీకంతా వేళాకోళంలే" అన్నాడు రాధ.

శ్రీహరి తనగదిలో బల్లదగ్గరచేరి పుస్తకంతీసి చదవడం మొదలుపెట్టాడు.

పినతండ్రి చదువుతూండడం చూసి రమణకూడా అతనిప్రక్కకు చేరాడు. వాడు పాఠం పైకి చదువుతున్నాడు. వాడికితోడు సూర్యావతి ఇంకా పడుకోక ఏదో పిచ్చిపాట గొణగసాగింది. "ఇక నీ పాటొకటి తక్కువయింది తల్లీ! పోయి మామ్మదగ్గర కథలు చెప్పించుకో" అని తరిమేశాడు రాధ దానిని. "ఒరేయి రమణా నువ్వు పైకి చదవకురా. పైకి చదివితే నాచదువు సాగదు" అన్నాడు.

"పైకి చదవమనే మా మాష్టారు చెప్పారు. పైకి చదవకపోతే నువ్వు పాఠం చదువుతున్నావో లేదో ఎట్లా

తెలుస్తుంది ? ఊరికే పుస్తకంకేసి చూస్తూ ఇంకేమో చెయ్యొచ్చుట. మా మాష్టారు చెప్పారు" అన్నాడు రమణ.

'బలేబాగా చెప్పాడులే సమాధానం. వాడు పైకి చదివితే మాత్రం నీ కే మట్టు ? నిజంగా ధ్యానంతో చదివే వాడికి ఇంకేమీ వినపడనే వినపడదు" అంది వరలక్ష్మి.

రాధ ఒకసారి వదినగారికేసి కోపంగాచూసి మళ్ళీ పుస్తకపఠనంలో పడ్డాడు. రమణ అన్నది నిజమే. తను పుస్త కంమీద చూపు నిలుపుతున్నా ఇన్నాళ్ళూ అలవాటైన పరధ్యానంవల్లా, పెరిగిన బద్ధకంవల్లా చదువు సరిగా సాగడమే లేదు. వెనక్కి-ముందుకు వస్తున్నాడు. సరిగా అర్ధమవు తున్నట్లు లేదు. చివరికి రాధకూడా ధ్యానం నిలుపుకుందుకు కొంచెం పెదవులు మెదపుతూ మెల్లగా గొణుగుతూ చదవ వలసి వచ్చింది.

"ఇంతమంది చదువుతూంటే నేనుమాత్రం ఎందుకు వెనకపడాలి ?" అని వరలక్ష్మి వారపత్రిక తీసుకొని గుమ్మం దగ్గర చతికిలబడింది.

శ్రీహరి సంసారనౌక మళ్ళీ ద్ద ఒడుదుడుకులు లేకుండా సాగుతోంది. ఎటువచ్చీ సున్నితమైన 'బడ్జటు' కావడంవల్ల ఈనెల చేసిన కొన్ని అనవసరపు అదనపు

ఖర్చులూ, బిల్లుకలెక్టరుకు బదులిచ్చిన మూడురూపాయిలూ అతని పడవకొక చిల్లు పడేటట్లు చేశాయి. సాయంత్రంపూట ఇద్దరు ప్రైవేటు మానివేయడం పెద్ద దెబ్బలాగే కనిపించింది. కాని మాధవి ప్రైవేటు దొరకడం సమయానికి నౌకను కాపాడింది.

మాధవికి ప్రైవేటు చెప్పడం అతనికి ఒక సరదాగా ఉంది. మిగతా చోట్లలా తను చాపమీద కూర్చోనక్కర్లేదు. దిండ్లున్న కుర్చీలో కూర్చొని పాఠం చెప్పవచ్చు. మాధవి కూడా కుర్చీలో కూర్చొని టేబిల్‌మీద పుస్తకాలు పెట్టు కొని పాఠాలు వింటుంది. రోజూ వెళ్ళగానే నౌకరుపిల్ల కాఫీ తెచ్చి ఇస్తుంది. త్రాగేవరకూ మాధవి ఊరుకోదు. తరువాత పాఠం చెపుతూండగా అనేకమైన అడ్డదిడ్డ ప్రశ్నలు వేసి అతనిని నవ్విస్తుంది. కథలు చెప్పమంటుంది. పాఠాలు పోతాయంటే ఏమీ పరవాలే దంటుంది. ఆమెకు పాఠా లెట్లా గైనా వస్తాయి, సూక్ష్మగ్రాహిణి కాబట్టి. శ్రీహరి మాధవి కోరినట్లుగానే చెప్తున్నాడు. కాని అతని ఒకకోరిక తీర లేదు — మాధవి తల్లిని చూడడం.

ఒకరోజున అదీ తీరింది. శ్రీహరి వెళ్లేసరికి ఆమె హాలులోనే ఒక సోఫాలో కూర్చొని అల్లికపని చూసుకుం టోంది. ఆమెనుచూసి అతను ఆశ్చర్యంతో నిలబడిపోయాడు. నిజంగా తనెట్లా ఊహించాడో అట్లాగే మాధవి తల్లి చాలా అందకత్తె. అందానికితోడు ఆమెలో ఠీవి ఉంది. అత నటూ

నిలబడిపోవడం చూసి ఆమె చిరునవ్వుతో "నిలబడేఉన్నారేం, మాష్టారూ, కూర్చోండి" అంది ఎంతో మర్యాదగా. అతను కొంచెం జంకుతూ కూర్చున్నాడు. ఆమెకేసి తేరిపార చూడడం మర్యాదకా దని తల వంచుకున్నాడు. కాని ఏదో విచిత్రమైన ఆందోళనలో ఉన్నాడు.

"మా మాధవి బాగా చదువుతోందా అండి" అని అడిగింది ఆమె.

"ఆ, బాగానే చదువుతోం దండి. చాలా తెలివైన పిల్ల" అన్నా డతను.

"చాలా అల్లరిపిల్లకూడా నండి"అంది ఆమె నవ్వుతూ. ఆమెనవ్వు మందమలయానిలంలా సోకింది అతని చెవులకి. ఆమెమాటలో, నవ్వులో హుందాతనం ఉట్టిపడుతోంది.

"మాధవీ పనిపిల్లను కేకెయ్యి" అంది కూతురికేసి తిరిగి ఆమె. మాధవి పరుగెత్తుకువెళ్ళింది. పనిపిల్ల ఒకప్లేటులో టిఫిన్ తీసుకువచ్చి అతనిముందు పెట్టింది. "క్షమించండి. నా కివన్నీ ఎందుకండీ" అన్నాడు శ్రీహరి.

"ఫరవాలేదు తీసుకోండి. నేను చేశాను కొత్తరకం పిండివంట. ఎట్లాఉందో చెప్పాలి" అంది ఆమె.

శ్రీహరి సంకోచిస్తూ కొంచెం నోటిలో వేసుకొని "చాలా బాగుందండీ" అన్నాడు.

"పొగడ్తకు కాదుగదా" అని నవ్వింది ఆమె. "మీ శ్రీమతి గారిని చూడా లంటోంది మా మాధవి. ఒకసారి

వారి నిక్కడకు రమ్మనండి. పరిచయం చేసికుంటాము'' అంది. ఎంత మర్యాద! ఏ మాత్రమూ గర్వం ఉన్నట్లే లేదే.

పనిపిల్ల కాఫీ తేగా అదికూడా త్రాగి, పాఠం ప్రారంభించాడు శ్రీహరి. కాని కొంచెం తడబడు తున్నాడు చెప్పడంలో. కొద్దిసే పుండి మాధవి తల్లి, "మీ పాఠానికి నే నడ్డు వస్తున్నా నేమో. రోజూలా నవ్వులూ, కబుర్లూ వినరావడం లేదు'' అని మెల్లగా లేచి లోపలికి యింది. శ్రీహరికి కొంచెం ఆశాభంగంలా అయింది. కాని మనస్సు కుదుటబడింది కూడా.

శ్రీహరి ఇంటికి వెళ్ళగానే వరలక్ష్మి ఎదు రొచ్చింది. ఆమె మొగం చూడగా శ్రీహరికి తీపితిన్న వెంటనే టీ త్రాగినట్లయింది. రోజూ తన చిరునవ్వుకు చిరునవ్వుతో జవాబిచ్చేభర్త ఈ రోజు తనను చూసి కనుబొమలు ముడుచుకోవడం చూసి వరలక్ష్మి కంగారు పడింది. భర్త ఎందుకో కోపంగా ఉన్నాడు, బళ్లో హెడ్‌మాష్టా రేమైనా కేకలేశా రేమో అనుకొని, "ఇదుగో ఏదో ఉత్తరం వచ్చిందండీ మీకు'' అని కవరు అతని చేతిలో పెట్టింది. ఉత్తరంలో విషయం తెలుసుకుందామని ఉన్నా భర్త మొగంమీద ఇంకా చిరాకు తాండవమాడుతూ ఉండడం చూసి జంకి వెనక్కి వెళ్ళిపోయింది. శ్రీహరి కవరు బల్లమీదికి గిరవాటువేసి, చొక్కా ఖండువా చిలకకొయ్యకు తగిలించి, పెరట్లోకి పోయి కాళ్ళు చేతులూ కడుగుకువచ్చి, ఉత్తరం మాట మరచిపోయి, మంచంమీద

వాలి ఆలోచనలో మునిగిపోయాడు. మాధవీ, ఆమె ఇల్లూ, ఆమె తల్లీ జ్ఞాపకం వస్తున్నారు. 'మాధవి తండ్రి ఎంత అదృష్టవంతుడు. అటువంటి హోదా, అటువంటి భార్యా, అటువంటి కూతురూ. తామూ ఉన్నారు ఎందుకు?—'

వరలక్ష్మి జంకుతూ లోపలికి తొంగి చూసింది. శ్రీహరి కొంచెం విసుగుకొని, మళ్ళీ ఉత్తరంమాట జ్ఞాపకం వచ్చి, లేచి బల్లమీద కవరు తీసుకొని చింపి, ఉత్తరం చదవ సాగాడు. అతని మొగం ఒక్కసారిగా విప్పారింది. లేచి కూర్చొని "ఏమేవ్ ఇట్లారా" అని కేకేశాడు.

భర్త గొంతుకలో ఆనందం పసికట్టి "ఏమిటండీ" అంటూ పరుగెత్తుకు వచ్చింది వరలక్ష్మి.

"మన రాధకి పెళ్ళి సంబంధమే. రేపు వస్తున్నా రట—తమ పిల్లను చూసి చేసుకోవలసిందని చెప్పి వెళ్ళ డానికి. మా మామయ్య రాశాడు" అన్నాడు శ్రీహరి.

"నిజమే!" అని వరలక్ష్మి ఒక్క చెంగున పెరట్లోకి పరుగెత్తి "అత్తయ్యా, మన రాధకి పెళ్ళిసంబంధం వచ్చింది. మీ అబ్బాయి రమ్మంటున్నారు" అని మళ్ళీ లోపలికి పరు గెత్తి వచ్చింది. ముసలావిడ పడుచావిడలా పరుగెత్తుకు వచ్చింది. "ఏరా అబ్బాయి. ఏమని వచ్చిందిరా? ఎవరు రాశారు? ఏదీ చదువు" అని తలుపుదగ్గర కూలబడడం మరచిపోయి నిల్చబడే అడిగింది ఆవిడ.

శ్రీహరి ఉత్తరం మెల్లగా స్పష్టంగా చదివాడు. వరలక్ష్మి సూరమ్మగారూ ఆ ఉత్తరంలో ప్రతిమాటా త్రాగేసినంత పని చేశారు.

"ఇరుగు పొరుగులు మీ మగది కేమీ సంబంధాలు రావడం లేదూ ?" అని ఒకటే పొడుస్తున్నా రండీ. ఇప్పుడు అడగమనండి చెపుతాను. మూడు వేలైనా కట్నం ఇస్తారా లేదా అండీ. పైన లాంఛనాలూ అవీ ఏమాత్రం ఇస్తారో. ఏమన్నా రాశారా?" అంది వరలక్ష్మి.

"లేదు. అంతా చదివి వినిపించానుకా. అప్పుడే ఏం చెపుతారు ? రేపు వాళ్ళని రానియ్యి తెలుస్తాయి" అన్నాడు శ్రీహరి.

"మూడువేలూ ఆపైన లాంఛనాలూ అవీ లేనిదే ఒప్పుకుంటాములే కోడలా ? బి.కాం చదువు తున్నాడు ! మనిషి మహారాజుల బిడ్డలా ఉంటాడు. ఐదువేలు కట్నం కూడా తేలికగా వస్తుంది" అంది సూరమ్మగారు సంతోషం పట్టలేక.

వెంకటరమణా, సూర్యావతీ ఇంట్లోకి రాగా, "ఒరే రమణా, సూరీ, రేపు మనింటికి పెళ్ళివారు వస్తున్నారు. మీ బాబయ్యకు, పెళ్లివారు. మీ రల్లరి చేయకూడదు. ఎంతో బుద్ధిమంతుల్లా ఉండాలి తెలుసా" అని వరలక్ష్మి అంటూ౦ళ్లే——

"పెళ్ళివారా? అమ్మో బాజాలూ అవీ వస్తాయి కామా. నేను కారెక్కుతానే" అన్నాడు రమణ. "నేనూ కారెక్కుతాను. బాబయ్య పక్కన కూచుంటాను." అంది సూర్యః

'బాజాలూ అవీ ఇప్పుడుకాదు. తరువాత—అన్నట్లు ఏమండోయి, రేపు వాళ్లు వచ్చేసరికి ఇల్లు ఈ విధంగా ఉంటే ఏం బాగుంటుంది? ఇంకో రెండు మూడు కుర్చీలు కావాలి. మనింట్లో రెండే ఉన్నాయి. ఎట్లా చాలుతాయి? నాకు ఒక గొలుసు చేయించ మంటే విన్నారా. బోసి మెడతో వాళ్ళ ఎదుట కెట్లారాను" అంది వరలక్ష్మి.

"తొందరపడకే కోడలా. త్వరలోనే అన్ని సరదాలూ తీర్చుకుందువు గానిలే" అంది సూరమ్మగారు.

శ్రీహరి లేచి "కుర్చీలమాట రేపుప్రొద్దున్న చూదాం. ఈ లోపుగా ఇల్లు కొంచెం సర్దుదాం. పాత సామానూ తట్టా బుట్టా లాంటివి అటకమీద పెట్టేదాం!" అని ఇంటిలోని సామాను సర్దడానికి పూనుకున్నాడు. వరలక్ష్మి అందిస్తోంది. శ్రీహరి నిచ్చెనమీద నిలబడి పాతసామాను అటకమీది కెక్కిస్తున్నాడు.

రాధ వచ్చాడు; "ఏమిటిది అన్నయ్యా, ఎందుకు సర్దుతున్నారు" అని అడిగాడు.

"తరువాత చెప్తానులే. ముందు మీ అన్నయ్యకు సాయం చెయ్యి, నేను వంటపని చేసుకుంటాను" అని ఆ పని

రాధ కప్పజెప్పి వరలక్ష్మి వంటింట్లోకి వెళ్ళిపోయింది.

రాధ కేమీ అర్థం కాలేదు. అన్నగారికి సాయం చేయ సాగాడు. "ఎందుకో చెప్పరేం, ఈ హడావిడి అంతా" అనుకుంటున్నాడు. వరలక్ష్మి కొంచెంసేపు మరదిని ఆడించా లనుకుంది కాని వంటింట్లో మామ్మచేత అన్నం పెట్టించుకు తింటున్న రమణ అక్కడనుంచే అరిచేశాడు. "బాబయ్యోయి నీకు పెళ్ళిట."

"నాకు పెళ్లేమిటి?" అని తెల్లబోయాడు రాధ.

శ్రీహరి నిచ్చెన దిగి వచ్చాడు. రాధ నిచ్చెన పట్టుకు వెళ్ళి పెరట్లోపెట్టి "ఏమిటి వదినా" అని అడిగాడు.

"పెళ్లివారు వస్తున్నారయ్యా మనింటికి"

"ఎవరికోసం?"

"ఎవరికోస మేమిటి- నీకోసమేనయ్యా పెళ్ళికొడకా" అని నవ్వింది వరలక్ష్మి.

రాధకి నడ్డిమీద ఎవరో చరిచినట్లయింది. ఒక్క సారిగా తన కలలు కూలిపోతున్నా యనిపించింది. వాసంతో! వాసంతి లేని బ్రతుకు అంధకారమయం. కాని అన్నగారి దగ్గర మాట్లాడడానికి ధైర్యం చాలలేదు. తమ భోజనా లయిన తరువాత శ్రీహరి ఎదుట వసారాలో తిరుగుతున్నాడు. రాధ అన్నం వడ్డించుకు తింటున్న వదిన దగ్గరికి చేరి, "నా కిప్పుడే పెళ్ళి వద్దు వదినా" అన్నాడు మెల్లగా.

వరలక్ష్మి ఉలిక్కిపడి మరది మొగంలోకి చూసింది. "ఏమిటీ?" అంది.

"నాకిప్పుడప్పుడే పెళ్ళి ఇష్టంలేదు వదినా, అన్నయ్యతో చెప్పు".

వరలక్ష్మి ఒక్క నిమిషం అతనికేసి నిదానించి చూసి "అయితే వాసంతిని పెళ్ళిచేసుకుంటావా?" అని అడిగింది.

ఇప్పుడు ఉలిక్కిపడడం రాధ వంతైంది. నోరు తెరచుకొని ఉండిపోయాడు.

"ముందు ఆ వాసంతి ఎవరో చెప్పు. ఎవరి కూతురు?" అని అడిగింది వరల

"స్టేట్ బ్యాంక్ ఏజంటు కూతురు" అని గొణిగాడు రాధ.

"నువ్వు వాసంతిని ప్రేమిస్తున్నావు సరే, కాని ఆమె నిన్ను ప్రేమిస్తోందా?" అని అడిగింది మళ్ళీ వరలక్ష్మి.

రాధ ఏమి మాట్లాడ గలడు, తను కట్టుకొన్న పేక మేడలు ఇంత నిర్దాక్షిణ్యంగా కూల్చి వేస్తూంటే అతని గుండెల్లో నుంచి ఏడుపు చీల్చుకు వచ్చినంత పనయింది.

"ఆమె ఏ లక్షాధికారినో, ఏ గొప్ప ఉద్యోగినో పెళ్ళి చేసుకుంటుంది కాని నీలాంటివాడిని చేసుకుంటుందోయి? ఏవో వెర్రి ఆలోచనలు పెట్టుకొని వచ్చిన సంబంధాలు చెడగొట్టుకుంటామా? వచ్చిన సంబంధాలు చెడగొట్టుకుంటే

ఆనక పెళ్లికావడమే కష్టమవుతుంది. ఇంతకీ ఈ సంబంధం చేసేసుకుంటామని ఎక్కడుంది? చూసి రావడంలో తప్పే ముంది? అన్నివిధాలా నచ్చితేనే చేసుకోవడం. నీకు నచ్చక పోతే నీ మెడలు విరిచి కట్టిపెట్టా మేమిటి? ఈ పెళ్ళి చూపుల సరదా కూడా లే దని, మా ముచ్చటలు చెడగొట్టకు. మంచి పిల్లవాడిలా మసులుకో'' అని తియ్యగా చీవాట్లు పెట్టింది వరలక్ష్మి.

రాధ వచ్చి పుస్తకం తీశాడు కాని కళ్ళ కక్షరాలు కనిపించడం లేదు. గుండె బాధతో గిజ గిజ లాడుతోంది. వాసంతి తనను చేసుకుంటుందని ఏమాత్రమూ ఆశ లేదు. కాని ఇప్పుడు ఆమెను గురించి కలలు కనడానికి కూడా తనకు హక్కు ఉండ దన్నమాట.

వరలక్ష్మి వంటింటిపని పూర్తి చేసుకొని, పిల్లల్ని పడుకోబెట్టి, ''ఇప్పటినుంచే చదువు మానెయ్యకోయి, పెళ్ళి కొడకా'' అని వేళాకోళమాడి భర్తదగ్గరికి పరుగెత్తింది. అంతకు ముం దా భార్యను చూసి విసుక్కున్న శ్రీహరి ఇప్పుడు భార్య రాకకోసం ఎదురు చూస్తున్నాడు. మాధవీ ఆమె తల్లిమాట కూడా మరచిపోయాడు. తమ్ముడికి పెళ్ళి సంబంధం వస్తోం దంటే అతని ఆనందం పట్టరాకుండా ఉంది. భార్యకు ఎన్నికబుర్లు చెప్పాలి! కట్నాల గురించీ లాంఛనాల గురించీ, పెళ్ళిళ్ళను గురించీ రాత్రి చాలా ప్రొద్దు పోయే

వరకూ ఉత్సాహంగా కబుర్లు చెప్పుకొని చాలా రాత్రి అయిందని గ్రహించి నిద్ర కుపక్రమించారు భార్యాభర్తలు.

ప్రొద్దున్న లేవగానే మళ్ళీ హడావిడిలో పడ్డారు. 'కొంచెం జ్వరం తగిలింది. తల నొప్పిగా ఉంది. ఈ రోజుకు సెలవు ఇప్పించ వలసిం'దని ఒక చీటీరాసి హెడ్మాష్టారికిచ్చి రమ్మని తమ్ముడిని పంపాడు శ్రీహరి. తరువాత ఇంటి వారింట్లో నుంచి కుర్చీలు తేవడం ఎట్లాగా అని ఆలోచించ సాగాడు. కొద్దిరోజులక్రిందటే ఇంటివారితో ఇల్లుతిరగెయ్యడం విషయమై పోట్లాడి ఉండడంవల్ల అడగడానికి మొహమాటంగా ఉంది అతనికి. పైగా ఇంటివారింట్లో ఏదో చాలా హడావిడిగా ఉంది, భార్యను సలహా అడుగుదా మంటే ఆమె కనిపించలేదు. ప్రక్క ఇంట్లో వారితో కబుర్లు చెపుతోంది. ఆమె ఇప్పుడు పెళ్ళిపెద్ద కాబోతోంది. ఎంత బాధ్యత? ఎంత గొప్పతనం !

రామకృష్ణమూర్తి అటువచ్చి శ్రీహరిని రాధకు రాబోతున్న పెళ్ళిసంబంధం గురించి ప్రశ్నలు వేశాడు. అతనికి జవా బిచ్చి శ్రీహరి అన్నాడు: "మాకు రెండు మూడు కుర్చీలు కావాలండీ. మీ యింట్లో ఏమైనా ఉన్నాయా ?"

"రెండే ఉన్నాయండీ. అవైనా మంచివికావు. ఇంటి వారింట్లో మంచివి ఉన్నాయి. అడగండి" అన్నాడు.

"కాని వాళ్ళు ఏదో హడావిడిలో ఉన్నట్లున్నారు' అన్నాడు శ్రీహరి.

"అవును అన్నట్లు చాలా హడావిడిలోనే ఉన్నారు"

"ఏమిటో తెలుసా?" అని అడిగాడు శ్రీహరి.

"ఏముంది, ఇంటివారి కోడలు ఎనిమిదేళ్ళయి కాపురానికి వచ్చినా ఆమె కడుపున ఒక్క పండు పడలేదు. దాని కోసం ఇట్లా వ్రతాలూ, నోములూ ఏవో చేస్తూనే ఉంటారు. ఈవేళ నవగ్రహపూజ, సూర్యనమస్కారాలు, సత్యనారా నారాయణ వ్రతం, వేంకటేశ్వర దీపారాధన, పాతికమంది బ్రాహ్మలకి సంతర్పణ. ఇంట్లో ఉన్నాంకా మనల్నికూడా పిలిస్తే ఏం పోయేది? ఉత్త పిసినిగొట్టులు" అన్నాడు రామకృష్ణమూర్తి.

శ్రీహరి మాట్లాడలేదు.

రామకృష్ణమూర్తే అన్నాడు: "భగవంతుడి లీల చూడండి. ఇక్కడ డబ్బు కుప్పలుతిప్పలుగా పడి ఉంది. ఇక్కడ కావాలి కావాలన్నా ఒక్క బిడ్డ పుట్టడు. అటు బిల్లు కలెక్టరు చూడండి ఆతనికో వద్దు మొర్రో మన్న కొద్దీ పిల్లలు పుట్టుకు వస్తారు-తరువాత ఈగల్లా చస్తా—"

అంటూండగానే బిల్లుకలెక్టరు అటు వచ్చాడు. బిల్లు కలెక్టరు వస్తూండడం చూసి రామకృష్ణమూర్తి తనవాకిట లోకి పరుగెత్తాడు. అత నట్లా పరుగెత్తడంచూసి బిల్లుకలెక్టరు ఒకక్షణం నిలబడిపోయి, మొగం చిన్నబుచ్చుకొని, నిట్టూర్చి కొంచెం తటపటాయిస్తూ ఎదరకు వచ్చాడు.

"సార్, మీకు మూడురూపాయ లివ్వాలి. మొన్న మాకష్టంలో మీరు చేసిన సహాయం ఎన్నడూ మరచిపోను. ప్రస్తుతం నేను చాలా ఇబ్బందిలో ఉన్నాను. ఇంకో రెండు రూపాయ లిస్తే మొత్తం ఏకంగా వచ్చేనెల జీతంలోనుంచి చెల్లించేస్తాను" అన్నా డతను శ్రీహరితో ఆశంతా కళ్లలో పెట్టుకొని.

శ్రీహరి చాలా ఇరకాటంలో పడ్డాడు. అన్నాడు: "క్షమించాలి. ఈవేళ మాయింటికి పెళ్లిసంబంధంవారు వస్తు న్నారు. చాలా ఖర్చుంది. ఈనెలకూడా చాలా ఇబ్బందిగా ఉంది. వచ్చేనెల మాతమ్ముడి జీతంకట్టాలి.—"

"ఒక్క రెండురూపాయలే సార్. వచ్చేనెల జీతం రాగానే తప్పక ఇచ్చేస్తాను."

"అయ్యో మీ రింతగా చెప్పాలా అండి? కాని ఇవ్వలేకపోతున్నాను. నేనే అప్పుచేయవలసి వచ్చేటట్లుంది".

బిల్లుకలెక్టరు మళ్ళీ నిట్టూర్పువిడిచి, "వస్తాను సార్" అని సలాముచేసి మెల్లగా వెనక్కు తిరిగి వెళ్లిపోయాడు. అతను వెళ్తూంటే శ్రీహరికి చాలా జాలివేసింది. కాని జాలి ఉండిమాత్రం ఏమిచేయగలడు?

వరలక్ష్మి ఎప్పుడు వెళ్లిందో అప్పుడే ఇంటివారింట్లోకి వెళ్లివస్తోంది. అక్కడనుంచే కేకేస్తూ వచ్చింది: "ఏమం డోయి. ఇంటివారు ఇస్తామన్నారు కుర్చీలు. వాళ్లుకూడా

హడావిడిలో ఉన్నారుట. నౌకరులు కూడా ఖాళీలేరట. సత్యనారాయణవ్రతంట. ఇంకా ఏమోఏమోట. మీరే వెళ్ళి తీసుకురండి. రెండుకుర్చీలూ వాకిట్లోఉన్న నాలుగైదు మంచిపటాలుకూడా తీసుకురండి" అంది. ఆమె కాలు నేల మీద ఆనడంలేదు.

శ్రీహరి వెళ్ళి కుర్చీలు తెచ్చాడు. అవి ఎదరగదిలో సర్దసాగాడు. వరలక్ష్మి ఈవేళ వంటపని అత్తగారికి అప్పజెప్పినట్లుంది. ప్రక్కవాటాల్లోకిపోయి వెండిగ్లాసులూ, వెండి పేట్లూ తెచ్చిపెట్టోంది.

"ఇవన్నీ ఏమిటి? లేనిపోనిడాబులుచేసి, వాళ్ళను మోసంచేయడం తప్పుకాదూ? అన్నాడు శ్రీహరి, భార్య ఏర్పాట్లకు ఆశ్చర్యపోతూ.

"నూరు అబద్ధాలాడి ఒకపెళ్ళిచెయ్యమన్నారు" అని నవ్వింది వరలక్ష్మి. తరువాత తనమెడచూపిస్తూ "ఎట్లాఉం దండీ?" అని అడిగింది దగ్గరకు వచ్చి.

"అదేమిటి! రాళ్ళనెక్లేసు ఎక్కడిది? ఎవరిచ్చారు?"

"ఇంటివారి కోడలిచ్చిందిలెండి. సొంతది పెట్టుకునేరాత నాబతుకులో ఉందోలేదో కాని ఇట్లాంటి సమయాల్లోనైనా కొద్దిసేపు ఎరువు తెచ్చిపెట్టుకోవద్దూ. ఇంతకీ ఇది పెట్టుకుంటే ఎట్లాఉన్నాను చెప్పండి. నగ బాగుంది కాని నేను బాగాలేను కాదూ" అంది చిలిపిగా చూస్తూ.

"ఛ, చాలా బాగున్నావు. నిజంగా పేరుకుతగ్గట్లు లక్ష్మిలాగే ఉన్నావు."

"చాల్లెండి మీకవిత్వం" అంది ఆమె విప్పారిన మొగంతో. "సరేకాని ముందు మీరుబజారుకువెళ్లి శేరు శనగపిండీ, అరవీసెపంచదార, తమలపాకులూ వక్కలూ తీసుకు రండి: వచ్చినవాళ్లకు బజ్జీలూ కాఫీలూ ఐనా ఇవ్వాలా? భోజనం ఎట్లాగైనా చేయను - కతికితే అతకదని".

రాధ వచ్చాడు. శ్రీహరి అతని దగ్గరనుంచి సైకిలు తీసుకొని సంచి సైకిలుకు తగిలించుకొని బజారుకు పరు గెత్తాడు. "ఏమయ్యోయిరాధా, నువ్వు త్వరగా భోంచేసి కాలేజీకి వెళ్లి మధాహ్నం సెలవుపెట్టి వచ్చెయ్యి. రాకపో యావా ఇక నీతో ఎప్పుడూ మాట్లాడను" అంది వరలక్ష్మి. అట్లాగే రాధ తల్లిచేత వడ్డించుకొని తిని కాలేజీకి వెళ్లి పోయాడు.

మధ్యాహ్నం రెండుగంటలకు పెళ్లివారు వచ్చారు. అతి సామాన్యంగా ఉన్నారు. మామూలు దుస్తులే ధరించి ఉన్నారు. పిల్లతండ్రిమాత్రం పాతకోటు వేసుకున్నాడు. వాళ్లనుచూసేసరికి శ్రీహరికి ఎందుకో ఆశాభంగ మైన ట్లైంది, అయినా వాళ్లను మర్యాదగా తీసుకువచ్చి కూర్చోబెట్టాడు: వరలక్ష్మి కంగారు పడుతోంది బజ్జీలు అవీ తయారుచేయా లని. రమణ తల్లి నడిగాడు (వాడు పెళ్లి వారిని చూసేటానికి

బడిమానేశాడు): "అమ్మా ఇంకా పెళ్లివారు రాలేదేం ?" అని. వరలక్ష్మి మాట్లాడ కన్నట్లు నోటిమీద వేలువేసుకొని "వచ్చారురా వాళ్లే పెళ్లివారు. నువ్వు వెళ్లి నాన్నదగ్గర కూర్చో" అని పంపేసింది వరలక్ష్మి.

మధ్యవర్తి కబుర్లు ప్రారంభించాడు. కాసేపటికి రాధ వచ్చాడు. వరలక్ష్మి బజ్జీలు పట్టుకువచ్చింది. సూరమ్మగారు కూడా వచ్చి గుమ్మందగ్గర కూర్చుంది. శ్రీహరి వచ్చినవారికి తనయింట్లో వాళ్లెవరెవరో పరిచయం చేశాడు. వరలక్ష్మి అత్తగారి ప్రక్కనే గుమ్మంలో ఒకప్రక్కకు కొంచెం ఒదిగి నిలబడింది. ప్రక్కవాటా రామకృష్ణమూర్తి భార్యాకూడా వచ్చి వరలక్ష్మి వెనకాల నిలబడి తొంగి చూస్తోంది.

"కుర్రాడు భేషుగ్గా ఉన్నాడు. మీరు వచ్చి పిల్లను చూసుకోవలసిం దని కోరుతున్నాం. మిగిలిన విషయాలు ఇప్పుడే మాట్లాడడం బాగుండదు. వచ్చి పిల్లను చూసి, సంబంధం నచ్చిం దన్నతరువాత అన్నీ మాట్లాడుకోవచ్చు. ఏమీ లోటు చేయం అని మాత్రం చెప్పుతున్నాను" అన్నాడు పెళ్ళి కూతురు తండ్రి.

వరలక్ష్మి "బాగుంటుందా అండి ? ఏచాయ ?" అని అడిగింది.

"ఆ బాగానే ఉంటుం దమ్మా. సంసార పక్షంగా ఉంటుంది. సంసారాలు చేసుకునే వారు సినిమాతారల్లా ఉండ

మంటే ఉండరుకదా. సినిమా తారల్లాంటివారు సంసారాలు చేరాస్తా? పిల్లగుణగణాలూ సంప్రదాయం అవీ చూసుకోవాలి. నాపిల్ల గుణాలపుట్ట, మణి అని నేను చెప్పకుంటే బాగుండదు కాని దాని అంత పనిమంతురాలు అంత వినయం ఉన్నవారు ఎవరూ ఉండరని చెప్పగలను. అబద్ధం ఆడమంటే దానికి నూటఆరు డిగ్రీల జ్వరం వస్తుం దంటే నమ్మండి" అంటూ చెప్పసాగాడు పెళ్ళికూతురుతండ్రి.

వరలక్ష్మికి కొంచెం నిరుత్సాహ మయింది. రాధలో చలనమే లేదు. మైనపుబొమ్మలాకూర్చొని ఉన్నాడు. వరలక్ష్మి కాఫీ తెచ్చి యిచ్చింది. అదిత్రాగి "మరి మాకు సెలవు ఇప్పిస్తారా. మీరు శనివారం సాయంత్రానికి దయ చేయండి. ఆదివారం పెళ్ళి చూపులు ఏర్పాటు చేస్తాం. ఆరాత్రిబండికే మీరు తిరిగి వచ్చెయ్యొచ్చు" అని చెప్పి మరి కాసేపటికి వెళ్ళిపోయారు వచ్చినవారు.

శనివారం పిల్లను చూడటానికి వెళ్లాలి. ఎవరెవరు వెళ్లాలి అనే సమస్య వచ్చింది. "మీరిద్దరూ వెళ్ళిరండి. మీరెట్లాఅంటే అట్లా నాకు" అన్నాడు రాధ వైరాగ్యంతో.

"బాగుందయ్యా రేపు నీభార్య నేలుకునేది నువ్వా మేమా? పెళ్ళికొడుకు లేకుండా మేము వెళ్ళే మొగంమీద నవ్వరూ" అంది వరలక్ష్మి.

వరలక్ష్మికి వెళ్ళాలనేఉంది కాని తాము ముగ్గురూ వెళ్ళడం బాగుండదు. అందువల్ల మానేసింది. చివరికి శ్రీహరి

రాధా వెళ్ళడానికి నిశ్చయం చేసుకున్నారు. అట్లాగే శని వారం బయలుదేరి వెళ్ళారు వాళ్ళిద్దరూ.

పెళ్ళికూతురు ఇంట్లో అడుగు పెట్టాంటేనే శ్రీహరి ఉత్సాహం సగం చచ్చిపోయింది. ఇల్లు ఉత్త పాత కొంప. తాతలనాటి సామాను ఎక్కడి దక్కడ పడేసి ఉంది. పెళ్ళి కూతురు అంత అందకత్తే కాదు, అంత అనాకారీ కాదు. తండ్రి చెప్పినట్లుగానే సంసారపక్షంగా ఉంది. రాధ ఒక్కసారి పెళ్ళి కూతురుకేసి చూసి తరువాత మళ్ళీ అటు చూడలేదు. పిల్ల తండ్రి గుచ్చి గుచ్చి అడగడం మొదలు పెట్టాడు. పిల్ల నచ్చిందా అని.

''పిల్లకేం పరవాలేదు'' అన్నాడు శ్రీహరి.

ఇవతలకు వస్తూ మధ్యవర్తి పిల్లపక్షంవారు కట్నం రెండువేలూ పైన నూటపదహార్లు లాంఛనాలు మాత్రం ఇవ్వ గలరని సూచించాడు.

''పిల్లను చూశాంకదా. మేము వెళ్ళగానే ఉత్తరం రాస్తాం. అప్పు డన్నీ ఆలోచిద్దాం'' అని ఎట్లానో వాళ్ళనుంచి బయట పడ్డాడు శ్రీహరి తమ్ముడిని వెంటబెట్టుకొని.

ఆ రాత్రికే ఇంటికి చేరుకున్నారు. వరలక్ష్మి ఎదురు పరుగెత్తుకువచ్చింది ''ఏమైందండీ'' అని అడిగింది.

''మాంమొగాలు చూస్తే తెలియడం లేదూ? పిల్ల ఓ మాదిరిగా ఉందనుకో. కట్నం రెండువేలు లాంఛనాలు

నూటపదహార్లట. రేపే ఉత్తరం రాసేస్తాను వేరే ప్రయత్నం చేసుకోవచ్చని" అన్నాడు శ్రీహరి.

వరలక్ష్మి నీరు కారిపోయింది. "పోనీలెండి. ఇది కాక పోతే మరో సంబంధం వస్తుంది. ఒకటి వచ్చింది కదా, ఇక అందరి దృష్టిలో పడతాం. రోజా ఇక మనింటిదగ్గర కాకి కావు కావు మనని రోజు వుండదు. — అన్నట్లు, ఏమం డోయి, పాపం ఆ పక్కింటాయన లేరూ- బిల్లు కలెక్టరు - నిన్న సాయంత్రం చచ్చిపోయాడండోయ్" అని చెప్పింది ఆమె.

శ్రీహరి ఒక్కసారి అదిరి పడ్డాడు. ఏమిటి నిన్న మధ్యాహ్నమే గదా మే మిక్కడనుంచి వెళ్ళింది!"

"అవును. గుండె ఆగడానికి ఎంతసేపు కావాలి ? నిన్న సాయంత్రం బజారునుంచి వస్తూంటే గుండెనొప్పి వచ్చినదని ఎవరితోనో అన్నాడట. కొంచెం విశ్రాంతి తీసుకుందామనో ఏమో ఒక చెట్టుకింద చేరాడట. అక్కడే ప్రాణాలు విడిచే శాడట. ఈ మధ్య ఈ గుండెజబ్బులు ఎక్కు వవుతున్నా యండీ. తలచుకుంటే భయం వేస్తోంది. ఇప్పుడు ఆ పెళ్లాం పిల్లల గతేం కాను. చెప్పండి ? ఆయన కన్ని బాధలూ తీరిపో యాయి. కాని వీళ్ళని దిక్కులేని వాళ్లుగా లోకం మీద పడేసి పోయాడు—" అంది వరలక్ష్మి.

శ్రీహరికి వెన్నులో పొడిచిన ట్లయింది. నాలుగు రోజుల క్రిందటే తనని మరో రెండురూపాయ లిమ్మని అతను ప్రాధే

యపడడం, తను లేదంటే నిరాశతో వెనక్కి వెళ్ళిపోవడం-ఆదృశ్యం శ్రీహరి కళ్ళముందు ఆడింది. ఆఖరిపిల్లవాడు చచ్చిపోతున్నప్పుడు అతను నిస్సహాయంగా కూర్చోవడం కూడా జ్ఞాపకం వచ్చింది.

"వెళ్లిఆవిడను పరామర్శ చేసిరావద్దూ ?" అన్నాడు. శ్రీహరి లోపల విచిత్రమైనబాధతో గుండె గిజగిజలాడుతూ.

"ఇంత రాత్రివేళ వద్దు. అస లావిడకి గట్టిగా ఏడ్చేందుకు కూడా ఓపికలేదు.—" అని ఆగి మళ్ళీ అంది వరలక్ష్మి. "భగవంతుడి లీల లతి విచిత్రంగా ఉంటాయి కాదండీ. అర్థం కావు. ఏమీలేని వాళ్ళకేనా ఇన్ని కష్టాలు ! సంపాదించేవాడు లేకపోతే ఇంతమంది పిల్లలూ ఆవిడా ఏమికాను ? చిల్లిగవ్వైనా ఆస్తి లేదే. అంతా పూర్వజన్మలో చేసుకున్న పాపాల ఫలమై ఉంటుందిలెండి. అంతకన్న మరేం కాదు.—ఇటుచూస్తే మన ఇంటివారికి చచ్చేటంత ఆస్తి. అది వాళ్ళ పూర్వజన్మపుణ్యానికి ఫలం లెండి. అయితే వాళ్ళకీ పెట్టాడు పరీక్ష భగవంతుడు ! ఇంతఆస్తి అనుభవించేటందుకు కోడలి కడుపున ఒక్క నలుసు పడడంలేదు- అన్నట్లు మీరు విన్నారా. మొన్న ఇంటివారు ఆంజనేయస్వామి ఆలయంలోకి వచ్చిన ఒక కొత్తయోగిని దర్శించారటగా. ఆయన చెప్పాడుట దక్షిణదేశ తీర్థయాత్ర చేసి వస్తే ఏడాదిలోగా మనుమడు పుట్టాడని. ఎల్లుండి తీర్థయాత్రకు బయలుదేరి వెళ్తున్నారు ఇంటి వారి కొడుకూ కోడలూను."

శ్రీహరి ఏమీ మాట్లాడలేదు. తల్లిలేచివస్తే ఆమెకు అన్ని విషయాలూ చెప్పి మరెచం మీదికి చేరాడు శ్రీహరి. అతని మనస్సు కల్లోలంలో పడిపోయింది. చావూ పుట్టుకా— పుట్టుకా చావూ. ఏమిటీ ఆట ? అటు ఆర్జించేవాడు చచ్చి ఆపిల్లలూ తల్లీ ఏడ్పు ! ఇటు కొడుకు పుట్టబోతాడని ఆనందమూ ! ఏమిటీ 'లీల' ?ఎందుకోసం ? పాపం, ఆ బిల్లు కలెక్టరు ఎన్ని ఆశలు పెట్టుకున్నాడో ! ఎన్ని కోరికలు ఉన్నాయో అతనికీ ! ఒక విధంగా చావే అతనికి మోక్షం ! అట్టే బాధపడకుండా చచ్చిపోయాడు. అదీ ఒకమేలే. గుండె జబ్బు అంటే అంతే. వరలక్ష్మి అన్నట్టు ఈమధ్యన ఈగుండె జబ్బు లెక్కువైపోతున్నాయి ! ఒకవేళ- ఒకవేళ తనకే గుండెజబ్బువచ్చి – శ్రీహరి గుండె ఒక్కసారిగా అదరిపడింది. తనూ బిల్లు కలెక్టరులా హఠాత్తుగా పోతే తన పిలలూ భార్యా, తమ్ముడూ, అమ్మా వీళ్ళంతా ఏమి కావాలి ? శ్రీహరి వణికిపోయాడు. అట్లాంటి పరిస్థితి రాకూడదు! రాకూడదు ! గుండె ఇట్లా కొట్టుకుంటోం దేమిటి ? – నిజంగా తన – ఏమో డాక్టరుచేత పరీక్ష చేయించుకోవాలి. ఆరోగ్యం విషయంలో జాగ్రత్తగా ఉండాలి. తన కోసం కాదు. తన పిల్లలకోసం. తన తమ్ముడికోసం అమ్మకోసం.— అంతలోనే శ్రీహరికి మళ్ళీ ధైర్యం వచ్చింది. తన కే గుండెజబ్బూ లేదు. భయంవల్లే గుండె ఇట్లా అదరిపడుతోంది. అంతకన్న మరేమీ లేదు— ఏమో ఎవరు చెప్పగలరు ? పైకి ఆరోగ్యంగానే

కనిపించవచ్చు. కాని ఎప్పుడో గుండె పని చేయడం మానే యవచ్చు. ఉక్కు విగ్రహాల్లాంటి వాళ్లు ఉఫ్‌మని ఎగిరి పోవడం లేదూ?— ఇట్లా ఆలోచనలతో సతమతమవుతూ ఎప్పుడో ఆలస్యంగా నిద్రలోకి జారాడు శ్రీహరి. కాని నిద్ర లోకూడా సుఖం లేదు. ఒకటే కలలు. పీడకలలు! ఒకసారి తనుచచ్చి పోయినట్లూ, భార్యా పిల్లలూ వాళ్ళూ అతిదీనంగా ఏడుస్తున్నట్లు కలవచ్చింది. ఆ దృశ్యం కలకంటూంటే శ్రీహరికే ఏడుపు వచ్చింది. మరోకసారి బిల్లుకలెక్టరు కల లోకి వచ్చాడు. తనతో ఏమో చెపుతాడు. కాని తనకు అర్థంకాదు. "మీరు చచ్చిపోలేదా?" అని తను అడుగుదా మనుకుంటాడు కాని బాగుండదని ఊరుకున్నాడు!- రాత్రి మెల్లగా గడచింది.

మరి నాలుగు రోజులుకి మళ్ళీ ఎవరో వచ్చారు. ఒకా యన వెతుక్కుంటూ వచ్చాడు శ్రీహరిగారి ఇల్లేదంటూ. ఆయ నను చూసి శ్రీహరి కంగారుగాలేచి "రండి రండి – ఏమేవ్ నారాయణరావుగారు వచ్చారు. కాళ్లు కడుగుకుందుకు నీళ్లు తే. మాఅమ్మని కేకెయ్యి." అని అరిచాడు. "ఇదే వస్తున్నా. వీధిలో మావాళ్లు ఉన్నారు. అమ్మాయీ, మాఆవిడా,

అబ్బాయీ అందరూ కూడా వచ్చారు. వీధిలో బండిలో ఉన్నారు. ఇల్లు అవునో కాదో ముందు తెలుసుకుందామని వచ్చాను'' అని ఆయన వెనక్కి తిరిగాడు. శ్రీహరి లోపలికి పరుగెత్తి "నారాయణగారూ భార్యా పిల్లలూ అందరూ కూడా వచ్చారుటే. కాఫీకూడా పెట్టు'' అని చెప్పి నారాయణ గారి వెనుక వీధిలోకి పరుగెత్తాడు. నారాయణగారు బండిలో వాళ్ళతో "ఇదే ఇల్లు దిగండి'' అని చెప్పాడు. శ్రీహరి "ఏమండి అత్తయ్యగారూ ఖులాసా'' అని పలుకరించాడు నారాయణగారి భార్యని. "ఆ కులాసాయే నాయనా'' అంటూ ఆవిడ, ఆవిడ వెనుక కూతురు దిగారు, రిక్షాలోంచి కొడుకూ మరొక పెద్దమనిషీ దిగారు.

వరలక్ష్మి అత్తగారికి కబురు చెప్పింది. ఆమె కంగారు అంతా యింతా కాదు. నారాయణగారు తమ బంధువులలో బాగా ధనవంతులు. వంద ఎకరం రెండు మేడలూ ఉన్నాయి. అందుకే వారికి గర్వంకూడా జాస్తి. సామాన్యంగా ఎవళ్ళ యిళ్ళకీ రారు. అటువంటివారు తమ యింటికి వచ్చారంటే, అందులో పిల్లతోసహా, వరలక్ష్మి ఆనందం పట్టలేక పోతోంది. ముసలావిడ "మా తండ్రి అదృష్టం. ఇంతటి సంబంధం వచ్చిందంటే ఏముంది! బంగారంలోముంచెత్తేయ్యరూ,''అని వసారా లోకి వచ్చి ఎదురు చూస్తోంది. వరలక్ష్మి అటూ ఇటూ పరుగెత్తుతోంది. ప్రక్కవాటాలోకి పరుగెత్తి "మా రాధకి గొప్ప సంబంధం వచ్చిందండోయి. ఏకంగా పిల్లతో

సహా వచ్చేశారు. మాలోకల్లా చాలా డబ్బున్నవారు. అందరికి కాఫీ ఇవ్వాలి. కొంచెం కాఫీపొడుం బదులిద్దురూ. రేపు పొద్దున్నే తిరిగి ఇచ్చేస్తాను'' అంది. ''ఓ అట్లాగే. దానికేమిటి కాని నేనే కాఫీకాచిపెట్టా నుండండి'' అని ఆమెను పంపేసి తనే రెండు కుంపట్లు చేసి ఒకదానిమీద డికాషను, రెండో దానిమీద వరలక్ష్మి యిచ్చిన పాలు – తన ఇంట్లో పాలు కూడా కొద్దిగా కలిపి– కాఫీ కాచసాగింది రామకృష్ణమూర్తి భార్య.

నారాయణ గారూ వాళ్ళూ లోపలికి వచ్చారు. ఆయనే పలుకరించారు సూరమ్మగారిని. ''ఏమండి అక్కయ్యగారూ కులాసాగా ఉన్నారా ?'' అని. ''ఆ కులాసాయే నాయనా. మాఇంటికి వచ్చారు అదే సంతోషం'' అంది సూరమ్మగారు చెమర్చిన కళ్ళతో. నారాయణగారి భార్యకూడా ఎంతో ఆప్యాయంగా సూరమ్మగారినీ వరలక్ష్మినీ పలకరించింది. వరలక్ష్మి పక్కవాటాలోనుంచి పరుగెత్తి ఇంటివారింట్లో కూడా చెప్పివచ్చేసింది. వాళ్ళ నౌకరు రెండు కుర్చీలు పట్టుకువచ్చి వేశాడు. శ్రీహరే పక్కవాటాలోనుంచి ఒకకుర్చీకూడా పట్టుకువచ్చాడు. కాళ్లు కడుగుకోవడం పూర్తి అయింది. ఆడవాళ్ళు లోపలికి వచ్చారు. మగవాళ్ళు కుర్చీలలో కూర్చున్నారు. ఇంతలో రాధకూడా వచ్చాడు. ''మీ తమ్ముడేనా ? చాలా ఎదిగాడే ! చూసి చాలా రోజు లయిందికాదూ. బి. ఏ. ఆ, బి. కామా చదువు తున్నది ?

ఏమోయ్ జ్ఞాపకం ఉన్నామా?" అని పలకరించారు నారాయణగారు. "ఆ జ్ఞాపకం లేకేమండీ" అన్నాడు రాధ మెల్లగా ఇదేమి కొత్త ఉత్పాతం వచ్చిం దనుకుంటూ. కాఫీలు వచ్చాయి. "అయ్యయ్యో ఇవన్నీ ఎందుకమ్మా? మనలో మనకి ఈ మర్యాద లెందుకు? పరాయివాళ్లమా ఏమన్నానా?" అన్నారు నారాయణగారూ భార్యా కూడాను. కాఫీలు త్రాగారు. కొంతసేపు నారాయణగారు శ్రీహరి ఉద్యోగం, ఉన్నఇల్లూ, ఇంటివారిని గురించీ ప్రశ్నలడిగిన తరువాత తాము వచ్చినపని చెప్పారు.

'మాపిల్ల సంబంధం విషయమై వచ్చామండి అక్కయ్యగారు," అని సూరమ్మగారి నుద్దేశించి అన్నారు పెద్దది ఎదర ఉంది కాబట్టి. శ్రీహరికీ, వరలక్ష్మికీ సూరమ్మగారికీ గుండె లెగిరి పడుతున్నాయి.

"ఈ ఊళ్లో ఓ సంబంధం ఉంది—" శ్రీహరీ, వరలక్ష్మి, సూరమ్మగారు ఒక్కసారిగా నీరు కారిపోయారు. కళ్ళలో ఆశాభంగం స్పష్టంగా తొణికిస లాడుతోంది. అయినా తమ అవస్థని కప్పిపుచ్చుకుందుకు మొగాలమీాదికి లేని చిరునవ్వు తెచ్చుకొని వింటున్నారు. రాధమాత్రం బ్రతికానురా బాబూ అనుకున్నాడు. అంతకు ముందే 'పెళ్లికూతురును' చూసి ఉలిక్కిపడి ఊరుకున్నాడు. పెళ్లికూతురు నల్లగా, పొట్టిగా లావుగా వుంది. మెడ కనిపించడం లేదు.

కూర్చుంటే మరీగుమ్మడిపండులా ఉంది.''— తండ్రికి ఉద్యోగం ఏమీ లేదు. ఆస్తులు చూసుకోవడమే. కొడుకుమాత్రం ఇక్కడే ఓ కంపెనీలో కొత్తగా చేరాడు. మిగతా అన్ని విషయాలు మధ్యవర్తిద్వారా — వేరే మధ్యవర్తి — సాగాయి. ఇక వాళ్ళు పిల్లను చూడడమే తరువాయి. తాము అక్కడికి రావడానికి వీలులేదనీ, పిల్లను ఈఊరు తీసుకువస్తే చూస్తామని కబురు చేశారు. మన వాళ్ళు ఎవరున్నారా అని ఆలోచిస్తే ముందు మీమాట జ్ఞాపకం వచ్చింది. ఇక్కడ పెళ్ళిచూపుల తతంగం జరిపితే— మీరు కాస్త సాయం చేయాలి'' అన్నారు నారాయణగారు.

''అయ్యో దానికేమండి'' అన్నాడు శ్రీహరి. ''ఆ మాత్రం సాయపడకపోతే చుట్టా లెందుకు ?''

లోపల నారాయణగారి భార్య వరలక్ష్మి చేతులు పట్టుకొని, ''మీయింటికి వచ్చాం. ఈ సంబంధం కుదిరితే మీపేరు చెప్పుకుంటాం'' అంది. వరలక్ష్మి ఆశాభంగం ఎప్పుడో ఎగిరిపోయింది. ఇంతగొప్ప వాళ్ళు తమ సాయం కోరడం! అంతకన్న ఏంకాలి.

నారాయణగారు ఒకసారి శ్రీహరి ఉన్న వాటాకేసి పరికించిచూసి,''కాని ఈఇల్లు కొంచెం వెనకగా ఉందే. అవతల వాళ్లు కొంచెం పెద్ద ఎత్తువాళ్లు—అని సందేహిస్తూంటే ''ఇంటి వారింట్లో ఏర్పాటు చేద్దాం, బాబుగారూ, వాళ్ళ హాలులో అన్ని విధాలా బాగుంటుంది'' అంది వరలక్ష్మి. ''అలా

గైతే శ్రీహరీ, ఒకసారి ఇంటివారి నడుగుదామా ? అడిగితే కాదంటారా ? తరువాత ఒకసారి ఆలా వెళ్ళొద్దాం వస్తావా ? పిల్లవాడి ఇంటికి వెళ్లి రేపు చూపులికి రమ్మని చెప్పిరావాలి. మేము ముగ్గురమే అయ్యాం. నాలుగోవాడు కావాలి'' అన్నారు. "అట్లాగే వస్తాను" అని శ్రీహరి ఖండువా వేసుకొని బయలుదేర బోయాడు. వరలక్ష్మి భర్తని చాటుకిపిలిచి చెవిలో ఏదో చెప్పింది. "డబ్బయిపోయిందే ఎట్లా?''అన్నాడు శ్రీహరి. "అరువు రాయమనండి. ఒక చీటీ రాసి ఇయ్యండి. మీ తమ్ముడిచేత తెప్పిస్తాను. అట్లాంటివాళ్లు మన ఇంటికి వస్తారా ? రాకరాక వస్తే అతనికి మర్యాద చేయొద్దూ''అంది వరలక్ష్మి. అట్లాగే శ్రీహరి ఒకకాగితం మీదరాసి వరలక్ష్మి కిచ్చి, నారాయణగారితో కలసి బయలుదేరాడు. ఎదుటి నుంచి ఇంటివారింట్లోకి తీసుకువెళ్లి హాలులో కూర్చున్న రామలింగంగారిని పరిచయం చేశాడు. ఇద్దరూ ఆస్తిపరులే కాబట్టి వారికి ఒకరిపట్ల ఒకరికి గౌరవం కుదిరింది. ఆస్తులను గురించీ, ప్రభుత్వం అమలు పరుస్తున్న సోషలిస్టు విధానాల ప్రమాదం గురించీ ఎంతో ఆసక్తితో కబుర్లు చెప్పుకో సాగారు. శ్రీహరి జ్ఞాపకం చేయగా నారాయణగారు తమ కోరిక తెలియబరచారు. రామలింగంగారు అంగీకరించారు. నారాయణగారూ వాళ్ళూ ఆయన దగ్గర సెలవు తీసికొని ఊళ్లోకి బయలుదేరారు.

వరలక్ష్మి మరదిని చాటుకు పిలిచి మెల్లగా అంది

"ఇదిగో ఈచీటి పట్టుకెళ్ళి కొట్టుకు వెళ్ళి సరకులు తీసుకురా. పక్కవాటాలోనుంచి వెళ్లిరా. వీళ్ళ మొగాల మీదనుంచి తేవడం బాగుండదు."

రాధ చీటీ చూసుకొని "ఏమిటివదినా, ఈ సరకు లెందుకు? అరువుపెట్టి కూడా తేవాలేమిటి? అని అడిగాడు.

"గట్టిగా మాట్లాడకోయి, నీకు పుణ్యం ఉంటుంది. ఇంటికి వచ్చిన వాళ్ళను మర్యాద చేయొద్దూ? అంతటి వాళ్ళు మనల్ని వెతుకుకుంటూ వచ్చారు? అసలు మన ఇంటికి ఎందుకు వస్తారు?"

"పాపం మనమీద ప్రేమకొద్దీ కాదులే. అవసరంకొద్దీ వచ్చారు. వాళ్ళు మన ఈ మర్యాదలను చూసి మనల్ని గొప్పగా చెప్పుకుంటే మనకి వచ్చేది ఏమిటి?"

"అబ్బబ్బ. నీకు చెప్పలేక చస్తున్నాను నీకెందుకు వెళ్లిరా. మీ అన్నయ్య తెమ్మన్నారు" అని పంపించింది వరలక్ష్మి. రాధ ప్రక్కవాటాలోనుంచే సరుకులన్నీ తెచ్చాడు.

మరికొంత సేపటికి నారాయణగారూవాళ్లూ తిరిగి వచ్చారు. నారాయణగారు భార్యతో చెప్పారు. "రేపు మధ్యాహ్నం రెండింటికి వస్తామన్నారు చూపులికి. ఇంటి ఆయనతో కూడా చెప్పాం. ఆయన ఒప్పుకున్నారు. రేపు ఆ ఏర్పాట్లు చూడు" అని.

భోజనాల దగ్గర అప్పడాలూ, వడియాలూ పూరీలు చూసి నారాయగారూ భార్యాకూడా "అయ్యయ్యో

ఎందుకమ్మా ఇవన్నీ? కావలసినవాళ్ళం నిన్న మర్యాదలు కావాలా? మనలో మనకు తేడా లేమున్నాయి కనక" అన్నారు. అయితేనేం సుష్టుగానే తిన్నారు.

శ్రీహరి మొదట్లో ఈ సంబంధం తన తమ్ముడికేనేమో అనుకున్నాడు. సంబంధం చూడటానికి వస్తూ ఎవరూ పిల్లను కూడా తీసుకురారని అప్పుడు తోచనేలేదు అతనికి. ఫలితంగా కొంత ఆశాభంగం చెందినా అంతగొప్పవాళ్ళు తన ఇంటిలో ఉండి తన సహాయాన్ని అర్థించడమే ఒక విధమైన సంతృప్తి గర్వమూ కలిగించింది. రాధకు ఈసంబంధం తనకు కాదు అని తెలుసుకోగానే సంతోషం కలిగినా నారాయణగారి అమ్మాయి చూపులు అస్తమానం తనమీదే ఉండడం వల్ల అతనికి ఇంట్లో ముళ్ళ మీద ఉన్నట్లుంది. ఆ పిల్ల సిగ్గు పడడం పోయి మగవాడైన తను సిగ్గుపడుతూ తలవంచుకొని వెళ్ళి పోతున్నాడు. పొద్దున్నే చదువుకోసమని వంకచెప్పి తన క్లాసుమేట్ ఒకరి గదికి పారిపోదా మనుకున్నాడు. కాని శ్రీహరి "ఒరేయి రాధా, ఇంట్లో చుట్టాలున్నారు. ఏమైనా పని ఉండవచ్చు, ఉండిపో. ఈవేళ కూడా వీలైతే కాలేజీకి సెలవుపెట్టు" అని చెప్పి తను కూడా ఆవేళ బడికి కాజువల్ లీవ్ రాసి రాధను ఇచ్చి రమ్మన్నాడు. ప్రైవేట్లు కెట్లాగైనా సెలవే.

మధ్యాహ్నం పెళ్ళిచూపులకు వచ్చేవారికోసం నారాయణగారి భార్య నడిగి వరలక్ష్మి ఉప్మా, జిలేబీ, తయారు చేసింది.

మధ్యాహ్నం రెండుగంటలకు ఇంటివారి పెద్దహాలులో పెళ్లిచూపుల కేర్పాటు జరిగింది. పెళ్ళికొడుకు నల్లగా స్థూలంగా ఉన్నాడు. రాధ అతనిని చూసిన తరువాత ఇంట్లోకి పరుగెత్తుకు వచ్చాడు. వరలక్ష్మి ప్లేట్లలో జిలేబీ, ఉప్మా సర్దడానికి ఇంట్లోకి వచ్చింది. రాధ వదిన దగ్గరికి పరుగెత్తాడు. "వదినా బలే బాగున్నాడుకాదూ పెళ్ళికొడుకు? అట్లా ఉండాలి సంబంధం అంటే. ఈడూ జోడూ టకీ మని సరిపోయింది" అంటూ పెళ్ళికూతురు నడకా, చూపులూ, తిప్పుకోనడాలూ, సిగ్గు నభినయించం, ఆపెళ్ళికొడుకు నడకా, మాటలూ అనుకరిస్తున్నాడు. పెళ్ళికొడుకును చూసేసరికి వరలక్ష్మికి కూడా కొంత నవ్వు వచ్చింది. గబుక్కున తల తిప్పేసుకొని లోపలికి వచ్చేసింది. రాధ ఇంట్లో ఆ పెళ్ళి కొడుకూ పెళ్లికూతుళ్ళను అనుకరిస్తుంటే ఆమె కూడా నవ్వు పట్టలేకపోతోంది.

లేనికోపం తెచ్చుకొని "అబ్బ, రాధా, నన్ను నవ్వించకు, ప్లేట్లు పడిపోతాయి. కొన్నిప్లేట్లు నువ్వు కూడా పట్టుకురా" అని కొన్ని రాధ చేతి కందిచ్చి, కొన్ని తనే పట్టుకు వెళ్ళింది. నారాయణగారి భార్య ప్లేట్లు వచ్చినవారికీ అక్కడ ఉన్నవారికీ అందిచ్చింది. రాధ ఒక ప్రక్క నిలబడి వదినగారి కేసి సైగలు చేస్తున్నాడు. ఆ పెళ్ళి కొడుకును చూడు, ఆ పెళ్ళికూతురు ఎట్లా చూస్తోందో చూడు అన్నట్లు. వరలక్ష్మి కళ్ళతోనే ఊరుకో అన్నట్లుచెప్పింది. కాఫీ తేవడానికి

ఆమె తన ఇంట్లోకివెళ్తే రాధ వెంటబడ్డాడు. ఇంట్లోకి వచ్చి కుర్చీలో కూలబడి పకపకా నవ్వేస్తున్నాడు కడుపు పట్టుకొని. 'అబ్బబ్బ నువ్వెక్కడ దొరికావయ్యా చంపేస్తున్నావు నీ నవ్వుతో చేష్టలతో, దణ్ణం పెట్తాను హాస్యపుచేష్ట లేమీ చేయకు. కాఫీగ్లాసు లిస్తాను. రా, పట్టుకు వెళ్దాం" అని గ్లాసుల్లో పోస్తోంది కాఫీ. ఇంతలో అటు ఇంటివా రింట్లో నుంచి ఏదో పాట వినిపించ సాగింది.

రాధ లేచి ధ్యానంగా విని, "ఒహో పెళ్ళికూతురు తన గాన నైపుణ్యం ప్రదర్శిస్తోంది కాబోలు. ఆహా ఏమి గానం! ఏమిగానం! రూపానికి తగ్గ గానం! మనింట్లో బర్రె లేమీ లేవులే బ్రతికి పోయాం - లేకపోతే అవి కూడా వచ్చేసేవి పెళ్ళి చూపులికి?"

"ఇదుగో రాధా చెప్తున్నది నీకు కాదూ. నీ హాస్యం కట్టిపెట్టు. రా కాఫీ పట్టుకురా."

"నేను రాను బాబూ. అక్కడ నవ్వాపుకోలేకపో తున్నాను. నలుగురిలో నవ్వేస్తే బాగుండదు," అని అక్కడే కూర్చుండి పోయాడు రాధ.

వరలక్ష్మి కొంచెం విసుగుకొని గ్లాసు లొకసారీ, కాఫీతోఉన్న గిన్నె ఒకసారీ పట్టుకు వెళ్ళింది.

పెళ్ళిచూపు లయి.పోయాయి. మర్నాడు ప్రొద్దున్నే వెళ్ళిపోతా మన్నారు నారాయణగారు "అదేమి టండీ బాబుగారూ వచ్చిందేదీ ఉండిందేదీ. ఎప్పుడూ వస్తారా ఏమన్నానా? రెండు రోజు లుండి వెళ్ళండి. ఈ లోగా వాళ్ళ దగ్గర నుంచి ఏ కబురూ తెలియ వచ్చుకూడా" అంది వర లక్ష్మి. సూరమ్మగారూ శ్రీహరీకూడా వరలక్ష్మి అన్నట్లే అన్నారు. మొహమాట పడుతున్నట్లు నారాయణగారు భార్య నడిగారు. "ఏమంటావు" అని. "వచ్చిన వాళ్ళం ఉత్త చేతులతో వెళ్తే ఏం బాగుంటుంది. ఈ వేళా రేపూ ఆగి వాళ్ళ కబురు తీసుకు వెళ్తేనే బాగుంటుంది" అంది భార్య. అట్లాగే ఉండిపోయారు. ఆరాత్రి అందరూ సినిమాకు కూడా వెళ్లారు. శ్రీహరే ఖర్చుపెట్టాడు రామకృష్ణమూర్తి దగ్గర అప్పుచేసి. మర్నాడు పెళ్ళికొడుకు వాళ్ళ దగ్గర నుంచి అంగీ కారం కూడా తెలిసింది.

"సరే వచ్చినపని అయింది. ఇక వెళ్తాం శ్రీ మీ ఉపకారం మరచిపోలేం. మేం ఇంటికివెళ్ళి వెంటనే పెళ్ళి ఏర్పాట్లు చెయ్యాలి. ఇక ఆట్టే వ్యవధిలేదు. పెళ్ళికి మీ రంతా రావాలి. శుభలేఖ పంపుతాం. రాకపోతే ఊరుకోం. మీ చేతి మీదుగానే పెళ్ళి జరగాలి." అని చెప్పి మర్నాడు ప్రొద్దున్న వెళ్ళిపోయారు నారాయణగారూ వాళ్ళూ.

వెళ్ళిన తరువాత లెక్క చూసుకుంటే చాలా ఖర్చు తేలింది. కిరాణా కొట్టు మీద అరువు బాకీ చాలా పెరిగింది. రామకృష్ణమూర్తిగారి దగ్గర అప్పుకూడా ఏర్పడింది. శ్రీహరికి కొంచెం చింత పట్టుకుంది. అంత ఎగిరి పడవలసింది కాదేమో అనుకున్నాడు అప్పుడప్పుడు. కాని గొప్పవాళ్ళకు ఆతిధ్య మీయగలగడం అతని అహాన్ని కొంత సంతృప్తిపరచింది. అయినా ఇన్నాళ్ళూ అప్పు జేయకుండా ఉండాలని కోరుకున్న వాడు కావడంవల్ల వెంటనే అప్పూ అరువూ తీర్చేస్తేకాని గుండెమీద బరువు తగ్గేటట్లు లేదు. బాంకులో కొంచెం సొమ్ము ఉంది. అది తమ్ముడి చదువుకోసం వేరే పెట్టింది. తమ్ముడి బి. కాం. చదువు పూర్తైతే తన భారం చాలా వరకూ తీరిపోతుంది. అంతవరకూ ఎన్ని ఇబ్బందులు వచ్చినా బాంకులో సొమ్ము ముట్టుకోకూడ దనుకున్నాడు. అదైనా అసలు ఎక్కువలేదు. ఒక టరమ్ జీతం, పరీక్షల రుసుము వీటికే సరిపోతుంది. ఏమైనా దాని జోలికి పోకుండా వచ్చే నెల జీతంలో ముందు అరువూ అప్పులూ తీర్చేసి, తరువాత ఖర్చులు తగ్గించుకొని ఎట్లాగో బయట పడాలని నిశ్చయించు కున్నాడు శ్రీహరి.

కాని ఈ నిర్ణయానికి పరీక్ష ఎదురు కా సాగింది. పొదుపు చేదామనుకుంటే ఎన్నో విఘ్నాలు ఎదురుకా సాగాయి. ఈసారి అనుకోని వైపునుంచి ఒక చిన్న ఖర్చు

వచ్చి పడింది. వెంకటరమణ బళ్లో బాలదినోత్సవం జరుప బోతున్నారు. ఆ సందర్భంలో ఆటలపోటీలే కాకుండా నాటికలూ, నృత్యాలూ, బృందగానాలువంటి ప్రదర్శనలు కూడా ఏర్పాటయ్యాయి. ఒక నాటికలోనూ, సమూహనృత్యం లోనూ వెంకటరమణకూడా ఉన్నాడు. వాడికి నీలం నిక్కరు, తెల్లషర్టూ కావాలి. కాని ఇంట్లో లేవు. కుట్టించుకోమని చెప్పారుట మాస్టారు. రమణ ఇంటికి వచ్చి తల్లితో చెప్పాడు. ఆమె ఆనందంతో పొంగిపోయి భర్తతో చెప్పింది. శ్రీహరి చూదాం అని ఊరుకున్నాడు. అతనికీ కుట్టించాలనే ఉంది. కాని చేతిలో పైసా లేనప్పుడు ఏమి చేయగలడు? కాని రమణ మాత్రం ఊరుకోలేదు. తల్లిని సతాయించడం మొదలు పెట్టాడు. వరలక్ష్మి మళ్ళా చెప్పింది భర్తతో. "బట్టలు కుట్టించుకోకపోతే నాటకాల్లోనుంచి తీసేస్తారటండీ. పాపం వెర్రి మొగం సరదా పడుతున్నాడండీ."

"రామకృష్ణమూర్తిగారి పిల్లలకేవైనా ఉన్నాయేమో కనుక్కో. ఒక్కపూటేగా" అన్నాడు. శ్రీహరి.

"అబ్బే వాళ్ళవి వాడికెట్లా సరిపోతాయండీ. వాళ్ళ పిల్లలు వీడి కన్న పెద్దవాళ్ళు."

"మరి ఏమి చేయమంటావు ? ఇప్పటికే అప్పు చేశాను. ఇంకా ఎవరి దగ్గర చేయమంటావు ?"

రమణ తేలికగా వదిలేరకం కాదు. మాస్టారినే సిఫా రసుకు తీసుకు వచ్చాడు. "మీవాడు చలాకీయైన వాడనీ,

చక్కగా ఉంటాడనీ వేసుకున్నాం” అని చెప్పారు ఆయన. మాష్టారి సిఫారసు పనిచేసింది. శ్రీహరికి చాలా ఉత్సాహం వచ్చింది. పట్టుదలా వచ్చింది. “ఎట్లాగో అట్లాగ కుట్టిస్తానండి తప్పక” అని చెప్పి పంపాడు మాష్టారిని.

కాని ఆ ఎట్లాగో ఒక సమస్యే అయి కూర్చుంది. రామకృష్ణమూర్తిగారిని ఆయన బదులు తీర్చకుండానే మళ్ళీ అడగడం బాగుండదు. ఇంటి వారిని అడగడం అతని కిష్టం లేదు. ఇంకెవరిని అడిగితే బాగుంటుంది? తెలుగు పండితులు ఆచార్లుగారు జ్ఞాపకం వచ్చారు. ఆయన అస్తిపరుడు. బడిలో శ్రీహరి ఆయన దగ్గరకు చేరి మెల్లగా ఇంకెవరికీ వినపడకుండా అడిగాడు. కాని ఆచార్లుగారు మాత్రం అందరికీ వినపడేటట్లు బిగ్గరగా అన్నారు: “అట్లాగే నాయనా. నీవంటి వాడ వడిగితే ఇవ్వనా” అన్నారు. సుబ్బారావూ నరసింహారావు శ్రీహరికేసి సాభిప్రాయంగా చూసి నవ్వారు. శ్రీహరి తలవంచుకున్నాడు. సాయంత్రం బడినుంచి తిరిగి వస్తున్నప్పుడు శ్రీహరిని కూడా రమ్మని ఒకకొట్టు దగ్గరకు తీసుకు వెళ్ళి ఆకొట్టు యజమాని చేత శ్రీహరికి డబ్బింపించారు “తరువాత నేనిస్తా”నని చెప్పి.

ఆ డబ్బుపెట్టి రమణకి బట్టలు కుట్టించాడు శ్రీహరి. అవి తొడుగుకొని ఇల్లంతా గంతులు వేశాడు. రాధ “ఏరోయి నువ్వు నాటకాలేమిటి, భూమికి జానెడు లేవు. నాటకాలంటే ఏమనుకున్నావు. అందరిని చూసేటప్పటికి నోరు వెల్లబెట్తావు”

అని వాడిని ఏడిపించ సాగాడు. "నాకు భయం లేదు. చూసుకో ఎట్లా చేస్తానో" అని ఇంట్లోనే రిహార్సల్సు వేశాడు రమణ. రాధ ఎంత కవ్వించినా తొణకలేదు బెణక లేదు. వరలక్ష్మి కొడుకు నెత్తుకొని ముద్దులు కురిపించింది. "నువ్వువాణ్ణి ఆక్షేపిస్తున్నావు కాని రేపు నీ కాలేజీనాటకాల్లో నువ్వేమాత్రం వేస్తావో చూస్తాముకా. కాళ్ళు వణకకపోతే చూదాం" అంది. రాధ రమణ బుగ్గ గిల్లి "చూద్దాంకా" అని ఊరుకున్నాడు.

బాల దినోత్సవం వచ్చింది. రమణ తల్లిదండ్రుల్నీ, చెల్లెలినీ, తమ్ముడినీ, రాధనీ, మామ్మనీ, ఇరుగు పొరుగుల్ని అందరినీ రమ్మని మరిమరీ చెప్పాడు. మధ్యాహ్నం పెందరాళే బడికి పరుగెత్తాడు. చెంచాలో నిమ్మకాయ పెట్టుకొని పరుగెత్తడం పోటీలోనూ, నోటితో నిమ్మకాయ అందుకోవడం పోటీలోనూ వాడు నెగ్గాడుకూడా. సాయంత్రం శ్రీహరి కుటుంబం రామకృష్ణమూర్తి కుటుంబం బడికి వెళ్ళారు.

"స్టేజీమీద రమణ ఏమి చేస్తాడో, పాడుచేస్తాడేమో అందరూ నవ్వుతారేమో" అని శ్రీహరికీ, వరలక్ష్మికీ ఆదుర్దాతో గుండెలు కొట్టుకుంటున్నాయి. సభ ప్రారంభ మయింది. ఉపన్యాసా లయినతరువాత ఆటలపోటీల్లో నెగ్గిన పిల్లలకు బహుమతు లీయబడ్డాయి. రమణకి ఒక సబ్బుపెట్టె, ఒకబెట్టూ వచ్చాయి. వాడు జనంలోనుంచి చీల్చుకుంటూ

వచ్చి ఆ బహుమతులు తల్లి చేతికిచ్చి మళ్లీ నాటకానికి తయారవ్వాలని పరుగెత్తుకు పోయాడు.

కొద్దిసేపటికి ప్రదర్శనలు ప్రారంభమయ్యాయి. మొదట జండానృత్యం ఉంది. అందులో రమణ జండా పుచ్చుకొని ముందున్నాడు. తల్లి ప్రక్క కూర్చున్న సూర్యావతి "అన్నయ్యా" అని పెద్ద కేకేసింది. పక్కవాళ్ళందరూ ఒక్కసారి నవ్వేశారు. వరలక్ష్మి సిగ్గుపడి "తప్పు, అన్నయ్య నిప్పుడు పలకరించకూడదు" అని చెప్పింది సూర్యావతితో. రమణ మాత్రం అసలు జనంలేనట్లే నిర్భయంగా నటించాడు. మళ్లా రెండు మూడు అంశాల తరువాత వాడు పాల్గొన్న నాటకం వచ్చింది. అందులో రమణ మాట్లేడేది అట్టే లేదు. మాట్లాడవలసినది కాస్తా బాగానే అప్పజెప్పేశాడు. చిన్న పిల్లవాడు కాబట్టి వాడు ఎట్లా మాట్లాడినా బాగానే ఉంది. ఆఖరున నాటికల్లోనూ నృత్యాల్లోనూ పాల్గొన్న బాలలకు బహుమతులు పంచిపెట్టబడ్డాయి. జనంలోనుంచి కొందరు ప్రత్యేకపు బహుమతులుకూడా చదివించారు. హెడ్ మాష్టారు "వెంకటరమణ అనే చిన్నకుర్రవాడి నటనకు మెచ్చి కాసుభేల గోపాలరావుగారు ఒక ప్రత్యేక బహుమతి – పెన్ను – ఇచ్చారు" అని చెప్పారు. అధ్యక్షుడు రమణకి షేక్ హాండ్ చేసి, బుగ్గగిల్లి బహుమతి అందిచ్చారు.

అందరూ ఇంటికి వచ్చారు. శ్రీహరి, వరలక్ష్మిల ఆనందం పట్టశక్యం కాకుండా ఉంది. ఎన్నిసార్లు చెప్పుకున్నా

వాళ్ళకు తనివితీరడంలేదు. ఇంటికిరాగానే సూరమ్మగారు రమణకి దిష్టి తీసింది. "ఎందరికళ్ళలో పడ్డాడో" అని. రాధకు మాత్రం మనస్సు పీకసాగింది. అన్నయ్యా వదినల ఆనందం చూసి ముఖ్యంగా వాళ్ళు తమ రమణకి ప్రత్యేక బహుమతి రావడం గురించి గొప్పగా చెప్పుకొని పొంగిపోవడం చూసి అపరాధిలా బాధపడసాగాడు. తనే తన స్నేహితుడిచేత అతని పెన్నే తరువాత కొని ఇస్తానని చెప్పి ప్రత్యేక బహుమతిగా చదివింపజేశాడు. ఇట్లా కొంతమంది చేస్తూనే ఉంటారు. అన్నయ్యను, వదినను ఇట్లా మోసం చేయిడం అన్యాయమేమో ననిపించింది రాధకు. వాళ్ళకు నిజం తెలిస్తే ఎంత చిన్నబోతారు! కాని మర్నాడు అతని స్నేహితుడు అతని చింత పోగొట్టాడు. "ఒరే రాధా నువ్వు నాకు పెన్ను కొని ఇవ్వనక్కర్లేదురా. మీవాడు చాలా బాగా చేశాడు. వాడిని చూస్తే నాకు చాలా ముచ్చటవేసింది. రేపు తప్పక గొప్పవాడవుతాడురా. ముఖంలో ఆ లక్షణా లున్నాయి" అన్నాడు. రాధ ఎగిరిగంతేసినంత పని చేశాడు. తిన్నగా ఇంటికి పరుగెత్తి వచ్చి రమణతో హుషారుగా షేక్‌హాండ్ చేసి, బుజం మీదికెక్కించుకొని తిప్పాడు! "వెంకటరమణకీ జై" అంటూ వరలక్ష్మి గుండె పొంగిపోయింది.

దెబ్బలు తిన్నా, చిల్లులుపడినా ఎట్లాగో ముందుకు సాగుతున్న పడవపైకి ఈసారి పెద్దకెరటమే విరుచుకు పడింది. పడవ ఇంచుమించు తలక్రిందులయినంత పని అయింది. నారాయణగారి దగ్గరనుంచి శుభలేఖ వచ్చింది. ఇక వరలక్ష్మి సంబరం ఇంతా అంతా కాదు. సూరమ్మగారు కూడా హడావిడి చేయసాగింది. "ఒరేయి అబ్బాయి అందరూ వెళ్లాలి. వాళ్ళు మరీ మరీ చెప్పారు. వెళ్ళకపోతే ఏమనుకుంటారు? మనవాళ్ళలోకల్లా గొప్పింటిపెళ్ళి. మన చుట్టాలు అందరూ వస్తారు. మనింట్లో పెళ్ళిచూపులు జరిగి సంబంధం స్థిరపడింది కాబట్టి నారాయణగారు వాళ్లూ మనల్ని ఎంత సత్తిమీద పెట్టుకుంటారు?" అని పదే పదే చెప్పసాగింది. అంతా వెళ్లాలనే నిశ్చయించుకున్నారు. రాధ మొదట్లో రానన్నాడు. కాని వరలక్ష్మి ఒత్తిడిచేసింది. "చాలామంది వస్తారుగా మనవాళ్ళు. నీకు నచ్చిన పెళ్లికూతురి నెవరినైనా ఏరుకోవచ్చు" అంది నవ్వుతూ. "నాకేం అక్కర్లేదు.— సరే వస్తానులే. ఆ మహామహీపాల పెళ్లి ముచ్చటలు చూడాలనిపిస్తోంది నాకూ" అన్నాడు రాధ.

పెళ్లికి వెళ్ళాలనుకోవడంతో సరిపోలేదు. తనకు మంచి బట్టలు కావాలంది వరలక్ష్మి "ఒక్కటే పట్టుచీర ఉంది. అది

ఒకటే మూడురోజులూ కట్టుకుంటే అందరూ నవ్వరూ? ఇంకో మంచి చీరైనా ఉండాలి. ఎప్పటికైనా కొనక తప్పదు గదా ఇప్పుడే కొనుక్కుంటే బాగుంటుంది. రమణకు మొన్న కుట్టించిన కొత్తబట్టలు ఉన్నాయి. కాని సూర్యావతి కో మంచిగౌనూ, బాబు కో చొక్కా కుట్టించాలండీ" అంది. అంతటితో ఊరుకోలేదు. భర్తనికూడా ఒకమంచి ఖండువా కొనుక్కోమని సలహా యిచ్చింది. "మీరుకూడా రేపో మాపో కాబోయే పెళ్లికొడుకు అన్నగారు. కాస్త ఠీవిగా ఉండొద్దూ" అంది. శ్రీహరి ఒక నిట్టూర్పు విడిచి "సరే తప్పుతుందేమిటి? అయిన అప్పు అవనే అయింది. ఇప్పుడు వెనక్కి-దీయడం ఎందుకు?" అన్నాడు. అంతలో వాళ్ళ కింకో ఖర్చు చాలా ముఖ్యమైనది జ్ఞాపకం వచ్చింది. పెళ్ళికి వెళుతూ ఉత్తచేతులతో వెళ్తే బాగుండదు. ఏదైనా బహుమతి పట్టుకువెళ్లాలి. ఏది పట్టుకువెళ్తే బాగుంటుంది? చివరికి ఇరవై రూపాయల వెండిపళ్లెం పట్టుకువెళ్దా మను కున్నారు. వరలక్ష్మి చీరకు ముప్ఫైరూపాయిలూ, బాబుకూ సూర్యానికీ బట్టలకు ఎనిమిది రూపాయలూ, శ్రీహరి ఖండు వాకి ఐదు రూపాయిలూ, వెండి పళ్లేనికి ఇరవై రూపా యిలూ, పెళ్ళికి రానూపోనూ ఖర్చులకి పాతిక రూపాయిలూ సుమారు తొంభై రూపాయిలు ఖర్చు కనిపించింది.

శ్రీహరి నిర్ణయానికి వచ్చేశాడు. బ్యాంకులో రాధకు పరీక్షఫీజు కట్టడానికిమాత్రం డబ్బుంచి మిగిలినది తెచ్చేశాడు.

ఆఖరి 'టరము' జీతం కట్టడానికి ఇంకా పైముంది. అప్పు డేదో ఉపాయ మాలోచించవచ్చు ననుకున్నాడు. తెచ్చిన దానితో వెంటనే రామకృష్ణమూర్తి దగ్గరా ఆచార్లుగారి దగ్గరా చేసిన బదుళ్ళు తీర్చేశాడు. కొట్లమీద అరువు ఇంకా అట్లాగే ఉంది. జీతం రాగానే అవీ తీర్చేయవచ్చు అనుకొని కొంత తేలికపడిన గుండెతో పెళ్ళి ప్రయాణానికి కావలసిన ఖర్చు లన్నీ చేశాడు.

నారాయణగారి కూతురి పెళ్ళికి భారీ ఎత్తునే ఏర్పాట్లు జరిగాయి. పెద్ద పందిళ్ళూ, స్తంభాలను అరటిచెట్లూ, తోరణాలూ, కాగితపు బుట్టలూ, అలంకారాలూ, అందమైన మండపమూ తయారయ్యాయి. ఊరేగింపు కోసం ఓపెన్‌టాప్ కారూ, రెండు బస్సులూ, బాండూ, సన్నాయి మేళమూ, రామడోలు మేళమూ కూడా ఉన్నాయి. మగ పెళ్ళివారి విడిదికి గాను రెండు మేడలు ఏర్పాటు చేశారు. నారాయణగారి తరఫున వచ్చిన చుట్టాలు కూడా చాలా ఎక్కువగా ఉన్నందువల్ల వాళ్ళకీ తమ ఇల్లుగాక మరో రెండు ఇళ్ళు ఏర్పాటు చేశారు నారాయణగారు.

శ్రీహరీ వాళ్ళూ బండి కట్టించుకొని పెళ్ళివారిల్లు చేరుకున్నారు. అక్కడ చాలా హడావిడిగా ఉంది. కొందరు అటూ ఇటూ పరుగెత్తు తున్నారు. ఏమేమో మాట్లాడు కుంటున్నారు. గొడవలో ఒకళ్ళ మాట ఒకరికి వినిపించక

గట్టిగా అరుస్తున్నారు. శ్రీహరీ వాళ్ళూ బండి దిగే సరికి నారాయణగారు పందిట్లో ఎవరితోనో ఏదో మాట్లాడు తున్నారు. శ్రీహరి దగ్గరకు వెళ్ళగా "ఆఁ వచ్చావా శ్రీహరీ" అని ఇంతలో ఎవరో వచ్చి చెవిలో ఏదో చెప్పగా మగ పెళ్ళివారింటికి కంగారుగా పరుగెత్తారు. శ్రీహరీ, రాధా, వరలక్ష్మి, సూరమ్మగారూ పిల్లలూ పందిట్లోనే నిలబడిపో యారు. సూరమ్మగారు "లోపలికి పోదాం రావే" అంది కోడలివైపుకి తిరిగి. కాని వరలక్ష్మి కదలలేదు. మరి కొంత సేపటికి నారాయణగారి భార్య వాళ్ళనీ వీళ్ళనీ కేకేస్తూ అటు వచ్చి, "వచ్చారా! ఎంత సేపైంది" అని మళ్ళీ వాళ్ళకీ వీళ్ళకీ ఏవో పనులు పురమాయిస్తూ పరుగెత్తుకు పోయింది. పెళ్ళికూతురు మేడమీద నుంచి ఇవతలకు ఒకసారి తొంగి చూసి లోపలికి వెళ్ళి పోయింది.

కొద్దిసేపటికి నారాయణగారితో కూడావచ్చిన మధ్య వర్తి అటువచ్చి వాళ్ళనుచూసి "ఓహో ఎప్పు డొచ్చారూ? రండి, మీ కింకోచోట ఏర్పాటు చేస్తాను" అన్నాడు. "కాస్త ఈ పెట్టె ఎవరినైనా తీసుకు రమ్మనండి" అన్నాడు శ్రీహరి.

"అలాగే, ఒరే సుబ్బన్నా ఈ పెట్టె అటు పట్టుకు రారా" అని పందిట్లో పనిచేస్తున్న మనిషి నొకడిని కేకేసి శ్రీహరీ వాళ్ళనూ తీసుకొని అక్కడికి ఏభై గజాల దూరంలో ఉన్న ఇంటికి నడిచాడు ఆయన. అది మండువా ఇల్లు. గదు లన్నీ అంతకు ముందే వచ్చిన చుట్టాలు ఆక్రమించేశారు.

మందువాలో కూడా చాలామందే ఉన్నారు. ఆ మధ్యవర్తి ఒక మూల చాప పరచి "మీరు ఇక్కడ స్థలం ఏర్పాటు చేసికోండి" అని చెప్పాడు.

"ఆ పెట్టె తెప్పిస్తారు కాదూ" అని మళ్ళీ అడిగాడు. శ్రీహరి. అట్లాగే అని వెళ్ళిపోయాడు ఆయన. వచ్చిన చుట్టాలలో చాలా మంది సూరమ్మగారినీ శ్రీహరినీ వరలక్ష్మినీ ఎరుగున్నవాళ్లు కాబట్టి ఒకరి కొకరు ఆప్యాయంగా పలకరించు కున్నారు. చాలా కాలం తరువాత కలిసికోవడం వల్ల చుట్టాలతో కబుర్లలో పడిపోయారు శ్రీహరీ వాళ్ళూ. రాధకి మాత్రం ఏమీ తోచలేదు. కొంతసేపుండి వరలక్ష్మికి జ్ఞాపకంవచ్చి "ఇంతకీ మనపెట్టె ఏదీ" అని అడిగింది. పెట్టె రాలేదు. "ఆ పందిట్లోనే ఉంటే ఎవరైనా ఎత్తుకుపోయి ఉండరు కదా కొంపతీసి. ఇట్లాంటి అవకాశం కోసం కాచి పెట్టుకు కూర్చునేవారు చాలామంది ఉంటారు" అంది వరలక్ష్మి ఆదుర్దాతో. నేను చూసివస్తా నుం డని రాధ వెళ్ళాడు. పెట్టె ఎక్కడి దక్కడే ఉంది. తనే ఎత్తుకు చక్కా వచ్చేశాడు రాధ. "ఇదేమిటి నువ్వే పట్టుకు వస్తున్నావు? ఆయన కేకేసిన మనిషే మయ్యాడు"అని అడిగింది. వరలక్ష్మి "వాళ్లెక్కడ వినిపించుకుంటారు? పనుల తొందరలో పడి ఉన్నారు" అన్నాడు రాధ. "మీ మరి దేమి టమ్మా? పెళ్ళికి ఉన్నాడన్నమాట. సంబంధా లేమైనా వస్తున్నాయా? మీ రెంత ఎత్తులో ఉన్నా రేమిటి?" అంటూ చుట్టాలు

వరలక్ష్మి నడుగుతూ రాధకేసి ఎదిగిన కోడెదూడకేసి చూస్తున్నట్టు చూస్తున్నారు. వాళ్ళచూపుల బారినుంచి తప్పించుకుందుకు రాధ ఊళ్ళోకి షికారుకు పోయాడు.

రాత్రి భోజనాల వేళకు నారాయణగారు వచ్చి అందరినీ భోజనాలకు లెమ్మని చెప్పారు. అందరితో బాటుగానే శ్రీహరిని కూడా "మీరుకూడా లేవండోయి" అని మాత్రం చెప్పి వెళ్ళి పోయారు.

మర్నాడు మధ్యాహ్నం పెళ్ళి. ప్రొద్దున్న కాఫీ ఉప్మాల తంతు. చిన్నపిల్లలకు చద్దన్నా లున్నాయి. నారాయణగారి తరఫున ఎవరోవచ్చి అందరినీ పెళ్ళివా రింటికి రమ్మన్నాడు. చుట్టా లందరూ నారాయణగారి ఇంటికి నడిచారు. శ్రీహరీ వాళ్ళూ కూడా వెళ్ళారు. నారాయణగా రింటిదగ్గర ఇద్దరు వంటబ్రాహ్మలు వచ్చిన వారందరికీ ఉప్మా అరటి ఆకుల్లో పెట్టి ఇస్తున్నారు. చుట్టాలు వాళ్ళ చుట్టూ మూగి ఉప్మా లందుకోవడానికి కంగారు పడుతున్నారు. ఆ ఎగబడడం చూసి అసహ్యంవేసి శ్రీహరీ వాళ్ళూ దూరంగా ఉండి పోయారు. వాళ్ళను ప్రత్యేకంగా ఆహ్వానించి పెట్టేవా ళ్ళెవరు? మగపెళ్ళివారి విడిదినుంచి వాళ్ళకు ఉప్మా చాలలేదనీ, కాఫీలో పంచదార తక్కువైందనీ వాళ్ళకు కోపాలు వచ్చాయనీ కబురు వచ్చింది. నారాయణగారూ భార్యా వంట బ్రాహ్మలను కేకేసి ఉప్మాబుట్టా, కాఫీగిన్నె, పంచదార పొట్లం పట్టించుకొని, మగపెళ్ళివారి విడిదికి పరుగెత్తారు.

పిల్లలు చద్దన్నాలు తినేవాళ్ళు తింటున్నారు. చద్దన్నాలు తిని ఉప్మా కాఫీల కెగబడేవారు ఎగబడు తున్నారు. నానా గొడవగా ఉంది. అత్తగారు "పోనీ పిల్లలకు చద్దన్నాలైనా పెట్టించవే" అని చెపుతున్నా వరలక్ష్మి కదలలేదు. అవతల మగపెళ్ళివారు శాంతించిన ట్లున్నారు. స్నాతకం ప్రారంభం కాబోతోంది. శ్రీహరి వాళ్ళకు కడుపులో మండుతోంది. కాని ఏం చేయగలరు?

రాధ పని మాత్రం చాలా బాగుంది. అతను అటూ ఇటూ తిరుగుతూంటే అతని దృష్టి పెళ్లివారింట్లో తిరుగుతున్న ఒక చక్కని చుక్కమీద పడింది. చక్కనిచుక్క కళ్ళు అతనిమీద పడ్డాయి. ఇద్దరి కళ్ళూ కలిశాయి. సిగ్గుతో తల వంచుకుంది. ఆ వన్నెల చిలక మళ్లీ తలెత్తే సరికి అతనే, తనకేసే చూస్తున్నాడు, ఈ అందమైన పడుచువాడు. ఆమె గుండెలో గిలిగింతలు పెట్టిన ట్లయింది. రాధ దృష్టి ఆమె చేతిలోఉన్న ఉప్మాబుట్ట మీద పడింది. ఆమె తనవాళ్ళ కెవళ్ళకో పట్టుకు వెళ్తున్నట్లుంది. రాధ చూపులు ఉప్మాబుట్ట మీదికి పోవడంచూసి ఆమె సిగ్గుతో నవ్వుతూ అరటి ఆకులో కొంత ఉప్మా అతనికోసం పెట్టి వెనక్కి పరుగెత్తింది. రాధ అది హాయిగా ఆరగించి అక్కడే నిలబడి ఉన్నాడు. ఆమె తలుపు చాటునుంచి ఓరగా చూస్తోంది. లోపలికి వెళ్ళిపోయి మళ్ళీ కొంతసేపటికి ఇవతలకు వచ్చింది. మళ్ళీ దృష్టి కలసింది. సిగ్గుతో మొగం చేతులతో కప్పుకొని ప్రక్కకి పరుగెత్తుకు

పోయింది. రాధ మంచి హుషారులో ఉన్నాడు. వచ్చినందుకు ఫలితం బాగానే ఉం దనుకున్నాడు. ఆ సమయంలో అతనికి వాసంతి జ్ఞాపకం రాలేదు. ప్రత్యక్ష సౌందర్యం పరవశం చేసిం దతనిని. మరో పది నిమిషాలు ఆ చక్కని చుక్క దర్శన మిస్తుం దేమోనని ఎదురు చూశాడు. కాని ఆమె మళ్ళీ రాకపోయే సరికి వెనక్కి వచ్చాడు. శ్రీహరీ వరలక్ష్మి పిల్లలూ ఒక మూల కూర్చొని ఉన్నారు. రాధను చూసి "ఒరే రాధా, దగ్గర్లో ఎక్కడేనా హోటలుం దేమో చూడరా? ఉంటే అక్కడ నాలుగు ఇడ్లీలు పొట్లం కట్టించుకు రా" అన్నాడు శ్రీహరి.

"ఏం? మీరు ఉప్మా తీసుకోలేదూ?" అని అడిగాడు రాధ.

శ్రీహరి జవా బీయలేదు. రాధ "ఉండండి, ఇప్పుడే వస్తాను" అని ఇందాకటి చోటికి పరుగెత్తాడు. 'ఆమె' కని పించింది. ధైర్యంగా ఆమె కళ్ళలోకి చూస్తూ "ఏమండీ, మరికాస్త ఉప్మా కావాలి. మా అన్నయ్యా పిల్లలూ తీసుకో లేదు" అనేశాడు రాధ. ఆమె ఏమనుకుందో లోపలికి వెళ్ళి ఒకబుట్ట పట్టుకువచ్చి అతని ముందుపెట్టి వెనక్కి తప్పుకుంది. రాధ "థాంక్స్" అని బుట్ట తీసుకున్నాడు. ఆమె నవ్వుతూ పారిపోయింది. రాధ ఉప్మాబుట్ట పట్టుకువచ్చి వదినగారి దగ్గర పెట్టి, "ఉండండి కాఫీ కూడా తెస్తాను"అని మళ్ళీ వెనక్కి పరుగెత్తాడు. ఆ 'దేవత' తిరిగి ప్రత్యక్ష మయింది. కథలో

చెప్పినట్లే భక్తు డేది కోరితే అది ఇచ్చేస్తోంది. కాఫీ కూడా గిన్నెతో పట్టుకువచ్చి ఇచ్చింది. రెండు గ్లాసులు కూడా తెచ్చి ఇచ్చింది. రాధ వదినగారి దగ్గర హాజ రయ్యాడు. కాఫీ నలుగురిలో పంచుతూ "ఏమిటి రాధా ఎక్కడ నుంచి తెస్తున్నావు ఇవన్నీ ? వంట బ్రాహ్మడి కేమైనా లంచ మియ్యలేదు కదా ! లేకపోతే దొంగతనం చేశావా" అని నవ్వుతూ అడిగింది వరలక్ష్మి. రాధ "కాదులే వదినా, నారాయణగారింట్లో చుట్టాలలో ఒకతను నాకు స్నేహితు డయ్యాడు. అతను ఇస్తున్నాడు" అని చెప్పి కాఫీ త్రాగడం అయిన తరువాత గిన్నె గ్లాసులూ పట్టుకువెళ్లి 'ఆమె' కందిచ్చాడు. ఆమెను కబుర్లోకి లాగడానికి గాను మెల్లగా తెగించి అడిగాడు : "మీ పేరేమిటండీ ?" "రాధ"అని ఆమె గిన్నె గ్లాసులూ తీసుకొని లోపలకు పరుగెత్తింది. రాధ అక్కడే తారట్లాడుతూ ఆమె పునర్దర్శనం కోసం వేచి ఉన్నాడు. తిరిగివస్తూ ఆమె తలుపుచాటుకు తప్పుకొని "మరి మీ పేరు ?" అని అడిగింది సన్నగా. "రాధాకృష్ణ". ఆ పిల్ల అతని కేసి చుర చుర చూసి, జడ ఒక్క విసురు విసిరి వెళ్ళి పోయింది. 'అరే ఇంతలోనే కోపగించేసిందే ! కోపం పోగొట్టడం ఎట్లా ? నిజంగా కోపంలో కూడా ఎంత అందంగా ఉంది పంచెవన్నెల చిలుకలా' అనుకున్నాడు. ఏమైనా అక్కడనుంచి కదలలేకపోతున్నాడు గులాబీని చూసిన తుమ్మెదలా. అతని నిరీక్షణ—'తపస్సు !'—ఫలించింది. ఆమె మళ్ళీ వచ్చింది. కాని అతని కేసి

చూడకుండా మూతి ముడుచుకొని వెళ్ళిపోతోంది. రాధ ఆ 'రాధ' దగ్గరకు పరుగెత్తివెళ్ళి "నా పేరు నిజంగానే రాధా కృష్ణండీ. మా వదిన నడగండి కావలిస్తే. నన్ను 'రాధ' అనే పిలుస్తారు మా వాళ్ళు," అన్నాడు. ఆమె ఆగి, అతని కేసి చూసింది అవునా అన్నట్లు. రాధ తల వూపాడు. అతని కళ్ళలో కపటం కనిపించలేదు. చందమామను కమ్మిన మబ్బులు తొలగిపోయాయి. చిరునవ్వుల వెన్నెలలు తిరిగి విరిశాయి. ఏదో మాట్లాడమని ఆమె దొండపండువంటి పెద వులు విప్పబోతూండగా "రాధా ఎక్కడి కెళ్ళావే" అని కేకేస్తూ ఎవరో దగ్గరకు వచ్చారు. ఇంకా చాలామంది చుట్టాలు వచ్చేశారు. గువ్వలు రెండూ వేరై పోక తప్పలేదు. దూరంగా ఉండి చూపులుతోనే కబుర్లు చెప్పుకో వలసి వచ్చింది. ఎన్నిపనులు చేస్తున్నా, అక్కడ పెళ్ళి ఏర్పాట్లు జరుగుతున్నా, చుట్టాలూ జనమూ అటూ ఇటూ అడ్డువస్తూ తిరుగుతున్నా, బాజాలు భజంత్రీలూ మ్రోగుతున్నా రాధ కంటికి ఆమె, ఆమెకంటికి రాధే కనిపిస్తున్నారు.

ఇక్కడ శ్రీహరీ వరలక్ష్మీ పిల్లలతో తమ విడిదికి తిరిగి వచ్చారు. సూరమ్మగారు చుట్టాలలోని ముసలమ్మలతో చేరి నారాయణగా రింట్లోనే ఉండిపోయింది. శ్రీహరికీ వరలక్ష్మికీ ఉత్సాహం ఎప్పుడో అడుగంటి పోయింది. తమను నెత్తిమీద పెట్టుకుంటారనీ, చుట్టా లందరిలో ఆకాశానికి పొగడేస్తారనీ ఆశపడివస్తే ఇట్లా అయినందుకు వారికి ఏడుపు వచ్చిన

ట్లయింది. "వెనక్కి వెళ్ళిపోదామా చడీచప్పుడూకాకుండా?" అన్నాడు శ్రీహరి. "నాకూ అట్లాగే అనిపిస్తోంది కాని తీరా వచ్చి ఇట్లా వెళ్ళిపోతే బాగుండదు. ఈ గొప్పవాళ్ళు ఇంతే నండి. వాళ్ళకళ్లు అసలు నేలమీద ఉండవు. మనింటికి వచ్చా రంటే మనమీద ప్రేమ పొంగిపోయి కాదు. అవసరంకొద్దీ వచ్చారు. అది తీరిపోయింది. కాబట్టి ఇక మనం వాళ్ళకి కనిపిస్తామా?" అంది వరల

మగ పెళ్లివారు ఊరేగింపుగా వస్తున్నారు. పెళ్లిపందిరి దగ్గరికి. ఎదురు సన్నాహం జరుగుతోంది. చుట్టాలందరూ పందిట్లోకి పరుగెత్తారు. శ్రీహరీ వరలక్ష్మి మాత్రం కదలక పెళ్లి ప్రారంభ మయిన తరువాత లేచి వెళ్ళారు. బ్రాహ్మ ణుల వేదఘోషతో, బాండుమేళం మోతతో పెళ్ళి బాగానే జరిగింది. బహుమతుల వంతు వచ్చింది. నారాయణగారి స్నేహితులూ చుట్టాలూ, మగ పెళ్ళివారిలో కొందరూ బహుమతులు చదివిస్తున్నారు. శ్రీహరికి తను తెచ్చిన వెండి పళ్ళెం జ్ఞాపకం వచ్చింది. భార్యను ప్రక్కకు రమ్మని సైగ చేసి, ఆమె వచ్చిన తరువాత "వెండి పళ్లెం మాట ఏమం టావు?" అని అడిగాడు. "ఇవ్వక పోతేనేం? వీళ్ళు ఏమను కుంటే మనకేం పోయింది?— అయినా తెచ్చాంకా. వెనక్కి తీసుకెళ్ళడం ఏం బాగుంటుంది? తీసుకెళ్లి ఇచ్చెయ్యండి. వాళ్లకే సిగ్గువస్తుంది. ఎవళ్లది గొప్పో తెలుస్తుంది" అంది

వరలక్ష్మి. "అయితే తాళంచెవి ఇయ్యి" అని శ్రీహరి తాళం చెవి తీసుకొని వెళ్లి వెండిపళ్లెం తెచ్చి పురోహితుడికిచ్చి చదివించాడు.

పెళ్లి అయిపోయింది. జనం లేచారు. నారాయణ గారు శ్రీహరిని చూసి "ఏమిటోయి, నువ్వు కూడా చదివిం చాలా?" అని ఒక నిట్టూర్పు విడిచి "ఏదో పెద్ద భారం తొలగి పోయిందోయి. ఆడపిల్ల పెళ్ళి అంటే సామాన్యమా? అందుకే ఆడపిల్ల పెళ్ళిచేసి చూడు ఇల్లుకట్టి చూడు అన్నారు.— అన్నట్లు మీకేం లోటు జరగలేదు గదా. బాగా జరుగుతోందా?" అన్నారు.

"ఆ ఏమీ లోటు లేదండీ. కాని భోజనాలవగానే మేము వెళ్ళిపోవాలి. సెలవు ఇప్పించండి" అన్నాడు శ్రీహరి.

నారాయణగారు ఆశ్చర్య పోతున్నట్లు చూస్తూ అన్నారు! "అదేమిటోయి, ఇంత అర్జం టేమి వచ్చింది? పెళ్ళి మూడు రోజులూ ఉండి వెళ్ళండి. రాత్రి ఊరేగింపు. రేపు పాటకచేరీ కూడా ఉంది."

"ఉండడానికేం ఉండచ్చు కాని నాకు సెలవు దొరక దండీ" అన్నాడు శ్రీహరి.

"సరే నీ యిష్టం. అంతగా కాదూ కూడదూ అంటే ఏం చెప్పగలను?" అని లోపలికి వెళ్ళి భార్యతో చెప్పారు. ఆవిడ వరలక్ష్మి దగ్గరికి వచ్చి, "అదేమిటే, అప్పుడే వెళ్ళిపోవడ మేమిటి? మూడు రోజులూ ముచ్చటలు చూడరూ" అంది.

"కాదండీ వదినగారూ వారికి సెలవు లేదట. అందు వల్ల వెళ్ళవలసి వస్తోంది" అంది వరలక్ష్మి.

"అలా అంటే ఏం చెప్పగలం? మీ యిష్టం మరి" అని ఇంతలో ఎవరో కేకేస్తే వెళ్ళిపోయింది నారాయణగారి భార్య.

రెండు గంటలకు భోజనా లయిన తరువాత శ్రీహరి తల్లినీ భార్యనీ ప్రయాణానికి సిద్ధం కమ్మన్నాడు. రాధను కూడా పిలుచుకు వచ్చాడు. రాధ గుండె గొల్లున పడ్చింది. 'ఆమె'తో ఇంకా పూర్తిగా పరిచయమైనా కాలేదే! ఆమె ఎవరో, ఎవరి అమ్మాయో, ఏ ఊరో, ఏం చదువుతోందో ఏమీ తెలియదే! ఎప్పుడో మంచి అవకాశం చూసుకొని. ఒంటరిగా ఆమెతో ఎన్నో మాట్లాడాలని మనస్సునిండా కబుర్లు నింపుకొనిఉన్నాడు. కాని అంతా తలక్రిందులై పోయింది. ఆమె మళ్ళీ కనిపిస్తుందో లేదో, అన్నగారితో కాని వదినగారితో కాని తన అవస్థ ఏమని చెప్పుకో గలడు? ఆఖరి సారిగా ఆమెను చూసి వద్దా మనుకుంటే శ్రీహరి అతనిని బండి కుదర్చమని పంపించాడు.

బండి వచ్చింది. సూరమ్మగారూ. శ్రీహరీ, వరలక్ష్మి చుట్టాలకు వస్తామని చెప్పి నారాయణగారి భార్య దగ్గరికి వెళ్ళి సెలవు తీసుకుంటా మని చెప్పారు. నారాయణగారూ భార్యా పనుల తొందరలో ఉండి వాళ్ళకు వెంటనే సెలవు ఇచ్చేశారు. పెళ్ళి కూతురుతో "వెళ్ళివస్తా మమ్మా. జ్ఞాపకం

ఉంచుకో. మా ఊరు వస్తావు కాదూ, వచ్చినప్పుడు మా యింటికి రా" అంది వరలక్ష్మి. పెళ్ళికూతురు ఒక నవ్వు నవ్వి తనకు వచ్చిన నగలూ, బహుమతులూ చీరలూ చుట్టాలకూ స్నేహితులకూ చూపించడంలో మునిగిపోయింది. రాధ బండి వెనక కూర్చొని పెళ్ళివా రింటికేసి చూశాడు. మేడమీదకు వచ్చింది 'ఆమె'. రాధను బండిలో చూసి ఉలిక్కిపడి నట్లుంది. అట్లాగే నిలబడి పోయింది. రాధ కంటి కానే వరకూ ఆమె కేసే చూస్తూ ఉండిపోయాడు.



ఇంటికి వచ్చిన తరువాత ఎంతో అను కున్నారు శ్రీహరీ వరలక్ష్మి; "బహుమతి చూసి వాళ్ళ మొగాలు విప్పా రాయి. ఇదేనా వాళ్ళ గొప్పతనం? ఇక్కడ ఉన్నన్నాళ్ళూ మనకీ మనకీ భేదా లేమిటి అంటూ ఎంత ఆత్మీయత వెలి బుచ్చారు! అవసరం తీరిపోగానే వాళ్ళ కళ్ళు మళ్ళా నెత్తి మీదికి వెళ్ళిపోయాయి."

రాధ అన్నగారిని గట్టిగానే అడిగాడు; "అదేమి టన్నయ్యా. ఆ వెండి పళ్లెం ఎవ రిమ్మన్నారు." నాకు తెలి యదు లేకపోతే ఇవ్వ నిద్దునా? లేనిపోని గొప్పకు పోతే మన కేం ఒరిగింది?"

"పోనీ లెద్దూ. అయిపోయిన దానికి ఇక విచారించి లాభంలేదు. వెండి పళ్లెంవల్ల నష్టం ఉండదులే. రేపు నీ పెళ్ళికి వాళ్ళ కెట్లాగైనా శుభలేఖ పంపుతాము. అప్పుడు వాళ్ళు వచ్చినట్లు మంచి జహుమతి ఇవ్వవలసిందే కదా. కనీసం మన వెండిపళ్లెం ఖర్చైనా తిరిగి వస్తుందిలే" అని వరలక్ష్మి కబ తెంపు చేసుకొని ఇంటి పనులలో పడిపోయింది.

కాని శ్రీహరి మాత్రం క్రుంగి పోయాడు. తమ్ముడి పరీక్ష ఫీజు కట్టేరోజు వచ్చింది. బ్యాంకులో అకౌంటు తీసేసి డబ్బు తీసుకు వచ్చేశాడు. పరీక్షఫీజు కట్టడం అయిపోయింది. తను పరీక్షకు ఏనాడో నీళ్ళు వదిలేసు కున్నాడు. తన కీ జన్మలో బి. ఏ అనిపించు కోవడం అసంభవమే అనిపిస్తోంది. తమ్ముడి చదువైనా కొనసాగితే అదే పదివేలు. కాని క్రిస్ట్ మస్ సెలవుల తరువాత కాలేజీ తెరవగానే ఆఖరి టరమ్ ఫీజు కట్టాలి. ఎక్కడనుంచి వస్తుంది. ఈ సమస్య అతని గుండెల మీద కుంపటిలా కూర్చుంది.

సమస్య నుంచి ఉపాయం కనిపించక బళ్లో ఒక రోజున నరసింహారావును మెల్లగా సలహా అడిగాడు. ప్రక్కనే ఉన్న అప్పలరావు సుబ్బారావు ఎట్లా పసిగట్టాడో అన్నాడు. "నన్నడగవోయి, శ్రీహరీ, అప్పులు చెయ్యడం విద్య నాకు తెలిసినంతగా ఇంకెవళ్ళకీ తెలియదు. నువ్వు ఈ వ్యవహారం లోకి దిగేటప్పుడు, కంగారు పడకూడదు. ఈ విషయంలో నిదానం, నిశ్చింత అవసరం. కంగారు పడితే మరింత

ప్రమాదంలో చిక్కుపడతావు. అప్పులు తీర్చలేక పోతావు. అప్పులవాళ్ళ కబంధ హస్తాలలో పడిపోతావు. చేసేటప్పుడు నిశ్చింతగా అప్పులు చెయ్యాలి. అప్పు ఎట్లా తీరుతుందా అని ఎప్పుడూ బెంగ పెట్టుకో కూడదు. ఎవ రేమన్నా చలించక పోవడం కూడా నువ్వు నేర్చుకోవాలి. అప్పులలో రకాలున్నాయి. నూటికి నెలకు అర్ధరూపాయి నాలుగు పైసలు మొదలుకొని నూటికి నెలకు రూపాయి పద్నాలు గణాలు, రూపాయికి నెల కణా, రూపాయికి రోజుకు కానీ ఈ విధంగా స్టేజీ లున్నాయి. అవి తీవ్రదశ లనుకో. ఇంకా నీవు ప్రారంభ దశలోనే ఉన్నావు కాబట్టి నీకు సులభంగా అప్పు దొరుకుతుంది. చవుకగా దొరుకుతుంది. నువ్వు ముందు చూడవలసింది ప్రావిడెంట్ ఫండు లోను. నీ డబ్బే నువ్వు తీసుకుంటావు. తేలిక వాయిదాలో తిరిగి చెల్లించేస్తా వన్నమాట."

శ్రీహరి గుండెలపై నుంచి పెద్ద భారం తీరిపోయినట్లైంది. ప్రావిడెంట్ ఫండులో రెండు వందలు అప్పు చేయవచ్చు. తమ్ముడి కాలేజీ జీతంకట్టగా మిగిలినది పెట్టి కొట్లమీద అరువు లేకుండా చేసుకోవచ్చు. "అయితే ఇప్పుడే చెప్పు లోన్‌కి అప్లికేషన్ ఎట్లా రాయాలో, డబ్బు వచ్చే టప్పటికి కొంత కాలం పడుతుంది కదా" అన్నా డతను. సుబ్బారావు చెప్పాడు. శ్రీహరి ఆ విధంగా దరఖాస్తురాసి హెడ్ మాష్టారికిచ్చి వచ్చాడు చిరునవ్వుతో.

సుబ్బారావు చూసి "అదీ అట్లా చిరునవ్వుతో ఉండాలి శ్రీహరీ అప్పుచేసే టప్పుడు" అన్నాడు.

"ఎందుకు చిసునవ్వు" అన్నాడు నరసింహారావు. "ప్రావిడెంట్ ఫండు అప్పేకదా తేలిక వాయిదాలలో కట్టె య్యొచ్చు గదా అనుకుంటున్నావు గాదూ, కాని బొటా బొటిగా ఉండే ఆదాయంలో నుంచి ఈ తేలిక వాయిదాల రూపంలోనైనా పది రూపాయిలు తరుగు ఏర్పడు తుందా, ఆ లోటు ఎట్లా పూడ్చుకో గలుగుతావు? పొదుపు చేద్దా మనుకుంటే నువ్వు పెద్ద అనవసరపు ఖర్చు లేమి చేస్తున్నావు తగ్గించు కోవడానికి. అందుకే కొట్లమీద అరువులూ చే బదుళ్ళూ పెరుగుతూ ఉంటాయి. ఒకసారి అప్పుల దారిన పడ్డవాడు వెనక్కు మళ్ళడం కష్టం. అంత కంతకు అప్పుల ఊబిలోకి దిగబడి పోతాడు. నాకూ అప్పు పెరిగి పోయింది. అది తీర్చడానికి ఎంత తపస్సు చేసినా ఫలితం లేకపోతోంది. ఒకటే మార్గం కనిపిస్తోంది అదే ఈ లాటరీలు. నెలకో రూపాయో రెండో పెద్ద ఖర్చుకాదు గదా. తగిలిందా అంటే మన బాధలన్నీ తీరిపోతాయి."

"నీ లాటరీ ప్రాపగండా బాగానే ఉంది కాని నీ లాటరీ దారి అక్కర్లేకుండానే ఒకొ్కక్కప్పుడు అప్పుచేసిన వాడు ఏదో అదృష్టం తన్ని ఒకసారి పైకివెళ్ళిపోకూడదూ. ఇప్పుడు శ్రీహరే ఉన్నాడనుకో. కొంత అప్పుచేసి బి. ఏ., ఎం. ఏ. పరీక్షలకు కట్టి పాసవుతాడనుకో అప్పుడు పెద్ద ఉద్యోగంలో ప్రవేశించి ఈ అప్పులు తీర్చేసి సుఖంగా ఉండవచ్చు. అసలు వ్యాపారం, పెట్టుబడిదారీ పద్ధతీ ఇవన్నీ ఎట్లా

నడుస్తాయి ? ఇతరులడబ్బు తీసుకొని దానిమీద వ్యాపారం చేయడమేకాదూ. అంటే అప్పుచేయడమే కాదూ ? ఎంత బాగా అప్పుచేస్తే అంత గొప్ప పెట్టుబడిదారు అయిపోతాడు" అన్నాడు గోపాలరావు.

"ఈ వ్యాపారం కూడా ఒక లాటరీయే గదా. అందరూ లాభాలు పొందేస్తున్నారా, దివాలాతీసేవాళ్ళు లేరూ ? దేనికైనా అదృష్టం ఉండాలయ్యా" అన్నాడు నరసింహారావు.

"ఆమాటకువస్తే గవర్నమెంటు కూడా అప్పులమీదే నడుస్తుంది. కాని చిత్రమేమంటే మనదగ్గరే అప్పుచేసి మనచేతే చెల్లింపజేస్తుంది ప్రభుత్వం" అన్నాడు సోషల్ స్టడీస్ బి. ఇడి.

"ఈ ప్రభుత్వంమాట ఎత్తకు నాదగ్గర" అన్నాడు సుబ్బారావు తీవ్రంగా. "అది అప్పులుచేసి ఎవరి నుద్ధరిస్తోంది? మనని కాదుగదా. మనకు జీతాలు పెంచమంటే కొసరి కొసరి పెంచుతుంది ? అవతల లక్షాధికారులు కోటీశ్వరులవుతున్నారు. కిరణాకొట్టువాడు టోకువర్తకు డవుతున్నాడు. చిన్నవ్యాపారస్థుడు పెట్టుబడిదారు అవుతున్నాడు. ఒక కంపెనీ డైరెక్టరు పదికంపెనీల డైరెక్ట రవుతున్నాడు. లైసెన్సులూ, పర్మిట్లూ, కోటాలూ, కాంట్రాక్టులూ వీటి మూలాన ఐశ్వర్యవంతు లయ్యేవాళ్ళు అవుతున్నారు. కాని బడిపంతులు మేడకట్టడం ఎక్కడేనా చూశావా స్వతహాగా ఆ స్టైపరు డైతే తప్ప.

"మాటికీ ప్రభుత్వం మీదా పెట్టుబడిదారీ విధానం మీదా విరుచుకు పడతావు కాని మనం బ్రతకడం లేదంటావా? బడిపంతుళ్ళందరూ అప్పుల్లో మునిగిపోయి చచ్చిపోతున్నా రంటావా?" అని అడిగాడు గోపాలరావు.

"అట్లా అని నే ననడం లేదు. బడిపంతుళ్లూ తక్కువ జీతాలవాళ్ళూ అసలు జీవితమే గడప లేకపోతే విప్లవం రాదూ? కొద్దో గొప్పో వెనకేసుకుని కొంత సుఖంగానే జీవితం గడిపేవాళ్ళూ ఉన్నారు. అప్పులపాలై సంసారాలు నాశనం చేసుకున్నవాళ్ళూ! ఉన్నారు. కాని మెజారిటీ అటు చావనూలేక ఇటు బ్రతకనూలేక త్రిశంకు స్వర్గంలో వ్రేళ్లాడుతున్నారు· మనందరం చచ్చిపోవడం లేదుకాని సంవత్సరానికి కనీసం మూడువందలు రోజులు ఏ చింతా లేక హాయిగా ఉండగలుగు తున్నామా అని? మన పిల్లలు పుట్టిన వాళ్ళందరూ బ్రతుకు తున్నారా? బ్రతికిన వాళ్లైనా పుష్టిగా బంతుల్లా ఉంటున్నారా? మనం మాత్రం సరియైన తిండి తిన గలుగు తున్నామా? దార్ఢ్యంగా ఉంటున్నామా? రోగాలూ రొచ్చులు మనల్ని విడిచిపెట్టి ఉండగల మంటున్నామా? మనం బ్రతుకుతున్నామయ్యా కాని సగం సగం మాత్రమే" అన్నాడు సుబ్బారావు కోపంగా.

ఇంతలో సుందర్రావు వచ్చి పట్టణంలో ఒక ఉద్యోగస్థుడి కూతుళ్ళను గురించిన పుకారు ఒకటి అందరి మధ్యా

వేశాడు. దానితో అందరూ ఆవిషయం తెలుసుకోవడంలో ఇతర విషయాలు మరచిపోయారు.

శ్రీహరికి మాత్రం ఉత్సాహం లేదు. 'ప్రావిడెంట్ ఫండు లోను' దరఖాస్తు పెట్టినప్పుడు మనకేమీభయం లేదనుకున్నాడు, కాని నరసింహారావు సుబ్బారావుల మాట వినే సరికి అతని గుండె దిగజారి పోయింది. తను అంతకంతకు అప్పులలో దిగబడి పోవలసిందేనా ?

ఇంటికి వస్తూంటే అతనిలో ఒకటే ఆలోచనల పరంపర. గోపాలరావు అన్నమాటలు జ్ఞాపకం వచ్చాయి. అవును! తను అప్పు అయితే అయింది బి. ఏ. కి కట్టి పరీక్షకు కూర్చుంటే తరువాత ఎం.ఏ ! కూడాకట్టి పాసయితే నిజంగా పెద్దఉద్యోగం ఏదైనా సంపాదించ వచ్చునేమో. కాని వెంటనే సందేహం. తను అప్పులు నెత్తిమీద ఉండగా నిశ్చింతగా చదవ గలడా? పైగా ఇతరమైన చింతలేమీ అడ్డురాకుండా ఉంటాయా ? తను ఎన్నాళ్ళకు ఎం.ఏ పాసుకాగలడు ? పాసైతే మాత్రం వెంటనే మంచి ఉద్యోగం దొరుకుతుందని గారంటీ ఏమిటి ? అదొక లాటరీలాగే కనిపిస్తోంది. గెలిస్తే ! ఓడిపోతే! ఇంటికి వెళ్ళిన కాసేపటికే అతనికి సమాధానం దొరికింది. తను ఆ 'లాటరీ' కట్టే అవకాశం లేదు.

అతను ఇల్లుచేరిన కొద్ది నిమిషాలకే అతని చెల్లెలు రాజ్యం పిల్లలతో బండి దిగింది. శ్రీహరినిర్ఘాంత పోయాడు.

మూర్తీభవించిన దైన్యంలాఉన్న చెల్లెలినిచూసి అతని గుండె నీరయిపోయింది. సూరమ్మగారు వచ్చి కూతురును కౌగలించుకుంది. రాజ్యం తల్లి రొమ్ములో తలపెట్టుకొని వెక్కి వెక్కి ఏడవసాగింది. వరలక్ష్మి వచ్చి ఆడబిడ్డ దగ్గర నిలబడి కంట తడిపెడుతూ "ఊరుకో, వదినా, మీ అన్నయ్య కనుక్కుంటారులే వాళ్ళ విషయం. ఊరుకో" అంటోంది. సూరమ్మగారు కూతురితో సమానంగా ఏడుస్తోంది. ఇరుగు పొరుగులు కూడా చేరారు. రాధ వచ్చాడు. అక్కను చూసి నిలచిపోయాడు. "అక్కయ్యా" అని ఇంకేమీ మాట్లాడ లేకపోయాడు.

కొద్ది సేపటికి రాజ్యం శోకవేగం కొంచెం ఉపశమింపగా "రా వదినా కాళ్ళు కడుగుకో. లేక ఏకంగా నీళ్ళు పోసుకుంటావా? పిల్లలూ నువ్వూ ఎప్పుడు ఎంగిలి పడ్డారో, పెందరాళే భోంచేద్దురు గాని" అంది వరలక్ష్మి. రాజ్యం నీళ్లు పోసుకుంటా నంది. సూరమ్మగారు సాయపడగా పిల్లలకు నీళ్లు పోసి తనూ నీళ్ళుపోసుకుని వచ్చింది. వరలక్ష్మి త్వరగా వంట చేసి అందరికీ వడ్డించింది.

భోజనా లయిన తరువాత రాజ్యం తీరికగా తన బాధలన్నీ చెప్పుకోసాగింది ఏడుపు కంఠంతో. అవి వింటూంటే శ్రీహరిలో కోపం నిస్సహాయతా కూడా పొంగుతున్నాయి. 'ఛీ ఏమిటీ జీవితం! ఎవరికీ సుఖంలేదు. ఈ జీవితంలో ఏముందని, ఏమి శాశ్వతమని ఒక జీవి మరొక జీవిని ఇట్లా ఎందుకు

బాధపెట్టారు?' రాధ రక్తం ఉడుకుతోంది. "అక్కయ్యా, వాళ్లు మనుషులు కారు పశువులు. నువ్వు తిరగబడాలి అక్కయ్యా. మాటకు మాట జవాబివ్వవలసిందే. లొంగి ఉంటే ఇంకా మితిమీరుతారు" అన్నాడు.

"అదీ అయింది రా బాబూ. ఒకసారి కర్మకాలి మాటకు మాటన్నాను. దానితో దెబ్బలూ గుద్దులూ కూడా తినవలసి వచ్చింది. పరాయి వాళ్ళు వింటారేమో నని లోపల్లోపలే కుళ్ళికుళ్ళి చావవలసి వచ్చింది. నాలుగు రోజులు నా ఒళ్లు నా వశంలో లేదు. అయినా చాకిరీ తప్పలేదు."

వరలక్ష్మి సూరమ్మగారూ "ఎంత దారుణం! ఆడదాని మీద చెయ్యి చేసుకుంటాడా రాక్షసుడు కాకపోతే!" అంటున్నారు.

రాధ వేగంగా శ్వాస విడుస్తున్నాడు. పళ్లు బిగిస్తున్నాడు. "ఎప్పుడో కనబడక పోతాడా? అప్పుడు చూపిస్తాను ఇతరులను కొడితే ఎట్లా ఉంటుందో" అన్నాడు.

శ్రీహరికి తెలుసు అట్లా చేయడం చెల్లెలి కాపురం పూర్తిగా చెడగొట్టడమే అవుతుంది అని. కాని ఏమి భయపడ్డాడో అదే జరిగిం దనిపించింది తరువాత రాజ్యం చెప్పిన మాటలను బట్టి.

"మా అమ్మనీ అన్నయ్యనీ వాళ్ళనీ చూసి చాలా రోజులైందండీ, ఒకసారి మా యింటికి వెళ్ళి రావాల నుం

దండీ' అన్నా నమ్మ నిన్నరాత్రి. అందుకు ఈవేళ పొద్దున్నే బయటికి గెంటేశారు. పో ఇంట్లోనుంచి అని. పెట్టెకూడా ఈడ్చి బయట పడేశారు. నే నేడ్చి గోలపెడితే "పో, నువ్వు ఈ యింట్లో ఉండడానికి వీలులేదు" అని అరిచి వీళ్ళిద్దరూ ఏడుస్తూంటే వీళ్ళను మాత్రం నా దగ్గర విడిచి పెట్టేశారు. పెద్ద పిల్లవాడు అక్కడే ఉండిపోయాడు. చేసేదిలేక ఇట్లా వచ్చేశానమ్మా" అంది రాజ్యం.

"సరే ముందు ఆలోచిద్దాం. కొన్నాళ్ళపాటు విశ్రాంతి తీసుకో. ఏమీ బెంగ పెట్టుకోకు. అన్నీ అవే దారికి వస్తాయి. పెందరాళే పడుకో" అని చెప్పాడు శ్రీహరి.

అందరూ పక్కలు చేరారు. రాజ్యం ప్రయాణపు బడలిక వల్ల ఇట్టే నిద్రలో పడిపోయింది. రాధకు మాత్రం నిద్ర పట్టలేదు. అక్క పరిస్థితి తలచుకొని అతను దహించుకు పోతున్నాడు. ఒకసారి బావ కనబడితే బాగుండు ననుకుంటున్నాడు. పళ్ళు బిగించి, అనేక మార్లు బావను చితక కొట్టి, 'బాబోయి, బుద్ధివచ్చింది బాబోయి' అని ఏడుస్తూ కాళ్ళమీద పడేటట్లు చేసినట్లూ, బావ తల్లీ తండ్రీ కూడా హడలిపోయి తనని బ్రతిమాలినట్లూ ఇట్లా అనేక రకాలుగా ఊహించుకుంటున్నాడు. అయినా తృప్తి పొందలేక పోతున్నాడు. ఊహలు ఊహలే కదా. క్రియలో జరిగినప్పుడు కదా! రాత్రి ఏ రెండింటికో కాని అతనికి నిద్ర పట్టలేదు.

శ్రీహరికి నిద్ర రాలేదు. ఇప్పుడంత తొందరేమి వచ్చింది తీరికగా ఆలోచించవచ్చుకదా అనుకున్నా మనస్సు సమస్యతో నిండిపోయింది. పరిష్కారంమాత్ర మేమీ కనిపించలేదు. అగాధ సముద్రంలోకి పడిపోతున్నట్లనిపిస్తోంది అతనికి.



మర్నాడు కూడా రాజ్యానికి తన దుఃఖగాథ వినిపించడంతో సరిపోయింది. ఇరుగు పొరుగులు పలకరించడానికి వచ్చారు. అమ్మలక్క లందరూ 'అయ్యో పాపం' అని ఎంతో సానుభూతి వ్యక్తంచేసి వెళ్ళిపోయారు. రాజ్యం దుఃఖభారం తగ్గింది. జరిగిన సంఘటనలు తలచుకుంటే ముల్లు పెట్టి కెలుకుతున్నట్లవుతున్నా ఇప్పుడు మొదటి ఉద్వేగం తగ్గింది. ఆత్మీయుల మధ్య చేరడంవల్ల ఎంతో ధైర్యం చేకూరింది. రెండు మూడు రోజులలోనే ఆమెలో విచారరేఖ లంతరించాయి. మొగంలో నీరసంపోయి మళ్ళీ కళా కాంతులు వస్తున్నాయి. వదినగారితోనూ, తల్లితోనూ సరదాగా కబుర్లు చెప్తోంది. వరలక్ష్మి రాధ ప్రేమ వృత్తాంతం చెప్పేసరికి పకపకా నవ్వేసింది. "ఏం రాధా నువ్వు త్త వెర్రిబాగుల వాడివిల్లా ఉన్నావురా. ఆ వాసంతి నెవరినో ప్రేమి

స్తావా ? ఇంకా నయం మొగుడున్న ఏ సినిమా తారనో ప్రేమించావు కాదు. పోనీ ఆ వాసంతికే చెప్పెయ్యక పోయావు నేను నిన్ను ప్రేమిస్తున్నా నని. అటో ఇటో తేలి పోను. ఇట్లా చాటునకూర్చొని కన్నీరు కారిస్తే ఏం లాభంరా? ఆమె నిన్ను ప్రేమించ నన్నా కూడా ఆమెనే ప్రేమిస్తూనే ఉంటా వేమిటి ఒకవేళ — ఒరేయి రాధా, ముందే చెప్తున్నాను నువ్వు ఎట్లా ప్రేమించినా సరే ఎవరిని పెళ్ళిచేసుకున్నా సరే నాకు రావలసిన ఆడబడుచు లాంఛనం మాత్రం ఘనంగా రావాలి. లేకపోతే నీ పెళ్ళికి రాను జాగ్రత్త'' అంది నవ్వుతూ.

కాని రాధ మొగాన నవ్వు కానీ కోపం కానీ లేదు. సంసార సుఖ దుఃఖాలకు అతీతుడైన జ్ఞానయోగిలా ఉన్నాడు. మధ్యమధ్య భారంగా నిట్టూరుస్తున్నాడు. కను కొలకుల్లో కన్నీటి బిందువులు ఒకటి రెండు తొంగి చూస్తున్నాయి. చూపుల్లో చురుకులేదు. వాటిలో గుర్తింపే లేనట్లుంది. పుస్తకం చేతిలోఉన్నా పేజీలు తిరగడం లేదు. అతని నడకలో కదలికలో వేయి మణుగుల బరువు కనిపిస్తోంది. అన్నం కతికి కతికి తింటున్నాడు. ఇంట్లో ఎవరూ ఇది గమనించ లేదు మొదట్లో, ఒకరాత్రి భోజనం దగ్గర వెంకటరమణే ముందు గమనించాడు. ''బాబాయి అన్నం తినడం లేదే జ్వరం వచ్చిందా?'' అని అడిగాడు. ఒక్కసారి శ్రీహరీ వరలక్ష్మి రాజ్యం అందరూ రాధకేసి చూశారు. కాని రాధ

ఈ లోకంలో లేడు. అన్నం కలుపుతూ నోట్లో పెట్టుకో కుండా కంచంకేసే చూస్తూ 'ఈ వస్తువేమిటి? ఇది నిత్యమా అనిత్యమా' అని తత్త్వపరీక్ష చేస్తున్నట్లున్నాడు. "ఏం రాధా, అన్నం తినడం లేదే. ఒంట్లో బాగాలేదా ?" అని అడిగాడు శ్రీహరి. రాధ ఉలిక్కిపడి ఒక్కక్షణం ఏం చెప్పాలో తెలియక తరువాత "ఏమీలే దన్నాయ్యా, ఏదో ఆలోచ నలో పడిపోయాను." అని లేని చిరునవ్వు తెచ్చుకొని, అన్నం త్వరత్వరగా కలుపుకొని తినబోయాడు. కాని ముద్ద మింగడం కష్టం అయింది. రాజ్యం వదినకేసి సాభిప్రాయంగా చూసింది. "అన్నంతినలేకపోతున్నావేం మరి" అన్నాడు శ్రీహరి మళ్ళీ. "పెద్ద ఏమీ లేదన్నయ్యా. ఆకలి మందగించింది. బద్ధకంగా ఉంది. కొద్దిగా తలనొప్పిగాకూడా ఉంది. రేపు ప్రొద్దున్నకి మామూ లయిపోతుంది ఇక ఇప్పు డన్నం తిన" నని లేచిపోయాడు. రాజ్యం తరువాత వరలక్ష్మితో అంది. "ఇది ప్రేమజ్వరం కాదుగదా వదినా ?" "ఇన్నాళ్ళూ ఈ లక్షణా లెన్నడూ లేవు" అంది వరలక్ష్మి

కాని మర్నాడు ఏదో అనుమానంవేసి రాజ్యం రాధ ఒంటిమీద చెయ్యివేసి చూసింది. రాధ ఒళ్ళు వెచ్చగా ఉంది. రాజ్యం కంగారుపడింది. వదినతో అన్నగారితో చెప్పింది. శ్రీహరి "రాధా నువ్వు ఈవేళ కాలేజీకి వెళ్ళడానికి వీలులేదు. రా నాతో" అని చెప్పి డాక్టరుదగ్గరకు తీసు కెళ్ళాడు. డాక్టరు తనతొందరలో రాధని గబగబా పరీక్షచేసి

రాధనేమీ మాట్లాడనీయకుండానే తనే ప్రశ్నలుమీద ప్రశ్నలు కురిపిస్తూ తనే ఇంచుమించు సమాధానాలుకూడా చెప్పేస్తున్నాడు: "ఆఁ ఏమిటి, ఒంట్లో బద్ధకంగా ఉందా? కొద్దిగా జ్వరంతగుల్తోందికాదూ. ఆకలిలేదు. తలనొప్పికూడా ఉంది. నిద్ర బాగా పట్టడంలేదుకాదూ - సరే ఈమందు పట్టుకెళ్ళి పుచ్చుకోండి. ఎట్లా ఉన్నదీ సాయంత్రం చెప్పండి" అని చీటీరాసి ఇచ్చాడు. కాంపౌండరు దగ్గర మందు తీసుకున్నతరువాత శ్రీహరి రాధని ఇంటికి పంపేసి తను బడికి వెళ్ళిపోయాడు.

రాధ ఇంటికి రాగానే సూరమ్మగారు, వరలక్ష్మి, రాజ్యం "ఏమని చెప్పారు డాక్టరుగారు" అని అడిగారు ఆదుర్దాతో. "ఏమీలేదు, మందిచ్చారు"అని సీసా బల్లమీద పెట్టి మంచంమీదికి చేరాడు రాధ. "మరి మందు పుచ్చుకో" అంది రాజ్యం. రాధ మాట్లాడలేదు. సూరమ్మగారు కొడుకు దగ్గరచేరి "ఏంవచ్చిందో నా తండ్రికి ఎవళ్ళకళ్ళో కాలిపోయి ఉంటాయి. దిష్టితీస్తే మంచిదేమో" అంటూ అతనికాళ్ళు పిసకసాగింది. రాజ్యం ఒక గ్లాసులో మందు పట్టుకువచ్చి త్రాగమంది. "నాకొద్దక్కయ్యా"అన్నాడు రాధ. రాజ్యం కోపపడింది. "నీకు కాకపోతే మరెవరికి? ఎందుకు తెచ్చావు? ఊఁ పట్టు నోరుతెరు"అని బలవంతాన అతని నోరు తెరపించి నోట్లో పోసింది. కాలకూటవిషంలా ఉంది ఆ మందు. రాధ అది మింగలేక గిలగిలకొట్టుకొని "నా ఒంట్లో ఏ రోగం

లేదంటే వినరేం? నన్ను చంపుకుతింటున్నారేమిటి" అని కోపంగా ప్రక్కకు తిరిగాడు. "రోగం లేదూ? మరిఎందుకట్లా ఉన్నావు? మనోవ్యాధా?" అని గట్టిగా అడిగింది రాజ్యం. రాధ మాట్లాడలేదు. మందు వెగటించుకుంటున్నాడు.

వరలక్ష్మికి ఏదో తోచింది. రాధ దగ్గరకు చేరి: "రాధా, రామకృష్ణమూర్తిగారిభార్య నిన్న చెప్పింది కొద్ది రోజుల్లో ఊళ్ళో గొప్పపెళ్ళి జరగబోతోందిట. పెళ్ళికూతురు బి. ఏ. చదువుతోందిట. పెళ్ళికొడుకు అమెరికా వెళ్ళివచ్చిన వాడట. ఆ అమ్మాయే ఈ వాసంతి కాదుగదా!" అని అడిగింది. రాధ ఒక్కసారి వదినగారికేసి తెల్లబోతూచూస్తూ మౌనంగా ఉండిపోయాడు. "ఏంరాధా వాసంతిపెళ్ళైనా? ఎప్పుడు?" అని రాజ్యం అతని బుజంపట్టుకొని ఊపుతూ అడిగింది. "వచ్చే శనివారం" అని గొణిగి "నన్ను ఇట్లా పడిఉండనీయి. మనస్సుకు శాంతి ఉండనియ్యి" అన్నాడు చిరాకుతో. రాజ్యం పకపకా నవ్వేసింది. "అది నీ అసాధ్యం కూలా! ప్రేమజ్వరమేనన్నమాట! ఆ పిల్లకు పెళ్ళి అవుతూంటే నువ్వు లంకణాలు చెయ్యడమేమిటి? ఎవళ్ళేనావింటే నవ్వుతారుకూడా. లే కాలేజీకి పో. ఆలస్యమయినా పరవా లేదు. వెళ్ళిరా. ఇరుగుపొరుగువాళ్ళకి తెలిస్తే బాగుండదు పో" అని రాధని కాలేజీకి తరిమేసింది రాజ్యం. రాధ వెళ్ళిన తరువాత రాజ్యం, వరలక్ష్మి కలిసి ఒకటేనవ్వు. "వాడి నెందుకే అంత ఎగతాళి చేస్తారు? పాపం వెర్రిమొగం ఏదో

మనసులో పెట్టుకున్నాడు''అంది సూరమ్మగారు కొంచెం విస్తుబోతూ. ''పీడి మనోవ్యాధి తగలెయ్యా బెంగపెట్టుకొని తిండి మానేసి నిజంగా రోగం తెచ్చుకునేటట్లున్నాడు. ఏం చేద్దామంటావు, వదినా ?''అంది రాజ్యం చివరికి. ''మనోవ్యాధికి మందేమిటి. అందమైన అమ్మాయికి విరుగుడు మరో అందమైన అమ్మాయే. ఏదో త్వరగా మంచి సంబంధంచూసి పెళ్ళి చేసేస్తే మంచిదిలా ఉంది'' అంది వరలక్ష్మి. ''మనం సంబంధాలకోసం తొందరపడితే కట్నాలూ, లాంఛనాలూ సరిగా రావద్దూ''అంది రాజ్యం.

సాయంత్రం శ్రీహరి ఇంటికి రాగానే ''రాధ ఏడీ ? ఎట్లా ఉంది''అని ఆదుర్దాగా అడిగాడు. వరలక్ష్మి వచ్చి సంగతి చెప్పింది. ''అదా''అని నీరసంగా ఒక చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు శ్రీహరి. విచిత్రమేమంటే అతని మొగమే ఎందుకో వాడిపోయి ఉంది. ఈమధ్యన రోజూ అట్లానే ఉంటోంది. కాని ఈ వేళ మొగమంతా చింత రాసి ఉంది. అతని కదలికలో కూడా బరువు కనిపిస్తోంది. భోజనం పరధ్యానంగా చేశాడు. రాత్రి భార్య ప్రక్కను చేరినపుడుకూడా అతను పైకి చూస్తూ ఆలోచనలో మునిగిపోయి ఉన్నాడు. వరలక్ష్మి ''ఏమండీ''అంది మెల్లగా. ''ఊఁ''అని ఏమీ కదలక ఆమెకేసి చూడక అట్లాగే పైకిచూస్తూ పడుకున్నాడు. వరలక్ష్మికి అనుమానంవేసి భర్త చెంపమీద చేయివేసి చూచింది. శ్రీహరి ఉలిక్కిపడ్డాడు. ''ఏమిటిది !'' అన్నాడు.

"ఒంట్లో ఏమన్నా ఇదిగా ఉందేమో చూశాను".

"నా ఒంట్లో ఏముంటుంది ?".

"మరి ఎందుకట్లా ఉన్నారు మీరు ?".

"ఎట్లా ఉన్నాను. మామూలుగానే ఉన్నానే ?".

వరలక్ష్మి అతని కళ్ళలోకి చూసి ముసిముసి నవ్వు నవ్వుతూ అంది: "మీ తమ్ముడిలాగే మీరుకూడా ఎవరినైనా ప్రేమించి ఆశాభంగం పొందలేదుకదా ?"

శ్రీహరి లేచికూర్చున్నాడు. "ఛ. ఏమిటామాటలు ? పదిహేను రూపాయల ప్రైవేటు కొద్దిరోజులలో ఆఖరై పోబోతోంది. అంతకంతకు అప్పులలోకి దిగబడిపోయేటట్లున్నాను. ముందు సంసారాన్ని ఎట్లా నిర్వహించడమా అని నేనాలో చిస్తూంటే —".

ఆ సాయంత్రం మాధవికి ప్రైవేటు చెప్తూంటే ఆ పిల్ల ఇదివరకటిలా చలాకీగా లేదు. కళ్ళలోనుంచి కన్నీళ్ళు పొర్లి వస్తాయా అనిపిస్తోంది. తల్లికానీ తండ్రికానీ ఆమెను కోపపడ్డా రేమో ననుకొని మెల్లగా చెప్తున్నాడు శ్రీహరి. మాధవి తల్లి వచ్చి గుమ్మందగ్గర నిలబడి "మాస్టారూ మాకు ట్రాన్స్‌ఫర్ అయిపోయింది. వారం రోజుల్లో వెళ్ళి పోవాలి. మా మాధవికి మీరంటే ఎంతో ఇష్టం. మీ కోసం ఇప్పటి నుంచే బెంగపెట్టుకుందండీ. మేమూ చాలా విచారిస్తున్నాము. మీరు చాలా బాగా చెప్తారు. మిమ్మల్ని మరచిపోము;" అంది ఆమె. శ్రీహరి ఆమెకేసి అర్థంకానట్లు తేరి పార జూసి

తరువాత తల వంచు కున్నాడు. ఏమీ మాట్లాడ లేక పోయాడు. మాధవి కళ్ళలోనుంచి కన్నీటి చుక్కలు ఇవతలకు పడ్డాయి. మాధవితల్లి ఈ మధ్య అప్పు డప్పుడు ఆ గదిలోనే సోఫాలో కూర్చొని ఉంటోంది. శ్రీహరిని బడికిసంబంధించీ, ఇంటికిసంబంధించీ ప్రశ్న లడుగుతోంది. అతనిని బి. ఏ తప్పక చదవమని ప్రోత్సహిస్తోంది. శ్రీహరి కూడా ఆమె ముందు ఇదివరకులా కంగారుపడక స్థిమితంగానే ఉండి సమాధానాలు చెప్తున్నాడు. మాధవితల్లి కొంచెంసేపు శ్రీహరి కేసీ మాధవి కేసీ చూసి "ఇంకా కొద్దిరోజు లుంటారు గదండీ. రేపో ఎప్పుడో మీరూ మా అమ్మాయీ కలిసి ఫొటో తీయించుకుందురుగాని" అని మెల్లగా లోపలకు వెళ్లిపోయింది. మాధవి ఏడుపు గొంతుకతో "మాష్టారూ ఈవేళ పాఠం ఆపేద్దామండీ" అంది. శ్రీహరి వచ్చేశాడు. అతని ముందు సమస్య వికృతరూపం దాల్చి నవ్వుతున్న ట్లుంది. చెల్లెలు వచ్చినప్పటి నుంచీ మరీ ఖర్చులు పెరిగాయి. తమకు కాఫీ అలవాటు లేకపోయినా చెల్లెలి పిల్లల కలవాటు ఉంది. అందువల్ల అదనంగా అర్థశేరు పాలు వాడుక పెట్టవలసి వచ్చింది. ఇతర ఖర్చులు కూడా ఇదే విధంగా పెరిగాయి. కొట్లమీద అరువు బాగా పెరిగిపోయింది. దీనికితోడు వచ్చే ఆదాయంలో పదిహేను రూపాయలు బొక్క పడితే ముందు ఎట్లా గడపడం? ఆర్థికసమస్య ఇట్లా ఉండగానే మాధవీ వాళ్ళూ వెళ్ళిపోతున్నా రంటే అతని గుండె ఆగి

యుల్ని కోల్పోతున్నట్లు గిజగిజ లాడుతోంది. అందుకే వరలక్ష్మి కళ్ళలోకి సూటిగా చూడలేక పోతున్నాడు. అతని స్వరంలో అబద్ధపుజీర ఉన్నట్లుంది.

వరలక్ష్మి అంది. "ఆ ప్రైవేటు పోతే మరొకటి దొరకక పోతుందా. ప్రయత్నిస్తే దొరుకుతుంది. కాని ఈ అప్పులూ ఖర్చులూ మాట మీ చెల్లెలి ముందు ఎప్పుడూ ఎత్తకండి పొరబాటునైనా. మనస్సు నొచ్చుకుంటుంది. మనకి భారమయ్యా ననుకొంటుంది. పాపం ఎంత బాధ పడి వచ్చిందో!"

"రాజ్యాన్ని పిల్లల్ని నేను భారంగా ఎంచుతానా! సొంత చెల్లెలినే సుఖపెట్టక పోతే అన్న బ్రతికి ఎందుకు? దానిబాధ తలచుకుంటే నా గుండె తరుక్కుపోతోంది. ఇక్కడ ఉన్నన్నాళ్లైనా దానికి ఏలోటు రాకుండాచూడాలి. ఎన్నడూ అప్పులు చేయని వాడిని కాబట్టి ఈనాడు అప్పులు చేయవలసి వస్తూండడంవల్ల భయం వేస్తోంది. కాదనుకున్నా మనస్సు పాడు అవుతోంది" అన్నాడు శ్రీహరి.

"అబ్బ పోనిద్దురూ. ఇట్లాంటివి తలచుకుంటే మనస్సు పాడవడం తప్ప మరోలాభం ఏముంటుంది? జరిగేదేదో జరిగి తీరుతుంది. ఇట్లాం టప్పుడేనా కాసేపు సరదాగా ఉండడం కూడా తప్పేనా?"

"ఎందుకు తప్పు అవుతుంది?" అన్నాడు శ్రీహరి.

వరలక్ష్మి అతని కళ్ళలోకి చూసి చిరునవ్వు నవ్వి

అతని రొమ్ములో తలదాచుకొని, అతని చేతిమీద రాస్తూ కనుబొమల మీదుగా అతని మొగంకేసి చూస్తూ అంది: "మీ చెల్లెలిని వాళ్లు అట్లా ఎందుకు చూస్తున్నారో! పోనీ రాజ్యం అందవికారా అంటే కాదే. భార్యను కోసిపెట్టే ఆ మొగుడికేమి వచ్చిందో! నా అదృష్టంబట్టి మీరు మంచి వారు దొరికారు. మీరే అట్లావుంటే నాగతి ఎట్లా ఉండేదో" అని మరింతగా అతని రొమ్ములోకి ఇమడడానికి ప్రయత్నించింది. శ్రీహరి ఆమెను రెండు చేతులతో చుట్టి తలమీదుగా వెన్నువరకూ రాస్తూ తనమొగం ఆమె తలమీదికి వాల్చాడు. ఏమీ మాట్లాడలేదు.

వరలక్ష్మి అంది: "ఏమండీ నే నెట్లా ఉన్నానండీ?"

"ఎట్లా ఉండడ మేమిటి?"

"నేను బాగుండను కదండీ? మీకు అందమైన భార్య దొరకవలసింది—"

శ్రీహరి ఆమె నోటిమీద చేయివేసి ఆపేశాడు. తరువాత రెండు చేతులతో ఆమె మొగం పైకెత్తాడు. ఆకళ్ళలో తనమీద ఎంత విశ్వాసం! ఎంత ప్రేమ! తన కష్టసుఖాలలో పాలు పంచుకునే అమాయకురాలు. శ్రీహరిలో ఆ క్షణమే ఆత్మవిశ్వాసం పొంగింది. ముందుకు వంగి ఆమె పెదవుల మీద ముద్దు పెట్టుకున్నాడు. ఆమెను గుండెల కదుముకున్నాడు. ఉండండి వస్తా నని దీపం తగ్గించి వచ్చింది వరలక్ష్మి.........

శ్రీహరి హృదయం మళ్ళీ కొంత తేలిక పడింది. చీకాకు చీకట్లు కొంచెం తొలగి పోయాయి. మర్నాడు అతను ఉత్సాహంగానే తనపనులు చూసుకున్నాడు. తను అప్పుల లోకి అంత కంతకు దిగిపోతున్నానని తెలిసికూడా ఒక విధ మైన మొండి పట్టుదలతో 'కానీయి ఏమైతే అయింది' అని చెల్లెలినీ పిల్లలనీ సినిమాకి కూడా పంపించాడు.

రాధ మనోవ్యాధి మాత్రం తగ్గుముఖం పట్టలేదు. బయటికి కనబడనిస్తే అక్కయ్యా వదినా ఏమంటారో అన్న భయంచేత లోలోపలే అణచుకొని మరింత తల్లడిల్లిపోతు న్నాడు. మధ్యమధ్యలో నారాయణగారింట్లో పెళ్ళి సంద ర్భంలో పరిచయమైన 'రాధ' జ్ఞాపకంవస్తోంది. చిత్రమేమంటే అప్పుడు ఆమె చూపులకోసం ఆరాటపడినవాడు కాస్తా తన ఊరులో అడుగుపెట్టగానే ఆమెను మరచిపోయాడు. మళ్ళా వాసంతి ప్రభావంలో పడిపోయాడు. సూర్యోదయమైన తరువాత చంద్రుడు వెలవెలబోయినట్లు ఆ 'రాధ' స్మృతి అతని మనస్సులో మందమైపోయింది. పైగా ఆమె ఎవరో తనకు పూర్తిగా తెలియదాయె. ఆమెను ఎక్కడ కనుక్కో గలడు ? వాసంతే అతని హృదయాన్ని ఆక్రమించేసింది. ఇప్పుడామెను బలవంతంగా హృదయంలోనుంచి పెకలించి వేయాలంటే హృదయమే భిన్నమయ్యేటట్లుంది. తన బ్రతుకింక ఎడతెగని అమావాస్యరా!

కాని అతని మనోవ్యాధి మరింత తీవ్రం కావలసిన రోజునే దానికి చటుక్కున చికిత్స అయిపోయింది. శనివారంనాడు ఆఖరిసారి వాసంతిని కన్యారూపంలో దర్శించి అనేకభగ్నప్రేమికుల్లాగే ఆమెకు తన 'పవిత్రప్రేమ' కు చిహ్నంగా ఏదో కానుక ఇచ్చి తరువాత త్యాగజీవితం గడపాలనుకున్నాడు ! — ప్రేమించడం జీవితంలో ఒక్కసారే అని దృఢంగానమ్మి, ఒక పుస్తకంకొని వాసంతిపెళ్లికి వెళ్లాడు. పెళ్లి జరిగిపోయింది. అందరితో బాటు తనూ వెళ్లి కానుక సమర్పించివచ్చాడు.

విచారంగా వెనక్కిమళ్లాడు. పందిరిలోనుంచి బయటకు వస్తూంటే ఎదర వెళ్తున్న ఒకామె తనచేతి రుమాలు పడేసుకుంది. చూసుకోకుండా వెళ్లిపోతోంది. రాధ అది చూసి త్వరగాముందుకు నడిచి చేతి రుమాలుతీసి "హియర్ ప్లీజ్, మీ హాండ్ కర్చీఫ్ పడేసుకున్నారు" అంటూ ఆమె దగ్గరకు నడిచాడు. ఆమె వెనక్కి తిరిగి 'ఓ!' అని చేతిరుమాలు అందుకొని మెనీ థాంక్స్నండీ"అని చిరునవ్వు నవ్వింది. "నో మెన్షన్ ప్లీజ్" అన్నాడురాధ. ఆమె నడుస్తోంది. రాధకూడ నడుస్తున్నాడు. అతనుతన వెనకేవస్తూండడంచూసి "మీరు డ్రమెటిక్ అసోసియేషన్ లో ఉన్నట్లున్నారు కాదూ అంది.

"ఔనండీ. నేను జాయింట్ సెక్రటరీని. మీరేమి చదువుతున్నారు. మిమ్మల్ని కాలేజీలో చాలాసారు చూశాను కాని మీరెవరో తెలియదు" అన్నాడు రాధ.

"బి.ఎస్.సి ఫస్టుఈయరండీ. మీ రేమి చదువుతున్నారు?

"బి.కాం. ఫైనలియరండీ. మీ పేరు తెలుసుకోవచ్చా?

"పేరు చాలా పొడుగండీ. కాని లక్ష్మి అని పిలుస్తారు. మీ పేరు? "

"రాధ...సారీ రాధాకృష్ణండీ. అందరు నన్ను రాధ అనే పిలుస్తారండి"

" అదేమిటి మగవాళ్లని ఆడ పేరుతో పిలవడమేమిటి? " అని నవ్వింది ఆమె వీణ మీటినట్లు. ఆనవ్వుతో రాధ హృదయంలోని చీకట్లు ఒక్కసారి పటాపంచలై పోయాయి. "కృష్ణ అనవచ్చునే, మీరు వచ్చే నెలలో కాలేజీ వీక్ లో ఏద్దైనా డ్రామాలో పాల్గొంటున్నారా అండీ? " అని అడిగింది ఆమె.

"అవునండీ. ఇంకా సెలెక్టు చేయలేదు. ఈవారంలో సెలెక్టుచేయాలను కుంటున్నారు. "

" మీ కే పాత్రలంటే ఇష్టం సామాన్యంగా"

" నేచురల్ గా ప్రతివాడికీ హీరో రోల్ (నాయకపాత్ర) వేయాలని ఉంటుంది. కాని నాకు హీరోయిన్ రోలే (నాయిక పాత్ర) ఇచ్చేటట్లున్నారండి."

"అందుకేనేమో మిమ్మల్ని రాధ అనిపిలిచేదికూడాను" అని నవ్వింది ఆమె మళ్లీ. సెలయేటి గలగల తోచాయి అతనికి ఆమె నవ్వులో.

" మీరు ఏఆక్టివిటీస్ (కార్యక్రమాలు) లోనూ పాల్గో రండీ? " అని అడిగాడు రాధ.

"ఎక్కువ లేదండి. ఈసారి మ్యూజిక్ కాంపిటీషన్‌లో పాల్గోవాలని ఉందండి. ఇంటిదగ్గర కేరమ్స్ ఆడుకుంటాను లేక పోతే ఏ నవలలో, కథలో చదువుకుంటాను."

" మీ కేనవలలంటే ఎక్కువ ఇష్టం ? "

'శరత్, మామ్, హార్డీ నవలలంటే చాలా ఇష్టమండి రవీంద్రనా టాగూరు కథలంటే కూడా పడిచస్తాను."

" నాకూ అంతేనండి. మీకు డిటెక్టివ్ నవలలంటే "ఇష్టం లేదా ? "

" లేదండీ. అవంటే తలనొప్పి. అర్థరాత్రిహత్య అపరాత్రిహత్య, పట్టపగలుహత్య, పీపాలో శవం, ట్రంకు పెట్టి లోశవం, నడిచివచ్చినశవం ఈ పేర్లు వింటేనే వెగటు పుట్టుకువస్తుంది. "

" నాకూఅంతేనండి ."

ఆమె ఆగిపోయింది. " థాంక్స్ అండి, ఇంతవరకు కంపెనీ గావచ్చినందుకు. మాయిల్లు ఈవీధిలోనే ఉంది. వస్తానండి. మీ నాటకం చూడాలనిఉంది. బై ... బై " అని నవ్వుతూ నమస్కారం చేసి వెళ్లిపోయింది ఆమె.

రాధ కొంతసేపు ఆమె కేసే చూస్తూనిలబడిపోయాడు. మరికొంతసేపటికి అతను పాంటు జేబుల్లో చేతులుపెట్టుకొని ఈల వేస్తూ ఉత్సాహంతో అడుగులు వేస్తూ లోపలికి వస్తూంటే ఇంట్లోవాళ్లు ఆశ్చర్యపోయారు.

## ౧3

రాధ హృదయం మీదనుంచి చెరగవనుకున్న వాసంతి అనే మూడక్షరాలూ ఇట్టే చెరిగిపోయాయి. ఇప్పుడు వాటి

స్థానంలో లక్ష్మి అనే రెండు అక్షరాలు గాఢంగా ముద్రించ బడ్డాయి. ఇదివరకు నిష్కామయోగి ఐన రాధ ఇప్పుడుఆశా వాది. అతనిని చూసి లక్ష్మి చిరునవ్వు అందిస్తోంది. అప్పుడప్పుడా మెతో మాట్లాడడానికి కూడావీలవుతోంది. ఆమె దగ్గరనుంచి నవలలు తీసుకుంటున్నాడు. తన స్నేహితుల దగ్గరనుంచి. తీసుకొని ఆమె కందిస్తున్నాడు. ఇప్పుడాతనిహృదయంలో శరత్కాలపు వెన్నెలలే.

శ్రీహరికి మాత్రం ఇంకాకృష్ణపక్షమే మాధవీ వాళ్ళూ వెళ్ళిపోయారు. 'ప్రావిడెంట్ ఫండులోను' వచ్చింది. తమ్ముడికి ఆఖరి టరమ్‌జీతం కట్టేశాడు. కొంతఊపిరి తీసుకోగల్గాడు. – ఈ ఒక్కఆటంకమేనా అధిరోహించ గలిగానని. మిగిలినమొత్తం లోనుంచికొంత చేతిలో నిత్యావసరాల కుంచుకొని, కొట్లమీద అరువు కొంతతీర్చాడు. ఈతాత్కాలపు మరమ్మతు రాబోయే ప్రమాదాన్ని ఎంతవరకు ఆపగలదు? లోపల ఈచింతరగులుతున్నప్పటికీ చెల్లెలికి చూచాయగా తెలిసినా చాలానొచ్చుకుంటుందనే భయంతో లోలోపలే అణచుకుంటున్నాడు. లోపలఅణగినా చింత మొగంమీద చిరునవ్వునుహరించివేసింది. అతను ఎప్పుడైనా నవ్వినా అది గుడ్డివెన్నెలలా ఉంటోంది.

రాజ్యం వచ్చిన మొదటి రోజుల్లో ఇంట్లో అందరూ సరదాగా కబుర్లు చెప్పుకునేవారు. కాని పోను పోను కొన్ని సంఘర్షణలు తలఎత్తడం మొదలుపెట్టాయి — ముఖ్యంగా రాజ్యం వరలక్ష్మిల మధ్య. ఇదివరకు సూరమ్మగారు కొడుకు

ఇంట్లో ఉన్నా ఒంటరి తనం అనుభవిస్తూఉండేది. ఇప్పుడు కూతురు రావడంవల్ల ఆమెకు ప్రాణం లేచివచ్చింది. ఎన్నాళ్లనుంచో కడుపులో దాగిఉన్న కబుర్లన్నీ బయటపడ్డాయి. తని వితీరా కూతురుతో చెప్పుకోసాగింది. "తల్లీ నీకర్మం. ఇంట్లో ఉంది కాని ఆవిడగారు చూడు నీవదిన—ఎంత మిడిసిపడుతోందో. అతగాడు ఆవిడ ఎంత అంటె అంత. పెద్దదాన్ని ఇంట్లో ఉన్నాను గదా ఎప్పుడూ నన్ను సంప్రతించిన పాపానపోడు. అంతా ఆవిడగారిదే పెత్తనం, తల్లీ నేనే మైనా చెపితే విసుగు ఆవిడకి. ఆచారం అసలు పనికిరాదు కదా—"

"అన్నయ్య నిజంగానే మారిపోయాడమ్మా ఇదివరకెంత సరదాగా ఉండేవాడు! ఇప్పుడుసరిగా మాట్లాడడమే లేదు ఆవిడ ఏమంత అందాలరాణిఅని అన్నయ్య ఇంత నెత్తికెక్కించుకుంటాడు? దేన్నికైనా పెట్టిపుట్టాలమ్మా. నాగతిచూడు. నామొహం చూస్తే ఆయనకు తగని చిరాకు. పైగా వదినకి అత్త మామల పోరు కానీ, ఆడబిడ్డలపోరు కానీ లేదుగదా. అందువల్ల ఉత్తము రాలే అనిపించుకుంటుంది—"ఇంతలో వరలక్ష్మి అడ్డువస్తున్నట్లయి,తల్లీ కూతురూ ఏమీ తెలియనట్లుగా ఊరుకున్నారు.

వరలక్ష్మి కొన్నాళ్లనుంచి ఇది గమనిస్తూనే ఉంది. తల్లీ కూతుళ్లు చెవులు కొరుక్కోవడం తనని చూసి ఏమీ తెలియనట్లు ఊరుకోవడం చూస్తే వాళ్లు తనను గురించే మాట్లాడుతూ ఉంటారని తోచసాగింది ఆమెకు. 'తనను గురించి ఏమి మాట్లాడుకుంటున్నారో! వాళ్లిద్దరూ తనొకతే కావడంతో

ఆమెకు తనింట్లోనే తానుపరాయి దానిలా అయినట్లుంది. భర్తతో ఇదివరకటిలా మాట్లాడడానికి కూడా బెదరుతోంది. ఆడబిడ్డ ఎక్కడ కందిపోతుందో అన్నట్లు ఆమెను ఏపనీ చేయ నివ్వడం లేదు. ఆమె ఎక్కడ నొచ్చుకుంటుందోఅని ఎంతో జాగ్రత్తగా మసలుకుంటోంది. 'అయినా తనమీద ఎందుకు చెప్పుకుంటారు ? ఆడబిడ్డల నైజమే అంతేమో! ఇట్లా ఒకరిపట్ల ఒకరికి అపోహలేర్పడడంవల్ల వరలక్ష్మి రాజ్యాల మధ్య కబుర్లలో ఇదివరకు లేని కృత్రిమత్వం వచ్చింది. లోని అసూయలు అనుమానాలూ కప్పిపుచ్చుకుందుకు అవసరానికి మించిన చిరునవ్వులూ, నవ్వులూ ఒలకబోస్తున్నారు. పరిహాసాలలో కారపుపాలు కలవసాగింది. పగలంతా శ్రమతో నీరసించి చింతతో దిగులొంది ఇంటికి చేరే (శ్రీ)హరికి ఈపరిస్థితి అవగహానచేసుకుందుకు ఓపికాలేదు కోరికాలేదు. సరికొత్త ప్రేయసి దొరికిన రాధ ఆకాశంమీదే కాని భూమిమీద విహరించడంలేదు.

వరలక్ష్మి ఎవరితో చెప్పుకుంటుంది ? లోలోపలే అన్నీ సహిస్తోంది. అయినా ఆమె సహనశక్తికి అతి తీవ్రపరీక్ష ఎదురు కాసాగింది. ముఖ్యంగా రాజ్యం పిల్లలవల్ల. రాజ్యం రెండోవాడు ఉత్త అల్లరిరకం.ఇంట్లోఅన్నీ తీసేస్తున్నాడు. వెంకటరమణ పుస్తకాలూ అవీతీసి వాటిలో ఇష్టంవచ్చినట్లు రాసేస్తున్నాడు. సూర్యావతి బొమ్మ ఒకటి దాచేశాడు. వరలక్ష్మికి నమ్మకం వాడే తీసేశాడని. పెట్టెలో ఏదోదాస్తూఉండడం చూసింది ఒకసారి. కాని ఏమనగలదు. తానూరుకున్నా పిల్లలూరుకోవ

డంలేదు. సూర్యావతి అంటోంది: " అమ్మోయి బాబేం నా బొమ్మ దాచేశాడే, " అని, వెంకటరమణ వాడిని కొట్టడానికి తయారవుతున్నాడు. కేకలు వేస్తున్నాడు. వరలక్ష్మి వాళ్ళను ఎట్లాగో సర్దుకు వస్తోంది. కాని రాజ్యం ముండ్రవాడు అయినదీ కానిదీ అన్న సర్దేస్తూంటే మెల్లగా వెళ్ళి చెయ్యిపట్టుకొని ఆపి " అవి ముట్టు కోకూడదు బాబు" అంటూ ఇవతలకు తీసుకువచ్చింది. రాజ్యం అదిచూసి త్వరగావచ్చి పిల్లవాడిని రెక్కపుచ్చుకొని ఈడ్చి కెళ్ళి నాలుగు వాయించింది; " వెధవ నీసొంత ఇల్లను కున్నావా? నోరుమూసుకొని ఓమూల కూర్చోమంటే కూర్చోవేం? "అంటూ సూరమ్మగారు. పరుగెత్తుకువచ్చి మనుమడిని ఒళ్ళోకి తీసుకొని, "వాడిని కొప్పడతావేమిటే వాడికేమి తెలుసు ముండ్రనాగమ్మ. పెద్ద వాళ్ళకే లేని తెలివి వాడికుంటూదేమిటే" అంటూ " దారాకి నాయనా, దాఅమ్మా, అమ్మచేత దెబ్బలుతినకు " అని పెరట్లోకి తీసుకుపోయింది. అత్తగారిమాటల్లో తనమీద దెప్పి పొడుపు కనిపించి వరలక్ష్మి మనస్సు చిన్నబుచ్చుకొని వంటింట్లోకి వెళ్ళి పోయింది. బాబు ఏడుస్తూంటే వాడి నెత్తుకొని పనిచేయసాగింది. ఈమధ్యకూతురువచ్చి నప్పటినుంచీ సూరమ్మగారు ఆమె బిడ్డ లనే ఎక్కువగా చేరదీస్తోంది. కొడుకుబిడ్డలను అంతగా పట్టించుకోవడం లేదు వరలక్ష్మి బాబు నెత్తుకొని తిప్పలు పడుతూ పనిచేస్తుంటే చూస్తూఊరుకోవడం బాగుండదని "ఇటు తేవే వాడిని అంది" సూరమ్మగారు "అక్కర్లేదు లెండి "అని కొంచెం విసురుగా పనిచేస్తోంది వరలక్ష్మి. " నేనేమన్నానని అంతరు

రుసరుసలాడతావు?'' అని అడిగింది అత్తగారు. ''మీరేమన్నారని నేనన్నాను? నేనేం రుసరుసలాడడం లేదు. వాడిని మీరు ఊరుకోబెట్టలేరు అందువల్ల వద్దన్నాను'' అంది వరలక్ష్మి మొగంలో కోపం స్పష్టముగా కనిపిస్తూనే. సూరమ్మగారు మూతి విరుచుకొని వెళ్ళిపోయింది.

పిల్లలు రెండువర్గాలుగా చీలిపోవడంతో ఇంట్లోపరిస్థితి అంతకంతకు దుర్భరమవుతోంది. రమణా సూర్యావతీ ఒక పక్షం రాజ్యం రెండోకుర్రవాడు ఒక్కడూ ఇంకోపక్షం. బాబు రాజ్యం ఆఖరివాడూ ఏడాదిలోపుపిల్లలు కాబట్టి వాళ్ళమధ్య నింకా సంఘర్షణ బయలుదేరలేదు. అక్కడికీ దగ్గరకువచ్చినప్పుడు ఒకళ్ళనొకళ్ళు అమాయకంగాతోసుకుంటున్నారు. ఎవరోఒకరు వెనక్కిపడి కేరుమంటున్నారు. చివరికి పిల్లలమధ్య సంఘర్షణ చిలికి చిలికి గాలివానఅయింది. పెద్దవాళ్ళమనస్సుల్లో ఉన్న అనుమానాలూ అసూయలు ఏదోవిధంగా బయటపడక తప్పదు. కాబట్టి ఈ కారణం చూచుకొని బయటపడి పోయాడు. రమణపుస్తకం రాజ్యం కొడుకుతీసేశాడు. రమణ అడిగితే తనకేమి తెలియదన్నాడు. రమణ ఊరుకోలేకపోయాడు. 'దొంగ' అని తిట్టాడు వాడిని. రాజ్యంకొడుకు ''నువ్వేదొంగవ''న్నాడు. రమణ మేనత్తకొడుకుని ఒక్కటివేశాడు. వాడు వెంటనే జవాబిచ్చాడు. ఇద్దరూముష్టియుద్ధం చేస్తునారు. జుట్లుపట్టుకున్నారు. రాజ్యం కొడుకురమణ చేయికరవడానికి ప్రయత్నిస్తునాడు. చప్పుడువిని రాజ్యం పరుగెత్తుకువచ్చింది.

ఇద్దరినీ విడదీసింది. రాజ్యం కొడుకు " అమ్మా నీడు, నన్ను దొంగ అన్నాడే నన్ను కొట్టాడే " అని ఏడవ సాగాడు. ఇంతలో వరలక్ష్మి కూడా అక్కడికి పరుగెత్తుకు వచ్చింది. రాజ్యం రమణతో అంటోంది. "వాడు దొంగా? నాకొడుకు దొంగరా? ఎవరు చెప్పారురా దొంగ అనమని?" రమణ నిటారుగా నిలబడి "అవును వాడే నాపుస్తకంతీశాడు. అందుకే కొట్టాను" అన్నాడు. వరలక్ష్మి వాడిదగ్గరికి

ఏమిటిరా వెధవా. అట్లా కొట్టావ్వా? తప్పుకాదూ అంటూ వాడిని పట్టుకుంది "అవునమ్మా వాడు నాపుస్తకం తీసేశాడు. పుస్తకం లేకపోతే బళ్లో మాష్టారు కొట్టారు. చూచిరాత రాసుకోవాలి. వాడూనన్ను కొట్టాడమ్మా. కరవబోయాడు కూడా, చొక్కా జొత్తం చిరగ్గొట్టేశాడు చూడు" అంటూ చొక్కా చూపించాడు తల్లికి. వరలక్ష్మికి ఏమీ పాలుపోలేదు. పుస్తకం రాజ్యం కుర్రవాడు తీశాడని ఆమె నమ్మకం. పుస్తకం లేకపోతే మాష్టారు రమణని కొట్టారేమో. ఆమె రాజ్యం కొడుకు కేసి తిరిగి "ఏం బాబూ, పుస్తకం తీశావా?" అని అడిగింది ఎంతో సౌమ్యంగా. రాజ్యం ఆమెకేసి మరమర చూసి, తనకొడుకు వైపుకు తిరిగి "ఏరా నిజంచెప్పు, నువ్వు వాడి పుస్తకం తీశావా" అని అడిగింది గట్టిగా. "నేను తియ్యలేదమ్మ వాడబద్ధంచెపుతున్నాడమ్మా, వాడి వెధవపుస్తకం నాకేంకావాలి" అన్నాడు వాడు కళ్లునుద్దుకుంటూ. రాజ్యం రమణ కేసి తిరిగి "ఏరా నువ్వు

చూశావా వాడు పుస్తకంతియ్యడం – వాణ్ణి దొంగఅని పిలు స్తున్నావు” అని అడిగింది తీక్షణంగా. “చూడలేదు. కాని వాడే తీసేశాడు. నాకు తెలుసు. మాచెల్లాయి బొమ్మ కూడా దాచేశాడు. దొంగ” అన్నాడు రమణ. వరలక్ష్మి కంగారుగా కొడుకు నోరుమూసింది. రాజ్యం ఊరుకోలేకపోయింది, “గతి లేక మీ యింటికొచ్చామనేకా ఇష్టమొచ్చినట్లు మాట్లాడడం బొమ్మకూడా తీసేశాడా? నాకొడుకు దొంగా? రేపు నన్నూ దొంగ అంటారు. గిట్టకపోతే గిట్టనట్లు చెప్పాలి—” అంటూ మొదలుపెట్టింది.

సూరమ్మగారు ఏమిటే ఏమిటే అంటూ వచ్చింది. రాజ్యం కళ్లనీళ్లతో, రుద్ధమైనకంఠంతో చెప్పసాగింది: “చూడ మ్మా రమణగాడి పుస్తకం నాకొడుకు తీసేశాడట. ఎందుకు తీస్తాడు వాడు? ఏంచేసుకుందామని? కొరుక్కుతిందామనా? ఎందుకు యోగిస్తుంది వాడికి? కళ్లకెదురుగా కనిపించాడని దొంగఅని తిట్టడమే! నాకొడుకుది దొంగబుద్ధిట. నాదీదొంగ బుద్ధేఅవుతోంది. మేము గతిలేక వచ్చామనేకా, మాకుమాత్రం మానాభిమానాలు లేవా? మేమమాత్రం అన్నం తినడం లేదా? మేంమాత్రం మనుష్యులంకామా? సూరీడుబొమ్మ కూడా వాడేతీసేశాడట. ఇంకాఉంటే ఎన్నిదొంగతనాలుకడ తారో. దగ్గర డబ్బుంటే ఆపుస్తకం ఖరీదు పడేద్దును. అందు కూ లేవు డబ్బులు. నాకు అవమానాలు కలగజెయ్యడానికే భగవంతుడు నాకీ పరీక్షలపెడుతున్నాడు. అమ్మా నీదగ్గర ఏమైనా డబ్బులుంటే ఇట్లా ఇయ్యి. వాడికి పడేస్తాను. తరు

వాత ఎప్పుడో నేను చచ్చేలోగా తీర్చడానికి – ప్రయత్నిస్తాను లే” అంటూ గొంతుక ఏడుపుతో మూసుకుపోవడం వల్ల – ఆగి పోయింది.

సూరమ్మగారు కూతురుని పట్టుకొని, ఆమె తలమీద రాస్తూ, కన్నీళ్ళు తుడుస్తూ, “అట్లాంటి మాట లనకే తల్లీ. నువ్వు కంటనీరు పెడితే నాకడుపు కోసుకు పోతుంది. ఏరా వెధవాయ్, వాడునీకు పరాయి వాడురా— వాణ్ణినానా మాటలూ అంటావ్” అంది రమణ కేసి తిరిగి.

“అవును మామ్మా. వాడు నాపుస్తకం తీసేస్తే ఊరుకో మంటా వేమిటి?” అని గట్టిగా అడిగాడు రమణ.

“అదుగో మళ్ళీ అదేమాట. వాడికి నీపుస్తకం ఎందు కావాలిరా? ఎక్కడో పడేసుకొని వాడిమీద దొంగ తనం కడ్తావా? మీనాన్న రానియ్యి నీపని చెప్తాను. వెధవా. అదుగో! తల్లి దగ్గర ఉండే ఇదంతా నడిపిస్తోంది.” అంది సూరమ్మగారు.

ఇంతసేపూ ఏమి మాట్లాడాలో తెలియక రాతివిగ్ర హంలా నిలబడిపోయిన వరలక్ష్మి చలనం లోకి వచ్చింది. “నేనేమి నడిపిస్తున్నానండ త్తయ్యా? నేనేమన్నానని మీరు” కూడా అట్లా మాట్లాడుతారు?” అంది.

“ఎట్లా మాట్లాడుతున్నావే! నువ్వేమనాలి? కొడుకు నానా మాటలూ అంటూంటే చూస్తూ ఊరుకుంటే చాలదూ? అక్కడ నానా బాధ'లూ పడివచ్చింది. ఇక్కడేనా కొన్నాళ్ళు

విశ్రాంతిగా ఉందామని. వచ్చినందుకు ఇదా సత్కారం? నీలా దాని మొగడు దాని చెప్పు చేతలలో లేడు—"

"మీ కొడుకు మీద నేనేదో మాయమందు చల్లాన నేకా మీరనేది. అనుకోండి. అనుకోండి. నామీద ఎన్నైనా అనుకోండి తేలికగా దొరికాను కాదూ" అంది వరలక్ష్మి కంఠంలో ఏదుపు జీరతో.

రాజ్యం అంది: "అమ్మా రేపో ఎల్లుండో నేను వెళ్ళిపో తాను. ఇక్కడ ఉంటే నాపిల్లలింకా ఎంత దొంగలవుతారో? నేనుకూడా ఎంతదొంగ నవుతానో! ఎంత గిట్టని దాన నవు తానో! వెళ్ళిపోతాను. అక్కడ నన్ను పెట్టి పూజించే వాళ్ళె వరూ లేరు. వెళ్ళగానే ఎదురయ్యేది తిట్లూ, తన్నులూ, దెబ్బలే. అయినా పడతాను. పీకనొక్కి పారేస్తే అందరికి బాధ తప్పుతుంది—"

"అట్లానలకే తల్లీ" అంటూ కన్నీరు పెట్టింది సూరమ్మ గారు. "ఏమేవ్ కోడలా. అది ఉండడం నీకిష్టం లేదా చెప్పు ఎందుకే అభాండాలు వెయ్యడం దాని మీదా దాని పిల్లల మీదా! అది వచ్చింది. పరాయి ఇంటికా ఏమన్నానా? రెండు మూడేంళ్ళకోసారేనా అది పుట్టింటికి రావడం కూడా తప్పేనా? ఎప్పుడూ అత్తారింట్లోనే పడుండాలా? ఒకే ఆడబడుచు, దానికి చీరె సారెలు పెట్టడంలేదు. సరికదా ఇంటికి వచ్చిన దాని నైనా సరిగ్గాచూడొద్దూ? ని అని అడిగింది ఆవిడ.

"అనండి అనండి. నేనెప్పుడూ ఇక్కడే పడి ఉంటు న్నాననీ, ఎప్పుడూ నాకు పుట్టింటి ముచ్చటలు లేవనేకా

మీ దెప్పి పొడుపు ? లేనివాళ్ళ కూతురు వచ్చి ఇంత అధికారం చలాయించడ మేమిటి. ఇంటి ఆడబడుచు కన్న సుఖంగా ఉండడ మేమిటి అనేకా మీ బాధ ? అవును, నావాళ్ళు లేని వాళ్ళే. ఏం చెయ్యను నేను ? గతిలేని దాన్ని కాబట్టే ఇట్లా పడి ఉంటున్నాను.— నేనే పోతాను లెండి. మీరు సుఖంగా ఉందురు గాని. మావాళ్ళు నన్ను పిలవరు ఏమైనా పెట్టవలసి వస్తుందే మోనని భయంచేత. కాని గుమ్మంలోకి వచ్చిన దానిని పొమ్మంటారా ఎంత గతిలేని వాళ్లైతే మాత్రం ? వాళ్ళతో బాటు చారూ అన్నమే తిని ఉంటాను. అదీ లేక పోతే పస్తుంటాను. మీరూ మీఅమ్మాయీ, మీ అబ్బాయీను ఏ గొడవా లేకుండా సుఖంగా ఉండండి ” అంది వరలక్ష్మి కోపమూ ఏడుపూ కలసిన స్వరంతో కొంగుతో కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ.

“ నేనేమన్నానని అట్లా విరుచుకు పడతావు ” అంది సూరమ్మగారు గొంతుక రెట్టించి. “ నీ పుట్టింటి వాళ్ళ మాట నేను తలపెట్టానా ? నువ్వే తలపెట్టావు. ఇంటికొచ్చిన దాని మీద ఈమాటలేమి టనేగా నేనన్నది. దానికే ఇంత ఉక్రోషం తెచ్చుకుంటావు దేనికి ?”

“ మీరనా లేమిటి ? మీ మాటలను బట్టి తెలియడం లేదూ లేని సంసారం లోది మీ కూతురు కన్న ఎందుకు ఎక్కువ సుఖ పడాలని. మీ కూతురిని నేనేమన్నాను ? ఇంట్లో నుంచి పొమ్మన్నానా ? తిట్టానా ?” అని అడిగింది వరలక్ష్మి.

“ తిట్టాలేమిటి ? నీ కొడుకు వాడిని దొంగ అంటే

తల్లిమనసు ఎంత బాధ పడుతుందో ఆలోచించావా ? వాడిని గట్టిగా చీవాట్లు పెట్టేబదులు నువ్వుకూడా వాడి పుస్తకం తీశాడనేగా చెప్పేది" అంది సూరమ్మ గారు.

వరలక్ష్మి ఒక్కసారిగా రమణను పట్టుకొని దబదబా బాదేస్తూ వెధవ! పెద్ద బి. ఏ. చదువు చదివేస్తున్నట్లు మాట్లాడతాడు. పుస్తకం పోతేనేం నోరు మూసుకొని ఊరు కోక! మరీ మితి మీరి పోతున్నాడు." అని పక్కవాళ్ళు చూస్తున్నారనే కోపంతో వాడిని ఇంకా బాదుతూనే వంటింటి వరకూ ఈడ్చుకు పోయి అక్కడ కూలేసి, "అట్లా తగలడు. కదిలావంటే చంపేస్తాను. దానితో నీపీడా నాపీడా వదలి పో తుంది." అని తిట్టి, వంటింట్లోకి పోయి కొంగుతో మొగం కప్పుకొని ఏడ్చేసింది. కొంత సేపటికి ఏడుపు తగ్గి, మొగం తుడుచుకొని వంటింటి పని చేసుకోసాగింది. ఇవతల రమణ కూర్చొని, వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. సూర్యావతి వాడి ప్రక్కన కూర్చొని, ఏమి చేయాలో తోచక తనూ ఏడుపు మొగం పెట్టి అన్నకేసి చూస్తోంది.

ఇంకొక మూల రాజ్యం కూర్చొని కళ్ళు ఒత్తుకుం టోంది. తల్లి ఆమె ప్రక్కనే కూర్చొని మెల్లగా ఏమిటో అంటూ ఓదారుస్తోంది. రాజ్యం ఆఖరి పిల్లవాడు తల్లి దగ్గరకు చేరాడు. గొడవకు కారణమైన వాడు మాత్రం దూరంగా నిలబడి పెంకెగా చూస్తున్నాడు—ప్రపంచాన్నంతా ఎదిరించే టట్లు. ఇంతలో ఉయ్యాలలో బాబు లేచి ఏడుపు మొద లెట్టాడు. కాని ఎవరూ పట్టించు కోవడం లేదు. వాడి ఏడుపు

ఇంకా ఎక్కువైంది. వరలక్ష్మి వంటింట్లో నుంచే "చావరా వెధవ ఏడుస్తున్నావూ" అని కోపంగా పనులు చేసుకుంటోంది. ఆఖరికి రమణే లేచి అట్లా ఎక్కడికోనే వెళ్ళి తమ్ముడిని మెల్లగా ఉయ్యాలలో నుంచి దింపి ఎత్తుకొని తండ్రి గదిలోనే కూర్చున్నాడు.

కాసేపటికి శ్రీహరి వచ్చాడు.

ఇంట్లో వాతావరణం చూసి హడలి పోయాడు. చెల్లెలు మొహం చూచి ఏడుస్తోందని గ్రహించి కూడా ఎందుకని అడగడానికి భయపడ్డాడు. వొక్కా ఖండువా చిలక కొయ్యకు తగిలించి కాళ్ళు కడుగుకుందుకు పెరటోకి పోతూంటే వంటింట్లో వరలక్ష్మి మొగం కూడా ముడుచుకుపోయి ఉంది. శ్రీహరి మాట్లాడకుండా లోపలికి వచ్చాడు. అంతలో రాధ కూడా తిరిగి వచ్చాడు. రాజ్యం అన్నగారికేసి చూసి "అన్నయ్యా రేపు నేను వెళ్ళిపోతాను. ఎన్నాళ్ళని ఇక్కడ ఉంటాను? ఎప్పటికైనా తప్పదు అక్కడికి పోవడం. చావో బతుకో దేనికైనా సిద్ధపడాలి" అంది ఇంకా దుఃఖంతో కూడిన కంఠంతో.

"అప్పుడే వెళ్ళడమేమిటి? తాపీగా ఆలోచించొచ్చు" అని శ్రీహరి తనగదిలోకి పోయాడు. బడిపని చూసుకో సాగాడు.

రాధే అడిగాడు: "ఏమిటక్కయ్యా. ఏం జరిగింది? ఏమన్నా ఉత్తరం వచ్చిందా?"

"అక్కడనుంచి ఉత్తరం కూడానా! సిగ్గులేక నెత్తే నలుగురిలో జుట్టుపట్టుకు బయటికీడ్చేయకపోతే అదే పెద్ద సత్కారం చేసినట్లు" అంది రాజ్యం.

అది కాదక్కయ్యా, ఎందుకు వెళ్ళిపోతానంటున్నా వని ?"

" అనకేం జేస్తుందిరా" అంటూ సూరమ్మగారు అందు కుంది. " అక్కడ నానా బాధలూ పడి పడి ఇక్కడికివచ్చిందా, ఇక్కడకూడ దానికి శాంతి లేకుండా చేస్తే అదేమవుతుంది?"

"శాంతి లేకుండా ఎవరు చేశారు? అక్కయ్యాకేం లోటు వచ్చింది ఇక్కడ ? ఎవరేమన్నారు ?"

ఎవరనాలి ? మీవదిననే అడుగు." అంది తల్లి.

"వదినా? వదిన అట్లా అనదే ఎప్పుడూ. "

"ఆవిడ గారు తన నోటితో అంటుందేమిటి ? అంత తెలివి తక్కువదేమీ కాదు. కొడుకు చేత అనిపించింది. చూడు, ఆ వెధవ వేలెడున్నాడో లేదో రాజ్యం కొడుకుని దొంగ అంటాడూ! వాడి పుస్తకం దాచేశాడుట! ఆవిడగారు పాపం తెలియనట్లు కొడుకును వెనకేసుకు వచ్చింది. కొడుకుని దొంగ అంటే ఏ తల్లి మనసు బాధ పడదూ? కుర్ర వెధవకి ఇట్లాంటి బుద్ధులు అవంతట అవే పుట్టుకు వస్తాయా? " అంది సూరమ్మగారు.

" అసలు వాడు తీశాడేమో కనుక్కున్నారా, " అని అడిగాడు రాధ.

" తీస్తే మాత్రం దొంగ అని తిట్టాలా?వాడు తియ్యనూ లేదు. నేనేమీ ఎరగను మొర్రో అని వాడు ఏడుస్తున్నాడు. మూడో క్లాసువాడు రెండో క్లాసు పుస్తకం ఏంచేసుకుం టాడు?" అని అడిగింది తల్లి.

"ఎందుకొచ్చింది— నేను రేపు వెళ్ళిపోతారా రాధా. నీకు ఎప్పుడైనా నన్ను చూడాలనుంటే అక్కడకే వద్దువు గాని' అంది రాజ్యం.

"నిన్నవరు వెళ్ళమన్నారక్కయ్యా?"

"పొమ్మనాలేమిటిరా; పొగబెడ్తే చాలదూ? నే నిక్కడ ఇంతకాలం ఉండడం గిట్టక పోబట్టే ఈ అభాండాలు. నేనెక్కడ తన ఆస్తి తినేస్తాననో భయం. ఇంకా ఉంటే ఇంకా ఏమేమి దొంగతెనాలు కట్తారో?" అంది రాజ్యం.

"ఛ, ఛ, ఏమి మాటలక్కయ్యా. వదిన అట్లాంటిది కాదక్కయ్యా."

"అవునురా నువ్వా నీవదిననే వెనకేసుకు వస్తావు. ఆవిడ మంచిది. నేనే పాపిష్టిదానిని!"

"ఎందుకక్కయ్యా లేనిపోనివన్నీ ఊహించుకొని బాధపడతావు? వదిన ఎవరినీ పల్లెత్తు మాట అనదు. అందు వల్లే ఇన్నాళ్ళూ ఎప్పుడేనా ఇరుగు పొరుగులతో కాని ఇం ట్లో కాని పేచీలు వచ్చాయా?"

"అవును, నేను వచ్చినప్పటినుంచే కాదూ పేచీలు తయారైంది? నేనే ఇంట్లో చిచ్చుపెట్టే దానిని? నావల్లే మీకు శాంతి లేకుండా పోయింది! నేనూ ఆవిడలా మంచి దానను కాను కాబట్టేనా, ఇంట్లో గొడవ తెచ్చుకున్నా నంటావు. నా మొగుడు కూడా నాచెప్పు చేతల్లో ఉండి, నా అత్తగారూ నోరు లేనిదైతే నేనూ చాలా ఉత్తమురాల ననిపించుకుందును–'

రాధ కోపంగా అరిచాడు: "అక్కయ్యా, ఏమి టిదంతా? ఎవరన్నారు ఇవన్నీని? వదిన ఇట్లాంటి బుద్ధులు కలది కాదు—"

"నాకే ఇట్లాంటి బుద్ధులున్నాయి మరి!"

"అబ్బ, చెప్పింది వినిపించుకోవేం? వదినను నువ్వు తప్పు అర్థంచేసుకొని ఉంటావక్కయ్యా - "

"ఒరేయ్, నాకేమీ చెప్పనక్కర్లేదు. నేను వెళ్ళిపోతాను. మీరంతా సుఖంగా ఉండండి. నేనెందుకు మధ్య పానకంలో పుడకలా, నేనే పరాయి దానిని. ఎవరికీ అక్కరలేని దానిని. నేనేమైపోతే ఎవరిక్కావాలి?—"

రాధకు చాలాకోపం వచ్చింది. గబగబా వెళ్ళి రాజ్యం కొడుకు చెవి పట్టుకున్నాడు. "ఏరా వెధవా నిజం చెప్పు చంపేస్తాను లేకపోతే. తీశావా లేదా?" అనివాడిని గుంజేస్తు న్నాడు. సూరమ్మ గారు దగ్గరకు పరుగెత్తుకు వచ్చింది. "ఒరేయి ఆరమణ గాడి మాట నిజం, వీడి మాట అబద్ధమూనా? వదిలెయ్యరా వాణ్ణి" అని రాజ్యం కుర్రవాణ్ణి విడిపించ డానికి ప్రయత్నించింది.

కాని రాధ విడవ లేదు. రాజ్యం కొడుకు చెవి మెలి వేస్తూ "చెపుతావా చెప్పవా" అని ఇంకా గుంజుతూనే ఉన్నాడు. రాజ్యం కొడుకు తేలిక ఘటం కాదు. "నేనెరగను. నేను తియ్యలేదు" అంటున్నాడు పెంకెగా.

వరలక్ష్మి చూసి, "వదిలెయ్యి రాధా. అతను తీసి ఉండడు. ఈ వెధవే ఎక్కడో పడేసుకొని ఉంటాడు." అంది.

"కాదు వదినా," అని రాధ అటూ ఇటూ చూసి రాజ్యం పెట్టె పక్కనున్న సంచి పైకి తీసి బోర్లించాడు. రాజ్యం కొడుకు బట్టలతో పాటు అడుగునుంచి రమణ పుస్తకం సూర్యావతి బొమ్మకూడా బయట పడ్డాయి.

రాజ్యం అది చూసి గబగబా లేచి కొడుకును వంగ బెట్టి ఒకటే పనిగా కొట్టడం మొదలు పెట్టింది. "చావు వెధవా! చచ్చినా వదలి పోను. దాచి తియ్యి లేదని చెపు తావా? నీ నుంచి నానా మాటాబానా?" అంటూ.

శ్రీహరి గదిలో నుంచి రాలేదు. నుదుటి మీద చెయ్యి పెట్టుకొని బల్లమీద ఆనుకొని ఉండిపోయాడు. "వది లేయ్యవే తల్లీ" అంటూ సూరమ్మగారు కూలురు కష్టు పడింది. కాని రాజ్యం ఇంకా కొట్తూనే ఉంది. వరలక్ష్మి కూడా అంది: "వదిలెయ్యి వదినా. తెలియక చేశాడు." వరలక్ష్మి అనడంతో మరింత కోపంతో కొట్టుతోంది రాజ్యం. చివరికి రాధ అడ్డుపడి బలవంతాన కుర్రవాడిని ఇవతలకు లాగి, దూరంగా తీసుకెళ్ళి, "ఇక్కడ కూర్చో, బుద్ధి కలిగి ఉండు" అని ఒకమూల కూర్చోబెట్టాడు.

తరువాత అక్క దగ్గరికి చేరి "చూశావా అక్కయ్యా, నువ్వు కాస్తముందు ఓపిక పట్టి ఉంటే ఇంత గొడవవచ్చి ఉండునా? నిన్నెవళ్ళో ఏదో అంటున్నారని లేనిపోనివి ఊహిం చుకొని నిన్ను క్షోభ పెట్టుకుంటున్నావు. ఇతరులనీ క్షోభ పెట్తున్నావు. నీవంటే నిజంగా ఎవరికీకోపం లేదక్కయ్యా –"

"నాకు నీవదినకులా తెలివితేటలు పెట్టలేదురా భగ వంతుడు. అందుకే ఇట్లాంటి పన్ని మీదికి తెచ్చుకుంటాను.

ఈపిల్లలుమాత్రం అదుపుల్లో ఉండరు. వాళ్ళను కనుక్కోవడానికి కూడా తీరిక ఉండి ఏడిస్తేకా? అందుకే వీళ్ళిలా తయారయ్యారు. నేను వేళ్ళిపోతే మీరేనా సుఖంగా ఉంటారు–"

ఇక అప్పుడు అక్కతో వాదించి లాభంలేదని రాధ నిరాశ చేసుకొని అక్కడనుంచి ఇవతలకు వచ్చేశాడు. భోజనాల దగ్గర రమణ రాధ దగ్గరికివచ్చి చూడు "బాబాయ్" అని చొక్కా ఎత్తి నడ్డి చూపించాడు. నడ్డిమీద వాతలు! "ఏమిటిరా ఇది?" అని అడిగాడు రాధ. తల్లికేసి చూపించి, "అమ్మ కొట్టింది" అన్నాడు రమణ. శ్రీహరి కూడా ఆదెబ్బలు చూసి ఉలిక్కిపడి తల దించేసుకున్నాడు. వరలక్ష్మికి రమణ నడ్డిమీద తన చేతి వేళ్ళ గుర్తులు చూసే సరికి కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి. చటుక్కున మొగం తిప్పేసుకొని కొంగుతో తుడుచుకుంది. రాధకు చాలాకోపం వచ్చింది అక్కమీద ఎక్కువగా. కాని కోపంతోబాటు అక్కపట్ల జాలికూడా పొంగుతోంది. అక్క అసూయతో అపోహలతో బాధపడుతోంది. వదినా ఆడబిడ్డల మధ్య ఈసంఘర్షణ సహజసిద్ధం కాబోలు! దానిని ఎవరూ పరిష్కరించ లేరు కాబోలు అనుకున్నాడు. ఎందుకో ఇంట్లాంటి బ్రతుకులు బ్రతుకుతూ కూడా తమచేతులతోనే తమ బ్రతుకులు మరింత బాధాకరం చేసుకుంటారు, అని ఆశ్చర్యపోయాడు.

శ్రీహరి ఏమీ మాట్లాడ లేదు. భోజనం చేసి తన గదిలోకి వచ్చి మళ్ళీ బడి పనిలో పడిపోయాడు. వరలక్ష్మి మగవాళ్ళ భోజనా లయిన తరువాత ఆడ బిడ్డను కూడా పిలిచింది.

రాజ్యం పలకలేదు. వరలక్ష్మి దగ్గరకు వచ్చి చివరకి 'నువ్వు అన్నం తినక పోతే నామీద ఒట్టు" అంది. రాజ్యం లేచి వచ్చిం ది. సూరమ్మ గారు అటుకులు తింది. మౌనంగా భోజనా లయిన తరువాత వరలక్ష్మి కంచాలు కడుగుతూంటే రాజ్యం తను చేస్తానని అడ్డు పడింది. వరలక్ష్మి వద్దంది. "నేను చేసు కుంటా నులే అమ్మ. ఎప్పుడూ ఉండేదే కదా" అంది ఇంకా కోపం పూర్తిగా చల్లారకపోయినా పైకి మర్యాదగా. "చెయ్య నియ్యి, వదినా. తేరగా తింటూ కూర్చుంటున్నాను. తిన్నందుకు ఈ మాత్రం చాకిరీ యేనా చెయ్యొద్దూ? ఎంత కాలం ఈ సుఖ భోగం నాకు? ఎప్పటికైనా మళ్ళీ అక్కడకు పోక తప్పదు కదా. అంతు లేని చాకిరీ నాకోసం ఎదురు చూస్తూ ఉంటుంది. మీరం దరూ మీలో మీరు ప్రేమగా ఉన్నారు కాబట్టి నీ చాకిరీ నీకు బాధ అనిపించదు. నాకో తిట్లూ-చీవాట్లు, దెబ్బలూ తన్నులూ, ఈ సారి ఇక తిరిగి వస్తానో రానో" అంది రాజ్యం.

"ఏమిటి వదినా ఆమాటలు?" అంది వరలక్ష్మి తీక్ష ణంగా. రాజ్యం బాధలు తలచుకుంటే, ఆమెలో మిగిలి ఉన్న కోపం కూడ హరించి పోయింది.

"ఏం చెయ్యమంటావు, వదినా? కాదను కున్నా కడు పులో బాధ బయట పడి పోతోంది. నాగతే ఇట్లా రాసి ఉంది. నావల్ల ఎవరికీ సుఖం లేదు. పాపిష్టిదానిని ఇక్కడ కూడా కలతలు తెచ్చాను —"

"అట్లా అనకు వదినా. నీమీద నాకు కోపంలేదు. నువ్వు వెళ్ళి నీ పిల్లలను పడుకోబెట్టుకో" అని రాజ్యం చేతిలో

నుంచి కంచాలు లాగి తనే కడిగి, వంటగది శుభ్రం చేసి వచ్చింది వరలక్ష్మి. రమణా, సూర్యావతీ ఒకమూల కునికిపాట్లు పడుతున్నారు. వరలక్ష్మి వాళ్ళ నెత్తుకొని వెళ్ళి సరిగా పడుకో బెట్టింది. రమణ మొగంమీద కన్నీటితో బాటు ముద్దులు కురిపించింది. రమణకివన్నీ తెలియవు. మంచి నిద్రలో ఉన్నాడు వరలక్ష్మి బాబు ఉయ్యాలలో సరిగా పడుకున్నాడో లేడో చూసి తలుపుకు గడియ వేసి భర్త దగ్గరకి వచ్చి కూర్చుంది. భర్త మొగంలోకి చూసింది. శ్రీహరి ఆమె కేసి నీరసంగా చూశాడు. హఠాత్తుగా వరలక్ష్మి లోపల దాగి ఉన్న బాధంతా ఒక్కసారి కట్ట తెగి ప్రవహించింది. భర్తను కౌగలించు కొని, అతని రొమ్ములో తలదూర్చి ఏమీ మాట్లాడకుండానే వెక్కి వెక్కి ఏడవ సాగింది. ఆపుకుందామన్నా ఆపుకోలేక పోయింది. ప్రక్క గదిలోవాళ్ళు వింటారేమోనని నోటిలో చీరకొంగు కుక్కుకుంది. శ్రీహరి తెల్ల బోయాడు. ఏమి చేయాలో ఎట్లా ఓదార్చాలో తెలియలేదు. ఆమెను దగ్గరగా పట్టుకొని ఆమె వెన్నుమీద రాస్తూ ఉండి పోయాడు.

కొంతసేపటికి ఏడుపు వేగం తగ్గినతరువాత వరలక్ష్మి అంది: "ఏమండీ నన్ను ఒకసారి పుట్టింటికి పంపించరూ. మా అమ్మనీ, నాన్ననీ చూడాలని ఉంది."

శ్రీహరి ఆమె కేసి ఆశ్చర్యంగా చూశాడు. "ఇప్పుడే మిటి? సమయంకాని సమయంలో! మీ అమ్మా నాన్నా రమ్మని ఏమీ రాయలేదు కదా," అన్నాడు.

"రాయకపోతేనేం? పుట్టింటికి వెళ్ళడానికి సమయం ఏమిటి? మీ అమ్మగారు చెప్పి పొడుస్తూనే ఉన్నారు ఎప్పుడూ ఇక్కడే పడి ఉంటున్నానని. మా అమ్మనీ నాన్ననీ చూసిఎంత కాలమయిందో! ఎట్లా ఉన్నారో! ఒకసారి చూసి రావాలని పిస్తోందండి. వెళ్తే అన్నం పెట్టడానికి జంకరుకదా. వాళ్ళు తినే పచ్చి మెతుకులే నాకూ రెండువేస్తారు."

"ఇంటిలో రాజ్యం ఉండగా నువ్విట్లా వెళ్ళిపోతే ఎవ రేనా ఏమనుకుంటారు?" వదిన ఉందికాబట్టే నేను వెళ్తాననేది. నేను లేకపోతే ఆమె కొన్నాళ్ళ పాటేనా సుఖంగా ఉంటుంది. ఆమే వండి పెట్టుంది. చేతకాని దేమీ కాదుగా–"

శ్రీహరి జవాబీయలేదు. ఆలోచిస్తూ ఉండిపోయాడు. "ఏమండీ, ఏమంటారు?" అని అడిగింది వరలక్ష్మి. అయినా జవాబులేదు శ్రీహరి నుంచి. మళ్ళీమళ్ళీ అడిగింది. చివరికి అంది: "మీకు కూడా నామీద జాలిలేదు. పోనీ వెళ్ళను లెండి–"

"అందుకోసం కాదు. ఇప్పుడు వెళ్తే బాగుండదు. నలుగురూ లేనిపోనివి చెప్పుకుంటారు ఏదో తగినంత కారణం ఉండి–"

"సరే వెళ్ళను లెండి. ఇందాకటి దానికి నామీద మీకుకోపం రాలేదు కదా?"

శ్రీహరి మాట్లాడ లేదు. కొంత సేపుండి "ఇప్పుడవన్నీ తలపెట్టకు. నిద్రపోదాం?" అన్నాడు.

వరలక్ష్మి కూడా నిద్రలో మరచిపోయింది ఆనాటి బాధలూ, కోరికలూ అన్నీని.

## ౧౪

వరలక్ష్మికి ఏ కోరికయితే ఉందో అది తీరిపోయింది. మర్నాడు పుట్టింటి నుంచిపిలుపు వచ్చింది. మంచి పిలుపు కాదు. ఆమె తండ్రి నాలుగురోజులు సుస్తీ చేసి చనిపోయాడని కబురు వచ్చింది. నవ్వుతూ వెళ్ళవలసిన వరలక్ష్మి ఏడుస్తూ పుట్టింటికి వెళ్ళింది. శ్రీహరి కూడా వెళ్ళి దిగబెట్టివచ్చాడు. మళ్ళీ చివరి రోజుల్లో వస్తానని చెప్పి.

వరలక్ష్మి వెళ్ళిన తరువాత ఆమె లేకపోతే ఆ యింట్లో ఎంతలోటో తెలిసింది అందరికీ. శ్రీహరి పరధ్యానంగా యంత్రవత్ పనిచేస్తున్నాడు. రాధకు మొదట్లో పెద్దదెబ్బ తిన్నట్లయింది. తన కాలేజీలో సాంస్కృతికోత్సవాలు వారం రోజుల్లోనే ఉన్నాయి. తను పాల్గొనే నాటకానికి వదిననూ పిల్లలనూ తీసుకు వెళ్ళాలని ఎంతో ఉబలాట పడ్డాడు. కాని ఇప్పుడు ఇట్లా అయింది. ఇంట్లో ఉండడానికే అతనికి మనసొప్పడం లేదు. సాయంత్రం రెహార్సల్సులో మునిగి ఉంటున్నాడు. ప్రొద్దున్నప్పుడు స్నేహితుల గదులకు వెళ్ళిపోతున్నాడు. శ్రీహరి తన ప్రైవేట్ల వల్లా, పరధ్యానం వల్లా తమ్ముడి చర్యలను గురించి పట్టించుకోవడమే లేదు. రాధకు వదినగారు లేకపోవడం అనే

లోటు ఒకమూల బాధిస్తున్నా లక్ష్మితో అతని పరిచయం మరింత నిస్సహితం కావడంవల్ల ఆనందానికి కూడా అంతులేక పోతోంది. పోనుపోను నవలలను గురించీ, అనేక ఇతరవిషయా లను గురించీ ఇద్దరి అభిప్రాయాలూ విచిత్రంగా ఒకటే అవుతు న్నాయి. రాధ లక్ష్మిని సంగీతపు పోటీలోనూ, వ్యాసరచనపో టీలోనూ పాల్గొమని ప్రోత్సాహమిచ్చి తానునాటకంలో పాత్ర వేయడమే కాకుండా వక్తృత్వ పోటీలోనూ, విచిత్ర వేషపు పోటీలోనూ చేరిచ్చాడు. నాలుగురోజులు పోయేసరికి వదిన మాటే మరచిపోయాడు.

వదిన పట్ల అసూయతో బాధపడిన రాజ్యానికి ఇప్పుడు భయం పట్టుకొంది. ఇట్లా జరుగుతుందని ఆమె అనుకోలేదు. వదిన ఏమనుకుంటుందో! అన్నయ్యా రాధాకూడా ఏమనుకుం టారో! ఇప్పుడు రోజంతా కావలసినంత మాట్లాడుకోవడా నికి స్వేచ్ఛ లభించినా తల్లీ కూతుళ్ళూ ఇదివరకులా ఉత్సాహం గా మాట్లాడుకో లేకపోతున్నారు. ఇంటిపనుల భారంకూడా మీదపడడంవల్ల రాజ్యానికి తీరికా లభించడం లేదు.

పదో రోజునాటికి శ్రీహరి అత్తగారి ఊరు వెళ్ళాడు. పద్నాలుగో రోజున వరలక్ష్మి కూడా తిరిగి వచ్చేసింది. మొద ట్లో కొన్నాళ్ళపాటు పుట్టింట ఉందామనుకుంది. కాని తీరా అక్కడ నాలుగు రోజులుండగానే అక్కడి పరిస్థితి అంతా అవగతమయింది. ఇద్దరు అన్నలూ తమ భార్యలెంత అంటే అంత. ఒకరంటే ఒకరికి పడదు. పెత్తనం అంతా కోడళ్ళదే

లోకం వెరపుతో కర్మఏదో జరిగిం దనిపిస్తున్నారు. కర్మ పూర్తి గాకమునుపే కొడుకులూ కోడళ్లూ ఆస్తి పంపకాల తాప త్రయంలో పడిపోయారు. ఇంతాచేసి ఉన్న ఆస్తి అల్లా తాటాకు ఇల్లూ, ఎనభై సెంట్ల భూమీ, ఇంట్లో చెంబూ తప్పాలా! దీని కోసమే వాళ్లు తండ్రి బ్రతికుండగానే పంపకాలు చేసేయమని మొదలుపెట్టారు. "నాయనా నేను బ్రతికుండగా అలాంటి పని చేయకండిరా. ఈ ఘటం వెళ్లే వర కేనా ఊరుకోండిరా. ఈ ఘటాన్ని ఇలా పోనీయండి." అని ఆయన ఎంతో బ్రతిమాలుకోగా ఎట్లాగో అప్పటికి ఓపిక పట్టారు. ఆయన పోయేముందు ఒకసారి కూతుళ్లని ముగ్గురినీ చూడాలని ఎంతో కాంక్షించాడట. "ఇట్లాంటి సుస్తీలూ, నూలుగులూ మామూలే కదా. చీటికి మాటికి రమ్మని రాయడం మొదలు పెడ్తే వాళ్ళేమనుకుంటారు? పోలేదు ఖర్చుకూడ" అని చెప్పి ఊరుకున్నారు కొడుకులు. నిజంగా ముసలాయనిది మామూలు సుస్తీలాగేఉంది. కాని ఆయన కెందుకో తనకు చావు ఆసన్నమైందని తోచింది. కాని కొడుకుల కెట్లానచ్చజెప్పడం? ఒక్కదణ్ణం పెట్టి, లోలో పల కుమిలి పోతూనే నాలుగోరోజు తెల్లవారు జామునే కళ్ళు మూసేశాడట. వరలక్ష్మి ఇది విని ఎంతగానో ఏడ్చింది. కన్న కూతుళ్ళను కూడా కడసారి చూడడానికి నోచుకోని జీవితం తండ్రిది. ఎందుకోసం కూతుళ్ళు? రక్తమాంసాలుధారపోసి వాళ్ళనెందుకు పెంచినట్లు? ఎందుకు పెళ్ళిళ్ళు చేసినట్లు? కనీసం తల్లినీ అక్కలనీ చూడగలిగానని వరలక్ష్మి కొంత ఊరట

పొందింది. ఆమె మొదట్లో అక్కలను గుర్తుపట్టలేక పోయిం ది. పెద్దక్కమీద అప్పుడే ముసలి తనపుఛాయలు పడుతు న్నాయి. జుట్టు నెరుస్తోంది. కళ్ళలోతుకు పోయాయి దవడలు నొక్కుకు పోయాయి. రెండవ అక్క దానికి భిన్నంగా అడ్డం గా ఊరిపోయింది. వారిద్దరినీ చూసి తనవయస్సు వచ్చిన తరు వాత పెద్దక్కగారిలా అవుతానా లేక చిన్నక్కగారిలా అవు తానా అని ఆలోచనలోపడింది వరలక్ష్మి. అక్క రూపాలు మారడమే కాదు వాళ్ళ స్వభావాలు కూడ మారిపోయినట్లు న్నాయి. కూపస్థ మండూకాల్లా ఎంతసేపు తమ సంసారపుగొడ వలూ, తమ అత్తగార్లూ, ఆడ బిడ్డలూ, ఆఖరికి భర్తలపై విమ ర్శలతో, ఆక్షేపణలతో వాళ్ళ కబుర్లు నిండిపోయాయి. ఇక్క డకు వచ్చిన తరువాత వదినగార్ల మీద గుసగుస లాడడం ఎక్కువైంది. వాళ్ళలో ఇదివరకుటి ఆత్మీయతా, అమాయ కత్వమూ, పుట్టింటి చిలిపితనమూ కనిపించడం లేదు. ఒకవేళ తనుకూడా మారిపోలేదు కదా అని సందేహించింది వరలక్ష్మి. మరికొన్నాళ్ళు పోతే తమ రొకరొకర్ని తలచుకోవడమే అరు దైపోతుందేమో. తమ కెవ రెవరికి ఎందరు పిల్లలోకూడా వా ళ్ళకు గుర్తులేదు. అక్క చెల్లెళ్ళమధ్యే ఇట్లాఉంటే ఇకపిల్లల మాట చెప్పాలా? వాళ్ళు మొదట తాము చుట్టాలమని కూడా తెలుసుకోలేక పోయారు. కాని పిల్లలు కాబట్టి ఒక్క రోజు లోనే కలిసి పోయారు. వాళ్ల ఆటలూ, కొట్లాటలూ, పరా మర్శ చేసే వాళ్ల రాకపోకలూ, తల్లి ఏడుపులూ, వదినగార్ల ఝుంకారాలూ, పురోహితుల మంత్రాలతో చనిపోయిన

వారికి ఆత్మశాంతి కాదుగదా బ్రతికున్నవారికి కూడా ఆత్మ క్షోభ బయలు దేరేట్లుంది. అందువల్ల తల్లిని విడవాలని లేక పోయినా ఎట్లాగో తెగ తెంపులు చేసుకొని వచ్చేసింది వర లక్ష్మి భర్తతో బాటు.

ఇంటి ఆయన రామలింగంగారి కొడుకూ కోడలూ కూడా తీర్థ యాత్రలు ముగించుకొని వచ్చారు. వచ్చిన తరు వాత సంతర్పణ ఏర్పాటు చేశారు. ఈసంతర్పణ నెపంతో రామలింగంగారు ప్రక్క పోర్షనులో ఉన్న బిల్లు కలెక్టరు కుటుం బాన్ని వెళ్లగొట్టాడు. బిల్లు కలెక్టరు భార్య నెలనెలా అద్దె చె ల్లిస్తానని, భర్త తాలూకుకొద్దిపాటి ప్రావిడెంటు ఫండు రాగానే దానిలోనుంచి ఇంతవరకూ ఉన్న బకాయి తీర్చేస్తాననీ మొర పెట్టుకుంది. "నెలనెలా ఎట్లా అద్దె ఇస్తావు?" అని అడిగాడు ఇంటి ఆయన. "ఎట్లాగైతే మీకెందుకు, చెల్లిస్తానుగదా" అని బ్రతిమాలింది ఆమె. శ్రీహరినీ రామకృష్ణమూర్తినీ వాళ్ళను కూడా చెప్పమని వేడింది. భర్త పోయినతరువాత ఆమె తోబు ట్టువులు ఒకమారువచ్చి తీసుకువెళ్ళి నాలుగు రోజులుంచుకొని పంపించేశారు. తరువాత కొన్నాళ్ళు చూసి ఇక వేరే దిక్కు లేదని బిల్లుకలెక్టరు భార్య చాటుగాపోయి కొందరిళ్ళలో పిండ్లు విసరి పెట్టి, చిన్నపనులు చేసి అవసరమైతే వంటకూడా చేసి నాలుగు డబ్బులు తెచ్చుకోసాగింది. చివరికి పూర్తిగా వంటకు కుదిరి పోయింది. పైకి చెప్పుకోవడానికి సిగ్గు. పెద్దకొడుకుని ఒక దుకా ణంమీద పెట్టించి, రెండోవాడిని పేపర్లమ్మేవాడుగా ఏర్పాటు చేయించింది. ఇదంతా ఏమి చెప్పుకోగలదు? శ్రీహరీ రామ

కృష్ణమూర్తి ఆమె తరఫున ఇంటిఆయనతో చాలా చెప్పారు. ప్లీడరు గుమాస్తా "ఫరవాలేదమ్మా నువ్వు ఇంట్లోనుంచి కదలకు ఏంచేస్తారో చూద్దాం ఏసహాయం కావలసినా నేను చేస్తాను" అని చెప్పాడు. కాని ఇంటి ఆయన " నా అవసరానికి వచ్చిన ప్పుడు కూడా ఇల్లు ఖాళీచేయకపోతే ఎట్లా? రేపు పెద్ద సంతర్పణ చేయాలి. వంటపెద్దు కావాలి," అని చెప్పి చివరికి ఆమెను లేవ గొట్టేశాడు. ఆమె లబోదిబోమంటూ వరలక్ష్మి వాళ్ళదగ్గర సెలవు తీసుకొని పిల్లలచేతే మంచాలూ అవీ పట్టించుకొని వెళ్ళిపో యింది. వరలక్ష్మి తన దుఃఖంలో కూడా ఆమెకోసం ఎంతో జాలిపడింది. ఈసంఘటన శ్రీహరిని మరీ కదిలించివేసింది. అత నిలో పెద్దభయం పట్టుకుంది. తాను ఈనాటివరకూ నెలతప్పక అద్దెచెల్లిస్తున్నాడు కాబట్టి ఇంటి ఆయన ఇంత గౌరవం ఇస్తున్నాడు కాని రేపు తనూ అద్దె బకాయిపడితే ఎంత తృణీకరిస్తాడో! నిర్మొహమాటంగా ఇంట్లో నుంచికూడా లేవగొట్టవచ్చు. తన సంసారం బిల్లుకలెక్టరు సంసారంలా కాదు గదా? ఖర్చులు తలకు మించిపోతున్నాయి. ఎట్లా?

ఇంటి వారింట్లో సంతర్పణ జరిగింది. బ్రాహ్మలూ చుట్టాలూ వాళ్లూ కలిసి రెండువందలమంది దాకా భోజనానికి లేచారు. శ్రీహరి ఇంట్లోనుంచి శ్రీహరీ, రమణా రాజ్యం, రాజ్యం పిల్లలూ మాత్రమే వెళ్లారు. బ్రాహ్మణుల గోవిందా లతో ఇల్లుమారు మ్రోగిపోయింది.

శ్రీహరి ఇంట్లోమాత్రం నిశ్శబ్దం వ్యాపించింది. వర లక్ష్మి ఇప్పుడు ఒక్క సారిగా ఇరవైఏళ్లు పెద్దదైపోయిన

ట్లుంది. ఆమె మొగంలో చిరాకూ లేదు. చిలిపి తనంలేదు. ఏదోనిర్లిప్తత. మాట్లాడడం కూడా తక్కువై పోయింది. శ్రీహరి సరేసరి. తన సమస్యలతో తాను కొట్టుమిట్టాడుతూ మౌన వ్రతం వహించి చాలాకాలం అయింది. అన్నావదినలు ఈవిధంగా ఉంటే రాధకేదో ఊపిరాడనట్లుంటోంది. సాధ్యమైనంత వరకూ బయటే కాలక్షేపం చేస్తున్నారు. ఈవాతావరణంలో రాజ్యానికి కూడా భయం వేసింది.

ఒక రోజున ఆమె వరలక్ష్మి దగ్గరికి చేరి మెల్లగా అంది "వదినా, అన్నయ్యతో చెప్పి, త్వరలో నన్ను పంపించడాని కేర్పాట్లు చెయ్యమని."

వరలక్ష్మి రాజ్యంకేసి నిదానంగా చూసింది.

"కోపంతో అనడంలేదు. వదినా. నువ్వు నిజంగా నన్ను చాలా బాగా చూస్తున్నావు. నాఅల్ప బుద్ధివల్లే నీమనసు నొప్పించాను. నేనెంతకాలం ఇక్కడ ఉంటాను చెప్పు? ఇంకా ఆలస్యం చేస్తే వాళ్లుఅసలు నన్ను గుమ్మం తొక్కనీయరేమో. కలకాలం ఇక్కడే ఉండిపోతే లోకం ఏమంటుంది?" అంది రాజ్యం.

"ఇట్లాగే తిరిగి వెళ్తే, వాళ్లకు మరింత లోకువై పోవూ? ముందు వాళ్లకు తెలిసి వచ్చేటట్లు చెయ్యాలి."

"వాళ్లు ఒకరు చెపితే వింటారనేనా, వదినా? అట్లాంటి వాళ్లయితే ఇంతదూరం ఎందుకు వస్తుంది? వాళ్లని దారికి తేవడానికి ఏముపాయముంది చెప్పు?"

వరలక్ష్మి మాట్లాడ లేక పోయింది.

"పెద్ద పిల్లవాడు అక్కడే ఉండిపోయాడు. వాడిని చూడాలని ఉంది. ఎట్లా ఉన్నాడో ఏమో. కబురేనా లేదు. వెళ్ళిపోతాను వదినా ఏమైతే అదే అవుతుంది" అంది రాజ్యం.

"చూదాం. తొందర పడకు" అని మాత్రం అనగలిగింది వరలక్ష్మి.

కాని ఆ సాయంత్రం ఇంట్లోకి వస్తున్న మనిషిని చూసి అందరూ స్తంభించి పోయారుకొన్ని క్షణాల సేపు. వరలక్ష్మి శ్రీహరి ఇద్దరూ ఒకేసారి రాజ్యంకేసి చూశారు. రాజ్యం మొగంలో ఆశ్చర్యం, భయం, కోపం, అంతలో ఆనందం, సిగ్గూ, మళ్లీ కోపం త్వర త్వరగా వచ్చి పోతున్నాయి. లోపలకు పరుగెత్తింది. ఎన్ని చేసినా భర్త భర్తే! శ్రీహరి బావగారిని పలకరించాడు. వరలక్ష్మి లోపలికి వెళ్లి రమణచేత కాళ్లు కడుగుకుందుకు నీళ్లు పంపించింది. శ్రీహరి "ఇంట్లో అంతా కులాసాయేనా?" అని అడిగాడు. "ఆ అంతా కులాసాయే అన్నిగారేరీ" అని అడిగాడు రాజ్యం భర్త శ్రీనివాసు. పిల్లలిద్దరూ వచ్చి చుట్టుముట్టగా వాళ్లకు మిఠాయి పొట్లాలిచ్చి ఒకపొట్లం పెట్టాడు. ఆఖరి పిల్ల వాడిని ఎత్తుకొని ముద్దాడాడు.

సూరమ్మగారు వచ్చింది. వస్తూంటే వరలక్ష్మి అత్తగారి చెవిలో ఊదింది "ఆగాడవ ఏమీ ఎత్తకండి," అని.

సూరమ్మగారిని చూసి "కులాసాగా ఉన్నారా, అత్తగారూ' అని ఎంతో ఆత్మీయత వెలిబుచ్చుతూ పలకరించాడు శ్రీనివాసు. సూరమ్మగారు ఆపిలుపుకు పొంగిపోయింది. వియ్యంకుడు వియ్యపురాళ్ళ యోగ క్షేమాలను గూర్చి అడిగి తెలుసుకుంది. శ్రీహరి కొంతసేపు బావగారితో అదీ ఇదీ మాట్లాడి లోపలి వైపుకు చూసినప్పుడు భార్య సంకేతం అందుకొని 'ఇప్పుడే వస్తాను. ఇంటి ఆయనతో ఒకమాట మాట్లాడిరావాలి నువ్వు గదిలోకి పోయి కూర్చో" అని చెప్పి అవతలకు నడిచాడు. సూరమ్మగారు "రా నాయినా వరండాలోకి ఎందుకు" అని గదిలోకి దారి చూపించి. వరలక్ష్మి అత్తగారిని రమ్మని సైగచేసింది. పిల్లల్ని కూడా తీసుకురమ్మని చేయిఊపింది. సూరమ్మగారు పిల్లల్ని తీసుకొని వంటింట్లోకి వచ్చింది. వరలక్ష్మి కాఫీకాచి గ్లాసులోపోసి రాజ్యాన్ని భర్తకిచ్చి రమ్మంది. రాజ్యం ఒప్పుకోలేదు. వరలక్ష్మి బలవంతాన గ్లాసు ఆమెచేతిలో పెట్టి "వెళ్ళిరా, ఇంకా కనిపించకపోతే అలిగి వెనక్కి వెళ్ళిపోతాడు", అని ఎదరకు తోసింది. అత్తగారినీ పిల్లలనీ రమ్మని పెరట్లోకి దారి తీసింది. రాజ్యంపిల్లవాడిని" మీనాన్న మీకేమి తేచ్చాడు చూపించు" అంటూ కబుర్లలోకి దింపింది.

శ్రీనివాసు శ్రీహరి గదిలో మంచంమీద కూర్చున్నాడు. రాజ్యం జంకుతూ వెళ్ళి, గడప దగ్గర ఒకసారి ఆగి తలవంచుకొని మెల్లగా అడుగులు వేస్తూ వెళ్ళి భర్తకు మౌనంగా కాఫీగ్లాసు అందించింది. శ్రీనివాసు కాఫీగ్లాసు అందుకొని " రాజ్యం " అని మెల్లగా పలకరించాడు. ఆమె త

ఎత్తి భర్త కేసిచూసి, వెంటనే తలవంచేసుకుంది. ఒక్కసారిగా ఆమెలో ఏడుపు పొంగి వచ్చింది. మంచం పందిరి స్తంభానికి ఆనుకొని మొగం చేతుల్లో దాచుకొని ఏడ్చింది. శ్రీనివాసుకు ఏమిచేయాలో తోచక కాఫీ త్రాగి గ్లాసు బల్లమీద పెట్టాడు. మెల్లగా లేచి వెళ్ళి ఆమెతలమీద రాశాడు. ఆమెను దగ్గరకు తీసుకున్నాడు. దుఃఖవేగం తగ్గిన తరువాత రాజ్యం కొంగుతో కళ్ళు తుడుచుకొని భర్త మొగంకేసి ఓరగాచూస్తూ "ఇప్పటికేనా నేనున్నానని జ్ఞాపకం వచ్చింది. అదే పెద్ద సంతోషం" అని మూతి ముడుచుకుంది. శ్రీనివాసు ఆమెబుగ్గ గిల్లుతూ "నామీద నీకింకా కోపం పోలేదా, రాజ్యం?" అన్నాడు చిలిపిగా నవ్వుతూ.

"పెద్దాణ్ణి కూడా తీసుకు రాలేదేం?" అని అడిగింది రాజ్యం.

"ఇంతలో తీసుకు వచ్చేదేమిటని మానేశాను. నిన్ను ఎల్లుండే తీసుకురమ్మని మానాన్నగారు ముహూర్తం పెట్టారు."

రాజ్యం భర్తకౌగలిలోనుంచి విడబడి ఒక్క నిమిషం భర్త కళ్ళలోకిచూసి "ఉండండి వస్తాను." అనికాఫీ గ్లాసు తీసుకొని వెళ్ళిపోబోయింది. గడప దగ్గర ఆగి "అన్నట్లు మా వదిననొకమారు పరామర్శ చేయండి. ఆమె తండ్రి ఈమధ్యే పోయాడు. రండి." అని పెరటివైపుకు నడిచింది. శ్రీనివాసు ఆమె వెనకాలే వెళ్ళి వరలక్ష్మిని పరామర్శించి వచ్చాడు.

రాధ వచ్చాడు. శ్రీనివాసే పలకరించాడు రాధని. "ఏమోయి కులాసా యేనా? బాగా చదువు తున్నావా?" అని. రాధ "ఆ" అనిమాత్రం జవాబుచెప్పి పెరట్లోకి వెళ్ళిపోయాడు. బావను చూసి అతనూ కొన్ని క్షణాలు తెల్లపోయాడు. తరువాత అతనిలో కోపం కట్టలు తెగి ప్రవహించింది. ఎట్లా బావకు బుద్ధి చెప్పడం అన్న ఆలోచనలో పడిపోయాడు. వరలక్ష్మి అతని దగ్గరికి వచ్చి, "చూడు రాధ, మీఅక్కయ్యకోసం బావ వచ్చాడు అదే పదివేలు. అతన్నేమీ అనకు నీకు పుణ్యం ఉంటుంది. మర్యాదగా ప్రవర్తించు" అంది "అక్కయ్యకోసం బావ వచ్చాడంటా వేమిటి. దానికోసం యజమాని వచ్చాడనక? ఇంట్లో ఈదాసీ లేకపోతే చాలా ఇబ్బందిగా ఉండి ఉంటుంది. అందుచేత వచ్చిఉంటాడు. పెద్ద మనిషి! మర్యాదగా ప్రవర్తించాలా పసువులా ప్రవర్తించిన వాడితో? ఉండు ఒక్కసారి నాలుగూకడిగేస్తాను" అని లోపలికి పోబోయాడు. వరలక్ష్మి అతనిని అడ్డగించి "వద్దు రాధ, పట్టుదలలూ పంతాలకుపోతే, మీ అక్క సంసారం చెడితుంది నామాట విను. మీఅక్కయ్యకూడా కోపం మరిచిపోయింది." అంది. "నెల రోజులు కనిపించక పోయే సరికి ఇప్పుడు మొగుడు కావలసి వచ్చినట్లున్నాడు. ఛీ. ఏం మనుషులు!" అన్నాడు రాధ.

"గట్టిగా అనకయ్యా బాబూ, నీకు దణ్ణం పెడతాను" అంది వరలక్ష్మి.

తల్లికూడా వచ్చి "ఒరేయి నాయనా బావనేమీ అనకు బాబూ," అని వేడింది.

"సరే నాకెందుకు మధ్య?" అన్నాడు రాధ మొగం చిట్లించుకొని.

రాజ్యం అటురాగా ఆమె కేసిచూశాడు. ఆమెమొగం లో ఆనందరేఖలుస్పష్టంగా కనిపిస్తున్నాయి. అత్తగారింటికి ప్రయాణం కాబోలు" అన్నాడు రాధ కొంచెం వెటకారంగా.

"నీపెళ్ళికి మళ్ళీ వస్తాలే" అంది రాజ్యం నవ్వుతూ.

శ్రీహరి తిరిగి వచ్చాడు. బావగారితో కబుర్లు చెప్ప సాగాడు చెల్లెలిబాధల మాటలు పరోక్షంగా కూడా ఎత్తక. రాధ మాత్రం బావగారితో మాట్లాడలేక పోతున్నాడు. తప్పని సరి అయితే రెండుముక్కలు మాత్రం మాట్లాడి ఊరుకుంటు న్నాడు.

ఇంట్లో శ్రీనివాసుకు ఘనంగా మర్యాదలు చేస్తు న్నారు. పిండివంట లేమిటీ- అతన్ని కొత్తఅల్లుడిని చూసి నట్లే చూస్తున్నారు. శ్రీనివాసుకు మర్నాడు భార్యాని పిల్ల లనీ సినీమాకు తీసుకువెళ్ళాడు. రాధని కూడారమ్మన్నాడు. కాని రాధ నాకు పరీక్షలు సమీపిస్తున్నాయి రాలేను అని చెప్పాడు.

శ్రీహరి ఆరోజు ప్రొద్దున్నే వరలక్ష్మితో సంప్రతించా డు. రామకృష్ణమూర్తి గారినీ ఇంటి వారినీ బదులు అడగడం మంచిది కాదనుకున్నాడు. ఆ చార్లుగారు ఆస్తిపరుడేకాని ఇచ్చే టట్లు లేదు. వెనక పదిరూపాయిలు ఇస్తున్నప్పుడే మొగం అదోలా పెట్టాడు. ఇంకెవరినీ అడగడం? చివరికి సుబ్బారావును సలహా అడిగాడు. "చాలా అవసరం వచ్చింది. వందరూపా యిలు కావాలి, ఇంటికి రాకరాక బావగారు వచ్చాడు. ఆయ

నకీ, మా చెల్లెలికీ, పిల్లలకీ మంచి బట్టలిచ్చి పంపాలి" అని చెప్పాడు శ్రీహరి. సుబ్బారావు "నువ్వో మాదారిలో పడిపోతున్నావు. సరేరా. కాని నీవు ఎంతకాలంలో చెల్లిద్దామనుకుంటున్నావు. ప్రామిసరీ నోటు రాస్తే మూడేళ్ళ వరకూ వ్యవధి ఉంటుంది. కాని అట్లా ఇచ్చేవారు నీగురించి వాకబు అంతా తెలుసుకొని కాని ఇయ్యరు. నీగుట్టు రచ్చకెక్కుతుంది. చాలా కొద్ది కాలంలోనే చెల్లిస్తానంటే సులభంగానే దొరుకుతుంది" అన్నాడు. "కొద్ది వాయిదాలలోనే తీర్చేస్తాను. అప్పునెత్తిమీద ఉంచుకోవడం ఇష్టంలేదు. ఈసారి ఇట్లాంటి పరిస్థితి వచ్చింది కాబట్టి అప్పుచేస్తాను. ముందు ఏమైనా అప్పులు చేయను" అన్నాడు శ్రీహరి. అంటూనే తనమాటలుతనే శంకించాడు. సుబ్బారావు అతనిని ఒకమార్వాడీ దగ్గరకు తీసుకువెళ్లి పరిచయం చేశాడు. మార్వాడీ శ్రీహరి చేత వందరూపాయిలకు సంతకం చేయించుకొని తొంభైఐదురూపాయిలు మాత్రం చేతికిచ్చి మూడు వాయిదాలలో తీర్చమని చెప్పాడు. తొంభైఅయిదే ఇచ్చారేం అన్నట్లు శ్రీహరి ప్రశ్నార్థకంగా చూస్తుండగా "ఇదే మాపద్ధతి వడ్డీ ముందరే తీసుకుంటాం ఆనక పేచీ పూచీలు లేకుండా," అన్నాడు మార్వాడీ. "మీరు కొత్తవారయినా సుబ్బారావుగారు చెప్పారు కాబట్టి ఇస్తున్నాను" అని ఎంతో మెహర్బానీ చూపుతున్నట్లు మాట్లాడాడు.

శ్రీహరి ఆడబ్బు తీసుకొని బావగారికి మంచి సిల్కు పంచా, ఖండువా, ఖరీదైన చొక్కా గుడ్డా, చెల్లెలికి ఖరీదైన

చీర, జాకెట్టు గుడ్డా, పిల్లలకి లాగు చొక్కాలకు గుడ్డలు కొని వెంటనే కుట్టువాడికి బట్టలిచ్చి, మర్నాడు పొద్దున్న కందజేయాలని చెప్పి కొలతల కింటికి రమ్మని చెప్పివచ్చాడు. వీసెడు మిఠాయి కూడా తెచ్చాడు. మర్నాడు చెల్లెలికీ, బావగారికీ పిల్లలకీ బట్టలు పెట్టి, రైలు ఛార్జీకూడా ఇచ్చి, చెల్లెలిని సారెతో ఘనంగా అత్తవారింటికి పంపించాడు. ఎంతో సంతోషంతో ఊపిరి పీల్చుకున్నాడు శ్రీహరి, వరలక్ష్మి, సూరమ్మగారు. రాధ మాత్రం పళ్ళు కొరుకు కున్నాడు. ఆనెల మొదటి సారిగా శ్రీహరి అద్దె బకాయి పెట్టేశాడు.

## ౧౫

ఇంటి ఆయన లోపల గుంజుకున్నా పైకి ఏమీ అనలేక పోయాడు. శ్రీహరి "నాలుగు రోజుల్లోనాకు ప్రైవేట్లు డబ్బువస్తుంది. అప్పుడు ఇచ్చేస్తాను." అని చెప్పాడు. "సరే ఆమాత్రం ఆలస్యానికి నేనేమంటాను! నెలల తరబడి బకాయి పెట్టకుండా ఉంటే సరే" అన్నాడు ఇంటిఆయన. శ్రీహరి ప్రావిడెంట్ ఫండ్, 'లోను' వాయిదా తరుగుపోగా మిగిలిన జీతంలో ముప్పై రూపాయిలు పట్టుకువెళ్ళి మార్వాడీకిచ్చి వచ్చాడు. మిగిలిన సొమ్ములో చాలావరకూ కిరాణాకొట్టు మీదే అయిపోయింది. వెనకటి అరువు తీరిస్తే కాని ఈ నెలకు సరుకు లియ్యనన్నాడు దుకాణదారు. అతను చెప్పినట్లే చేయవలసి వచ్చింది శ్రీహరి. ఇంటికి వచ్చేసరికి ఐదు రూపాయల చిల్లరే మిగిలింది.

అందువల్ల పనిమనిషికి మాత్రం మూడురూపాయ లిచ్చేశాడు. పాలమనిషిని ఇంకో నాలుగు రోజులు ఓపిక పట్టమని, ప్రైవేట్ల డబ్బు రాగానే ఇస్తానన్నాడు. ఆమె సరే బాబూ అని వెళ్లిపోయింది. కాని మర్నాటి నుంచి రోజూ పొద్దున్న పాలుపోసినప్పుడు "డబ్బొచ్చిందా, బాబూగారూ" అని అడుగుతోంది. తడవ తడవకీ రాలేదని చెప్పడానికి సిగ్గుగా ఉంది శ్రీహరికీ వరలక్ష్మికీ. ప్రైవేట్ల డబ్బు చేతికి త్వరగా రావడంలేదు. పిల్లల తల్లి దండ్రులకు వాళ్ళ ఇబ్బందులు వాళ్ళకున్నట్లున్నాయి. అందువల్ల మామూలు కన్న ఆలస్యం చేశారు.

నాలుగు రోజులికి శ్రీహరి అద్దె ఇవ్వక పోయే సరికి ఇంటి ఆయన రామలింగంగారు కంగారు పడడం మొదలు పెట్టారు. సూటిగా అడగడానికి మొహమాటం. ఆరోజు సాయంత్రం ఆయనా కొడుకూ కలిసి ఎక్కడికో వెళ్ళారు. వాళ్లు వెళ్ళిన కాసేపటికి ఇంటి ఆవిడ కామాక్షమ్మ గారు వరలక్ష్మి దగ్గరకు వచ్చి "అమ్మాయీ, నీదగ్గర ఇరవై రూపాయిలుంటే ఇద్దూ. ఆయనా లేరు, అబ్బాయి లేడు సమయానికి కట్టెలవాడు నెత్తి మీదకి వచ్చి కూర్చొన్నాడు," అంది.అప్పుడు శ్రీహరి ఇంట్లోనే ఉన్నాడు. "ఉండండి, వారి దగ్గర ఉందేమో అడిగి వస్తాను" అని గదిలోకి వెళ్లి భర్తతో చెప్పింది వరలక్ష్మి. శ్రీహరి అంతా వినే ఉన్నాడు. జేబులో నుంచి రెండు రూపాయిల చిల్లర తీసి ఇదే ఉంది అని చూపించాడు. వరలక్ష్మి తిరిగి వచ్చి, "వారి దగ్గర రెండు రూపాయితే

ఉన్నాయండీ. మీకద్దె కూడా ఇవ్వాలి. ఇంకా ప్రైవేట్ల డబ్బు రాలేదట. రేపో ఎల్లుండో ఇచ్చేస్తాం తప్పక" అంది. "అయ్యో దానికోసం కాదమ్మా. ఆ కట్టెలవాడు నెత్తిమీద కూర్చున్నాడు. అందుకోసం అడిగాను. పోనీ ఏంచేస్తాం? తరువాత రమ్మంటాను" అని వెళ్లిపోయింది ఇంటి ఆవిడ.

వరలక్ష్మి భర్త దగ్గరికి వచ్చింది. "చూశారా అద్దె కోసం తిన్నగా అడగలేక ఈ పద్ధతి అవలంభించారన్నమాట. ఆకట్టెలవాడు ఇంటివారు డబ్బు ఎగ్గొట్టేసేటంత బీదవాళ్ళనేనా ఇంత నెత్తిమీద కూర్చుంటూ? పోనీ ప్రక్కన రామకృష్ణమూర్తి గారిని అడగ కూడదూ? పైగా సొమ్ము లేకనేనా ఈనాటకం? ఆవిడ దగ్గరే ఉంటుంది ఎప్పుడూ బోలెడు డబ్బు. కోడలి దగ్గరా ఉంటుంది. పదిహేనే అడిగితే బాగుండదని ఇరవై అడిగింది. ఎంత తెలివితేటలు!" అంది ఆమె.

శ్రీహరి దీర్ఘంగా ఊపిరి తీసుకొని "ఇంకా వాళ్లు ప్రైవేట్ల డబ్బు ఇవ్వడం లేదు. వాళ్ళ నెట్లా గట్టిగా అడగడం? గట్టిగా అడిగితే ప్రైవేట్లు చాలించు కుంటారు. ఆ డబ్బురాగానే వీళ్ళ మొగానపడేస్తాను అద్దె. వీళ్ళతో డబ్బుసంబంధం తప్ప యింకో సంబంధం ఏముంది మనకి" అన్నాడు.

"పాపం ఆబిల్లు కలెక్టరు భార్యని వెళ్లగొట్టేశారా, ఇప్పుడు ఆ మెడ్డు మళ్ళీ అద్దెకిచ్చారు. రేపు పొద్దున్న దిగుతున్నారట ఆకొత్త వాళ్లు. ఆ సంతర్పణ ఒకసారు అన్నమాట" అని వరలక్ష్మి తనపని చూసుకోవడానికి వెళ్లి పోయింది.

శ్రీహరి మనస్సు పరిపరివిధాల పోతోంది. సాఫీగా పోతుందని గర్వించిన తన జీవితం ఇట్లా ఒడిదుడుకుల్లో పడిపోయింది. ముందు ఇంకా ఏముందో? ఇంటివారి ప్రవర్తన అతనిని మరీ బాధిస్తోంది. అంత ఆస్తిపరులు ఒక్క పదిహేను రూపాయలకు గిజగిజ కొట్టుకుంటున్నారే!

మర్నాడు ప్రొద్దున్న అతను ప్రైవేట్లకు పోబోతుంటే, పెద్దులోకి మకాము వచ్చేవారు అప్పుడే తమ సామాను దింపు కుంటున్నారు. దారికడ్డంగా ఉండడం వల్ల శ్రీహరి మెల్లగా తప్పించుకొని వెళ్ళవలసి వచ్చింది. అతనికి బిల్లుకలెక్టరు సంసారం జ్ఞాపకం వచ్చింది. అటు వంటిదే నేమో ఈ సంసారం కూడా. ఏమిటో ఈ జీవితాలు అనుకుంటూ శ్రీహరి సైకి లెక్కి ప్రైవేట్లకు వెళ్ళాడు. డబ్బుమాట అడగనా మాననా అను కొంటూండగా వాళ్ళే డబ్బిచ్చి వేశారు అతనికి.

తిరిగి వచ్చేటప్పుడు శ్రీహరి ఇంటివారింట్లోకి నడిచాడు అద్దె ఇచ్చివేద్దామని. కాని ఇంటి ఆయన కనిపించలేదు. 'రామ లింగంగారు' అని కేకేశాడు. రామలింగంగారు భార్య వంటింట్లో ఉంది. శ్రీహరి కేకవిని "వారూ అబ్బాయీ ఊళ్ళోకెళ్ళారు బాబూ. కోడలి ఒంట్లో బాగుండకపోతే లేడీ డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళారు" అని చెప్పింది ఆవిడ. "సర్లే లెండి. సాయంత్రం వస్తాను" అనివచ్చేశాడు శ్రీహరి.

వరలక్ష్మి అతనిని చూసి "ఆ పెద్దులోకి కొత్తగా అద్దెకువచ్చారు చూశారా. ఈసారి పిల్లలాట్టే లేరులెండి. మొగుడూ పెళ్ళామే. కాని ఇటు వచ్చారో లేదో అప్పుడే

బదుళ్ళు మొదలెట్టింది ఆమహా తల్లి! ఈబదుళ్ళు చేసే వాళ్ళను చూస్తే చాలాచిరాకు. ముందు మన వాటాయే ఉందికూడా అన్నట్లు ఈవేళేనా ఇచ్చారా లేదా డబ్బు?" అని అడిగింది.

"ఆ ఇచ్చారు. అద్దె ఇచ్చేద్దామంటే ఇంటి ఆయన లేరు" అన్నాడు శ్రీహరి.

"పోనీ ఆవిడ కిచ్చెయ్యక పోయారా? కంగారు పడిపోయింది పాపం! సరేలెండి, సాయంత్రం ఇవ్వావచ్చు. ఇంతలో కొంప మునిగిపోదుగదా. అసలు వాళ్ళనైజం బయట పెట్టేందుకు మరి కొన్నాళ్ళు ఆలస్యం చేసి ఇస్తే బాగుంటుందేమో" అంది వరలక్ష్మి.

కాని శ్రీహరి ప్రొద్దున్నే అద్దె చెల్లించివేయక పోవడం పొరబాటైంది. ఆసాయంత్రం బడినుంచి వస్తూంటే సుబ్బారావు అతని వెంటబడ్డాడు. "బ్రదర్, చాలా ఇబ్బందిలో ఉన్నాను. అర్జంటుగా పదిరూపాయిలు కావాలి. నువ్వే గట్టెక్కించాలి." అన్నాడు. శ్రీహరి తనపరిస్థితి చెప్పాకున్నాడు. "పరవాలేదు లేవోయి, ఇంటివాళ్ళకు మరీ అంత హడలి పోకూడదు. రేపు నెల జీతంలో ఇచ్చేస్తానుకా. నీదగ్గర అబద్ధ మాడతానా? పీకల మీదికివచ్చింది. మా ఆవిడ మంచాన పడింది. వెంటనే వైద్యం చేయించకపోతే ప్రమాదంలా ఉంది. బాబ్బాబు కాదనకు. ఒక్క పది రూపాయిలు ఎట్లాగో 'స్పేర్' చెయ్యి. అంతగా అవసరమైతే నాకు చెప్పు. ఆపైలా పచ్చీసుగాడు లేడూ సుందరావు. డబ్బు నీళ్ళలా ఖర్చుపెట్టేస్తాడు. వాడి దగ్గర నీకిప్పిస్తాను.

నాకివ్వాడు. నీకిస్తాడు. వాడికి డబ్బు లెక్క లేదు. వెంటనే చెల్లించకపోయినా పరవాలేదు'' అని సుబ్బారావు శ్రీహరి దగ్గర పదిరూపాయిలు ఊడేసుకొని చక్కాపోయాడు. తనకు అప్పు చూపించి సాయంచేసి నందువల్ల సుబ్బారావును శ్రీహరి గట్టిగా కాదన లేక పోయాడు. చేతిలో ఐదురూపాయిలే మిగిలాయి. సాయంత్రం ప్రైవేటు వాళ్ళింటిదగ్గర స్పష్టంగా అడిగేశాడు. వాళ్ళు పదిరూపాయిలు ఇచ్చారు. మొత్తం పదిహేను రూపాయిలు తీసుకొని ఇంటికి నడిచాడు శ్రీహరి.

పదిహేను రూపాయిలూ ఇంటివారికిచ్చేస్తే పాలమనిషికో? చివరికి తెగింపుకు వచ్చేశాడు. అతను ఇంటివారింట్లోకి అడుగుపెట్టూంటే విప్పారిన మొగంతో రామలింగంగారు పలకరించారు. "రానాయనా. పొద్దున్న వచ్చావుట కాదూ?"

"అవునండీ. మీరు లేడీడాక్టరు దగ్గరకు వెళ్ళారట. కోడలికి ఏదో సుస్తీ చేసిందని విన్నాను. ఏమీకంగారు లేదు కదా అండి'' అని అడిగాడు మర్యాదకోసం శ్రీహరి.

"ఆ ఏమీ లేదు. రాకూర్చో ఒకనిమిషం'' అని కుర్చీ చూపించారు రామలింగంగారు.

శ్రీహరి తనుఇద్దే ఇవ్వబోతున్నాననే ఈసత్కారం కాబోలు, ఎట్లా ఈయనకి చెప్పడం అనుకుంటుండగా రామలింగంగారు చిరునవ్వు మొగంతో చెప్పడం మొదలు పెట్టారు. "ఈనాటికి మాజీవితం ధన్యమైందోయి. మాకోరిక తీరబోతోంది. చూడు పిల్లలులేని ఇల్లు ఎంత ఆస్తి ఉంటేనేం, ఎన్ని

సౌకర్యాలు ఉంటేనేం కళకళలాడుతూ ఉండదుకదా. అందు వల్లే మిమ్మల్నీ మీపిల్లల్నీ చూస్తూంటే మేము అసూయతో బాధపడే వాళ్ళమంటే నమ్ము-"

"అయితే కోడలిగారికి —"

"నెల తప్పిందని లేడీడాక్టరు చెప్పింది. మొదట్లో మేము నమ్మలేక పోయాం మాకు అంతటి భాగ్యం పడుతుందా అని. కాని లేడీడాక్టరు కచ్చితంగా చెపుతూంటే! ఇన్నాళ్ళూ వాళ్ళ పిల్లల్నీ వీళ్ళపిల్లల్నీ చూసి చాటుగా మురిసిపోతూండే వాళ్ళం. ఇప్పుడు ఆగతి తప్పిపోబోతోంది. చూడు, శ్రీహరీ ఈరోజుల్లో నాస్తికత్వం పెరిగిపోయింది. ఈదేవుళ్ళూ దెయ్యాలూ ఏమిటి? ఈయాత్రలెందుకు డబ్బుదండగ అంటారు కాని వాటిలో మహత్తు ఎక్కడికి పోతుంది? -"

శ్రీహరి జేబులోనుంచి నోట్లుపైకి తీశాడు. రామలింగంగారు తృప్తిగా చిరునవ్వు నవ్వుతూనే "అంత తొందరేమీ లేదు నాయనా. నేనంత కరాకచ్చి మనిషినేమిటి? నువ్వెట్లాంటి వాడవో నాకు తెలియదూ-" అంటూనే ఆయన మొగం వెలవెలపోయింది.

శ్రీహరి మూడు ఐదునోట్లలోనూ రెండుజేబులో పెట్టేసి ఒకటి రామలింగంగారి వైపుకు చూపాడు. "ఇప్పుడు ఐదురూపాయిలే ఇవ్వగలుగుతున్నానండి. ఒకస్నేహితుడు పదిరూపాయిలు పట్టుకుపోయాడు. రేపు నెల జీతంలో మీకు మొత్తం ఇచ్చేస్తాను" అన్నాడు.

రామలింగంగారు అంతవరకూ సరదాగా కబుర్లు చెప్తున్నవాడల్లా మొగం ముడుచుకొని "అట్లాగే" అని ఆ నోటు అందుకున్నారు.

"వస్తానండి" అని శ్రీహరి వచ్చేశాడు.

వరలక్ష్మి ఎదురు పరుగెత్తుకు వచ్చింది. "ఏమండోయి ఈవార్త విన్నారా - "

"ఇంటివారి కోడలు తల్లి కాబోతూందనేనా "

"మీకప్పుడే తెలిసిందీ! ఇంటి ఆయన చెప్పరా? వాళ్ళు ఎట్లా పొంగిపోతున్నారనుకున్నారు! ఎన్నిసార్లు వచ్చి చెప్పిందో కామాక్షమ్మగారు మనయింట్లోకి వచ్చి. కోడలిని ఇప్పుడు గాజుపూస చూసినట్లు చూస్తున్నారు— ఇంతకీ అద్దె ఇచ్చేశారా? "

"లేదు ఐదు రూపాయిలే ఇచ్చాను."

"అదేమిటి పొద్దున్న పూర్తిగా ఇచ్చేస్తామన్నారే!"

"అవును అప్పుడనుకున్నాను కాని తరువాత ఒక స్నేహితుడికి పదిరూపాయిలు బదులివ్వ వలసివచ్చింది."

"ఇది మరీ బాగుందండోయి. ముష్టిలో ముష్టి అన్నట్లు. మీరు మరొకరికి బదు లివ్వాగమా? "

శ్రీహరి మాట్లాడ లేదు. వరలక్ష్మి అంది. "పని మనిషి మరో రూపాయి పెంచమందండీ. నాలుగు రూపాయిలిస్తే నే చేస్తుందిట."

"నాలుగు రూపాయిలా? "

"ఇంటివారు ఆరు రూపాయి లిస్తున్నారట. వాళ్ళకేమి వాళ్ళు ఆస్తిపరులు, ఎంతేనా ఇవ్వగలరు వాళ్ళకీ మాకు పోలి కేమిటి అని చెప్పినా వినలేదు. రామకృష్ణమూర్తి గారు ఇస్తు న్నారట. నాలుగు రూపాయిలూ ఇచ్చుకోకపోతే చచ్చినట్లు చేసుకోవలసిందే. మరొకళ్లెవరూ కుదరరు. వాళ్ళలో అంత కట్టు. పైగాపనివాళ్ళు ఎక్కువ లేరు కూడా. వాళ్ళను బ్రతి మాలవలసి వస్తోంది. ఏంచేద్దామంటారు?"

శ్రీహరి ఆలోచనలో పడిపోయాడు.

వరలక్ష్మి అంది: "మూడు రూపాయలకీ చెయ్యలేక పోతే మానెయ్యమన్నానండి. నేనే చేసుకుంటాను. ఏంచేస్తా ను? సుఖంమరిగిన కొద్దీ సుకుమారం ఎక్కువవుతుంది. చేసు కుంటూంటే అదే సరిపోతుంది."

శ్రీహరి భార్యకేసి బ్రతికించావన్నట్లు చూశాడు. కాని అంతలో భార్యా ఎంతపని అని,చేయగలదు. భార్యదాసీ మనిషా అనిబాధ పడ్డాడు. అట్లానే తనగదిలోకి వెళ్ళిపో యాడు.

పొద్దున్నే పాలమనిషి అడిగింది "అయ్యగారూ డబ్బు వచ్చిందా?" అని. శ్రీహరి డబ్బులెక్క చూశాడు. క్రిందటి నెల అదనపు పాలవల్ల లెక్కపదిహేడు రూపాయల చిల్లర తేలింది. తనదగ్గర ఉన్నదీ ఇంచుమించు అంతే మరి నెలగడ పడం ఎట్లా?. అందువల్ల పదిరూపాయిలు తీసి " ఇప్పుడు కొం చెం ఇబ్బందిగా ఉంది. రేపు నెలలో పూర్తిగా ఇచ్చేస్తాను. ఇప్పటికి ఈపది రూపాయిలు పట్టు కెళ్ళు" అని శ్రీహరి పది రూపాయిలు ఆమె దగ్గర పెట్టాడు.

పాలమనిషి "రేపటి నుంచి నేను పాలు పొయ్యలే నయ్యా. మరొక వాడుక కుదుర్చుకోండి. ఈ వేళ వరకూ లెక్క కట్టి ఎంతయిందో ఇచ్చెయ్యండి", అని ఆడబ్బు అక్కడే పెట్టేసింది విస్పాటంగా.

వరలక్ష్మికి చాలకోపం వచ్చింది. "ఏమిటమ్మా అంత ముక్కా మొహమాటం లేకుండా మాట్లాడుతావు. నీకెన్న డేనా బకాయి పెట్టామా? ఎప్పుడైనా లెక్కలో తేడా చెప్పా మా? ఒక్కసారి కాస్త ఇబ్బంది వస్తే ఇట్లా మాట్లాడుతా వా? ఇన్నాళ్ళ నుంచీ పాలుపోస్తున్నావు — ఆమాత్రం మంచి లేదూ" అంది.

"మంచేమిటమ్మా? మేము పాలుపోస్తున్నాం మీరు డబ్బిస్తున్నారు. మీరు ఊరికేనూ డబ్బియ్యడం లేదు. మేము పాలూ ఊరికే పొయ్యడం లేదు. పాలమ్ముకు బతికేవాళ్ళం మాకు బకాయీలు పెత్తే మాగతేంకాను? మొదటి తారీఖు పోయిందీ. ఇన్నాళ్ళూ తిప్పి, ఇప్పుడు పది రూపాయిలు చేతిలో పెట్టారా? ఇట్లా అయితే మేము పాలుపొయ్యలేం" అంది పాల మనిషి కోపంగా.

రాధ ఊరుకోలేక పోయాడు. మధ్యలో కలుగజేసుకు న్నాడు. "అవునమ్మా నీలాంటి వాళ్ళకు మంచేమిటి? కృత జ్ఞత ఏమిటి? పాలలో నీళ్ళు కలిపేవారికి ఇట్లాంటి పిచ్చి పిచ్చి భావాలుంటే ఇబ్బంది కాదూ? వ్యాపారం ఎట్లా సాగుతుం ది? నువ్వుపాలలో ఎన్ని నీళ్ళు కలిపినా ఫీళ్ళు నోరుమూసుకు ఊరుకోవలసిందే." అన్నాడు.

దానితో పాలమనిషి మరీ రెచ్చిపోయింది. "ఏందుకట్లా విసుసుకు పడతారు? మీడబ్బేం నేనియ్య మనడం లేదే. నాకు రావలసిన డబ్బులే నామొగాన పడెయ్య మంటున్నాను. నేను పాలలో నీళ్ళు కలుపు తున్నానా? మా నెయ్యక పోయాడా? ఎవరు పోయించుకో మన్నారూ? నేనేం బతిమాలలేదే పోయించుకోమ్మని. ఇంతకీ డబ్బు ఇస్తారా ఇయ్యరా డబ్బు ఇమ్మంటే పోట్లాట పెట్టా రేంటయ్యా ?" అంది గట్టిగా.

"నీడబ్బు ఇవ్వక పారిపోతామను కున్నావా? నీడబ్బులు ఎగ్గొట్టేందుకు ఉద్యోగాలు ఊళ్లూ వదులుకొని పారిపోతా మనేనా నీకంగారు?" అని అడిగాడు రాధ.

"ఊరుకో రాధా ఆమెతో మనకి మాటలేమిటి?" అని వరలక్ష్మి రాధ నాపి భర్తవైపుకు తిరిగి "పూర్తిగా ఇచ్చెయ్యండి. వాళ్ళకేదో మంచి తనం ఉండాలను కోవడం మనదే పొరబాటు. తను చూస్తూనే ఉంది ఇంటికి చుట్టాలు రావడం ఖర్చులు పెరిగాయని తెలుసు. ఒకనెల సర్దుకోవడంలో కాస్త ఇబ్బంది కలగవచ్చు దానికే ఇంత గొడవ చెయ్యాలా! మనుషులన్నాళ్ళు కాస్త ఒకళ్ళ కష్టసుఖా లొకళ్ళు తెలుసు కోవాలి. ఈవేళ మనకు వచ్చింది. ఇబ్బంది. రేపు తనకు రావచ్చు— పడేయ్యండీ డబ్బు" అని వెళ్ళి భర్త దగ్గర మొత్తం లెక్క తీసుకు వచ్చి " పట్టుకెళ్ళమ్మా నీడబ్బు. ఎక్కడ ఎగ్గొట్టేస్తామనో హడలిపోయావు" అంది.

పాలమనిషి కొంచెంతగ్గింది. "పోనీ లెండి ఆపదిరూపాయలే ఇప్పించండి. నేనుమాత్రం మనిషిని కానేమిటి? ఇన్నాళ్లూ ఆల

స్యం చేశారు. ఇప్పుడు ఇంతే ఇస్తున్నారు అనే కోపంతో అట్లా అన్నానుకానీ—''

''అక్కర్లేదమ్మా. పట్టుకువెళ్ళు నీడబ్బు. నీ మొహార్బానీ మాకేం అక్కర్లేదు. ఇన్నాళ్ళనుంచి పాలుపోస్తూకూడా ఎవరెట్లాంటివారో తెలుసుకోలేకపోయావు. మమ్మల్ని అందరితో సమానంచేశావు'' అనిడబ్బుపాలమనిషి దగ్గరపెట్టేసి వెనక్కి వచ్చేసింది వరలక్ష్మి.

పాలమనిషి మారుమాట్లాడలేక డబ్బుతీసుకొని వెళిపోబోయింది. వరలక్ష్మి అడిగింది. ''రేపటినుంచి మరోవాడుక చూసుకోమంటావా ముందే చెప్పు పొయ్యవన్నమాటేనా?''

''ఎందుకు పొయ్యనండమ్మా. వాడుక ఊరికే పోగొట్టుకుంటానేమిటి?'' అని వెళ్ళిపోయింది పాలమనిషి.

''ఇంకా ఎందుకు ఆమనిషినే పట్టుకువ్రేళ్ళాడుతావు వదినా?'' అన్నాడు రాధ.

''ఏంచేస్తామయ్యా? మరొకరయితే ఈమాత్రం పొయ్యరు ఈమనిషే కాస్తనయం.'' అంది వరలక్ష్మి.

''ఇన్నేళ్ళనుంచిపోస్తూ ఇట్లామాట్లాడింది. వీళ్ళతో మంచితనం అనేదేలేదు. మంచితనానికి వీళ్ళదృష్టిలో విలువేలేనట్లుంది.'' అన్నాడురాధ కోపంగా.

'' పాలమనిషినని ఏం లాభం? అంత ధనవంతులు ఇంటివారే పదిరూపాయిలు బకాయి పెట్టే బెంగ పెట్టుకుపోయారు. పాలమనిషి అనుకుందంటే ఆశ్చర్యమేముంది? అందరికీ డబ్బుతోనే సంబంధం లాఉంది '' అన్నాడు శ్రీహరి.

"వెధవడబ్బు!-డబ్బే మోక్షంకాబోలు" అన్నాడు రాధ

"ఆ వెధవ డబ్బు లేకేనోయి ఈ తిప్పలు. ఆ వెధవ డబ్బు కోసమే రేపు నువ్వుకూడా ప్రాకులాడాలి" అని లోపలికి వెళ్ళి పోయింది వరలక్ష్మి.

ౕరి మనస్సు కలత జెందిపోయింది. నిజంగా మంచి తనానికి విలువ లేదా? అంతా డబ్బులోనే ఉందా? అయితే తమ జీవితాలు ఇంతేనా? ఇట్లా కలత పడుతూనే ప్రైవేట్లకు వెళ్ళాడు.

ప్రైవేటు చెపుతున్నాడుకాని పరధ్యానంగా ఉన్నాడు. కొంతసేపు తరువాత చదువుకునే పిల్లవాడి తండ్రి అటు వచ్చి "మాష్టారూ" అని పిలిచాడు. శ్రీహరి వినిపించుకోలేదు. "మాష్టారూ మానాన్న కేకేస్తున్నాడండీ" అని పిల్లవాడు శ్రీహరి మోకాలు మీద తట్టి చెప్పగా శ్రీహరి తుళ్ళిపడి "ఏమండీ. అన్నాడు."

"మొన్న అర్ధ సంవత్సరం పరీక్షల్లోకూడా మావాడికి బాగా మార్కులు రాలేదండీ. అప్పుడే చాలా నెలలనుంచి ప్రైవేటు చెపుతున్నారు. అయినా ఇంకా మార్కులు అట్లాగే ఉన్నాయండీ" అన్నాడు పిల్లవాడి తండ్రి.

"నేనన్నీ చెపుతున్నానండీ. జాగ్రత్తగానే చెపుతు న్నాను. ఏమీ అశ్రద్ధ చెయ్యడం లేదు. మీరు చూస్తూనే ఉన్నారుకా" అన్నాడు శ్రీహరి.

"అవుననుకోండి. మీరు ఎట్లా చెపుతున్నదీ మార్కులు రావడం బట్టే కదండీ మాకు తెలిసేది. మాదగ్గర ఆస్తులు ఏమీ పడి మూలగడం లేదు– డబ్బు ఎట్లాపోతేనేం అనుకుందుకు. నెలనెలా డబ్బిచ్చి ప్రైవేటు చెప్పించడం మాకూ కష్టంగానే ఉంది. మీరు ప్రైవేటు సరిగ్గా చెప్పడం లేదని నేననడం లేదు. కాని మరింత శ్రద్ధ తీసుకొమ్మనే చెప్పేది. ఎట్లాగో మాట దక్కించాలి" అని వెళ్ళిపోయాడు పిల్లవాడి తండ్రి.

శ్రీహరి తెల్లబోతూ ఏమీ మాట్లాడలేక పోయాడు. అతనిలో రోషం పొంగి వచ్చింది. తనేమి చెయ్యాలి? తను జ్ఞానం కుర్రవాడి బుర్రలో కుక్కలేడుగదా. తను ఏమీ అశ్రద్ధ చేయడం లేదే. తను చెప్పినది పిల్లవాడు మననం చేసుకుంటున్నాడా లేదా అని ఎప్పుడూ కనుక్కోలేరేం? తను ఇంకా శ్రద్ధ తీసుకోవాలా? ఇంతవరకూ సరిగా చెప్పడం లేదన్నట్లు! అవును తను చెపుతున్నది పాలలా పైకి కనిపించేది కాదు. అందువల్ల దానికి విలువలేదు. డబ్బిస్తున్నారు! అందువల్ల వాళ్ళు ఏమన్నా అనవచ్చు. వాళ్ళ కాఅధారిటీ ఉంది. తను డబ్బు తీసుకుంటున్నాడు. తను చెప్పేదానికన్న వాళ్ళడబ్బు విలువైనది! అందువల్ల వాళ్ళేమన్నా పడాలి. ఎదిరిస్తే ఆడబ్బూ రాదు. ఛీ వెధవ జీవితం!

ప్రైవేట్లనుంచి ఇంటికి వచ్చాడు. మనస్సు చాలా చిరాకుగా ఉంది. ఇంట్లోకిరాగానే "వంట అయిందా" అని కేకేశాడు. "ఇంకా ఎక్కడండీ?" అంది వరలక్ష్మి వంటింట్లోనుంచి

"ఇంకా లేదూ. ఎప్పుడు తయారవుతుంది మరి — నేను బడికి వెళ్ళిపోయిన తరువాతా?" అన్నాడు అతను కోపంగా.

మరోపావుగంట చూశాడు. "ఏం ఇప్పటికేనా తయారయిందా లేక ఇట్లాగే బడికి పొమ్మంటావా?" అని కేకేశాడు.

"అంత కంగారు పెట్టేస్తే ఎట్లాగండి? ఇప్పుడే అన్నం ఉడికింది" అని వరలక్ష్మి త్వరగా పీటా కంచం వేసిఅన్నం పెట్టి ఆనకాయ వేసింది. కూర తరవాయి చూడసాగింది. ఇంతలో బాబు లేచాడు. ఏడుపు మొదలు పెట్టాడు. వరలక్ష్మి తన పని విసుగులో "ఏడవరా ఏడు, నీకూఇదే టైము" అని విసుక్కొని పనిచూడ సాగింది.

"మజ్జిగ పొయ్యి" అన్నాడు శ్రీహరి.

"ఒక్క నిమిషం ఉండండి. కూరకూడా వేస్తాను —"

"అక్కర్లేదులే మజ్జిగ పొయ్యి, టైము చాలా అయిపోయింది."

"అంత కోపం అయితే ఎట్లాగండీ — ఒక్క నిమిషం ఓపిక పట్టండి అంటే -"

"మజ్జిగ పోస్తావా లేదా, లేచిపొమ్మంటావా" అని లేచిపోబోయాడు శ్రీహరి.

వరలక్ష్మి కంగారుగా పరుగెత్తి మజ్జిగ పోసింది. అవతల బాబు ఏడ్చేస్తున్నాడు.

వరలక్ష్మి భర్త కోపానికి ఆశ్చర్యపోతూ "నేనేమన్నా ఊరికే కూర్చున్నానండీ. పని మనిషి కూడా ఈ వేళనుంచి మానేసిందా మొ—" అని అంటూండగా

"అందుకు నామీద ఈ సాధింపు కాబోలు" అన్నాడు శ్రీహరి కోపంగా.

వరలక్ష్మి పెద్ద కళ్ళతో భర్తకేసి చూసింది. "నేను కావాలనే వంట ఆలస్యం చేశానంటారా? కావాలనే పనిమనిషిని మాన్పించా నంటారా" అని అంటూండగా—

"నీకబుర్లు వింటూ కూర్చోడానికి ఇక్కడ ఎవరికీ తీరిక లేదు" అని శ్రీహరి కోపంగా ఆమజ్జిగ మెతుకులు నోట్లో వేసుకొని లేచి బడికి పరుగెత్తాడు. వరలక్ష్మికి భర్త ప్రవర్తన ఏమీ బోధపడలేదు. ఎందుకింత కోపం! ఎవరి మీద? తనేమీ చెయ్యలేదే? వంట ఆలస్యానికేనా తను ఏమి చేయగలదు? అవతల బాబు కక్కటిల్లి పోతున్నాడు. అయినా వరలక్ష్మివాడి దగ్గరికి కదలలేదు. తరువాత వెళ్ళి "వెధవ ఏడుపుతో చంపేస్తున్నాడు" అని వాడి నడ్డిమీద ఒకటి అంటించి అప్పుడు ఎత్తుకొని ఊరుకోబెట్ట సాగింది. రాధ కాలేజీకి వెళ్ళడం లేదు కాబట్టి ఆస్యంగా భోజనానికి వచ్చాడు. "ఏమిటి వదినా అన్నయ్య అంత కోపంగా వెళ్తున్నాడు?" అని అడిగాడు.

"ఏమో నాయనా ఏమి తెలుస్తుంది" అని వరలక్ష్మి అతనికి వడ్డన సాగించింది.

శ్రీహరి బడికి వెళ్ళాడు. మాష్టర్లు మామూలుగా కబుర్లు చెప్పుకుంటున్నారు. ఈవేళ శ్రీహరికి వాళ్ళ కబుర్లు చూస్తే మంటెత్తుకు వస్తోంది. పదిరూపాయిలు బలవంతాన ఊడలాక్కు పోయినందుకు సుబ్బారావంటే అతనికి కోపం— తనపైవే

ల్లు లాగుతున్నందుకు గోపాలరావు అంటే కోపం లాటరీకి బల తంవరగా కట్టించిన నరసింహారావు అంటే కోపం—ఆచార్లుగా రంటే కోపం—సైన్సు బి. ఇడి. సుందరరావంటే కోపం—ఈవేళ శ్రీహరికి కోపం కొత్త వరదలా పొంగితోంది. కట్టలు తెగి పోతాయా అనిపిస్తోంది.

తిన్నగా క్లాసుకు వెళ్ళాడు. అక్కడ మళ్ళీ గొడవగా ఉంది. క్లాసులీడరూ సుధాకరూ మళ్ళీ వాదించుకుంటున్నారు. మిగిలిన పిల్లలలో కొందరటూ కొందరిటూ. సుధాకర్‌ని చూసి శ్రీహరికి ఒక్కసారి మళ్ళీ కోపంపైకి ఉబికింది. కాని ఏమి చేయగలడు? పళ్ళు బిగించుకొని ఉండిపోయాడు శ్రీహరి. క్లాసులీడరు "మాస్టారూ సుధాకర్ చాలా అల్లరి చేస్తున్నాడండీ. పిళ్ళుకూడా వాడికి తోడై, నామాట వినడం లేదండి. క్లాసులో గోల అయిపోతోందండి," అని శ్రీహరి చేతికి కాగితం అందియ్యబోయాడు. శ్రీహరికోపం వాడిమీదికి విరుచుకు పడింది. శ్రీహరి విసురుగా ఆ కాగితం వాడిచేతిలో నుంచి లాగి పక్కకు గిరవాటువేసి లీడరు మెడబట్టుకొని, "అసలు నీవల్ల అల్లరి ఎక్కువైపోతోంది. అంత చేతకాని వెధవవైతే లీడరుషిప్ వెలిగించడమెందుకు? నువ్వు మాట్లాడకుండా ఊరుకో. నోరెత్తావంటే చంపేస్తాను జాగ్రత్త" అని గట్టిగా గుంజి, వాడు కూర్చునే చోటువైపుకు ఒక్కతోపు తోశాడు. వాడు హడలిపోయి, మాస్టారి ప్రవర్తన అర్థంకాక నోరుమూతపడి తనస్థానంలో తలవంచుకొని కూర్చున్నాడు కళ్ళు చొక్కాతో తుడుచుకుంటూ. క్లాసు అంతాకూడా నిశ్శబ్దమై పోయింది.

ఈవేళ ఎందుకో మాష్టారు చాలా కోపంగా ఉన్నారు. మాట్లాడితే మీాదపడి కొట్టేటట్లున్నారు అని ఎవరుమట్టుకు వాళ్ళు కిక్కురుమనకుండా ఉండిపోయారు.

మధ్యాహ్నం రీసెస్‌లో స్టాఫ్ రూంకి నడిచాడు. మాష్టర్లు వాళ్ళకబుర్లలో వాళ్లుపడ్డారు. శ్రీహరి మాత్రంకివాళ్ల మాటలు వినక కనుబొమలు ముడిచి, దృష్టి హోంవర్కు పుస్తకాల మీాద కేంద్రీకరించి దిద్దుతున్నాడు. కొంత సేపటికి నడ్డిలాగి, ఒకనిమిషం కలం పుస్తకంమీాద పెట్టి, కుర్చీలో జేరబడ్డాడు. నరసింహారావు అన్నాడు! "శ్రీహరీ లాటరీ టికెటు కొంటావా? మళ్లీపంపుతున్నాం. నెలాఖరున జీతమప్పుడు ఇవ్వవచ్చులే డబ్బు"

శ్రీహరి తల అడ్డంగా ఊపుతూ, కొంచం చిరాకుగా "నాకు అక్కర్లేదు" అన్నాడు.

"క్రిందటి సారి తగలలేదని అప్పుడే నిరుత్సాహపడిపోయావా? కట్టూండాలి. ఎప్పుడేనా తగలవచ్చు. కట్టిన ప్రతివాడికీ మొదటి సారే తగిలితే ఇంకేమి ఉంది?"

"నాకు లాటరీలు అక్కర్లేదు— లక్షలూ అక్కర్లేదు నన్ను ఇట్లా బ్రతకనిస్తే చాలు. ఇట్లాకూడా బ్రతకనియ్యరా" అన్నాడు కోపంగా శ్రీహరి మళ్లీ కాంపోజిషన్లలో పడ్డాడు.

నరసింహారావు నోరు తెరచుకొని ఉండిపోయాడు. అతని అవస్థ చూసి కొందరు మాష్టర్లు మెల్లగా ఇకిలిస్తున్నారు. కాని శ్రీహరి కోపం వాళ్ళమీాదకూడా పనిచేసింది. అందరూ మెల్లగానే మాట్లాడుకుంటున్నారు. శ్రీహరి తిరిగి

క్లాసుకు రాబోతూంటే మాష్టర్ల మధ్య సన్నగా నవ్వులు విన బడ్డాయి. తనను గురించే అయి ఉంటాయని సిద్ధారించుకు న్నాడు శ్రీహరి మనస్సులో " ఛీ నీచులు " అని తిట్టుకున్నా డు. అతని కోపం లోలోపలే రగులుతూ అతని శక్తిని హరించే స్తోంది. సాయంత్రం బడి విడిచిన తరువాత ప్రైవేటుకు వెళ్ళి అక్కడి నుంచి ఇంటికి మళ్ళాడు.

అతను వెళ్ళేసమయానికి ఇంటి కాంపౌండు దగ్గర కొంత గొడవజరుగుతోంది. సపోటా చెట్టు మీద రమణా, రామకృష్ణ మూర్తి కుర్రవాడొకడూ మరో ఇద్దరు కుర్రవాళ్లూ ఎక్కి కాయలు కోస్తున్నారు. వీధిలో గోడ అవతల, సపోటాచెట్టుకు దగ్గరగా చాలామంది పిల్లలు గుంపుగా నిలబడి "నాకోకాయ, నాకోకాయ" అని అరుస్తున్నారు. చెట్టుమీద వాళ్ళుకాయలు వాళ్ళకు గిరవాటువేస్తున్నారు. కొన్ని లాగు జేబుల్లోనూ చొక్కా జేబుల్లోనూ కుక్కుకుంటున్నారు. ఇంటి ఆయనకర్ర పుచ్చుకొని వచ్చాడు., "దిగుతారా దిగరా "వెధవల్లారా" అంటూ ముందు వీధిలోకి పరుగెత్తాడు అక్కడి పిల్లలు తలో మూలకీ పారిపోయారు. రామలింగం.గారు చెట్టుదగ్గరకు వచ్చి దిగుతారాకొట్టనా" అని చేతి బెత్తంతో చెట్టుమీద ఉన్నవా ళ్లని కొట్టడానికి ప్రయత్నిస్తున్నాడు. వాళ్లు ఆకొమ్మమీద నుంచి ఈకొమ్మ మీదకీ ఈకొమ్మమీదనుంచి, ఆకొమ్మమీదికీ దూకుతూ ఆయనను కవ్విస్తున్నారు. వీధిలో పిల్లలు కొంచెం దూరంలో నిలబడి ఇదొక ఆటలాతోచి ఆనందంతో చప్పట్లు కొట్టున్నారు. దానితో ఇంటిఆయనకు మరీ పిచ్చెత్తినట్లుంది.

'దొంగ వెధవలారా, కోతుల్లా తయారై చెట్టున ఒక్క' 'కాయ లేకుండా చేస్తున్నారా? మీ అబ్బ సొమ్మనుకున్నారా, తాతసొమ్మనుకున్నారా? అని ఎగురుతున్నాడు. ఇద్దరు కుర్రాళ్లు అటూ ఇటూ ఎగురుతూనే చటుక్కున ఒకకొమ్మ మీదనుంచి వీధిలోకి దూకేసి పారిపోయారు. ఇంటి ఆయన వాళ్లవైపుకు పరుగెత్తే సరికి రామకృష్ణమూర్తి కొడుకు రెండో వైపునుంచి క్రిందకు దూకి వెనక్కి పారిపోయాడు. రమణ ఒక్కడు మాత్రమే చెట్టు మీద ఉండి పోయాడు. ఇంటి ఆయన "నువ్వా దిగుతావా దిగవా? పెద్దనాయకుడిలా కూర్చున్నావు" అని కేక లేస్తున్నాడు. ఇంటి ఆయన కొడుకు కూడా తండ్రి దగ్గరికి వచ్చాడు. అటు శ్రీహరికూడా అప్పుడే లోపలికి వచ్చాడు.

శ్రీహరిని చూసి ఇంటి ఆయన "చూశావా శ్రీహరి మీవాడు ఎంత అల్లరి చేస్తున్నాడో? అడ్డమైన వెధవల్నీ తీసుకు వచ్చి చెట్టెక్కించి ఊళ్లో వాళ్లందరికీ సపోటాకాయలు సంతర్పణ చేస్తున్నాడు. ఇందాకటి నుంచి దిగమంటే దిగడం లేదు" అని చెప్పాడు.

శ్రీహరి దూరం నుంచి ఇది చూస్తూనే ఉన్నాడు. "ఏరా దిగిరావేం" అని అరిచాడు కొడుకు వైపుకు తిరిగి.

రమణ చెట్టు ఎక్కడమంటే ఎక్కుతాడుకాని త్వరగా దిగలేడు. మెల్లగా దిగడానికి ప్రయత్నం చేస్తున్నాడు.

ఇంతలో ఇంటి ఆవిడ అరుగు మీదికి వచ్చి: " చెట్టు ఉందన్న మాటేకాని ఒక్క పండు తిన్న పాపాన పోలేదు.

అన్నీ వీళ్ళ కడుపున పెట్టుకుంటున్నారు. ఇట్లాంటి పిల్లల నెక్కడా చూడలేదు. ఇంట్లోవాళ్ళే ఊళ్లోవాళ్ళ కందరికీ నేర్పి పెడుతూంటే ఇంక ఏమి చేసేది" అంటోంది.

ఇంటివారి కొడుకు అంటున్నాడు. "ఏముంది, ఇప్పటి నుంచీ తయారు. ఒకళ్ళ నడగ నక్కర్లేదు— అంతా సొంత ఆస్తి అయినట్లు. తన తాత నాటాడనా ముత్తాత నాటాడనా ఈ చెట్టు!"

వాళ్ళ మాటలు వినగా శ్రీహరిలో నీరసం అడుగున పడ్డకోపం మళ్లీ పైకి లేచింది. సైకిలు స్టాండు వేసి చెట్టు దగ్గరకు వెళ్లి "దిగుతున్నావా లేదా" అని అరిచాడు. రమణ మ్రాను పట్టుకొని పొట్టతో ప్రాకుతూ కిందికి దిగుతున్నాడు. ఇంటి ఆయన అన్నారు. "శ్రీహరీ, పిల్లవాడిని కాస్త అదుపులో పెట్టుకోవాలయ్యా. ఇట్లా అల్లరి చేస్తూంటే ఎట్లా భరించగలం?"

శ్రీహరి చెట్టుమీద నుంచి క్రిందికి జారుతున్న కొడుకును పట్టుకొని ఒక్క ఊపులో క్రిందికి లాగాడు. రమణ క్రింద పడ్డాడు. శ్రీహరి వాడి రెక్క పట్టుకొని బరబర ఈడ్చుకు పోయాడు ఇంట్లోకి. అక్కడ వాడిని పట్టుకొని దబదబా బాదేయడం మొదలు పెట్టాడు. వరలక్ష్మి సూరమ్మగారూ పరుగెత్తుకు వచ్చారు. సూరమ్మగారు "ఏమిట్రా నాయనా, ఏమిటి?" అంది. రాధకూడా వచ్చాడు సమయానికి.

"ఏమిటేమిటి! ఇంటివారి సపోటా కాయలన్నీ కోసే స్తున్నాడట. ఊళ్ళో పిల్లలనందరినీ చేర్చి నానా అల్లరీ చేస్తు న్నాడట వెధవ ఆగడమూ వీడూను. వెధవ. ఇంకెప్పుడేనా చేస్తావా, "అంటూ వరలక్ష్మి "కొట్టకండి కుర్రకుంక, వాడి కేమి తెలుసు" అని అడ్డు పడితే ఆమెను పక్కకు తోసేసి, కొట్టున్నాడు శ్రీహరి.

అది చూసి రాధ కేకేశాడు "ఆగన్నయ్యా. వాణ్ణి అట్లా కొట్టావేమిటి?" అని.

"కొట్టక పూజిస్తారేమిటి వెధవని. నానామాటలూ పడవలసి వస్తోంది ఈ వెధవ వల్ల" అని ఇంకా కొట్టూనే ఉన్నాడు. రమణ ఏడవ లేక పోతున్నాడు.

రాధ "ఊరుకో అన్నయ్యా. వాడికేమి తెలుసు. వది లెయ్యి. చెపుతూంటే వినవేం" అని గట్టిగా అరిచాడు.

"ఏమీ తెలియదూ. సపోటా చెట్టెక్కడం, కాయలు దులిపెయ్యడం. తెలుసేం" అని ఇంకా కొట్టూనే ఉన్నాడు శ్రీహరి.

రాధ అడ్డు పడ్డాడు "నీకు కాదన్నయ్యా చెప్పుతున్నది వదలమని? వదలుతావా వదలవా" అని రంకె పెట్టాడు.

"ఒరేయి నువ్వూరుకో. నీకేం తెలియదు. ఇప్పటి నుంచీ వీడు ఇట్లా తయ్యారైతే ఇక వీడికి రేపు పట్టపగ్గాలుం డవు. తాను చాలక ఊళ్లో వెధవ లందరికీ నాయకత్వం వహి స్తాడేం?" అని కొడుకును జుట్టుపట్టుకొని గుంజేస్తున్నాడు.

"ఏరా వెధవా మాట్లాడవేం? ఇంకెప్పుడు అట్లాంటి పనులు చెయ్యనని లెంపలు వాయించుకుంటావా? లేదా? ఏం ?" అంటూ –

రాధ బలవంతాన రమణని ఇవతలకు లాగేశాడు. "చంపేస్తా వేమిటి పీడిని. అప్పటికి కాని నీకోపం చల్లారేటట్లు లేదు! చిన్న పిల్లవాడు కాస్త తప్పు చేస్తే ఇట్లా కొట్టడమా? చేతులెట్లా వచ్చాయంట! పెద్దవాళ్ళకే బుద్ధి లేనిది కుర్రకుంకకి బుద్ధి ఉంటుందీ" అని రమణను ఓదార్చడానికి ప్రయత్నిస్తున్నాడు. కాని వాడు గుక్క తిప్పుకోలేక పోతున్నాడు.

"ఇంకా ఏడుపు వస్తోంది. నోరు మూసుకుంటావా లేదా. నోరు నొక్కెయ్యనా ఏడుపు పైకి రాకుండా" అని మళ్ళీ శ్రీహరి రమణ మీదికి రాబోయాడు.

రాధ గట్టిగా తిరగ బడ్డాడు. "ఇదుగో అన్నయ్యా మీదికి రాకు, చెప్తున్నాను. వాడి ఒంటిమీద మళ్ళీ చెయ్యి వెయ్య నియ్యను, వాడు ఈ ఇంట్లో బతకడం ఇష్టంలేదా చెప్పు. అంతబరువై పోతే చెప్పు, వాడిని తీసుకొని ఎక్కడికో వెళ్ళిపోతాను. వెధవ సపోటా కాయలకోసం పిల్లవాడి ప్రాణాలు తీస్తావా" అని రమణ నడ్డిమీద రాస్తూ, అరిచాడు. వరలక్ష్మి వచ్చి రమణ నందుకుంది.

రాధ కోపం ఇంకా హరించలేదు. తమ ఇంట్లోనుంచి ఇది చూస్తున్న ఇంటివారిని చూసే, "వెధవ సపోటా కాయల కోసం ఇంతగొడవా? ఆస్తి ఏదో నాశనమై పోతున్నట్లు! వెధవ సపోటా కాయిలు ఎవడిక్కావాలి? రేపు నేను తెచ్చి పెట్తానుం

డు రమణా, నీకు బోలెడు మంచి పళ్లు. ఇక ముందు ఆ కాయల జోలికి పోకు. ఆచెట్టు కాయలన్నీ వాళ్లనే కోసుకొని పొట్ట పగిలేటట్లు తిని అజీర్తి తెచ్చుకోమను. ఏవీ, నీ దగ్గర కాయలు వాళ్ళమొగాన కొట్టివస్తాను'' అని వరలక్ష్మి బుజం మీద ఉన్న రమణ లాగు జేబులో లాగులో ఉన్న నాలుగు సపోటా కాయలూ పైకి తీసి, పట్టుకువెళ్ళి ఇంటివారి గుమ్మం లో పడేశాడు. '' ఇదుగోనండి మావాడు దొంగిలించిన మీ ఆస్తి'' అని వచ్చేశాడు.

శ్రీహరిలో కోపం ఇంకా రంగులుతూనే ఉంది. తమ్ముడికేసీ, భార్యకేసీ తీక్షంగా చూసి వెనక్కి వెళ్లి సైకిలు తీసుకు వచ్చి వరండాలో పెట్టి తనగదిలోకి పోయి కూర్చున్నాడు.

వరలక్ష్మి రమణ నోదార్చడానికి నానాప్రయత్నాలు చేస్తోంది. వాడిచేతిలో బెల్లం ముక్క పెట్టింది. తన దగ్గర ఉన్న ఒక అణా వాడికిచ్చింది. '' ఎందుకురా నాయనా అట్లా దెబ్బలు తింటావు? అట్లాంటి పనులు చేయకు తండ్రీ ఎప్పుడూ'' అని వాడిని చూస్తూ ఉండమని అత్తగారికి చెప్పి తనవంటపని చూసుకో సాగింది.

భోజనాలదగ్గర ఎవరూమాట్లాడలేదు. ఎన్నడూ లేనిది అన్నగారి నీవేళ తీవ్రంగా ఎదిరించినందువల్ల అన్నగారికేసి చూడలేక పోతున్నాడు రాధ. శ్రీహరి తలవంచుకునే భోజనం చేశాడు. రమణ అన్నం తినకుండానే ఇవతలగదిలో నేల మీద పడి అట్లా ఎక్కుతూనే నిద్రపోతున్నాడు. శ్రీహరి తనగదిలోకి వెళ్లబోతూ రమణ దగ్గర ఆగి వాడి మొగంకేసి

చూశాడు. వాడి మొగం మీద కన్నీటి చారలున్నాయి. జుట్టు రేగిపోయి ఉంది. చెంపలమీద చేతివేళ్ల గుర్తులు కనిపిస్తున్నాయి. ఇంకా ఎక్కు పెద్దగా వచ్చేస్తోంది. శ్రీహరి ముందుకు వంగి రమణని చేతుల్లోకి తీసుకున్నాడు. రాధ అదిచూసి అవతలకు తప్పుకున్నాడు. శ్రీహరి రమణ తల బుజంమీద పెట్టుకొని తన చెక్కిలి వాడి చెక్కిలి మీద చేర్చి వాడి వెన్ను మీద రాస్తున్నాడు. రమణకు మెలకువ రాలేదు. శ్రీహరి వాడిని తీసుకు వెళ్లి తన మంచంమీద పడుకోబెట్టాడు. వాడి జుట్టు సర్ది, కన్నీటి చారలు తుడిచి, చెక్కిళ్లమీద రాసి తరువాత మోకాళ్ళమీద మోచేతు లాన్చుకొని అరచేతుల్లో తలపెట్టుకొని ఉండిపోయాడు.

వరలక్ష్మి వచ్చింది. కొంతసేపు భర్తకేసి చూసింది. దగ్గరకు వచ్చి రమణకేసి చూసింది. వాడిమీదికి వంగి మొగం మీద ముద్దు పెట్టుకొని కళ్ళుకొంగుతో తుడుచుకుంది. భర్త దగ్గరగా నిలబడి "వెర్రినాయనను ఎన్నడూ లేనిదీ అట్లాకొట్టారేమిటి? ఏమంత పెద్దతప్పు చేశాడని? ఇదివరకెన్ని సార్లు వాడు సపోటా చెట్లు ఎక్కలేదు? ఎన్నిసార్లు సపోటాకాయలు కొయ్యలేదు? ఎప్పుడేనా గొడవ పెట్టారా ఇంటివారు? నవ్వుతూ చూస్తూ ఊరుకునేవారు కారూ? వీడంటే ఎంతగారాబం చేసే వారు! ఇప్పుడు అద్దె ఇవ్వలేదని మంటకొద్దీ ఇట్లా చేశారు. పైగా తమకే మనుమడు పుట్టబోతున్నాడుకా. ఇక పరాయి పిల్లల మీద వాళ్ళకు ప్రేమేమి ఉంటుంది? నాచేతులు పడిపోను, అప్పుడు నేనూ అనవసరంగా కొట్టాను వెర్రి

తండ్రిని. ఇట్లా మన పెద్దలకోపాలు వాడిమీద చూపిస్తున్నా మన్న మాట" అంది. రమణను తీసుకువచ్చి ఇవతల గదిలో పడుకో బెట్టి వచ్చింది.

శ్రీహరి ఇంకా అట్లాగే కూర్చోవడం చూసి దగ్గరకు వెళ్ళి అతని బుజంమీద చేతితో రాస్తూ "ఈవేళ ఎందుకో పొద్దున్న నుంచీ మీరు చాలా కోపంగా ఉన్నారు. ఎవరేనా ఏమన్నా అన్నారాండీ?" అని అడిగింది.

శ్రీహరి ఆమె మొగంలోకి ఒకసారి చూసి మళ్ళీతల చేతుల్లో పెట్టుకొని, "నావంటి వాడికి కోపం కాక మరేముం టుంది? ఎవరంటే కోపమేమిటె, జీవితం అంటేనే కోపం! చేత కాని కోపం! నావల్ల ఒకళ్ళకీ సుఖం లేదు, బాధేకాని" అంటు న్నాడు.

"అదేమి టండీ? అట్లా అనకండి. మనస్సు లనవసరంగా పాడుచేసుకో కండి. ఇక పడుకోండి. నేను ఈవేళ రమణ దగ్గర పడుకుంటాను పలవరిస్తాడో ఏమో? పడుకోండి" అని భర్త తలెత్తి మెల్లగా పడుకో జేసింది. తనువచ్చి రమణ దగ్గర పడు కుంది.

రమణ రాత్రి రెండుమూడుసార్లు పలవరించాడు శ్రీహ గుండెలు పిండుకొని లేచి వచ్చి కొడుకు ఒంటిమీద చేయివేసి చూసి. భార్య "ఏమీ లేదు పడుకోండి" అని చెప్పగా వెళ్ళి పడుకుంటున్నాడు. ఆరాత్రి అతనికి సరిగా నిద్ర పట్టనేలేదు.

## ౧౬

పొద్దున్నే లేచాడు. కాని తమ్ముడి మొగం చూడడానికి శ్రీహరికి మొగం చెల్లలేదు. రాధకూడా ముభావంగా ఉన్నాడు. రమణ మామూలుగానే లేచాడు. ముందురోజు సాయంత్రం దెబ్బలు అప్పుడే మరచిపోయినట్లున్నాడు. "అమ్మ త్వరగా నీళ్ళోసి, అన్నం పెట్టు, బడికెళ్లి పోవాలి" అని మొగం కడుగుకొని, తల్లి చేత నీళ్ళు పోయించుకొని, చద్దన్నం పెట్టించుకొని తిన్నాడు. చొక్కా తొడుగుకొని, పుస్తకాల సంచీ బుజాన వేసుకున్నాడు. శ్రీహరి "ఇటు రారా" అని మెల్లగా పిలిచాడు. వాడు తండ్రి దగ్గరకు బెదురుతూ వెళ్ళాడు. శ్రీహరి వాడి తలమీద నిమురుతూ "అల్లరిచేయకేం" అన్నాడు. వాడు పెద్దగుడ్లతో చేయనన్నట్లు తలఅడ్డంగా ఊపాడు. శ్రీహరి జేబులోనుంచి ఒకఅణా తీసి వాడికిస్తూ, "నిమ్మతొనలు కొనుక్కో చెల్లాయికి కూడా కొన్ని పట్టుకురా" అన్నాడు. అణా చూసి రమణ మొగం విప్పారింది. తండ్రికేసి సంతోషంగా చూసి, వెనక్కి తిరిగి "చెల్లాయి. నీకూ కూడా నిమ్మతొనలు తెస్తాను" అని కేకేసి బడికి పరుగెత్తుకు పోయాడు. శ్రీహరి వాడికేసి చూస్తూ ఉండిపోయాడు. ప్రైవేట్లకు బయలుదేర బోతూండగా వరలక్ష్మి "ఈ పూటకు కూర లేదండీ, ఎట్లా" అంది. శ్రీహరి జేబులో రెండణాలు మాత్రమే ఉన్నాయి. మాట్లాడకుండా అవే భార్యవైపు గిరవాటు వేసి, ఒక నిట్టూర్పు విడిచి, సైకిలు

తీసుకొని ముందుకు సాగాడు. ఈవేళ అతనిలో కోపంలేదు. కోపం తనతోబాటు అతని శక్తినికూడా తీసుకు పోయినట్లుంది. ఇప్పుడతనిలో విపరీతపు నీరసం మాత్రం మిగిలింది. ప్రైవేట్లకు ఈవేళ మానెయ్యాలనిపించింది. కాని వెళ్ళక తప్పదు. వెళ్లాడు.

తొమ్మిదింటికి ఇంటికి తిరిగి వచ్చి పరధ్యానంగా నాలుగు మెతుకులు నోట్లోవేసుకొని లేచాడు. చేతిలో చిల్లిగవ్వ లేదే ఎట్లా ముందురోజులు గడపడం– పోనీకూరలు మానేస్తే! ఆరోగ్యం చెడుతుందేమో. – అయినా మానేయవచ్చు. కాని ఒక్క అణా కూడా లేకుండా గడపడం కష్టంకాదూ! ఏమీ పాలుపోలేదు శ్రీహరికి. వరలక్ష్మి వచ్చింది. శ్రీహరి ఏమిటన్నట్లు చూశాడు ఆమె కేసి. వరలక్ష్మి అతనికి ఒక నెక్లెసు, ఒక గాజుల జత చూపించింది. "కొనమని కాదులెండి" అని చిరునవ్వు నవ్వింది "రామకృష్ణమూర్తిగారు భార్యకు చేయించారట. ఆవిడ చూపించి రమ్మంది. ఎట్లా ఉన్నాయండీ."

శ్రీహరి మంత్రముగ్ధుడులా వాటికేసి చూస్తూ ఉండిపోయాడు. "ఎట్లా ఉన్నాయంటే చెప్పరేం" అంది వరలక్ష్మి. శ్రీహరి దీర్ఘంగా శ్వాస పీల్చి "బాగానే ఉన్నాయి" అని పెదవి కొరుక్కొని, చొక్కా తొడుగుకొని, ఖండువా వేసుకొని బడికి బయలు దేరాడు. వరలక్ష్మి కొంతసేపు అతని కేసి చూసి, మరికొంత సేపు చేతిలో నగల కేసి చూసి, పెదవి విరిచి, వెళ్ళి రామకృష్ణమూర్తి భార్యకు ఇచ్చివేసి వచ్చింది.

శ్రీహరి బడిలో పాఠం కనిపెట్టి కాబోలు పిల్లలలో గుసగుసలూ, ఇకిలింపులూ సకిలింపులూ ప్రారంభమయ్యాయి. శ్రీహరి అవేమీ పటించుకోకుండా పాఠం చెప్తూ తున్నాడు. రీసెస్ వేళ స్టాఫ్ రూంకు నడిచాడు. కాఫీ హోటలుకు వెళ్ళే మాష్టర్లు లేచి వెళ్ళారు. మిగిలిన వారు ఫ్లాస్కులలో నుంచి పోసుకొని తాగుతున్నారు. శ్రీహరికి ఈ వేళ చాలా బలహీనంగా ఉంది. నిజానికి కొన్నాళ్ళనుంచి ఇట్లాగే ఉంటోంది. ఆ మధ్యాహ్న సమయాన ఏమైన తీసుకుంటే బాగుండు ననిపించింది. టీ తెప్పించు కుందామంటే అలవాటు అవు తుందేమోనన్ని భయం మాట అటుంచి ఇప్పుడు దగ్గర డబ్బులు లేవు. అనుకోకుండా అతని దృష్టి కొన్ని క్షణాల పాటు ఫ్లాస్కుల్లో నుంచి కప్పులోకి కాఫీ పోసుకొని తాగుతున్న వారి మీద నిలిచింది. వెంటనే తలవంచేసు కున్నాడు. నరసింహారావు శ్రీహరి కేసి ఒకసారి చూసి మొగం తిప్పి వేసుకొన్నాడు. 'మంచికి పోతే చెడ్డ ఎదురైంది. ఏదో నా ఒళ్ళో ఒరిగి పోయినట్లు నిన్న శ్రీహరి నామీదికి ఎట్లా లేచాడు!' అనుకున్నాడు. కాఫీ హోటలకు వెళ్ళిన మాష్టర్లు తిరిగి వచ్చారు. మామూలు కబుర్లలోపడ్డారు. శ్రీహరికి వాళ్ల కబుర్లేమీ వినబడడం లేదు. ఎదురుగా పెట్టుకొన్న హోం వర్కు పుస్తకాలు దిద్దడం లేదు. తెరవిన పుస్తకం కేసి చూస్తూ ఉండిపోయాడు.

సాయంత్రం బడినుంచి తిన్నగా ఇంటికి పోవడానికి వీలు లేకుండా ప్రైవేటు. చాలా నీరసంగా ఉంది. మానేస్తే? ఒకటి

రెండు నిమిషాలు సందిగ్ధావస్థలోపడి రోడ్డుమీద నిలిచి పోయాడు. తరువాత సైకిలెక్కి దారిలో హోటళ్ళకేసీ, గ్లాసు కేసులలో ఉన్న తినుబండారాల కేసీ, మిఠాయి కొట్లకేసి చూస్తూ ప్రైవేటుకు వెళ్ళాడు. అయిందని పించి ఇంటికిమళ్ళా డు. ఇంటికి చేరబోతుంటే ఏదో ఆలోచన తట్టి సైకిలాపి, వెనక్కి తిప్పి సుబ్బారావు ఇంటికి వెళ్ళాడు.

ఒకవేళ సుబ్బారావు ఇంట్లో ఉండడేమో ననుకున్నాడు. ఉన్నాతను వచ్చానని తెలసి ఇంట్లో లేనని చెప్పమంటాడేమో అనుకున్నాడు శ్రీహరి. కాని సుబ్బారావు ఇంట్లోనే ఉన్నాడు. శ్రీహరిని చూసి "రా శ్రీహరీ" అని లోపలికి తీసుకువెళ్ళి కుర్చీ చూపించాడు. తను మరో కుర్చీమీద కూర్చున్నాడు. అక్కడే ఒక నులక మంచం మీద ఒక కుర్రాడు పడి మూలుగు తున్నాడు. "మా రెండో వాడోయి. రెండు రోజులనుంచీ జ్వరం. చూస్తూన్నావు కాదూ. ఇట్లాగే ఎవళ్ళకో ఒకళ్ళికి మూలుగులో ఏవో ఉంటూనే ఉంటాయి. ఒక్క నిమిషం మన శ్శాంతి ఉండదు – ఏంనాన్నా పడుకో, అదే తగ్గుతుంది. కాస్త యూకలిప్టస్ ఆయిల్ రాయనా" అని కుర్రవాడు నుదుటికి యూకలిప్టస్ ఆయిల్ రాసి మళ్ళీ శ్రీహరి దగ్గర కూర్చు న్నాడు సుబ్బారావు. ఆదృశ్యం చూసేసరికి శ్రీహరిలో డబ్బు అడగగల ధైర్యం కాస్తా అడుగంటిపోయింది.

సుబ్బారావు అంటున్నాడు "ఏమిటోనోయి ఈజీవితం శ్లేష్మంలో పడ్డ ఈగలా! ఎందుకో నాకర్థం కావడం లేదు. ఏమి

సుఖం పొందుతున్నాము? - అన్నట్లు నిన్న ఎందుకంత కోపంగా ఉన్నావు శ్రీహరీ?"

శ్రీహరి జవాబీయలేదు.

"నేనర్థం చేసుకోగలనులే. మనలాంటివాళ్ళు ఎందుకు కోపంగా ఉంటారు సామాన్యంగా. కాని నాకు విచారం వేస్తోంది శ్రీహరీ నువ్వేనా మాకన్న బాగా బ్రతుకుతున్నావనుకున్నాను. నీకు మాకన్న కొన్ని మంచి ఆదర్శాలున్నాయి. మంచి లక్షణాలున్నాయి. అభివృద్ధిలోకి వస్తావనుకున్నాను. నువ్వుకూడా మాలాగే కావడంతో నాలోకూడా ఉత్సాహం చచ్చిపోయింది" అని, కుర్రవాడు పిలవగా సుబ్బారావు లేచి వెళ్ళి వాడిని పెరటి వైపుకు మెల్లగా నడిపించుకు వెళ్ళి, మళ్ళీకొద్దిసేపటికి లోపలికి తీసుకు వచ్చి మంచంమీద పడుకోబెట్టాడు వాడిని. తలగడ సరిగా పెట్టి, దుప్పటీ కప్పాడు.

శ్రీహరిలో వేదన అంతా ఒక్కసారిగా పైకి వచ్చేసింది. అన్నాడు: "నాకీలోకం వ్యవహారం చాలా బాధ కలిగిస్తోంది, సుబ్బారావు. మా పాలమనిషి ఎంతో కాలంనుంచి మాకు పోస్తోంది. ఎప్పుడూ మేము బకాయి పెట్టలేదు. తారీఖు రాగానే డబ్బు ఇచ్చివేస్తూ ఉన్నాను. అయిన నిన్న కొంత డబ్బు దిగబెట్టానని నానామాటలూ అంది. కృతజ్ఞత అనేది హరించి పోయినట్లుంది మనుష్యుల్లో. పోనీ పాలమనిషి మాట అటుంచు. మా ఇంటిగల ఆయన బోలెడంత ఆస్తిపరుడు. అటువంటి వాడు మొదటిసారిగా ఈ నెలకొంత అద్దె దిగబెట్టానని గిజ గిజ కొట్టుకుంటున్నాడు. డబ్బుతో నేనా మంచితనం

ఉంటూ? ఇటు చూస్తే మా యింట్లో పని మనిషి మరో రూపా యి పెంచమని కచ్చింతగా చెప్పింది. పెంచలేమంటే మనే సింది.”

సుబ్బారావు చిరునవ్వు నవ్వుతూ, “అవునయ్యా డబ్బు మీాదే ఆధారపడి ఉంది ఈప్రపంచం. అందుకే 'ధనమూాల మిదం జగత్' అన్నారు పెద్దలు. అన్నిటి విలువా లెక్కకట్టే ది డబ్బే. ఆడబ్బులేకపోతే మన మొగం ఎవళ్ళూ చూడరు. డబ్బున్నవాడిని మనం ధనవంతుడని ఊరుకోం చూడు. గొప్ప వాడంటాం. అంటే డబ్బుంటేనే గొప్పన్నమాట. అందుకే ప్రతివాడూ ఆడబ్బు సాధ్యమైనంత ప్రోగుచెయ్యడానికి తం టాలు పడుతున్నాడు. ఆప్రయత్నానికి ఈమంచి తనం, కృత జ్ఞతా వంటివి అడ్డువస్తే వాటిని ప్రక్కకి తోసేస్తున్నాడు. మనం డబ్బుని సింహాసనం మీాద కూర్చోబెట్టినప్పుడు ఒకరు కృతజ్ఞత చూపలేదని మంచిగా ప్రవర్తించలేదని నిందిస్తేలాభం లేదు. మనం చెప్పే చదువులు డబ్బుతో పోల్చి చూస్తే అంత విలువైనవిగా కనబడ్డంలేదు సమాజానికి. పాలూ పెరుగూ పాటి విలువ కూడా చేయవు మన చదువులు. ఉప్పూ పప్పూ చింత పండూ బెల్లం అమ్ముకునే వాడు మనకన్న ఎక్కువ ఆర్జిస్తు న్నాడు”- అని పిల్లవాడు బాధతో అటూ ఇటూ దొర్లుతూం టే లేచి వెళ్ళి వాడిప్రక్కన నులకమంచం మీాద కూర్చొని కాళ్ళురాస్తూ మళ్ళీ అన్నాడు. “చూడు మీాపనిమనిషికున్న కట్టుబాటు. డబ్బుపెంచితేనే పనిచేస్తానని కచ్చింతగా చెప్ప గలిగింది. ఈవేళ మానిపించేశారనుకో. కాని నాలుగు రోజులు

పోయాక ఇక చేసుకోలేక మళ్ళీ ఆమెనే బ్రతిమాలవలసి వస్తుంది. మరొకరు దొరకరాయె. డబ్బుమీద ఆధారపడిన ఈ సమాజంలో మనం నిలబడాలంటే మనలోనూ ఆకట్టుబాటు కావాలోయి. కాని మనలో సంఘీ భావమేమిటి? ఒకరు ఎడ్డెమంటే మరొకరు తెడ్డె మనవలసిందే. అందరూ చదువుకున్నవారే కదా. అందరికీ అమూల్యాభిప్రాయాలుంటాయి. అందుచేత మరొకడి మాట వినడం అంటే చిన్నతనంగా ఉంటుంది. ఎవరిమట్టుకు వాడే నాయకుడు. నలుగురూ కలిసి పనిచేయలేకపోయినా విమర్శలు మాత్రం గొప్పగాచేయగలరు- చదువుకున్నవారు కాదూ? మన లాంటివాళ్ళు ఏంచేయగలం? సమ్మెలు చెయ్యడమంటే నామోషీ. చేసినా నెగ్గలేం కూడా మన తత్వాన్నిబట్టి. అటుప్రభుత్వం ఇటు ప్రజలూ కూడా మన సమ్మెలు లెక్కచేయరు. బురదగొడ్డు బుస్సుమంటేమాత్రం భయపడేదెవరయ్యా? మన విలువ సమాజం గుర్తించే వరకు మన పరిస్థితి ఇంతేనయ్యా."

శ్రీహరి చెప్పాడు. "మా పక్కవాటాలో ఒక పెద్ద డబ్బుండి గుమాస్తా ఉన్నాడు. ఆయన అప్పుడే రెండెకరాల భూమి కొన్నాడు. భార్యకు నగలు చేయిస్తున్నాడు. నిన్ననే కొత్తగా ఒక నెక్లేసూ, మరో గాజుల జతా చేయించాడు.- కాని మన పరిస్థితి చూస్తే ఇట్లా ఉంది."

"అవును వాళ్ళకు జీతానికి మించిన పైరాబడి ఉంటుందోయి. ఒక్క మాష్టర్లకి తప్ప మిగతా అందరు ఉద్యోగస్థులకీ పైరాబడీ ఉంటుంది. ప్రమోషన్లూ ఉంటాయి. ఎటువచ్చీ

మాష్టర్లే గొంగళీ ఎక్కడున్నావంటే వేసిన చోటే ఉన్నానన్నట్లుండేది. మాష్టర్లకూ ప్రైవేట్లనేవి ఉన్నాయనుకో పై రాబడి సాధనాలుగా. కాని పెద్దక్లాసుల మాష్టర్లకి తప్ప మనలాంవాళ్ళకి ఈవిధంగా కూడా శ్రమ ఎక్కువ రాబడి తక్కువే. అందుకే కొందరు ఇట్లా కాక 'సైడ్ బిజినెస్' చేస్తారు. భార్య పేర ఇన్సూరెన్సు వ్యాపారం చెయ్యడం. పుస్తకాలూనోట్సులూ రాయడం, హోమియోపతీ వైద్య చేయడం ఇట్లాంటివి. కోటివిద్యలూ కూటికే కాదోయ్" అన్నాడు సుబ్బారావు వెటకారపు చిరునవ్వుతో.

శ్రీహరి రెండు నిమిషాలు ఏమీ మాట్లాడక తరువాత నీరసంగా "సరే వస్తాను" అనిలేచాడు.

"ఉండు ఇప్పుడే వస్తాను" అని సుబ్బారావు లోపలికి. వెళ్ళి వచ్చి శ్రీహరి చేతిలో పదిరూపాయిలనోటు పెట్టాడు. "శ్రీహరీ నీలో ఒక్క చెడ్డ లక్షణం ఉందయ్యా. మొహమాటం అది ఎంత మాత్రం పనికిరాదు. నువ్వునాదగ్గరకు వచ్చింది ఈడబ్బు తీసుకు వెళ్ళడానికేనా? మరి ఏమీ అడగకుండా వెళ్ళిపోతావేం? ఇట్లా ఉంటే లోకంలో నెగ్గుకు రాలేవయ్యా. ఆవేళ నీదగ్గరనుంచి ఈపదిరూపాయిలు తీసుకువెళ్ళాను కాని అసలే ఇబ్బందిలో ఉన్న నీవంటివాడి దగ్గరపట్టుకు వచ్చినందుకు చాలా బాధపడుతూనే ఉన్నాను. కాని అప్పటికి మరో దారి లేక నీదగ్గరే తీసుకోవలసి వచ్చింది. నిన్న నువ్వుకోపంగా ఉండడం చూసి పదిరూపాయిలు ఎట్లాగో పుట్టించి తీరాలని

ప్రయత్నంచేసి ఈవేళ ఎట్లాగైతేనేం సాధించాను," అని ఇంతలో కుర్రవాడు కేకెయ్యగా "సరే ఉంటాను శ్రీహరీ" అని లోపలికి వెళ్ళిపోయాడు సుబ్బారావు.

పదిరూపాయిలనోటు చూసే సరికి శ్రీహరికి పెన్నిధి దొరికినంత ఆనందమైంది. ఇంటికి త్వరగా పోసాగాడు. దారిలో ముందు రోజు తనకోపం, అది రమణమీదికి విరుచుకుపడడం జ్ఞాపకం వచ్చింది. ఒక్కసారి గుండె గిజ గిజలాడింది. సైకిలు బ్రేకు వేసి, ఒకమిఠాయి కొట్టు దగ్గరకు నడిచి పావలా పకోడీలూ పావలా జిలేబీ పొట్లాలు కట్టి ఇమ్మన్నాడు. దుకాణదారు పొట్లం కట్టూంటే "అయ్యా ధర్మం. తల్లి దండ్రులు లేరు. కలరా తగిలి ఇద్దరూ చచ్చిపోయారు. మూడు రోజులనుంచీ అన్నం లేదు. ఆకలిగా ఉంది. ఒక్కకానీ ఇవ్వరూ" అంటూ ఒకముష్టి కుర్రవాడొచ్చాడు. శ్రీహరి వైపుకు తిరిగి "బాబూ ఒక కానీ ధర్మం చెయ్యరూ. మా అమ్మా నాన్నా లేరండీ" అంటూ అడగడం మొదలు పెట్టాడు. శ్రీహరి అటు తిరిగాడు. ఆ కుర్రవాడు శ్రీహరి మొగంలోకి చూసి వెనక్కి పరిగెత్తడం మొదలు పెట్టాడు. శ్రీహరి తెల్లబోయాడు. తరువాత పోల్చుకున్నాడు. బిల్లు కలెక్టరు మూడో కుర్రవాడు! "ఇటురా అబ్బాయి అని కేకేశాడు శ్రీహరి. ఆకుర్రవాడు బిక్కమొగం వేసుకొని శ్రీహరికేసే బెదురుగా చూస్తూ దగ్గరికి వచ్చాడు. దుకాణదారు శ్రీహరికి పొట్లాలిచ్చాడు. శ్రీహరి పది అణాలిచ్చి ఒకఅణా పకోడీలూ, ఒక అణా జిలేబీ పొట్లంకట్టి ఈ కుర్రవాడికి ఇయ్యమని, ఆపొట్లాలు కుర్రవాడి కిప్పించిఇంటికి పోయాడు.

ఇంటికి వెళ్ళగానే శ్రీహరి పొట్లాలు రమణ చేతిలో పెట్టి, "అమ్మని అందరికీ పంచిపెట్టమని చెప్పు" అన్నాడు. రమణ ఎగిరి గంతేసి లోపలికి పరిగెత్తి తల్లితో చెప్పాడు. వరలక్ష్మి అటువచ్చి పొద్దున్న పైసా లేదన్నారు. ఇవెట్లా వచ్చాయి." అని అడిగింది.

శ్రీహరి చిరునవ్వుతో దానికేమీ జవాబీయక "ముందు నోరూరుతోంది, అందరికీ పంచుదూ" అన్నాడు.

రాధకూడా ఇంట్లోనే ఉన్నాడు. వరలక్ష్మి అందరికీ తలోకొంచెం పంచిపెట్టింది. "అన్నట్లు ఏమండోయి, మళ్ళీ రాధ కోసం పెళ్ళి సంబంధం వారు వచ్చారు. మీరు లేరంటే రాత్రి వస్తామన్నారు" అని వరలక్ష్మి మరది మొగం వాడిపోవడం చూసి నవ్వింది.

శ్రీహరి హృదయంలో అంతలో సంతోషం—కారు మబ్బులలోనుంచి సూర్యుడు తొంగిచూసినట్లు. "అయితే త్వరగా వంట చెయ్యి. భోంచేసి కూర్చుందాం వాళ్ళు వచ్చే సరికి" అన్నాడు.

"ఈలోగా కుర్చీలమాట చూడండి. రాత్రివేళ కాబట్టి టిఫిన్లూ అవీ పెట్టనక్కర్లేదు లెండి. వెండి పళ్ళేలూ అవీ తేవల సిన పనిలేదు" అంది చిరునవ్వుతో వరలక్ష్మి.

"చచ్చా! ఎట్లా? ఇంటివాగిని చచ్చినా అడగను. వాళ్ళ కు అద్దెపూర్తిగా ఇవ్వలేదుకదా. పోనీ ఒక ఐదురూపాయి లిచ్చి రానేమిటి?— ఊహు ఇవ్వను. వచ్చేనెల జీతం వచ్చిన తరువాతే ఇస్తాను. ఏంచేస్తారో చూస్తాను. ఈసారి ఉండు, ఈ అప్పులు తీరిపోగానే రెండుకుర్చీలు కొనేస్తాను. వాళ్ళనీ వీళ్ళనీ

అడగవలసిన పనిఉండదు" అని రామకృష్ణమూర్తి ఇంట్లోకి వెళ్ళి వాళ్ళ కుర్చీలు తెచ్చాడు శ్రీహరి. వరలక్ష్మి వంట ఇంటిలోకి వెళ్ళిపోయింది.

శ్రీహరి కేమీ తోచక రాధను ప్రశ్న వేశాడు: "ఏరా రాధా, బాగా చదువుతున్నావా? పరీక్షలు దగ్గరకు వస్తున్నాయి. బాగా వ్రాసుకోవాలి."

రాధ కొంచం కంగారుపడి "బాగానే చదువు తున్నానన్నయ్యా" అన్నాడు.

శ్రీహరి రమణను "ఏరా, నీపాఠాలు బాగా చదువుతున్నావా? కొత్త పద్యాలు ఏమైనా చెప్పారా" అని అడిగాడు.

"ఆ చెప్పారు, నాన్నా " అని అప్పజెప్పడం మొదలు పెట్టాడు రమణ. శ్రీహరి వాడి జుట్టు నిమురుతూ "బాగా వచ్చాయిరా, వచ్చేఏడు నువ్వు మళ్ళీ నాటకాల్లో వేసి ఇంకా ఎక్కువ ప్రైజులు సంపాదించాలి, ఏం? " అన్నాడు.

ఇంతలో సూర్యావతి వచ్చి "నాన్నా, నాకో కథ చెప్పవూ" అంటూ అడిగింది.

"చెపుతాను ఉండు. ముందు బాబుని తీసుకురానియ్యి" అని శ్రీహరి లేచి వెళ్ళి బాబును తీసుకువచ్చి, వాడిచేత విద్యాలు చేయిస్తూ, కాకీ నక్కా, కోతీ రెండు పిల్లులూ కథలు చెప్పాడు. సూర్యావతీ రమణా చెరో ప్రక్కనీ నిలబడి తండ్రి బుజాల కానుకొని కథలు వింటున్నారు. కథలు చెప్పడం అయింది.

రమణ అన్నాడు. "నాన్నా, బాబుని నామీాద గుర్రం ఎక్కించవూ" అని మోకాళ్ళమీాదా మోచేతుల మీాద వంగున్నాడు. శ్రీహరి బాబుని వాడి మెడమీాద కూర్చోబెట్టి పట్టుకున్నాడు. సూర్యావతి వెనకాలనుంచి చల్ చల్ అంటోంది. రమణ మోకాళ్ళమీాదా మోచేతుల మీాదా ముందుకు కదులుతున్నాడు. బాబు పక పకా నవ్వేస్తున్నాడు కొత్తగా వచ్చిన రెండు పళ్ళూ పైకి కనబడేటట్లు. వరలక్ష్మి ఇవతలకు వచ్చి ఈ వినోదం రెండు సమిషాలు నిలబడి "సరే, ఇక భోజనానికి లేస్తారా? పెళ్ళి సబంధం వారు వస్తారు" అంది. శ్రీహరి రాధా వాళ్ళూ వచ్చి భోజనాలు చేశారు.

వాళ్ళ భోజనాలయిన కాసేపటికి సంబంధంవారువచ్చారు. అన్ని కబుర్లూ అయిన తరువాత వచ్చినవారు తమపిల్లను చూసి వెళ్ళవలసిందని కోరారు. శ్రీహరి తమ్ముడిని అడిగాడు. "ఏమంటావు రాధ? "అని. "నాకుఖాళీ లేదన్నయ్యా. పరీక్షలు చాలా దగ్గరకు వచ్చాయి" అన్నాడు రాధ. వచ్చినవారు "ఒక్కపూటేగా, ఎట్లాగో వీలుచేసుకొని వస్తే, పెళ్ళి పరీక్షలయిన తరువాతనే జరిపించుతాం" అన్నారు. కాని రాధ ఒప్పుదల సూచించలేదు. "పోనీ ఈ ఊళ్లోనే పెళ్ళిచూపుల కేర్పాటు చేస్తాం" అన్నారు వాళ్ళు. శ్రీహరి తమ్ముడి మొగంమీాద అయిష్టత కనిపెట్టి "వద్దులెండి, పరీక్షలు కానీయండి. అయిన తరువాతనే చూద్దాం. ఒక నెల పోయిన తరువాత మరొక కార్డు రాయండి— ఒకవేళ ఇతర సంబంధాలేమైనా ఉంటే చూసుకుంటూనే ఉండండి. మాకోసం ఆగవద్దు" అన్నాడు. "ఆహా ఆమాత్రం

ఓపిక లేకపోతే ఎట్లా? మళ్ళీ కొన్నాళ్ళు పోయిన తరువాత రాస్తాము ” అని కొంచెంసేపు ఆకబుర్లూ ఈకబుర్లూ చెప్పి వె పోయారు వచ్చిన వాళ్ళు.

శ్రీహరి మనస్సులో మళ్ళీ ఆలోచనలు చిందులాడు తున్నాయి. ఎన్నాళ్ళు ఈ ఇబ్బందులూ కష్టాలు తనకి? రాధకి రేపో మాపో పెళ్ళి అవుతుంది. ఉద్యోగం దొరుకుతుంది. తన అప్పులు తీరిపోతాయి. తనమీద పెద్ద భారంకూడా తొలిగిపో తుంది. తనూ అప్పుడు బి.ఏ. పూర్తి చేయచ్చు. ఎం. ఏ.కూడా–

ఇంట్లో మళ్ళీ సంతోషవాతావరణం నెలకొంది.

* *

రాజ్యం వెళ్ళిన కొద్దిరోజులకు ఆమెదగ్గర నుంచి కులా సాగా చేరినట్లు ఒక కార్డు మాత్రం వచ్చింది. మళ్ళీ ఏమీ లేదు అయినా అందరూ రాజ్యం సంసారం ఏదో విధాన చక్కబడిం దని సంతోష పడ్డారు. సూరమ్మగారు మరీని. ఆమె ఈమధ్య సరిగా ఇంటిపట్టున ఉండడం లేదు. తరుచు రామకృష్ణమూర్తి తల్లి దగ్గరకు వెళ్ళి కూర్చుంటోంది. లేకపోతే ఇద్దరూ కలసి పక్క ఇళ్ల ముసలమ్మల దగ్గరకు పోతున్నారు. గుళ్ళో పురా ణాలకీ వాటికీ పోతున్నారు. వరలక్ష్మికూడా ఆశ్చర్యపోయింది. ఎన్నడూ అంతగా బయటకు కదలని అత్తగారు ఇంత ఉత్సా హంగా తిరిగి వస్తూండడం చూసి.

ఒకరోజు సూరమ్మగారు కోడలితో చెప్పింది: “ ఏమేవ్ కోడలా. ఇక్కడ అందరూ దక్షిణదేశం యాత్రకు వెళ్తున్నారే. ప్రత్యేకం రైలుబండి ఉంటుందిట. అన్ని క్షేత్రాలు చూపిస్తారట

భోజనాలకూ వాటికీ ఏర్పాట్లు వాళ్ళే చేస్తారుట. కూడా భజనలు చేసే వాళ్ళూ, పురాణం చెప్పే ఒక శాస్త్రులుగారూ, ఒక హరిదాసూ వస్తారట. నెలరోజులుయాత్రలు. ఇంతాచేసి నూట ఏభై రూపాయిలట. రామకృష్ణమూర్తిగారి తల్లి కూడ వెళ్తోందిట. నాకు కూడా వెళ్లి రావాలని ఉంది. ఏం శాశ్వతం చెప్పు. మళ్ళీ ఏటికి ఉంటానో ఉండనో. మరుక్షణం మనది కాదాయె బ్రతికి ఉండగా ఈపుణ్యక్షేత్రాలు చూసిరావాలనుంది. ''

రమణా సూర్యావతీ ఈమాటలు విని " ఎక్కడికి మామ్మా, ఊరెళ్తావా? కాశీవెళ్తావా? మళ్ళీ ఎప్పుడొస్తావు, మామ్మా" అంటూ ప్రశ్నల వర్షం కురిపించ సాగారు.

" కాశీ కాదురాతండ్రీ, రామేశ్వరం, మధురా అవీని. నెలా పదిహేనురోజుల్లో వచ్చేస్తాను, " అంది ఆవిడ.

" మరి మమ్మల్ని కూడా తీసుకెళ్ళవూ మామ్మా! "

" చిన్న పిల్లల్ని రానియ్యరురా, మీకు మంచి మంచి బొమ్మలు తెస్తానులే" అని ఓదార్చింది ఆవిడ వాళ్ళను.

సాయంత్రం శ్రీహరి రాగానే రమణా సూర్యావతీ తండ్రి దగ్గరికి పరిగెత్తి " నాన్నా, నాన్నా మామ్మెమో రామెశ్వరం చూడ్డాని కెళ్తోంది" అన్నారు.

" ఏమిటీ? " అని తెల్లబోయాడు శ్రీహరి.

" అవునండీ. ఇక్కడ చుట్టుపక్కల వాళ్ళు కొందరు దక్షిణదేశ యాత్రకు వెళ్తున్నారట. ప్రత్యేకం రైలుట రామకృష్ణ మూర్తిగారి తల్లికూడా వెళ్తున్నారట. వాళతో బాటు

అత్తగారుకూడా వెళ్దామనుకుంటు న్నారండీ'' అని చెప్పింది వరలక్ష్మి.

''అవునురా అబ్బాయి. ఇదిగో ఈకాగితం చూస్తే అన్నీ తెలుస్తాయిట. గుళ్లో ఇచ్చారు '' అని సూరమ్మగారు కొడుకుకు కాగితం అందిచ్చి యాత్రల గురించి చెప్పుకుపోసాగింది.

శ్రీహరి కాగితం చదివాడు. మొత్తం పుణ్యక్షేత్రాలూ మొత్తం వెళ్ళూ, ఎక్కడెక్కడ ఎన్ని రోజులు మకాము, ఏమేమి సౌకర్యాలో అన్నీ వివరంగా ఉన్నాయి అందులో.

''ఏమంటావురా అబ్బాయి'' అని అడిగింది సూరమ్మగారు

'' చూదాం'' అని ఊరుకున్నాడు శ్రీహరి. తరువాత ఆవిషయమె మరచిపోయాడు

కాని సూరమ్మగారు మాత్రం మరచిపోలేదు. కొడుకు 'చూదాం' అన్నమాటే అంగీకారంగా భావించి తనుకూడా యాత్రకు వస్తున్నానని చెప్పి వచ్చేసింది రామకృష్ణమూర్తి తల్లితో, ఇరుగు పొరుగులతో. ఆవిడలో ఇప్పుడు ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది. వయస్సులో పదేళ్లు తగ్గిపోయినట్లు లేచి తిరుగుతోంది. యాత్రకు కావలసిన సామానూ వగైరా లన్నీ సమకూర్చుకుంటోంది. మామ్మ ప్రయాణ సన్నాహం చూసి, రమణ రైలు ఆట మొదలు పెట్టాడు. వాడు తనే గార్డూ, ఇంజనుడ్రైవరూ, స్టేషను మాస్టరూ, ఇంజనూ కూడా, 'టంగ్ టంగ్' – ప్రీ – ఈ –ఈ ' – ' కూ – ఛుక్ ఛుక్ ఛుక్ ఛుక్ –కూ అంటూ పరుగెత్తు తున్నాడు. సూర్యావతే రైలుపెట్టె. వాడి

వెనకాల వాడి చొక్కా పట్టుకొని పరుగెత్తుతోంది. రమణ మామ్మ దగ్గర ఆగి "ఏమండీ టికెట్టు తీసుకోండి. బండి వెళ్ళిపో తుంది. త్వరగా ఎక్కెయ్యండి - 'కూ- ఛుక్ ఛుక్ ఛుక్ ఛుక్'- మద్రాసు వచ్చేసింది దిగండి " అంటున్నాడు. అది చూసి తను అప్పుడే ప్రయాణం చేసేస్తున్నంత ఆనందం పొందసాగింది సూరమ్మగారు. వరలక్ష్మి చిరునవ్వుతో కొడుకు ఆట చూస్తోంది. బాబూ అన్నగారి పరుగులు చూసి కేరింతాలతో చెయ్యి వూపుతున్నాడు వాళ్ళ వెనకాల అటూ ఇటూ పాకుతున్నాడు

ఈ ఆట చూసే శ్రీహరికి జ్ఞాపకం వచ్చింది తల్లి యాత్ర మాట. అతనికి కంగారు పట్టుకుంది. ఒకవేళ తల్లి నిజంగా ప్ర యాణ సన్నాహం చేయడంలేదు కదా అని. తల్లిని యాత్రకు పంపిస్తే ? - ఎంత సంతోష పడుతుంది! కాని డబ్బేదీ? అప్పు చేస్తే? అవును, రేపు రాధకు ఎట్లాగైనా కట్నాలూ లాంఛ నాలతో పెళ్ళి అవుతుంది. వచ్చిన కట్నంలో నుంచిఅప్పు తీర్చే యచ్చు. అట్లా చేస్తే? - ఎప్పుడో ఏదో వస్తుందని ముందే అప్పు చేసుకు కూర్చోవడం మంచిదా ? అమ్మ ఎంత ఉబలాట పడుతోందో యాత్రచేయాలని. - ఆలోచన ఎటూ తెగక కొట్టుకుంటున్నాడు శ్రీహరి.

రమణా సూర్యావతీ మామ్మచుట్టూ రాచేరి 'మామ్మా మాకేం తెస్తావు? " అని అడుగుతున్నారు. " మంచిమంచి బొమ్మలూ, దేవుళ్ళ పటాలూ, ప్రసాదం పట్టుకువస్తానులే. సూరీడూ నీకు కంచి పట్టు పరికిణీ, చొక్కా పట్టుకుస్తాలే తల్లీ " - అని సూరమ్మగారు అంటూంటే.

"నాకు కీయిస్తే పరుగెత్తే రైలు పట్టుకురా మామ్మా. గంతులేసే కుక్క కూడాను" అన్నాడు రమణ.

"మామ్మా నాకు లబ్బరు పాపాయి తెచ్చి పెట్టవూ. దానితో ఆడుకుంటాను. పెద్ద పాపాయి ఉడాలి" అంటోంది సూర్యావతి.

"అట్లాగే నగ్గా. నాకేమి తెలుస్తాయి, మరి ఎవళ్ల చేతేనా మద్రాసు వెళ్లినప్పుడు కొనిపిస్తానులే" అంటోంది సూరమ్మగారు.

శ్రీహరి గుండె అదిరి పడింది. అమ్మ యాత్రసన్నాహం మీదే ఉంది. నిజంగా వెళిపోతున్నాననుకుంటోంది ఎటూ?

సాయంత్రం రామకృష్ణమూర్తి అతని దగ్గరికి వచ్చి "ఏం శ్రీహరిగారూ మీ అమ్మగారు కూడా యాత్రకి వెళ్తున్నారటగా. పంపించండి. మా అమ్మనుకూడా పంపిస్తున్నాను. చుట్టుపక్కల వాళ్ళూ వెళ్తున్నారు. అందరూ తోడుగా ఉంటారు. సరదాగా వస్తారు. పెద్దవాళ్ళకి కూడా నాలుగూ చూసిరావాలని కోరికలుండవా? వాళ్ల కోర్కెలు తీర్చకపోతే మనం కొడుకులమై పుట్టి ఏం ప్రయోజనం చెప్పండి?" అన్నాడు.

ఈ మాటలన్నీ శ్రీహరి గుండెలో శూలాల్లా గుచ్చుకున్నాయి. గిజ గిజ లాడుతూ "మరి డబ్బో" అన్నాడు మెల్లగా.

"వెధవ డబ్బు అదే వస్తుంది తలచుకుంటే. రేపు మీ తమ్ముడి పెళ్ళి ఉండనే ఉందాయె. అప్పుడు కావలసినంత గుంజ

దురుగాని. ఇప్పుడు ఎక్కడో అక్కడ తెచ్చి పంపించండి పాపం ఆవిడ ఎంత సంబర పడుతోందో! డబ్బు గొప్పదా పుణ్యం గొప్పదా చెప్పండి," అన్నాడు రామకృష్ణమూర్తి.

శ్రీహరి మాట్లాడ లేదు.

"అన్నట్లు శ్రీహరిగారూ మీతో ఎప్పటి కప్పుడు చెప్పాలనుకుంటున్నాను. మాకు తెలిసిన ఆయన కొడుకు లిద్దరు మీస్కూలులోనే చదువు తున్నారట. వాళ్ళకు ప్రైవేటు చెప్పాలిట. బాగా ముట్ట జెప్తారు. ఆయన మీతో మాట్లాడి ఒప్పించమన్నారు. రేపు పొద్దున్న ఒకసారి వెళ్ళొద్దామా?"

"పొద్దున్నా ప్రైవేట్లున్నాయి - అయినా సరే వెళ్దాం" అన్నాడు శ్రీహరి ఉత్సాహంగా. ఈ ప్రైవేట్లు కుదిరేటట్లయితే తెగించి అప్పుచేసి తల్లిని యాత్రకు పంపించాలని నిశ్చయించుకున్నాడు.

మర్నాడు పొద్దున్న రామకృష్ణమూర్తితో కలిసి వెళ్ళాడు. పిల్లల తండ్రి వారిద్దరినీ ఆహ్వానించి, శ్రీహరితో "నమస్కారం మాష్టారూ, నాకు తమతో పరిచయం లేనందువల్ల రామకృష్ణమూర్తిగారి సహాయం అడిగాను. తమకు తీరిక ఉంటుందో ఉండదో అని సందేహించాను. తమ కెప్పుడు వీలుగా ఉంటుంది?" అని అడిగాడు.

"సాయంత్రం పూట తీరికగా ఉంటుందండీ" అని చెప్పాడు శ్రీహరి.

"అట్లాగే చెప్పండి. వీళ్ళే మా అబ్బాయిలు. చూసే ఉంటారు. పెద్దవాడు థర్డ్ ఫారం చదువుతున్నాడు. చిన్నాడు ఫస్టుఫారం. వీళ్ళ నెలాగో గట్టెక్కించాలి. బండ వెధవలు సరిగ్గా చదవరు. మీరు చావ చితకకొట్టినా నేను ఏమీ అనుకోను. ఎట్లాగో అట్లాగా పాసైంది అనిపిస్తే చాలు. డబ్బు విషయం రామకృష్ణమూర్తిగారు ఎట్లాఅంటే అట్లా చేస్తాను. అంతా ఒక్క మొత్తంగా ఇవ్వాలనుకుంటున్నాను. కాదు ముందే సగం ఇమ్మంటే ఇస్తాను. వీళ్ళు కనక పాసైతే ఏదో నాకు తోచిన రీతిని బహుమతి కూడా ఇచ్చుకుంటాను" అన్నాడు పిల్లల తండ్రి.

"ఒకవేళ ఇప్పుడే మంచిదేమో చూడండి. కొంతసేపు చెప్పి వెళ్ళిపోతాను" అన్నాడు రామకృష్ణమూర్తి.

పిల్లల తండ్రి పంచాంగం క్యాలెండరు చూసి "ఇప్పుడు బాగానే ఉందండీ. ఇప్పుడే ప్రైవేటు ప్రారంభించండి. రేపటి నుంచీ సాయంత్రంపూట చెప్పుదురుగాని" అన్నాడు.

"అయితే నేను వెళ్తాంటాను" అని రామకృష్ణమూర్తి వెళ్ళి పోయ్యాడు.

"ఒరేయి ఇట్లారండి, మాష్టారి చేత చెప్పించుకోండి. అటూ ఇటూ దిక్కులు చూశారంటే తోళ్ళు ఊడ గొట్టాను. జాగ్రత్తగా చెప్పించుకోండి" అని కేకేసి పిల్లల తండ్రి కూడా లోపలికి వెళ్ళిపోయాడు.

శ్రీహరి ముందు ధర్డ్ ఫారం కుర్రవాడికి పాఠం చెప్పాడు. తరువాత ప్రశ్నలడిగితే వాడు గుడ్లగూబలా గుడ్లప్పగించి ఊరుకున్నాడు. నోరు మెదపలేదు. ఒకవేళ భయ పడ్తున్నాడేమో నని వాడి తలమీద రాస్తూ "భయం లేదులే. నేనేమీ చేయను చెప్పు" అని తనే ప్రశ్న జవాబులు చెప్పి వాడిచేత చిలుక పలుకుల్లా చెప్పించాడు. "ఇప్పుడు నువ్వే చెప్పు" అని ప్రశ్నలడిగితే వాడు మళ్ళీ మౌనం వహించాడు. శ్రీహరి ఆశ్చర్యపోయి డిక్టేషను చెపుతాను రాయమన్నాడు. వాడు రాశాడు కాని అక్షరాలు పోల్చుకోవడం చాలా కష్టమై పోయింది. "సరే, లెక్కలు చెయ్యి పోనీ" అని ఒక లెక్క ఇచ్చాడు శ్రీహరి. వాడు లెక్క కేసి దీనినెక్కడా ఎరుగున్నట్లు లేదే అన్నట్లు చూస్తున్నాడు. శ్రీహరి వాడికి లెక్క తెలియ జెప్పి "ముందు ఏమిచేయాలి? భాగించాలి కదా. ఈ పెద్ద సంఖ్యని ఈ చిన్న సంఖ్య పెట్టి భాగించు" అన్నాడు. వాడికి భాగహారం చేతైనతే కదా! శ్రీహరి ఒక నిట్టూర్పు విడిచి "నువ్వు సైన్సు చదువుతూ ఉండు" అని చెప్పి ఫస్టుఫారం వాడి చదువు ఎట్లా ఉందో చూదామనుకున్నాడు. వాడు 'అతని కంటె ఘనుడు ఆచంట మల్లన్న' అన్నట్లున్నాడు. వాడికి అక్షరాలే సరిగా రావు. ఎక్కాలు సరేసరి నాలుగెనిమిదిలు ఇరవై ఆరు అని చెపుతున్నాడు. "సరే ఈవేళకు చాలు" అని లేచాడు శ్రీహరి.

పిల్లల తండ్రివచ్చి "రేపు సాయంత్రం వస్తారు కాదూ. ఏమన్నా పని ఇచ్చారా—మీరు వచ్చేసరికి చేసి ఉంచేందుకు? చెయ్యకపోతే తోళ్లు ఒలిచెయ్యండి వెధవల్ని" అన్నాడు.

శ్రీహరి వస్తానని చెప్పిపొద్దున్నపూట ఉన్న ప్రైవేట్లకు పోయి తలో సావుగంటా కూర్చొని ఇంటికి చేరుకున్నాడు. పక్క వాటాలోకి నడిచాడు. 'రామకృష్ణమూర్తిగారూ' అని కేకేశాడు. ఆయన భోజనం చేస్తున్నాడు. "లోపలికి రండి" అని కేకేశాడు రామకృష్ణమూర్తి వంటింట్లో నుంచే. శ్రీహరి చెప్పులు విడిచి లోపలకు వెళ్ళాడు.

"ఏం ప్రైవేటు బాగా సాగుతోందా?" అని నవ్వుతూ అడిగాడు రామకృష్ణమూర్తి.

శ్రీహరి ఒకనిమిషం ఊరుకొని "రామకృష్ణమూర్తి గారూ ఆపిల్లల తండ్రితో చెప్పండి, పెద్ద ఆశలు పెట్టుకుంటారేమో - వాళ్లు పాసవుతారని నాకెంత మాత్రం ఆశలేదు" అన్నాడు.

రామకృష్ణమూర్తి నవ్వుతూనే "అయ్యో అందుకే కదండీ మీదగ్గర పెట్టింది. వాళ్ళకు చదువు వచ్చిందా రాదా అని మిమ్మల్ని ఎవరూ అడగరు. మీరు వెళ్ళి ఊరికే కూర్చొని వచ్చేస్తున్నా సరే. వాళ్ళు పాసవడం మాత్రమే కావాలి."

"చదువు రానిదే వాళ్ళు ఎట్లా పాసవుతారు" అని అడిగాడు శ్రీహరి.

"అది నన్నడుగుతారేమిటండీ? బలే వారే! మీతోడి మాష్టర్లు లేరండీ? మీలో మీకు ఆమాత్రం సహకారం ఉండదా ఏదో విధంగా వాళ్ళు పాసయ్యేటట్లు చూడండి. అందుకే బాగా డబ్బు ముట్టుతుందని నేను చెప్పింది. రేపు సగం అడ్వాన్సుగా ఇవ్వమననా?"

శ్రీహరి తెల్లబోయాడు. తల అడ్డంగా ఊపుతూ "అయితే అటువంటి ప్రైవేటు నాకు వద్దండీ. నేను చెప్పలేను. మరొకరి నెవరినైనా చూసుకోమనండి" అన్నాడు.

రామకృష్ణమూర్తి ముద్ద నోట్లో పెట్టుకోబోతూ ఆగిపోయి శ్రీహరికేసి ఆశ్చర్యంగా చూశాడు. రెండు నిమిషాల తరువాత అన్నాడు: "అబ్బే శ్రీహరిగారూ, మీరు ముక్కుకు సూటిగా పోతామంటే లాభం లేదు ఈకాలంలో. అట్లా అయితే మీరిక సంపాదించి నట్లే! సిరిరా మోకాల్లొడ్డే వారెవరండీ. బాగా డబ్బుముట్టుతుందని చెప్పానుగా. ఇంకా ఇట్లాంటివి చాలా ప్రైవేట్లు దొరుకుతాయి. నేనే కొన్ని చూపిస్తాను. డబ్బుకు డబ్బూ వస్తుంది. పలుకుబడీ పెరుగుతుంది. మీ అమ్మగారిని యాత్రకు పంపించరూ? మీకు ఇతర సరదాలేమీ తీరొద్దూ?"

"అయినా వద్దండీ" అన్నాడు శ్రీహరి.

రామకృష్ణమూర్తి కనుబొమలు చిట్లించి "ఇంకా మించి పోయింది లేదు. రేపు సాయంత్రం కదా వాళ్ళయింటికి వెళ్ళవలిసింది. తొందరపడకండి. ఆలోచించండి. అవకాశం పోగొట్టుకోకండి" అన్నాడు.

శ్రీహరి వచ్చేశాడు. మనస్సు తుంజాటనలో పడింది. బడిలో సలహా అడిగితే లాభం లేదని సాయంత్రం ముందు సుబ్బారావు ఇంటికి వెళ్ళాడు. తన సమస్య చెప్పుకున్నాడు.

"వద్దు శ్రీహరీ, అట్లాంటి పనులు చేసే వాళ్ళు నానా గడ్డీ కరుస్తారు. పైగా అట్లాంటివి చెయ్యడానికి ఎంతో లౌక్యం,

సాహసం కావాలి. వెనకాల ఏమైనా వస్తే కాపాడేందుకు ఎవరో గట్టివాళ్ళుండాలి. ఇట్లాంటి పనులు చేసేవాళ్ళు అవసరం వస్తే కాళ్ళు పట్టుకోగలరు కూడా. ఆత్మ గౌరవం గలవాళ్ళు చేయవలసిన పనులు కావు. పైగా నీలాంటివాడు చేస్తే మొదట్లోనే చిక్కి పోతాను. నీకు పలుకుబడీ లేదు. నువ్వు కాళ్ళు పట్టుకోనూ లేవు. చూడు నన్ను మనవాళ్ళు కమ్యూనిష్టనీ, అందువల్ల నాకు నీతి నియమా లేమిటనీ ఆక్షేపిస్తూ ఉంటారు కాదూ. కాని నేను చెడ్డవాడినైతే కావచ్చును కాని ఈపనికి మాత్రం ఒడబడలేక పోతున్నాను," అన్నాడు సుబ్బారావు.

"నేను చెప్పనన్నాను అప్పై వేట్లు, కాని మా అమ్మ యాత్రకు వెళ్దామనుకుంటోంది." అన్నాడు శ్రీహరి.

"లంఖణాల్లో మనుగుడుపులట! — ఇట్లా అంటున్నానని కోపగించకు. కాని డబ్బున్న వాళ్ళకు కాని మాలాంటి వాళ్ళ కేమిటోయ్ ఈ యాత్రలూ ముచ్చటలూ?"

"కాదు మా అమ్మ పాపం చాలా ఉబలాట పడుతోంది. చుట్టుపక్కల వాళ్ళు వెళ్తున్నారట—"

"అయితే ఏమంటావు? - ఇంకా అప్పు చేస్తావా?"

శ్రీహరి మాట్లాడ లేదు.

"నువ్వుకూడా మాలాగే మొండి కెత్తావన్నమాట. అప్పు లంటే భయం తీరిపోయిందన్న మాట-"

"రేపు మాతమ్ముడి పెళ్ళిఅవుతుంది—వాడు ఉద్యోగం"

"చేస్తాడు రెండు చేతులతో ఆర్జిస్తాడు. అప్పుడు అప్పులు తీర్చి పారెయ్యొచ్చంటావు. ఊఁ ఊఁ వెయ్యి ప్లానులు!

అని నవ్వి సుబ్బారావు చెప్పసాగాడు: "శ్రీహరీ, పెద్దవాణ్ణి చెప్పుకున్నాను. నీకన్న తెలివితేటలు లేకపోయినా అనుభవం ఎక్కువవుంది. నా సలహా నచ్చితే పాటించు; విన్నదూ కూడా ముందేదో వస్తుందని చెప్పి గాలిమేడలు కట్టకు. నువ్వనుకున్నది నీచేతిలోకి రాదని కాదు. రావచ్చు; కాని అది చేతిలోకి వచ్చిన తరువాతే నీ ప్రణాళికలు తయారుచెయ్యి. లేకపోతే నీ అంచనాలలో తేడా వస్తే అప్పుడు నీపరిస్థితి ఏమవుతుంది? ఒకసారి అప్పుల్లో చిక్కుకున్నవాడు బయటపడేడం సామాన్యంగా కష్టం. సాలెగూడులో పడ్డ ఈగ చూడు కొట్టుకున్న కొద్దీ మరి కాస్త చిక్కుకు పోతుంది. అట్లా— అది అట్లా ఉంచు. మీ తమ్ముడి పెళ్ళి అవుతుందంటున్నావు. సరే కట్నం వస్తుందయ్యా. అయితే కట్నం అంతా మూట కట్టేసుకుందామనుకుంటున్నావేమిటి? పిల్లకు నగలో! పెళ్ళిఖర్చులో? ఇవన్నీ ఎక్కడనుంచి తెస్తావు. ఇవిపోగా ఇక నీ చేతిలో ఎంత మిగులుతుంది? తమ్ముడికి పెళ్ళిచేసి తీరా అతనికేమీ మిగల్చవన్నమాట! తమ్ముడు పెళ్లాంతో సరి పోదు కదా. మరో మనిషి వచ్చి చేరుతుంది మీలో "ఆమె ఖర్చు భారం మీమీద పడదూ? మీ తమ్ముడు ఉద్యోగం చేస్తాడంటావు. వెంటనే ఉద్యోగం వస్తుందని గారంటీ ఏమిటి? పోనీ వచ్చిందనుకో రేపు ఆవచ్చే అమ్మాయి ఎట్లాంటిదవుతుందో. తన కాపురం తనే నడుపుకోవాలనుకుంటుందేమో"

శ్రీహరి నోరు తెరచి చూస్తూ ఉండిపోయాడు. తరువాత ఒక్క పెద్ద నిట్టూర్పు విడిచి ఏమీ మాట్లాడకుండానే వచ్చేశాడు.

అతను ఇంటికి చేరిన తరువాత సూరమ్మగారు చేరింది. ఆవిడ కళ్ళలో ఆనందం స్పష్టంగా తొణికిసలాడుతోంది. లోపలికి రాగానే కోడలితో చెప్పనాగింది: " ఇంకా చాలామందే వస్తున్నారేం కోడలా. మేము శ్రీరామనవమికి భద్రాచలం వస్తామట," అంటూ చెప్పుకుపోతోంది. శ్రీహరి గుండె పిండుకున్నాడు. తల్లితో చెప్పడం ఎట్లా? ఆమె ఆశలమీద, ఉత్సాహంమీద ఒక్కసారిగా చన్నీళ్ళు చల్లడ మెట్లా? అతనికి సాహసం చాలలేదు తనలో తాను మథన పడుతూ భోజనం చేసి తనగదిలోకి వెళ్ళిపోయాడు. మరికొంత సేపటికి వరలక్ష్మి వచ్చింది. శ్రీహరి భార్యను చెప్పమన్నాడు తల్లితో.

" అయ్యో, మొదట్లోనే చెప్పక పోయారండీ! ఆవిడ ఎంత ఆశ పెట్టుకున్నారు! పాపం వెళ్ళుతున్నామనే సంబర పడుతున్నారు. ఇప్పుడు చెప్తే ఎంత బాధ పడతారో," అంది వరలక్ష్మి.

"అవును పంపడానికి వీలవుతుందేమో ప్రయత్నించాను. కాని వీలుపడదని తేలిపోయింది. నువ్వే చెపుదూ మెల్లగా మాఅమ్మ మనసు బాధ పడకుండా" అన్నాడు శ్రీహరి.

" నేను చెప్పలేనండి బాబూ. నేనే ఏదో చెప్పి పెట్టాననుకుంటారు కూడా" అంది వరలక్ష్మి.

మర్నాడు పొద్దున్న తల్లి మొగం చూడచెల్లక శ్రీహరి పెందరాళే ప్రైవేట్లకు వెళ్ళిపోయాడు. అతను తిరిగివచ్చి భోజనం చేస్తున్నప్పుడు సూరమ్మగారే అడిగింది: "ఏరా

అబ్బాయీ. అందరూ డబ్బు కట్టేస్తున్నారురా. ఆలస్యం చేస్తే ఖాళీ కూడా దొరకదుట. డబ్బు చూడవూ?"

శ్రీహరికి ఎట్లా చెప్పాలో తోచలేదు. ఇప్పుడైనా చెప్పెయ్యాలి. కాని ఎట్లా? ముద్ద దిగక మంచినీళ్ళు త్రాగాడు. తరువాత తలవంచుకునే మెల్లగా అన్నాడు: "అమ్మా నువ్వు ఇంకోసారి వెళ్ళువుగాని. ఈ యాత్రల రైళ్ళు ఎప్పుడూ ఏవో ఉంటూనే ఉంటాయి. రాధ పెళ్ళి అయిన తరువాత వెళ్ళువుగాని" అన్నాడు. గుండెల మీదనుంచి పెద్దభారం తొలగినట్లైంది అతనికి.

సూరమ్మగారు కొయ్యస్తంభంలా నిలబడి పోయింది. వరలక్ష్మి అక్కడ ఉండలేక పక్కకు తప్పుకుంది. సూరమ్మగారు కొంత సేపటికి ఎట్లాగో మాట పెగల్చుకొని అంది: "నలుగురూ వెళ్తున్నపుడు కాకపోతే ఇంకెప్పుడు వెళ్తానురా, నాయనా? తెలిసిన వాళ్ళు వెళ్తున్నారు కాబట్టి వెళ్దామనుకున్నాను. నేనొకత్తెనీ ఏం వెళ్ళగలను?"

"పరవా లేదమ్మా. తెలిసిన వాళ్ళు ఎవరో ఒకరు అప్పుడూ దొరుకుతారులే అమ్మా" అన్నాడు శ్రీహరి.

"ఏమోరా నాయనా ఏమి శాశ్వతం? మళ్ళీ ఏడు నేనుంటానని ఏముంది? ఏ నిమిషం హరీ అంటానో!"

"అట్లాంటి మాటలనకమ్మా. నీకేమీ భయంలేదు. రాధ పెళ్ళి అయిన తరువాత తప్పక వెళ్ళువుగాని అన్నాను కదమ్మా"

"రామకృష్ణమూర్తిగారి తల్లితో, చుట్టుపక్కల వాళ్ళతో నేనుకూడా వస్తున్నానని చెప్పానురా."

శ్రీహరి మాట్లాడలేదు. వరలక్ష్మి మౌనంగా వడ్డిస్తోంది.

"ఎక్కడా డబ్బు దొరకలేదురా, నాయనా?" అని అడిగింది తల్లి మళ్ళీ.

"లేదమ్మా. అంతటా ప్రయత్నించాను," అన్నాడు శ్రీహరి లోపల గుండె గతుక్కుమంటూండగానే.

సూరమ్మగారు 'హుం' అని ఒక్క పెద్ద నిట్టూర్పు విడిచి, తల వంచుకొని మెల్లగా అడుగులు వేస్తూ ఇవతలకి వచ్చి కూలబడి కూర్చుంది. శ్రీహరి భోజనం దగ్గర నుంచి లేచి త్వరగా చేతులు కడుగుకొని, బట్టలు వేసుకొని బడికి వెళ్ళిపోయాడు.

వరలక్ష్మికి అత్తగారిని పలకరించడానికి మొగం చెల్లలేదు. కాని కొంతసేపటికి తెగించి "అత్తయ్యా, లేవండి భోజనానికి" అంది.

సూరమ్మగారు అక్కడే కొంగు పరచుకొని పడుకొంటూ- "నాకు ఆకలిగా లేదుతల్లీ. నువ్వు భోజనం చెయ్యి" అంది నీరసంగా.

"కాదండీ. భోజనం చేయకుండా ఉంటే ఎట్లా? మనస్సులో పెట్టుకోకండి. నేను చెప్తాను లెండి గట్టిగా. రండి ముందు భోజనం చెయ్యండి," అంది వరలక్ష్మి.

సూరమ్మగారిలో ఇంకా ఆశ చావక, "కాస్త చెప్పి కోడలా వాడితో. తెలిసిన వాళ్ళతో వెళ్తే బాగుంటుంది కాని వట్టెప్పుడు వెళ్తే ఏంబాగుంటుంది? పైగా కాలం ఎప్పుడూ ఓలా ఉంటుందనేమిటి? ఈవేళ ఉత్సాహం, ఓపికా రేపు ఉంటాయో ఉండవో" అని లేచివెళ్ళి భోజనం చేసింది.

తరువాత వెళ్ళి రామకృష్ణమూర్తి తల్లితో కూడా చెప్పి వచ్చింది—ఆవిడ కొడుకు చేత తన కొడుకుకు చెప్పించమని. "మా అబ్బాయి చెపుతాడు లెండి. మీరు తప్పక మాతో వస్తారు" అని ధైర్యం చెప్పింది రామకృష్ణమూర్తి తల్లి.

రాత్రి భోజనాల దగ్గర వరలక్ష్మి భర్తతో అంది: "ఏమండీ ఏదో విధంగా అత్తగారిని పంపించండి. పాపం చాలాసంబర పడుతున్నారు."

శ్రీహరి ఏమీఅనలేదు. రామకృష్ణమూర్తి తల్లి అటు వచ్చింది. "బాబూ మీ అమ్మగారిని కూడా మాతో పంపండి ఆవిడ వస్తారని మేము కూడా ఎంతో ఆశ పడుతున్నాం నలుగురం తోడుగా ఉంటామనుకున్నాం" అంది.

"పంపడానికేం ? నాకూ పంపాలనే ఉందండి, కానీ, ప్రస్తుతం ఇబ్బందిగా ఉందండీ" అని శ్రీహరి లేచి వచ్చాడు.

రామకృష్ణమూర్తి వచ్చాడు "ఏమండీ శ్రీహరిగారూ, అమ్మగారికి ఆశాభంగం కలిగించకండి. వెధవ డబ్బుకు చూడకండి. మీరు ఊఁ అంటే ఎక్కడో పుట్టిస్తాను. మెల్లగా తీర వచ్చు" అన్నాడు.

"నాకిష్టం లేదండి. ఇప్పటికే అప్పు చేశాను. అది తీర కుండానే కొత్త అప్పు చేయడం నాకెంతమాత్రం ఇష్టం లేదు" అన్నాడు శ్రీహరి.

రామకృష్ణమూర్తి, "నేను చెప్పవలసినది చెప్పాను. తరు వాత మీ ఇష్టం" అని వెళ్ళిపోయాడు.

సూరమ్మగారు మౌనంగా నులక మంచం తెచ్చుకొని వేసుకొని దానిమీద బొంత పరచుకొని, దానిమీద పడింది. తల్లిని చూసేసరికి రాధకి కూడా జాలి వేసింది. "అన్నయ్యా. అయిన అప్పు ఎట్లాగో అయింది. అమ్మను పంపిస్తే" అన్నాడు.

శ్రీహరి తమ్ముడి కళ్ళలోకి చూశాడు. తరువాత అన్నాడు: "నువ్వు రేపు వెళ్ళి మొన్న చెప్పి వెళ్ళిన వాళ్ళ పిల్లను చూసి వస్తావా? నువ్వు త్వరగా కట్నంతో పెళ్ళి చేసు కుంటానంటే నేనిప్పుడే వెళ్ళి ఎక్కడో అక్కడ అప్పుచేసి పట్టుకువస్తాను."

రాధ తల ఎత్తలేదు. శ్రీహరి తల్లి వైపుకు చూశాడు. పక్కకు తిరిగి, మంచం కేసే చూస్తూ కంట తడిపెట్టుకుంటోంది. శ్రీహరి తన గదిలోకి వెళ్ళిపోయి, బల్లదగ్గర కుర్చీలో కూల బడి, బల్లమీద మోచేయి ఆన్చి నుదురు రుద్దుకుంటూ ఉండి పోయాడు. కొంతసేపటికి ఒక నిట్టూర్పు విడిచి, స్కూలుపని చూడసాగాడు.

సూరమ్మగారిని ఊరికే ఉండనీయక రమణా సూర్యా వతీ ఆవిడ దగ్గరకుచేరి "మామ్మా ఎప్పుడెళ్తున్నావు ఊరు?" అని అడిగారు.

"వెళ్ళడంలేదు తండ్రీ. ప్రాప్తం ఉండొద్దూ దేనికైనా" అంది ఆవిడ బాధతో సన్నగిల్లిన గొంతుకతో.

"అదేమిటీ? వెళ్ళడం లేదూ? మరి మాకు బొమ్మలు ఎట్లా వస్తాయి?" అన్నాడు రమణ.

శ్రీహరి తనగదిలోనుంచే ఒక్క కేక వేశాడు: "ఒరేయి రమణా నీపుస్తకం చదువుకో" అని.

రమణ పరిగెత్తుకు వెళ్ళి తన పుస్తకం తీసుకొని ఆగది లోనే ఒకమూల కూలబడి మధ్యమధ్య మామ్మకేసీ, మధ్య మధ్య తండ్రి ఉన్నవైపుకీ చూస్తూ చదువుతున్నాడు. సూర్యా వతి మామ్మ పక్కనే చేరింది. సూరమ్మగారు దానినడ్డి మీద రాస్తూ పరధ్యానంగా జోకొట్టుతూ ఉండిపోయింది.

అప్పటినుంచి ఆవిడ మళ్ళీ పూర్వవత్ ఏదోమూల కునికి పాట్లు పడుతూ పడి ఉంటోంది. నాలుగు రోజుల తరువాత యాత్రకు వెళ్ళేవారు బయలుదేరు తూంటే రమణనీ, సూర్యా వతిని కూడా తీసుకొని మెల్లగా వెళ్ళి, అదృష్టవంతులు వేళ్తూ వుంటే చూసి, బరువుగా వెనక్కి తిరిగి వచ్చింది. ఆరాత్రే ఆవి డకు కొంచెం జ్వరం తగిలింది. అయినా లోలోపలె దాచుకుంది. కాని మర్నాడు ఆవిడ సరిగ్గా ఎంగిలి పడకపోయేసరికి వరలక్ష్మికి అనుమానం వేసింది. భర్తతో చెప్పింది.

శ్రీహరి హడలి పోయాడు. తల్లిదగ్గరకు వెళ్ళి, వంగి, "అమ్మా నిజం చెప్పు. ఒట్లో బాగుండడం లేదా అమ్మా?" అని అడిగాడు.

"ఏం లేదురా నాయనా, ఏదో కొంచెం బడలికంగా ఉంది అంతే" అంది ఆవిడ.

"అప్పుడ్నుంచి ఇదే మనస్సులో పెట్టుకున్నావు. చెప్పాను కదమ్మా నిన్ను ఎప్పుడో అప్పుడు యాత్రలు చేయించి తీర్స్తానని. కొంచెం ఆగమని అంటున్నాను ఆ మాత్రం చేయనా అమ్మా."

"దానికి కాదులేరా నాయనా. నువ్వు ఇష్టం లేక పంపించ లేదేమిటి? ఏదో కొంచెం జ్వరం తగిలితే ఇంత కంగారు పడతావెందుకు? రెండు రోజులు లంఖణాలు చేస్తే అదే తగ్గిపోతుంది."

కాని మర్నాడు పొద్దున్న కూడా ఆవిడకు జ్వరం తగ్గలేదు. మొహం తెలుపుతూనే ఉంది. శ్రీహరి డాక్టరును తీసుకు వస్తానన్నాడు "ఇంగిలీషు డాక్టరు నాకు వద్దురా నాయనా తెలుగు మందు తెప్పించు చాలు" అంది తల్లి.

శ్రీహరి రాధను పంపించాడు. శాస్త్రులుగారికోసం ఆయన వచ్చి నాడీ, నాలుకా పరీక్ష చేసి, లక్షణాలు అడిగి మాత్రలు ఇచ్చి, జీలకఱ్ఱ కషాయంతో ఇమ్మని చెప్పి వెళ్ళాడు. శ్రీహరికి చాలా భయం పట్టుకుంది. తల్లిని పట్టిన ఈ బెంగ ఏమి చేస్తుందోనని. వరలక్ష్మిని అస్తమానూ తల్లిని కనిపెట్టుతూ ఉండమన్నాడు. రాధతో కూడా "ఒరేయి చదువుకోసమని, ఎక్కడికో పోక ఇంట్లోనే ఉండి చదువుకో. అమ్మకి కాస్త ధైర్యంగా ఉంటుంది" అని చెప్పి ఇంట్లోనుంచి వెళ్ళేముందూ ఇంట్లోకి రాగానే తల్లికి ఎట్లా ఉన్నదీ కనుక్కుంటున్నాడు.

ఇరుగుపొరుగులు వచ్చారు సూరమ్మగారి క్షేమం తెలుసుకోవడానికి. యాత్రకు పంపించి ఉండవలసింది అంటున్నారు. వాళ్ళమాటలు శ్రీహరికీ వరలక్ష్మికీ పుండుమీద కారం చల్లినట్లుంటున్నాయి.

రాత్రి వరలక్ష్మి అత్తగారి కాళ్ళు పిసుకుతూ ఆకబుర్లూ ఈకబుర్లూ చెప్పి ఆవిడను మరపించడానికి ప్రయత్నిస్తోంది. శ్రీహరి వచ్చి తల్లికి ఎదురుగా కుర్చీ వేసుకొని కూర్చున్నాడు. తల్లి కొడుకు కేసి ఏదో చెప్పుదామన్నట్లు చూసింది.

"ఏమిటమ్మా" అని అడిగాడు శ్రీహరి.

"ఒకసారి రాజ్యానికి టెలిగ్గిరాము ఇస్తే? దానిని చూడాలని ఉంది ఎందుకో"

శ్రీహరీ వరలక్ష్మి ఉలిక్కి పడ్డారు. ఇద్దరూ ఆమె కేసి అందోళనతో చూశారు. "టెల్గ్రాం ఎందుకమ్మా అది కంగారు పడుతుంది. రేపుపొద్దున్న ఉత్తరం రాస్తాను. నువ్వేమీ అధైర్యం చెందకమ్మా. నీకేమీ పరవాలేదు నువ్విట్లాఉంటే మాకూ తోచడం లేదు" అన్నాడు శ్రీహరి.

మర్నాడు పొద్దున్న రాజ్యానికి ఉత్తరం రాసి పోస్టు చేశాడు. తల్లితో చెప్పాడు రాశానని. రాజ్యం ఎప్పుడు వస్తుందా అని రోజులు లెక్క పెట్టుకో సాగింది సూరమ్మగారు. రెండుమూడు రోజులు గడచినా ఆవిడకి జ్వరం తగ్గలేదు. శ్రీహరి నిజంగానే చాలా కంగారు పడ్డాడు. డాక్టరును తీసుకు వచ్చాడు. ఆయన పరీక్ష చేసి "ఏమీ కంగారు లేదు. పెద్ద

వాళ్ళరోగాలు కాబట్టి కొంచెం టైం తీసుకుంటాయి" అని చెప్పి మందు రాసి ఇచ్చాడు.

నాలుగు రోజులికీ రాజ్యం రాలేదు. ఆమధ్యాహ్నం ఉత్తరం వచ్చింది. ఆఉత్తరం చూసి శ్రీహరి నీరుకారి పోయాడు. రాజ్యం తను అత్తవారింటికి తిరిగి వెళ్ళిన కొన్నాళ్ళు కాస్త భోగం వెలిగించారనీ, కాని ఇప్పుడు మళ్ళీ వెనకటి పరిస్థితే వచ్చిందనీ, చాకిరీ అంతా తనమీదే పడిందనీ, ఇప్పుడు తను వట్టిమనిషిని కూడా కాననీ, స్నానంచేసి రెండు నెలలైందనీ రాసింది. తన తల్లికి జబ్బు చేసిందని అందువల్ల పంపించమని అడిగితే అత్తగారూ మామగారూకానీ భర్తకానీ ఏమీ మాట్లాడ లేదట. వెంటనే తల్లిపరిస్థితి ఎట్లాఉన్నదీ తిరుగుటపాలో రాయుమంది. అంతగా అవసరమైతే రాధను పంపిస్తే ఎట్లాగో వస్తానని రాసింది రాజ్యం.

శ్రీహరికొంచెంసేపు ఉత్తరం కేసే చూసి, పెదవి విరిచి. తల్లికి చదివి వినిపిద్దామని పోబోతూండగా వరలక్ష్మి "అంతా చదివి వినిపించకండి, ఆవిడ మరింత కుంగిపోతారు. నేనే చెప్తానుండండి" అని అత గారి దగ్గరికి ళ్ళి, "అత్తయ్యా రాజ్యం దగ్గరనుంచి ఉత్తరం వచ్చిందండీ. కులాసాగానే ఉందట ఇక్కడకు వెంటనే రావడానికి వీలులేదట. ఇప్పుడు వట్టి మనిషి కూడా కాదుట. రెండో నెలట" అని చెప్పింది.

సూరమ్మగారు "అట్లాగా" అని కూతురు మళ్ళీపిల్ల తల్లి కాబోతూన్నందుకు సంతోషంతో ఊరుకుంది.

మరికాసేపటికి సుబ్బారావు వచ్చాడు. "ఏం శ్రీహరీ ఎట్లా ఉంది మీ అమ్మగారికి?" అని అడిగాడు.

"అట్లాగే ఉంది. ఇంకాపూర్తిగా తగ్గలేదు" అని శ్రీహరి అతనిని తల్లిదగ్గరకు తీసుకు వెళ్ళాడు.

సూరమ్మగారు లేవబోయారు.

"లేవకండి, లేవకండి పిన్నిగారూ. కొంతకులాసాగా ఉందా?" అని అడిగాడు సుబ్బారావు.

"ఆ ఏంకులాసా, నాయనా, ఈఘటానికింకా! ఎంత త్వరగా వెళ్ళిపోతే అంతమంచిది," అంది ఆవిడ.

"అవేం మాటలండీ పిన్నిగారూ. మీకేమంత వయస్సు మీరిపోయిందని. మీరింకా ఎన్ని చూడాలి! చిన్నకొడుకుపెళ్ళి చూడాలి. చిన్నకోడలు రావాలి. ఆ మెకడుపునకూండా పిల్లలు పుట్టాలి. మనుమలంతా పెరిగి పెద్దవాళ్ళు కావాలి. మీరినన్నీ చూస్తారు. అందులో ఏమీ సందేహంలేదు. మీవాడు మిమ్మల్ని యాత్రకు పంపిస్తానంటే నేనేవద్దని చెప్పానండి. ఒకళ్ళ దగ్గర అప్పుచేసి పంపించడ మేమిటోయి, సిగ్గుచేటు, రేపు మీతమ్ముడు పెళ్ళి అయిన తరువాత మీసొంతడబ్బు పెట్టి దర్జాగా పంపించవచ్చని నేనే చెప్పానండి. రేపుకోడళ్ళిద్దరూ మిమల్ని ఎంతో ఆదరంతో పంపిస్తే ఎంతగొప్పగా ఉంటుంద చెప్పండి? మీరు దక్షిణదేశయాత్ర ఏమిటి కాశీనుంచి రామేశ్వరం వరకూ దేశమంతా యాత్రచేసి వద్దురుగాని, ఏమంటారు?" అన్నాడతను.

సూరమ్మగారి కళ్ళల్లో కొంతసంతృప్తి గోచరించింది. "దానికోసం కాదు నాయనా. ప్రాప్తం ఉంటే మీరన్నట్లు అన్నీ చూశవచ్చు. ఏకోరోగం వచ్చింది.ఇంకానయం యాత్ర వెళ్ళినతరువాత వస్తే ఎంత ఇబ్బంది అవును" అంది.

"ఆఁ చూశారా, నేను ఎంతచెప్పినా విన్నాడు కాడంటే శ్రీహరి. మీరేమీ మనస్సులో పెట్టుకోరని చెప్పాను. కాదు, మాఅమ్మ బెంగ పెట్టుకుందని ఒకటే బెంగ. ఒకటి అడుగుతాను చెప్పండి. మీకొడుకులు మీకేమైనా లోటుగా చూస్తు న్నారా చెప్పండి" అని అడిగాడు సుబ్బారావు.

"లేదు బాబూ, వాళ్ళు ఎంతో బాగా చూస్తున్నాడు. పాపిష్టిదానిని వాళ్ల చేత ఇంతచాకిరీ చేయించుకుంటు న్నాను," అంది ఆవిడ కంట తడితో. "కోడలూ అట్లాగే చూస్తోంది బాబూ."

"మీరు నిజంగా చాలా అదృష్టవంతులండీ ఇట్లాంటి కొడుకులున్నందుకు. మేము మాఅమ్మా బ్రతికుండగా ఆవిడ ఎప్పుడు వెళ్ళిపోతుందా అనిచూశాం. సరిగా వైద్యంకూడా చేయించలేదు. తీరా ఆవిడ వెళ్లిపోయిన తరువాత ఇప్పుడు అనుకుంటున్నానుకోండి. మేము అన్నదమ్ములమన్న మాటే కాని అన్నదమ్ముల్లాగే ఉండం. ఒకళ్ళకొకళ్ళకు సంబంధమే లేదు. మీశ్రీహరి చూడండి బడిలో అస్తమానూ మిమ్మల్ని గురించే ఆలోచిస్తూ ఉంటాడు మాఅమ్మకెట్లా ఉందో అని. తమ్ముడి చదువును గూర్చి తలచుకొని పొంగి పోతూ ఉంటాడు. ఇంత ప్రేమ గలకొడుకులుంటే మీకింకేం కావాలి చెప్పండి."

"అట్లాగే బాబూ," అంది సూరమ్మగారు. కొడుకులు తనపట్ల చూపుతున్న ఆదరాభిమానాలు తలచుకొని గొంతుక నిండి పోయి మరేమీ మాట్లాడలేక పోయింది.

"పిన్నిగారూ నేనొకటి చెపుతాను. అట్లా చేస్తే మీ జ్వరం నిమిషాలమీద తగ్గిపోతుంది. కాస్త చారూఅన్నం తినెయ్యండి. రేపు పొద్దున్నకి మీరు మామూలుగా తిరగకపోతే నా పేరుతీసి మరోపేరు పెట్టండి. మీకొడలు వెంటనే వందు తారు–" అని అతను అంటూంటే వరలక్ష్మి "వండే ఉన్నాయండి. మడిగానే ఉన్నాయికూడా" అంది.

"అదుగో లేవండి. నామాట వినండి. కాస్త ఎంగిలి పడండి," అని శ్రీహరి అడ్డుచెప్పబోతూంటే "ఏంపరవా లేదు, శ్రీహరి నేనుపూచీ ఇస్తాను. లేవండి పిన్నిగారు" అని ఆమెను తొందర పెట్టడం మొదలుపెట్టాడు సుబ్బారావు.

"అయ్యో స్నానం అదీ లేకుండా ఎట్లా తీసుకోను-బాబూ. ఇప్పుడు స్నానం చేస్తే–" అని సూరమ్మగారు అంటూంటే–

"అట్లాంటి ఛాదస్తాలేమీ పెట్టుకోకండి. ఆపద్ధర్మం కాసిని నీళ్ళు నెత్తిమీద చల్లుకొని ఎంగిలి పడండి. మందే అనుకోండి, ఏదండీ, చారూ అన్నం మెత్తగాకలిపి పెట్టుకు రండి" అనిచెప్పి వరలక్ష్మి పట్టుకురాగా సూరమ్మగారిచేత తినిపించాడు సుబ్బారావు. "కాసేపు పడుకోండి. అప్పుడే నిద్ర మాత్రం పోకండి. మీకొడలుగారు కాలక్షేపం చేస్తారు

ఏకబుర్ర తోనో. రేపుపొద్దున్నకి మీరుకులాసాగా తిరుగుతారు చూడండి" అని చెప్పి "రావోయ్ శ్రీహరీ కాసేపు వరండాలో కూర్చుందాం. ఏమయ్యా రాధాకృష్ణమూర్తీ, బాగా చదువుతున్నావా. ఫస్టుక్లాసులో పాసవ్వాలి. – ఎవరు శ్రీహరీ? మీ పెద్దవాడేమిటి? – ఏం బాబూ, నీ పేరేమిటి – వెంకటరమణా ఏం చదువుతున్నావు? –రెండో క్లాసే భేష్!" అని వాడి బుగ్గగిల్లి "రేపు పెద్దవాడవైతే నువ్వేమవుతావు చెప్పు" అని అడిగాడు సుబ్బారావు.

"డాక్టరు నవుతాను" అన్నాడు రమణ.

"అబ్బో. పెద్దప్లాను మీదే ఉన్నావే. డాక్టరు వెందుకవాలనుకుంటున్నావు చెప్పు?" అన్నాడు సుబ్బారావు.

"ఎందుకో, డాక్టరునవ్వాలని ఉంది. అంతే" అన్నాడు రమణ ఆలోచనగా చూస్తూ.

"నువ్వదృష్టవంతుడవోయి శ్రీహరీ. మీవాడు నిజంగా డాక్టరే అయ్యేటట్లున్నాడు" అని నవ్వి సుబ్బారావు ఇన తలకు వచ్చాడు.

శ్రీహరి వరండాలో మంచం వాల్చాడు. దానిమీద ఇద్దరూ కూర్చున్నారు. "అన్నట్లు మీవాడికి ఎట్లా ఉంది" అని అడిగాడు శ్రీహరి.

"కులాసాగానే ఉంది. నిన్నే పథ్యం పెట్టాం. వాడి మీదే మా ఆశలన్నీ ఉన్నాయి. పెద్దవాడు మొద్దనుకో. చదువంటడం లేదు. పిడుమాత్రం చదువుల్లో చాలా చురుకుగా ఉంటాడు. కాని ఆరోగ్యం బాగుండదు" అని సుబ్బారావు

అంటూండగా రామకృష్ణమూర్తి అటువచ్చాడు. శ్రీహరి ఇద్దరినీ ఒకరికొకరికి పరిచయంచేశాడు. సుబ్బారావు శ్రీహరికేసి సాభిప్రాయంగా చూశాడు ఆవేళ మాట్లాడింది ఈయనను గురించేనా అన్నట్లు.

"ఇట్లావచ్చారేం?" అని అడిగాడు రామకృష్ణమూర్తి

"ఇతని తల్లిగారికి ఏదో సుస్తీ చేసిందంటేనూ చూసి పోదామని వచ్చానండి," అని చెప్పాడు సుబ్బారావు.

"నేను చెప్పానండీ ఈయనతో ఎట్లాగో అట్లాగ ఆవిడను యాత్రకు పంపించమని. అప్పుకావలస్తే నేను ఎక్కడైనా పుట్టించి పెట్టానన్నాను. విన్నారు కాదు" అన్నాడు రామకృష్ణమూర్తి.

"నేను వద్దని చెప్పానండి" అన్నాడు సుబ్బారావు.

"ఒహో అట్లాగా, అయితే మనం వ్యతిరేక పక్షాల మన్నమాట," అని నవ్వాడు రామకృష్ణమూర్తి.

"వ్యతిరేకమని కాదండీ. నిజంగా నాకుమించిన అప్పులరాయుడు మరొకడుండడు. అప్పుమాట వింటే ప్రాణం లేచి వస్తుంది నాకు. కాని ఇతనికి ఎందుకు అప్పుచేయ వద్దని సలహా ఇచ్చాను? ఇతని తత్వం నాకులా అప్పుచేసి ధైర్యంగా ఉండే రకం కాదు. అదేమనస్సులో పెట్టుకుంటాడు. మనస్సు పాడుచేసుకుంటాడు. ఇప్పుడైనా మనస్సులో పెట్టుకోలేదని కాదు. కాని దానికన్న ఇదేమేలు" అన్నాడు సుబ్బారావు.

"అదీ నిజమే నండోయి" అని ఒప్పుకున్నాడు రామకృష్ణమూర్తి

"ఏమైనా ఈ యాత్రలూ సరదాలూ మనవంటివాళ్లకు కాదండీ" అన్నాడు సుబ్బారావు.

"మరెటువంటి వాళ్లకండీ?"

"డబ్బున్న వాళ్లకండీ."

"ఆడబ్బు మీరూ సంపాదించండి. ఎవరు వద్దన్నారు?"

"డబ్బు వస్తుందంటే వద్దంటామండీ? డబ్బుచేదా? కాని అది నావంటి వాళ్ల దగ్గరకు రావద్దండీ? అది ఉన్నవాళ్ల దగ్గరకే ఎక్కువగా చేరుతుంది ఈ సమాజంలో"

"అయితే మీరనేది సమాజమే మారిపోవాలంటారు."

"ఆ"

"ప్రభుత్వం మనకు మంచి జీతాలిస్తే మనమూ సుఖంగానే వుండి సరదాలు తీర్చుకోవచ్చుగా. కాని ప్రభుత్వం అట్లా చేయడంలేదు కాబట్టి దానిని అనగాలిగాని సమాజమే మారిపోవాలనడం ఏమి సబబు?"

"ప్రభుత్వం మాత్రం ఏం చేస్తుందండీ? నేనేదో ప్రభుత్వాన్ని వెనకేసుకు వస్తున్నాననుకోకండి. నేను వీలుచిక్కినప్పుడల్లా ప్రభుత్వాన్ని తిడుతూనే ఉంటానుకాని పిచ్చి కోపంలో దానిని తిట్టడమేగాని నిజానికి ప్రభుత్వం ఒకసాధనం మాత్రమేనండి. అసలు మూలకారణం సమాజంలోనే ఉంది. ఒకడిదగ్గర డబ్బు అవసరం లేకపోయినా కుప్పలు తెప్పలుగా పడి ఉంటుంది. నావంటివాడి దగ్గర నిలవనే నిలవదు. డబ్బు మీద ఆధారపడ్డ ఈ సమాజం మారిపోతేనే ని కొందరికి

అంతులేని సుఖాలూ, కొందరికి అంతులేని దుఃఖాలూ అనే ఈ అన్యాయం తొలగిపోదు," అన్నాడు సుబ్బారావు అప్పుడే ఆవేశంలోకి వచ్చి.

"అయితే మీ కమ్యూనిస్టు సమాజంలో అందరూ సుఖంగా ఉంటారంటారా? కమ్యూనిజం వస్తే అన్ని సరదాలూ తీరి పోతాయంటారా?" అని అడిగాడు రాధ తన చదువుమాట మరచిపోయి ఈ వాగ్వాదం వింటూ.

సుబ్బారావు ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు. రాధకేసి వెనక్కి తిరిగి చూశాడు. "అప్పుడే నన్ను కమ్యూనిస్టుకింద జమ కట్టేశావన్నమాట - ఇంకా నేను ఆమాట పలకందే! 'ఈ అన్యాయం చూడండీ, ఈ అన్యాయం పోవద్దా, అని గట్టిగా అడిగితే కమ్యూనిస్టుకిందే లెఖ్ఖనిమాట! నిజానికి నేను సరిస్టైన కమ్యూనిస్టును కాను. లెనిన్ ఏమి చెప్పాడో, మార్క్సు ఏమి చెప్పాడో నాకు తెలియనే తెలియదు. చదవలేదు. వినలేదు కూడాను-" అని ఒక నిమిషంమాగి "అది అట్లా ఉంచు నిన్నొక ప్రశ్న అడుగుతాను చెప్పు. నీజీవిత లక్ష్యం ఏమిటి? జీవితంలో ఏమి సాధించ దలచావు? కాలేజీలో వ్యాసాలు రాసి ఉంటావు గదా? " అన్నాడు.

రాధ తెల్లబోయాడు. కను బొమలు చిట్లించాడు. కాని ఏమీ జవాబు చెప్పలేక పోయాడు. శ్రీహరి కూడా తలెత్తి సుబ్బారావు కేసి సందేహంగా చూశాడు. సుబ్బారావు అన్నాడు, "చూడు, శ్రీహరీ, నీకొడుకు వెంకటరమణో

నయం. తను ఏమి కావాలనుకుంటున్నాడో తడుముకోకుండా చెప్పేశాడు, ఎందుకో చెప్పలేక పోయినా. మనం పెద్దవాళ్ళం ఆదీ చెప్పలేక పోతున్నాం. నిన్న అనడం లేదయ్యా, రాధాకృష్ణమూర్తీ. నిజంగా నాకూ తెలియదు నాజీవిత లక్ష్యమేమిటో. అసలు బ్రతకడమే ఒక పెద్ద సమస్య అయిపోతే బ్రతికి ఏమి సాధించాలో ఏమి చెప్పగలను? నీళ్ళలో మునిగిపోతూ గుటకలు వేసే వాడిని నువ్వు ఒడ్డుచేరుకున్న తరువాత ఏమిచేయ్య దలచుకున్నావంటే ఏమిచెప్పగలడు? ముందు బ్రతికి బయట పడనియ్యి అంటాడు. అట్లాగే ఉంది మనస్థితి. మన జీవితాలకు లక్ష్యం లేదు- అర్థమూ లేదు ఆమాటకొస్తే. మనం చుక్కానిలేని పడవలం. ప్రవాహం ఎటు తీసుకుపోతే అటుకొట్టుకు పోతాం. ఏదైనా అడ్డు తగిలితే కాసేపు ఆగుతాం. అదృష్టం బాగుంటే ఒడ్డు చేరుకుంటే చేరుకోవచ్చు లేకపోతే ఏ సుడిగుండలోనో పడిమునిగిపోనూ వచ్చు."

"ఇంతలోనే వేదాంతంలోకి పడిపోయారేమిటండోయి? కమ్యూనిష్టులకు శోభించదు." అని నవ్వాడు రామకృష్ణమూర్తి. "రాధాకృష్ణమూర్తి మీరు హఠాత్తుగా అడగడం వల కంగారుపడి చెప్పలేకపోయాడు. కాని ప్రతివాడికీ జీవిత లక్ష్యం ఏమి ఉంటుందండీ తను సుఖపడాలనీ, తనవాళ్ళను సుఖపెట్టాలని తప్ప?"

"బాగానే చెప్పారు. కాని ఎంతమంది సుఖపడుతున్నారని?" అని అడిగాడు సుబ్బారావు.

"ఎంతమంది సుఖపడడం లేదని?" అని ఎదురుప్రశ్న వేశాడు రామకృష్ణమూర్తి.

సుబ్బారావు ఒకక్షణం మాట్లాడలేకపోయాడు. అతని మొగంలోకి కోపం చిమ్మింది. ప్రయత్నంతో కోపం అణచుకొని మెల్లగానే అన్నాడు! "మీరన్నమాట నిజమే. చాలా సుఖంగానే జీవితాలు గడుపుతున్నారు. ఆస్తులు పోగుచేస్తున్నారు. కాని కొంచెంలోతుగా ఆలోచించి చూడండి మీకే తెలుస్తుంది– ఒకడు పెద్ద ఆస్తిపరుడు కావాలంటే పదిమంది కిందే పడి ఉండాలని. డబ్బంటే రూపాయ కాసులూ నోట్లూ బంగారమే అనుకోకండి. అది సమాజంలో తయారయ్యే వస్తువులూ వాటికి ప్రాతినిధ్యం మాత్రమే వహిస్తుంది. మరి అంత డబ్బు—అంటే సమాజంలోని వస్తువులు నిజంగాఅక్కర్లేక పోయినా వాటి కొనుగోలు శక్తి కొందరి దగ్గర ఎక్కువగా పోగుబడాలంటే చాలామంది దగ్గరనుంచి దానిని తీసెయ్యకపోతే ఎట్లా వస్తుందండీ? పంట పండించే రైతులూ వస్తువులు తయారుచేసే కూలీలూ మేడలు కట్టడం మనమెక్కడా చూడంగాని అక్కడి సరుకు లిక్కడా ఇక్కడ సరుకు లక్కడా మార్పిడిచేసే మధ్యవాళ్ళే మేడలూ మిద్దెలూ కట్టడం చూస్తాం. ఒకకొత్త వస్తువును కనుక్కున్న శాస్త్రజ్ఞుడు లక్షాధికారి కావడం కష్టంకాని దాని నుపయోగించే పెట్టుబడిదారు మాత్రం కోటీశ్వరుడవుతాడు."

"తొందరపడతారేమండీ. తక్కువ జీతాలూ ఆదాయాలూ కలవాళ్ళ స్థితిగతులను బాగుచేయడమే కదా ప్రథా

నంగా మన ప్రణాళికల లక్ష్యం. నిమ్న వర్గాలస్థితి ఇదివరకుకన్న కొంత బాగు పడిందంటారా లేదా? ఇంకో పదేళ్ళుపోతే ఇంకా బాగుపడుతుంది.” అన్నాడు రామకృష్ణమూర్తి.

“అవును ఇంగ్లాండులోనూ అమెరికాలోనూ ఇతర యూరోపు దేశాలలోనూ రైతులూ కార్మికులూ, మాష్టర్లూ వంటివాళ్ళ జీవన ప్రమాణాలు చాలాహెచ్చుగా ఉన్నాయి. మనమూ ఆస్థితి అందుకోవచ్చు,” అన్నాడు రాధ.

“మనంకూడా ఆస్థితి అందుకున్నా నాప్రధానవాదం అట్లాగే ఉంటుంది. ఇప్పుడు దేశంలో ఉన్న డబ్బున్నవాళ్ళ నందరినీ తీసుకోండి. వాళ్ళేనా సమాజానికి చాలా ఎక్కువ పని చేస్తున్నది. వాళ్ళేనా మానవజాతిని ముందుకు తీసుకుపోతు న్నది? వాళ్ళకేనా ఎక్కువ విలువ? సైంటిస్టులూ, కళాకారులూ రైతులూ, కూలీ మాష్టర్లూ వీళ్ళకృషికి అంత విలువ లేదూ? మీాయింటి ఆయన ఉన్నాడు. ఆయన సమాజానికి ఏమిచేస్తున్నాడని అంత డబ్బు ఆయన దగ్గర పోగు పడింది? ఆడబ్బుండడం వల్ల ఆయన జీవితపు పోటీలో మనకన్న చాలా ముందుంటాడు. రేపు ఆడబ్బు పెట్టుబడిపెట్టి ఇంకా పది లక్షల అధికారికావచ్చు. మనది ఎంతైనా తాబేటి నడకే!”

“కుందేలు మీాద తాబేలే నెగ్గింది కదండీ చివరికి” అని నవ్వాడు రామకృష్ణమూర్తి.

“అది కథలో. నిజంలో కుందేలు నిద్రపోవద్దూ? నిద్ర పోదు. ఈ పంపిణీ విధానం మారాలండీ. సమాజంలో ఎవడి

కృషికి నిజమైన విలువో దానికి తగ్గ ప్రతిఫలం ముట్టేవరకూ న్యాయం చేకూరదండీ” అన్నాడు సుబ్బారావు.

“మనం సోషలిజం వైపుకే కదండీ పోతున్నది” అన్నాడు రామకృష్ణమూర్తి.

“పెట్టుబడిదారుల నట్లాగే ఉంచి సోషలిజం సాధిస్తామంటే ఎట్లా నమ్మగలమండీ?”

“అయితే ఏమి చెయ్యమంటారు? డబ్బున్నవాళ్ళ యిళ్ళ మీద పడిదోచి అందరికీపంచిపెట్టామా?” అని అడిగాడు రామకృష్ణమూర్తి వెటకారంగా.

“నేనట్లా చెప్పలేదే.”

“మరేం చెయ్యమంటారు చెప్పండి. మీరు అందరూ సమానంగా సుఖంగా ఉండేందుకు దారి చూపిస్తే మేముకూడా మీ వెనకాల వస్తాం.”

“నేను మీకు నాయకత్వం వహించడానికి తగినవాడిని కాను. నాకేమి తెలుసు. ఉద్యోగంలోచేరక ముందూ, తరువాత ఒకటి రెండేళ్ళూతప్ప తరువాత అప్పటినుంచి ఇప్పటి వరకూ వార్తాపత్రికలకు మించి మరొకటి చదివిన పాపాన పోలేదు. నేనేమి చెప్పగలను? ఈ రాధాకృష్ణమూర్తి వంటి చదువుకున్న ఉత్సాహవంతులైన యువకులే ఏదైనా దారి చూపాలి. కాని అటువంటి యువకులే జీవితంలో ఒకలక్ష్యం అవసరమనేదే మరచిపోయి ఉన్నప్పుడు ఇక చేసే దేమిటో తోచడంలేదు” అన్నాడు సుబ్బారావు.

"అటువంటివారు ఈకమ్యూనిష్టు ప్రచారం మానెయ్యా లండీ. క్రియ శూన్యం కదా. మీకో విధంగా అన్యాయం అక్రమం అంటూ అస్తమానూ అంటూ ఉండడంవల్ల పనివాళ్ళూ కూలీలూ మన మాట వినకుండా పోతున్నారు. రిక్షావాడే ఉన్నాడనుకోండి. ఎంత ఎదిరించిమాటాడుతాడు! ఎంతటివాడి నైనా ఇట్టేతీసి పడేస్తాడు మరోఅణాకోసం. ఫలితంలేని మీవాదాలవల్ల జరిగే హానేఇది. లాభంమాట దేవుడెరుగు" అన్నాడు రామకృష్ణమూర్తి.

సుబ్బారావు కోపం ఆపుకోలేక పోతున్నాడు. తనను తానుఅదుపులో పెట్టుకోవడానికి ప్రయత్నం చేస్తూనే అన్నాడు "అవును వాడి కడుపు మంట అట్లా చేస్తుంది. మనకు కోపం గానే ఉంటుంది. మనం డబ్బు ఇస్తున్నాం కదా, మనడబ్బు తింటూ మనతో అట్లా మట్లాడడమేమి టని. కాని మనం వాడి కిచ్చేదాని కన్నా వాడేమనకు ఎక్కువ ఇస్తున్నాడేమో? వాడు రోజంతా చచ్చిచెడి తొక్కుతాడు. వాడు ఎంత శక్తి ఖర్చుపెట్టుతున్నాడో అంతా తిరిగి కూడ దీసుకుందుకు తగి నన్ని డబ్బులు దొరుకుతున్నాయా అని. ఆపనికి వాడు ఎంత తిండి తినాలో ఎట్లాంటి తిండి తినాలో అట్లాంటి తిండితినడా నికి చాలినంత సంపాదన వాడికుంటా అని. అందుకే కొన్నాళ్ళు రిక్షాలాగేసరికి ఏనుగలాంటివాడు పీనుగులా అవుతాడు"

"అయితే వాడి రక్తమాంసాలు రిక్షాలోకూర్చునే వాళ్ళం పీల్చేస్తున్నారంటారా?" అని అడిగాడు రామకృష్ణ మూర్తి.

" ఒక్కరోజు వాడులాగినంతసేపూ, అంతదూరం రిక్షా లాగితే తెలుస్తుంది నిజమేమిటో "

" మీరులాగి చూశారా " అని అడిగాడు రామకృష్ణమూర్తి.

సుబ్బారావు మాట్లాడలేకపోయాడు.

రామకృష్ణమూర్తి పకపకా నవ్వేశాడు. రాధకూడా నవ్వకుండా ఉండలేకపోయాడు. నవ్వుతూనే రామకృష్ణమూర్తి అన్నాడు: " ఊహిస్తున్నారన్నమాట. ఇట్లాంటి ఊహాలవల్లే కొంప తీస్తున్నదని నేను చెపుతున్నది. ఏమైనా, మీరు కాదన్నా మీరు పదహారణాల కమ్యూనిస్టేనండి. సందేహం ఏమీ లేదు. మీరుకమ్యూనిష్టని తెలిస్తే మాయింటి ఆయన గేటు లోకి అడుగు పెట్టనీయడు ఆయనకు కమ్యూనిష్టులన్నా, దొంగ లన్నా పన్నులవాళ్లన్నా చెడ్డ భయం. మనమాటలు వినలేదు, నయం. వీధివైపు ఉండిఉంటారు. "

సుబ్బారావు మొగం చిన్నబుచ్చుకున్నాడు. శ్రీహరి కేసి తిరిగి " నువ్వు చెప్పు శ్రీహరీ, ఇప్పుడు మనిళ్లలో రోగాలు వస్తే డాక్టరు ఎంత బిల్లు చేస్తాడో, ఏమి ఇంజక్షన్లు కొనమంటాడో అని భయపడుతాము. అదే మీఇంటిఆయన ఐతే అవసరమయితే ఇంగ్లాండు కూడా వెళ్లి వైద్యం చేయించుకు రాగలడు. సమాజానికి ఏమిచేశాడని ఆయనకింత ప్రత్యేక అవకాశం? ఇది అన్యాయమా కాదా చెప్పు, "అని అడిగాడు.

హరి మెల్లగా తల ఊపుతూ " అన్యాయమే" అన్నాడు.

రాధ అన్నగారికేసి విచిత్రంగా చూశాడు. ఆమాటే నాకు కావలసింది. చాలు. ఇక నేను వెళ్లివస్తాను. మీ తమ్ముడ్ని చదువుకూడా చెడగొట్టుతున్నానేమో" అని లేచి ఒకసారి లోపలికి చూసి "మీ అమ్మగారు నిద్రపోతున్నట్లున్నారు పొద్దున్నకి పూర్తిగా కులాసాగా ఉంటారు చూడు. మరివస్తాను" అని వెళ్లిపోయాడు సుబ్బారావు.

రామకృష్ణమూర్తి కొంచెంసేపు అక్కడే ఉండి, "ఏమండోయి శ్రీహరిగారూ, ఇటువంటి ఆయనతో స్నేహం చేస్తున్నా రేమిటి? మీకుకూడా కమ్యూనిష్టులు అయిపోవడం లేదుగదా కొంపతీసి? సూచనగా తెలిసినా ఇంటిఆయన నిమ్మల్ని కొంపఖాళీ చేసెయ్యమంటాడు. అది సరేకాని ఇట్లాంటి వాడిని ఉద్యోగంలో ఎట్లా ఉండనిస్తున్నారని?" అన్నాడు.

శ్రీహరి కానీ రాధకానీ మాట్లాడలేదు.

"ఈ కమ్యూనిష్టులు కడుపుమంట కమ్యూనిష్టులండి నాలుగు డబ్బులు చేతిలో నిలిచాయంటే చాలు వీళ్ళ కమ్యూనిజం కర్పూరంలా హరించి పోతుంది. ఏమిటోయి రాధాకృష్ణమూర్తి ఆలోచిస్తున్నావు? జాగ్రత్త. ఇట్లాంటి వాళ్ళ మాటలు బుఱ్ఱకెక్కనిచ్చావంటే చెడిపోతావు. పైకి రావలసినవాడవు. బాగా చదువుకో – వస్తానండి శ్రీహరీ" అని రామకృష్ణమూర్తి కూడా వెళ్ళిపోయాడు.

శ్రీహరి తల్లికేసి చూసి, తరువాత తనగదిలోకి వెళ్ళాడు. అతని వెనకే వరలక్ష్మికూడా గడియ పెట్టివచ్చింది.

"ఎవరండీ ఆయన? అట్లా మాట్లాడుతున్నాడు! చాలాసేపటి నుంచి వింటూన్నాను. కమ్యూనిష్టులా ఉన్నాడు" అంది.

"ఏం? భయం వేసిందా?" అని అడిగాడు చిరునవ్వుతో.

"కాదండీ. అట్లాంటి ఆయనతో మీరు స్నేహమేమిటండీ?"

"ఏం, నేనుకూడా కమ్యూనిష్టునైపోతానని భయమేమిటి? నేనూ కమ్యూనిష్టునే అనుకో" అని నవ్వాడు శ్రీహరి.

వరలక్ష్మి అతనికేసి బెదురుగా చూసింది.

"కమ్యూనిష్టులంటే మీదపడి కొరుక్కు తినేసే వాళ్ళై ఉంటారనే కాదూ నీ అభిప్రాయం అసలు కమ్యూనిష్టులు అట్లాంటివారు అయినా కాకపోయినా ఇప్పుడే కమ్యూనిష్టుమాత్రం నువ్వను కున్నంతా చేస్తాడు" అని పళ్ళతో ఆమె క్రింది పెదవి పట్టుకున్నాడు. ఆమె కిచకిచలాడింది.

* * * * *

సుబ్బారావు వైద్యం సూరమ్మగారికి పనిచేసినట్లే ఉంది. మర్నాటికి ఆమె కులాసాగా లేచింది.

"మొత్తానికి బెంగవల్లే ఇది వచ్చిందన్న మాటంటే" అంది వరలక్ష్మి.

శ్రీహరి చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.

## ౧౭

రాధకు పరీలు దగ్గరకు వస్తున్నాయి. కాని అతని మనస్సు చదువుమీద నిలవడం లేదు. అతని మనస్సు లక్ష్మితో

నిండిపోయి ఉంది. లక్ష్మి ఈమధ్య అంతగా కనిపించడం లేదు. ఆమెకి కాలేజీలో పరీక్షలు జరుగుతున్నట్లున్నాయి.

కాలేజీకి వెళ్ళితే కనిపిస్తుందేమోనని తనకు కాలేజీ లేకపోయినా వెళ్ళాడు రాధ. కాలేజీ కాంపౌండులో అటూ ఇటూ తిరిగాడు. తెలిసిన లెక్చరర్లు కనిపిస్తే నమస్కారంచేశాడు. 'ఏరోయి రాధా. కాలేజీ వచ్చావేం?' అని అడిగారు వాళ్ళు.

ఊరికేనే" అన్నాడు రాధ.

"ఊరికే కాలేజీకి ఎందుకురా? ఏం, ఇంటిదగ్గర చదువు సాగడం లేదేమిటి? కాలేజీ గ్రౌండ్సులో బాగుందేమిటి చదువుకోడానికి? బలే చోటు దొరికింది లే. పోనీ తోటల్లోకి రాకపోయావు? " అని అడిగాడుఒకడు.

"కాదులేరా. ఇది ఆఖరి సంవత్సరం కాదూ? కాలేజీతో సంబంధం తెగిపోతుంది కాదూ. అందువల్ల కాలేజీని విడవలేక బెంగతో మరోకసారి చూసుకుంటున్నాడు " అన్నాడు ఇంకొకడు.

" కాలేజీనే ప్రేమించేశావేమిటిరా? " అన్నాడు మరొకడు. అందరూ నవ్వేశారు. "ఎక్కరా రాధా, సైకిలుమీద పోదాం " అని వాళ్ళలోనే ఒకడు రాధని బలవంతం చేశాడు. రాధ వెనకాల కేరియరు మీద కూర్చున్నాడు,

నలుగురూ ఒకహోటలు దగ్గర ఆగి, కాఫీ తాగుదాం అని రాధనుకూడా లాగుకు పోయారు, ముందు దోసెలు అర్డరు

చేశాడు. దోసెలు తింటూ ఒకడు అడిగాడు. "ఏరా రాధా, ఎట్లా ఉంది నీ 'లవ్ అఫైర్', ?"

రాధ తెల్లబోయాడు, అత సంతమోటుగా అడగడం రాధకి చాల బాధ కలిగించింది. "లవ్ అఫైర్ ఏమిటి?" అన్నాడు. కొంచెం తెప్పరిల్లుకొని ఏమీ తెలియనట్లుగా నటి ద్దామని.

"ఒరే మామందు దాస్తావెందుకురా?" అని అడి గాడు ఒకడు.

"వాడికి తెలియదేమోరా అందరికీ తెలిసినట్లు" అన్నాడు ఇంకొకడు.

కాఫీ వస్తే అది త్రాగుతూ వాళ్ళు అన్నారు: ఏమైనా 'విష్ యూ గుడ్ లక్.' ఒకడిన్నరు పార్టీ తగులుతుందేమో న నే ఆశ, గాంధర్వ వివాహం మాత్రం చేసుకోబోకు, భాయీ. మమల్ని దగా చెయ్యకు. రాధ "ఎట్లాగో వాళ్లనుంచి విడి పించుకొని బయటపడి ఇంటికి చేరాడు.

కాని లక్ష్మి కనిపించకపోవడం వల్ల అతను ప్రాణవా యువులందని వాడిలా కొట్టుకుంటున్నాడు. కనీసం ఆమెనొక సారి కళ్ళారాచూడడమైనా సాధ్యపడుతుందేమోనని తెగించి లక్ష్మి ఇంటికేసినడిచాడు. ఇంటికి ముందునుంచి లోపలకు చూస్తూ వెళ్ళాడు, ఆమె కనిపించలేదు. కాని ఎదర వరండాలో పడక కుర్చీలో కూర్చొని ఉన్న ఆయనమాత్రం రాధను చూశాడు. లక్ష్మి తండ్రేమో. కొంతసేపు తరువాత రాధ మళ్ళీ

వెనక్కి తిరిగి లోపలికి చూస్తూనే నడిచాడు. మళ్ళీ పడక కుర్చీలో కూర్చున్న ఆయన దృష్టి అతనిమీద పడింది. రాధ త్వరగాఎదరకు నడిచాడు. తండ్రే అయిఉంటాడు. ధైర్యంగా వెళ్ళి లక్ష్మితో కొంచెం మాట్లాడాలని చెపితే? ఏంపని అని అడుగుతాడేమో? ఏమని చెప్పాలి? ఎంతకొట్టుకున్నా సరియైన నెపం దొరకలేదు. ఇంటికి ఇరవై గజాలదూరంలో వీధిమొగన నిలబడిపోయి, వెనక్కి వెళ్ళిపోవడమూ లేక మరొకసారి లక్ష్మి ఇంటిముందునుంచి పోవడమూ అని తటపటాయిస్తూ ఆయింటి కేసే చూస్తున్నాడు రాధ.

ఎదర వరండాలో కూర్చున్న ఆయన గేటులోకి వచ్చి వీధిలో అటూ ఇటూ చూశాడు. ఎవరికోసమో చూస్తున్నట్లు న్నాడు. రాధనుకూడా చూశాడు. కొద్దిసేపుండి రాధను రమ్మ న్నట్లు సైగ చేసాడు. రాధ ఆశ్చర్యబోతూ ఉండిపోయాడు. కదలలేదు. ఆయన స్పష్టంగా రమ్మని చేయి ఊపాడు. రాధ సందేహిస్తూనే మెల్లగా దగ్గరకువెళ్ళాడు. ఆయన "లోపలకి రండి" అని లోపలికి దారితీశాడు. రాధకు కుర్చీ చూపించి తను పడక కుర్చీలోకూర్చున్నాడు. రాధసందేహిస్తూనే కూర్చు న్నాడు.

"మిమ్మల్ని ఎక్కడో చూసినట్లుంది: ఎక్కడో, ఎప్పుడో సరిగా జ్ఞాపకం రావడం లేదు" అన్నాడుఆయన.

రాధ తెల్లబోతూ ఏమీ మాట్లాడలేదు.

"మీ పేరేమిటి?" రాధ చెప్పాడు.

"ఏమి చదువుతున్నారు?"—తరువాత ఒక్కొక్కటే వివరాలు అడిగాడు. రాధ చెప్పాడు.

"మాలక్ష్మికి మీరు బాగా తెలుసుగదూ?"

రాధ తల ఊపాడు.

"ఆఁ, ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. ఆ వేళ కాలేజీ 'ఫంక్షన్'లో ఒకనాటకంలో మీరున్నారు కాదూ. లేడీ రోల్ ఏదో వేసినట్లున్నారు" అన్నాడు ఆయన.

"అవునండీ"

"ఏం, ఇట్లా వచ్చారేం?"

"— — — —కొంచెం పనిఉందండీ"

ఎవరితో?"

"మాలక్ష్మితో నేనా?"

"— — —అవునండీ"

"ఏమిటి పని?"

రాధ కంగారు పడిపోయాడు. బుర్ర పని చేయలేదు. "ఒక పుస్తకంకోసమండీ" అన్నాడు చివరికి తడబడుతూ

"అట్లాగా? నాకూ మీతో ఒకపని ఉంది. సమయానికి వచ్చారు."

రాధ ఏమిటన్నట్లు చూశాడు.

ఆయనకుర్చీలో జేరబడి ఒక నిమిషమాగి తరువాత మెల్లగా చెప్పడం మొదలు పెట్టాడు.

"పడమటి దేశాల్లో మగవాళ్లూ ఆడవాళ్లూ ఎంతో స్వేచ్ఛగా కలిసి మెలిసి తిరుగుతారు. వారిలో అది తప్పుకాదు. కాని మన సమాజంలో ఎంతలేదన్నా స్త్రీలు తమదగ్గర వాళ్ళలో తప్ప పరాయి వాళ్ళతో సమానంగా తిరగడం సాధ్యంకాదు. ఇది బూజుపట్టిన మనస్తత్వం అయితే కావచ్చును కాని మన దేశం ఇంకా పాత పద్ధతులు పూర్తిగా వదులుకోలేదు. బొంబాయి, కలకత్తా, ఢిల్లీలవంటి పెద్దనగరాలలో పడమటి దేశాలలోలా కొంతస్వేచ్ఛ ఉండవచ్చు కాని చిన్ననగరాల్లోనూ పట్టణాల్లోనూ ఆడవాళ్ళుకొంచెం మెలకువగానే సంచరించాలి. అంటేమడి కట్టుకొని కూర్చోమని కాదు. కాలేజీల్లో చదువులకు వెళ్తున్నప్పుడు నలుగురితో కొంచెం మాట్లాడ వలసివస్తుంది. కొంచెం కలిసి తిరగవలసివస్తుంది. కాని అది కూడా ఆకాలేజీలో ఉన్నకాసేపూ, లేక పరిస్థితులను బట్టి జరగాలిగాని హద్దు దాటిపోతే ప్రమాదం వస్తుంది. ఏమంటారు? నేను చెప్తున్నది అర్థం చేసుకున్నారనుకుంటాను."

రాధ ఏమీ మాట్లాడలేదు. మంత్ర రుద్ధభుజంగంలా ఉండిపోయాడు.

"మేము తల్లి దండ్రుల ఉన్నాం. మా మీద కొంత భాధ్యత ఉంది కదా? పిల్లలకు స్వేచ్ఛ ఇస్తున్నామంటే పిల్లలకు ఆస్వేచ్ఛను పాడుచేసుకొని అపాయంలో చిక్కుకోకుండా చూసుకోవాలి. ప్రతి తండ్రికి ఏమని కోరిక ఉంటుంది? తన పిల్లకు మంచి సంబంధం దొరకాలనీ, ఆమెకు పెళ్ళిచేసి తన బాధ్యతనుంచి విముక్తి పొందాలని ఉంటుంది. ఆకోరిక తీరే.

వరకూ అతని మనస్సుకు శాంతి ఉండదు. అటువంటప్పుడు తన కూతురు భవిష్యత్తుకు ప్రమాదం రాబోతూంటే ఏతండ్రి ఊరుకోగలడు? పిల్లలకు కాలేజీ చదువులు చదివిస్తున్నది ఏవో ఉద్యోగాలూ చేయించాలనీ, ఊళ్ళేలించాలనీ కాదు. సరదా కొద్దీ, ఆపేక్ష కొద్దీ, వాళ్ళకొకవేళ ఉద్యోగాలు చేయాలని కోరిక ఉంటే, పెళ్ళి అయిన తరువాత భర్త ఇష్టపడితే చేసుకోవచ్చు. కాని ఈచదువుల మూలాన ఆమెమీద ఏవుకార్లో బయలుదేరి, రేపు ఆమెకు పెళ్ళి కావటం కష్టమైతే ఏతండ్రికైనా ఎంతబాధ కలుగుతుంది చెప్పండి. నేను చెపుతున్నది మీరు పూర్తిగా అర్థం చేసుకున్నారనుకుంటాను. మీరు చదువుకున్నవారు కాబట్టి ఇంత విమర్శకంగా చెపుతున్నాను" అని ఆయన మళ్ళీ రాధమొగంలోకి చూశాడు.

రాధనుంచి జవాబేమీ లేదు.

"మీకు మాలక్ష్మితో పరిచయం ఏర్పడి ఉంటుంది. అది తప్పుకాదు. ఎప్పుడైనా సరదాగా మాట్లాడుకోవచ్చు. పుస్తకాలు ఇచ్చిపుచ్చుకోవచ్చు—కాని నలుగురు చాటున చెప్పాను నే వరకూ వెళ్ళితే ఎట్లా చెప్పండి? మగాడికేమీ పరవాలేదు. కాని ఆడదానిమీద ఒక్కమాట పడిందంటే అదిత్వరగా చెరగదు—"

రాధ నోటిలోనుంచి మాటవచ్చింది. 'నేనేమీ చెడ్డపని చేయలేదండి. మీ అమ్మాయిపట్ల అవినీతిగా ప్రవర్తించలేదండి. "అన్నాడు.

ఆయన కనుబొమలు చిట్లించాడు: "నేనింతవరకు చెప్పినది మీరు గ్రహించినట్లు లేదు. మీరు అవనీతిగా ప్రవర్తించావా

రని నేనడం లేదు. కాని మన సమాజంలో ఎంతవరకూ ఉచితమో అంతవరకూ తప్ప అంతకు మించి స్నేహం చేద్దామంటే ఏవో లేనిపోని సంబంధాలంట కడ్తారు నలుగురూ. దీనికి జమాజాన్ని నిందించి లాభం లేదు. అట్లాంటిది రాకుండా నేచూచుకోవాలి. ఇట్లాంటివాటివల్ల నాశనమయ్యేది స్త్రీయే. మీరు హద్దులు దాటబోతున్నారనే నేను చెప్పేది. మీరు స్వతహాగా మంచి వాళ్ళు మరియాదస్థులు అని భావించడం వల్ల నేనింత ఓపికగా చెపుతున్నాను. మీరు మా అమ్మాయిని ఇక కలుసుకోకపోవడం చాలా మంచిది, మిష్టర్''

రాధలో కోపం రేగింది. "లక్ష్మిగారు నాతో మాట్లాడటం ఇష్టం లేదంటే నేను మానేస్తానులెండి" అన్నాడు.

దానితో ఆయన మొగంలో క్రోధ చిహ్నాలు బయటపడ్డాయి. రాధకేసి తీవ్రంగా చూస్తూ, లేచి మెల్లగా గొంతుక పెంచుతూ "అయితే మా తల్లిదండ్రులకేమీ బాధ్యత లేనే లేదంటారా? మా పిల్లమీద మాకామాత్రం అధికారం లేదంటారా? మాపిల్ల భవిష్యత్తు పాడవుతూంటే చూస్తూ ఊరుకోమంటారా? నేను చెప్పవలసింది చెప్పాను. నయాన వినకపోతే మరోరకం చూడవలసి ఉంటుంది. ఇక మీరు వెళ్ళవచ్చు. చదువుకున్న ప్రయోజనం ఉంటే నేను చెప్పినది అర్థం చేసుకొని బుద్ధిగా మసులుకోవచ్చు అని ఆయన గుమ్మం దగ్గరకు పోయి రాధవైపుకు వీపు తిప్పి లోపలికి చూస్తూ నిలబడ్డాడు.

రాధ మొగమంతా కందగడ్డలా అయిపోయింది. కొన్ని క్షణాలు అట్లాగే కూర్చొని తరువాత లేచి సరసరా ఇవతలకు

వచ్చేశాడు. ఎటుపోతున్నాడో ఎందుకు పోతున్నాడో తెలియకుండా పోతున్నాడు. పళ్ళు బిగించి విసురుగా వెళ్ళిపోతున్నాడు. ఆ వెళ్ళడంలో సైకిలువచ్చి అతనికిడాష్ ఇచ్చింది. ముందరి చక్రం అతని కాలుకు తగిలి ఆగిపోయింది. రాధ పిచ్చకోపంలో సైకెలు హాండిల్ బారు పట్టుకొని గట్టిగా ప్రక్కకు తోసేశాడు. సైకిలుమీదవాడు దానితోబాటు క్రిందపడ్డాడు. సైకిలు క్రింద నుంచి కాలు తీసుకొని రాధ మీదికి ఎగిరి కాలరు పట్టుకున్నాడు. "బెల్లుమోగిస్తున్నా వినిపించుకోక పైపెచ్చు నన్ను కిందికి తోసేస్తావయ్యా! ఎన్ని గుండెలున్నాయి నీకు?" అన్నాడు వాడు రాధ మొగంలో మొగం పెట్టి. "ముందు కాలరు వదలుతావా వదలవా రాస్కెల్? బెల్లు మోగించావా? నాకు చెముడనుకున్నావా? వదులుతావా వదలవా లేక దవడ పళ్ళురాల గొట్టమంటావా? అని రాధ చెయ్యెత్తబోయాడు. ఇంతలో జనం చుట్టూ పోగుబడి ఇద్దరినీ పట్టుకున్నారు. అవతలవాడు ఓయబ్బో దవడ పళ్లు రాలగొట్టాడంట. పెద్ద మొనగాడు బయలు దేరాడు. చీమబొక్క చూసుకోవాలి. ఏదీ ఏమాత్రం కొట్టావో చూస్తాను. ఎంగిలి ఇంగిలి పీసుముక్కలు నాలుగు వాగితే గొప్పనుకుంటున్నాడు. గొప్పోడి సినట్టే ఉంది "అంటూ ఎదరికు" గావడానికి ప్రయత్నిస్తున్నాడు కానివాడిని పట్టుకున్న జనం వాడిని వాడ్ని వెనక్కి లాగుతున్నారు. "ఏమిటెరా రాస్కెల్, పేలుతున్నావు! వదలండయ్యా నన్ను. వాడిపళ్ళు రాలగొట్టి తీరుతాను అంటూ రాధ ముందుకు పోబోయాడు. కాని అతనినీ వెనక్కి

లాగుతున్నారు జనం. "మిస్టర్, అయిపోయిందేదో అయింది అట్లాంటి వాళ్ళతో పోట్లాట మనకు బాగుండదు" అని ఒకడు రాధను శాంతింప జేస్తున్నాడు. అవతల మరికొందరు సైకిలు వాడినికూడా సముదాయించి, సైకిలుపైకి తీసి, హాండిల్ బారు సరిచేసి వాడికందిచ్చారు. వాడు రాధకేసి కోపంగా చూస్తూ సైకిలెక్కి వెళ్ళిపోయాడు. జనం విడిపోయారు. రాధ ముందుకు కదలిపోయాడు.

పార్కులోకి వెళ్ళి కూలబడ్డాడు. అతని మనస్సులో ఆలోచనలు ఎగిరి పడుతున్నాయి. 'బాణాసురుడు! – రాక్షసుడు! – జైలరు. ధర్మ పన్నాలు వల్లించే వృద్ధ జంబుకం! కన్న కూతురు కాదు బానిస!' రేపుతను మరోమంచి అందమైన అమ్మాయిని పెళ్ళాడి పెద్ద ఉద్యోగం చేస్తూ లక్ష్మితండ్రిని అవమాన పరచాలి. గడ్డిపరక క్రిందతీసి పారెయ్యాలి. అప్పుడు తెలిసి వస్తుంది. – అసలు లక్ష్మి కొంతకారణమేమో? లేకపోతే అంతసేపు తాను అక్కడ ఉంటే ఒక్క సారైన అటు వచ్చి తనను సమర్థించడానికి ప్రయత్నించిందా? కనీసం ఒక్క సారి తనకేసి చూసి తన అశక్తత తెలియబరచినా చాలే. – లక్ష్మి మనస్సు మారి పోయిందేమో! స్త్రీలబుద్ధి చంచలం అసలు లక్ష్మి ఏమంత గొప్ప అందకత్తె అని? నిజానికి వాసంతి ముందు లక్ష్మి తీసికట్టే. అట్లాంటి వాసంతిని మరచిపోగలిగి నప్పుడు ఈలక్ష్మిని మరచిపోవడం కష్టమా? లక్ష్మికన్న అందమైన అమ్మాయిని పెళ్ళాడి లక్ష్మికి పరాభవం చెయ్యాలి. ఆ'రాధ' ఎక్కడుందో? ఇంతవరకూ పెళ్ళి అయి ఉండక

పోతే తనను తప్పక చేసుకుంటుంది! - కాని ఒకవేళ అక్కడ కూడా ఇట్లాంటి బాణాసురులే ఉన్నారేమో! ఇంతకీ ఆ రాధ ఎక్కడ ఉందో ఎవరికి తెలుసు? - అసలు లక్ష్మి మనస్సు మారిపోయి ఉంటుందా? ఇన్నాళ్ళా తనలో దాపరికం లేనట్లే మాట్లాడే దే కాని ఏమి చేస్తుంది? తల్లి దండ్రుల ఒత్తిడి. ఆడవాళ్ళు అసలే పిరికివాళ్ళు! - లక్ష్మితో ఒక్కసారి మాట్లాడగలిగితే! 'జైలు'లోనుంచి బయటపడాలని చూస్తోం దేమో? తన దగ్గరనుంచి ఒక ఉత్తరం అందినా చాలేమో? రుక్మిణిని శ్రీకృష్ణుడు తీసుకుపోయినట్లు ఆమెను తెచ్చేస్తే? - కాని ఎట్లా? ఒకవేళ నిజంగానే లక్ష్మికి తనపట్ల ఉన్నది ఉత్త స్నేహమేమో? నేను స్నేహంగా ఉన్నాను కాని ప్రేమించడం లేదంటుం దేమో? - అవును తను ఆమె మనస్సు పూర్తిగా తెలుసుకోలేదెన్నడూ. ఎప్పుడూ పుస్తకాలనుగురించీ, సినీమాలను గురించీ మాట్లాడుకోవడమే కాని తమ ప్రేమ గురించి మాట్లాడలేదే! మాట్లాడితే స్పష్టంగా తేలిపోయేది ఆమె తనను ప్రేమించినదీ లేనిదీ - అరెరే అమూల్యమైన సమయం కాస్తా వ్యర్థం చేసుకున్నానే!' ఇప్పుడెట్లా?'

చీకటిపడబోతోంది. రాధ లేచాడు. దూరంనుంచి అటు వైపే వస్తున్న స్నేహితులు అతన్ని చూసి "హల్లో రాధ" అని కేకేశారు. వాళ్ళు ఎక్కడ పట్టుకుంటారో అని రాధ వాళ్ళ కేక విననట్లుగా త్వరగా పరుగెత్తాడు. ఇంటికి చేరుకొని "వదినా, కొందరు స్నేహితులు ఇప్పుడే నన్ను వద్దన్నా బలవంతంగా హోటలుకు లాగుకుపోయి కాఫీ టిఫిన్ ఇప్పించారు. అందువల్ల

ఈపూట అన్నంతినను ” అని వరలక్ష్మితో చెప్పి తనచదువులో పడ్డాడు. కానిచదువు ఏమీ సాగలేదు. కనుకొలకుల్లోనుంచి కన్నీరుచూడబోతున్నట్లుంది. అక్షరాలు అలుక్కుపోయాయి.

రాధ రాత్రి పదకొండు గంటలకి దీపం తగ్గించి నిద్రకుప క్రమించాడు కాని ఒకటే ఆలోచనల కల్లోలం. ఒక్కొక్కప్పు డులక్ష్మిని తనురక్షిస్తున్నాడు. ఒక్కొక్కప్పుడు లక్ష్మినీ ఆమె తల్లి తండ్రులినీకూడా తగినట్లుగా పరాభవం చేస్తున్నాడు. పథ కాలు వేస్తున్నాడు. కనురెప్పలు మూసుకున్నా నిద్రమాత్రం రాలేదు.

తెల్లవారు సమయానికి మాత్రం అతనికి తెలియకుండా నిద్ర ఆవహించింది. కాని మరికాసేపటికే వరలక్ష్మి, “లేరాధా తెల్లవారబోతోంది, లేచి చదువుకో ” అంటూ లేపసాగింది. రాధ “ఊఁ, ఊఁ, వదినా కాసేపుండి లేస్తాలే” అని మళ్ళీ అట్లాగే పడుకుంటున్నాడు. “ పరీక్షలు దగ్గరకు వస్తున్నాయి. ఇప్పుడు కూడా ఇట్లా నిద్రపోతే ఎట్లా? పరీక్షలయిన తరువాత కావలసి నంత నిద్రపోదువుగానిలే” అని వరలక్ష్మి అతనిని లేపుతూనే ఉంది. “అబ్బా, రాత్రి ఒక్కక్షణం కంటిమీద కునుకులేదు—” అని చటుక్కున ఆగిపోయాడు రాధ. “ఏం ఎందుకు నిద్రలేదు? పదకొండు గంటలకే దీపంతగ్గించి పడుకున్నావు గదా. నిద్ర ఎందుకు లేదు?” అని ప్రశ్నల వర్షం కురిపించసాగింది వరలక్ష్మి, రాధకొంచెం ఇరకాటంలో పడి “ ఏమిలేదు వదినా ఎందుకో పాడికళ్ళు పడిపోయాయి. వేడి చేసి ఏమో” అన్నాడు.

"అయితే కాసేపు పడుకోలే" అని వెళ్ళిపోయింది వరలక్ష్మి. కాని రాధ లేచాడు. మొగం కడుగుకొని వచ్చి, దీపం పెంచి పుస్తకం తెరిచాడు. ఎప్పటిలాగే రమణ ప్రక్కకు తయారయ్యాడు. వాడిని చూసేసరికి రాధకు కొంచెం సిగ్గువేసింది. జాగ్రత్తగా చదువుదామనుకున్నాడు కాని మనస్సులోని ఆలోచనలు మళ్ళీ బయటపడ్డాయి. హృదయంలో బాధఉబికింది. ఛీ ఏమిజీవితం. బ్రతికి ఏం ప్రయోజనం?— అన్నీ నిరాశలే—అనుకున్నాడు రాధ.

శ్రీహరి మామూలుగానే స్నానం చేసి ప్రైవేట్లకు వెళ్ళాడు. తొమ్మిది గంటలకు ఇంటికి తిరిగి వచ్చాడు. వస్తూనే రాధను చూసి కళ్ళుఎర్రజేసి, పెదవులు వణికిపోతూండగా గట్టిగా అరిచాడు. "ఏరా రాధా, నువ్వు నిజంగా చదువుతున్నావా, నాటకమాడుతున్నావా?"

రాధ తెల్లబోయాడు.

" ఏం, మాట్లాడవేంరా, చదువుతున్నావా లేదా అంటే?"

" — చదువుతూనే — ఉన్నానన్నయ్యా"

" చదువుతున్నావా! — శుద్ధఅబద్ధాలు. నాటకం మోసం. ఇంకాఎన్ని నేరుస్తావో" అని అరుస్తున్నాడు శ్రీహరి.

వరలక్ష్మి పరుగెత్తుకువచ్చి, ఏమిటండీ, "ఏమి జరిగింది, చెప్పరేం? " అని అడగసాగింది.

" ఏం జరగడమేమిటి? — ఈయనగారు చదువులకి స్వస్తి చెప్పేసి ప్రేమలో పడ్డాడు. ప్రేమిస్తున్నాడట. సిగ్గులేకపోతే సరి— "

"ఏవరినండీ. ఆ అమ్మాయికి అప్పుడే పెళ్ళి అయి పోయింది కాదండీ" అంది వరలక్ష్మి.

"ఆ అమ్మాయి కాదు మరో అమ్మాయి. వీళ్ళకు స్థిరత్వ మేమిటి? ఆపిల్ల తండ్రి వచ్చి నాదగ్గర గోల పెట్టాడు. తన పిల్ల కపకీర్తి వస్తుందని రేపుపెళ్ళి కాదనీ.—ఏరా పరీక్షలు దగ్గరకు వస్తే చదువుకోక ఆపిల్ల ఇంటి చుట్టూ కాపలా కాయడమేమిటి? ఇన్నాళ్ళనుంచి ఆడుతున్న నాటకం ఇది అన్నమాట. ఇక్కడేమన్నా ఆస్తులు పడి ఉన్నాయను కున్నావా నీయిష్టం వచ్చినట్లు గంతులేసేందుకు" అని ఇంకా గట్టిగా అరుస్తున్నాడు శ్రీహరి. పక్క ఇళ్ళవాళ్ళు తొంగి చూస్తున్నారు చోద్యమేమిటా అని.

"ఇంతకీ ఎవరండీ ఆ అమ్మాయి" అని అడిగింది వరలక్ష్మి.

"ఎవరైతేనేం—ఒక ప్లీడరు కూతురు. మరోకులం కూడా పాపం తనకు చులాగ్గా చేతనైందని ప్రేమించేశాడు. చదువు లెట్లా పోయినా పరవాలేదు. మన మెట్లాపోయినా పరవాలేదు. తన కేం? సంసారభారం తన నెత్తిమీద లేదుకా! తను అన్ని సరదాలూ కోరికలూ తీర్చుకుంటాడు. నేనుమాత్రం గానుగె ద్దులా ఇట్లాపడి ఉండాలి. వాడు పాసైనా పాసుకాకపోయినా చదివిస్తూ డబ్బుకట్టూండడమే నాపని. ఎక్కడనుంచి తెస్తాను డబ్బు? —ఎన్నాళ్ళని తెస్తాను? ఏరా మాట్లాడవేం? నువ్వు పాస య్యేటట్లు చదువుతున్నానని చెప్పగలవా?—"

రాధ మాట్లాడలేదు. వంచిన తలఎత్తలేదు.

"మరెందుకిన్నాళ్ళూ ఈనాటకం ఆడావు? ఇట్లా తింటూ

తిరుగుతూ కనపడ్డ వాళ్ళని ప్రేమిస్తూ గడపడమేననుకున్నావా జీవితమంటే? మొదట్లోనే చెప్పక పోయావు. ఈ ఆశలు పెట్టుకోకపోయి ఉందుము. ఎందుకు వచ్చిన బ్రతుకురా, ఛీ" అని తన గదిలోకి వెళ్ళిపోయాడు శ్రీహరి.

రాధ రెండు నిమిషాలట్లాగే ఉండిపోయి తరువాత లేరు కొని వీధిలోకి నడిచిపోయాడు. వరలక్ష్మి ఏమి మాట్లాడాలో ఏమిచేయాలో తోచక అట్లాగే ఉండిపోయింది. సూరమ్మగారు ఇదంతా అర్థంగాక కోడలిని అడిగింది. వరలక్ష్మి చెప్పింది. సూరమ్మగారు బుగ్గలు నొక్కుకుంటూ, "అయ్యయ్యో, ఇవేమి బుద్ధులు పుట్టాయే వీడికి" అంటూ కూచ్చుండి పోయింది.

శ్రీహరి బడివేళకు నాలుగు మెతుకులు నోట్లో వేసుకొని వెళ్ళిపోయాడు. అతనిలో కోపం ఇంకా రగులుతూనే ఉంది. తమ్ముడు చేసిన పని తలచుకున్న కొద్దీ అతనిలో మంటలు లేస్తున్నాయి. వెనక 'వాసంతి' విషయంలో తను నవ్వులాటగా తీసుకున్నాడు. కాని ఇప్పుడు పరీక్షలు సమయంలో కూడా— పరీక్ష బాగా పాసవడంమీదే తమబోటి వాళ్ళ జీవితం ఆధారపడి ఉన్నప్పుడు—ఇట్లా ప్రవర్తిస్తే ఎట్లా సహించగలడు? బాగా పాసవుతాడు—మంచి ఉద్యోగం సంపాదిస్తాడు—చక్కగా పెళ్ళిచేసుకుంటాడు - తనభారం కొంత తగ్గిస్తాడని తను ఎంత ఆశలు పెట్టుకున్నాడు. ఇప్పుడు రాధ ఆ ఆశలన్నీ నిరాశలు చేసేశాడు. మంట పట్టలేక సుబ్బారావు తోకూడా చెప్పు కున్నాడు శ్రీహరి.

"తొందర పడకు. శ్రీహరీ. ఆవయస్సులో అది కొంత వరకు సహజమే. ఈకాలపు పడుచువాళ్ళు ఇంచుమించు అంతా ఇట్లాగే ఉన్నారు. ఏమీ బాధ్యతా బాదరబందీ పట్టించుకోరు. కథలూ నవలలూ సినిమాలూ వీటివల్ల ఇట్లాతయారవుతున్నారు. మన సమాజంలో నూటికి తొంభైతొమ్మిదివంతుల పెళ్ళిళ్ళు ప్రేమ పెళ్ళిళ్ళు కావు. కాని ఆనూటికి తొంభైతొమ్మిదివంతులు ప్రేమ పెళ్ళిళ్ళను గురించే నూటికి తొంభైతొమ్మిది వంతులూ కథలూ, నవలలూ సినిమాలూ ఉంటాయి.—ఇంతకీ నువ్వు మరీగట్టిగా తిట్టలేదుగదా మీ తమ్ముడిని?" అని అడిగాడు సుబ్బారావు.

"నాకు కోపం ఆగలేదు సుబ్బారావు. ఇన్నాళ్ళూ పెంచుకున్న ఆశలు ఒక్కసారి కూలిపోతే సహించలేక పోయాను—" అన్నాడు శ్రీహరి తన మితిమీరిన కోపానికి కొద్ది కొద్దిగా పశ్చాత్తాప పడుతూ.

"గట్టిగా తిట్టితే అసలు చెడుతుంది వ్యవహారం. వాళ్ళకు మెల్లగానే నచ్చ జెప్పాలి. ఈవేళో రేపో నేను వచ్చి మీ తమ్ముడితో మాట్లాడుతానులే - కాని ఒకమాట. ఈవిషయం ఇంకెవరికీ చెప్పకు. ఆర్చేవాళ్ళా? తీర్చేవాళ్ళా? బదులు మరి కాస్త లోకువచేస్తారు నిన్ను" అన్నాడు సుబ్బారావు.

సాయంత్రం శ్రీహరి ప్రైవేటు చెప్పి నీరసంగా ఇంటికి మళ్ళాడు. తమ్ముడిని అట్లా కేకవేసినందుకు కొంత బాధ కలుగుతోంది. కాని అతను చేసినపని తలచుకొంటూంటే ఇంకా కోపం వస్తూనే ఉంది. ఇంట్లోకి అడుగు పెట్టేసరికి రమణ

ఎదురు పరుగెత్తుకు వచ్చాడు: నాన్నా, "నాన్నా, బాబాయి పొద్దుటినుంచీ ఇంటికి రాలేదు. అన్నం తినలేదు" అని చెప్పాడు. వరలక్ష్మి అంది: "అవునండీ. ఎక్కడకు పోయాడో ఏమో. ఏ నీరసమో వచ్చి కళ్ళు తిరిగి పడిపోతే–"

"పోనియ్యి ఎట్లాపోతే. కడుపు కాలితే వాడే వస్తాడని" శ్రీహరి కాళ్ళూచేతులూ కడుగుకొని వచ్చి నీరసంగా మంచం మీదికి పడ్డాడు. పైకప్పుకేసి చూస్తూ ఉండిపోయాడు. సూరమ్మగారు ఒకసారి లోపలికి తొంగి చూసింది. ఏదో చెప్పాలనుకున్నట్లు చూసింది. కాని కొడుకు ఏమంటాడో అన్న భయంచేత వెనక్కి వెళ్ళిపోయింది. ఆతుర్దాతో కూడిన ఆమె మొగం చూసేసరికి శ్రీహరి గుండెకూడా గిజ గిజలాడింది. అంతలోనే మళ్ళీకోపం. రమణ మెల్లగావచ్చి అన్నాడు: "నాన్నా, మామ్మ బాబాయిని ఇంటికి తీసుకు రమ్మంటోంది, నాన్నా." శ్రీహరి రమణ తలమీద చేతితో రాసి లేచాడు. చొక్కా ఉండువా వేసుకొని సైకిలు తీసుకొని బయలు దేరాడు.

వీధిలో కొద్దిదూరం పోయేసరికే సుబ్బారావు ఎదురయ్యాడు "ఎక్కడికి శ్రీహరీ? మీ యింటికే వస్తున్నాను మీ తమ్ముడితో మాట్లాడు దామని" అన్నాడతను.

"వాడు పొద్దుటినుంచీ ఇంటికి రాలేదుట. వెతికి తీసుకు రావడానికి వెళ్తున్నాను" అని చెప్పాడు శ్రీహరి.

"అయితే నువ్వుండు. నువ్వుసరిగా నచ్చజెప్పలేవు. నేను వెతికి తీసుకువస్తాను. సైకిలు నాకియ్యి" అని శ్రీహరిని వెనక్కి పంపేసి సైకిలుమీద బయలుదేరాడు సుబ్బారావు

ఊరంతా ఒక్కొక్క వీధే తిరుగుతూ వెళ్ళాడు. చివ రికి ఊరిబయట ఒకచెట్టుకు జేరబడి తలవంచుకొని కూర్చొని కనిపించాడు రాధ. సుబ్బారావు సైకిలు స్టాండు వేసి మెల్లగా రాధ దగ్గరికి నడిచాడు.

రాధ ఉలిక్కిపడి ఒకసారి తలెత్తి సుబ్బారావుకేసి చూసి మళ్ళీతల దించేసుకున్నాడు. సుబ్బారావు అతని బుజం మీద చేయివేసి మెల్లగా అన్నాడు: "రాధాకృష్ణమూర్తీ నీ మనస్సులో బాధ నాకు తెలుసు. జీవితమంటే ఇంతేనోయి ఎన్నో నిరాశలూ బాధలూ తప్పవు. అంతా అనుకున్నట్లు జరి గిపోతే ఇంకేమి ఉంటుంది? ఈ భూమి ఒకస్వర్గం అయిపోదూ? మా అన్నయ్య నిన్ను కోప్పడ్డాడు. నిజమే కాని నీమీద ద్వేషంతో కాదుగా. అతని బాధఅతనిది. తన ఆశలన్నీ నిరాశ లవుతున్నాయేమో నన్న ఆందోళనకొద్దీ ఏదో అనేశాడు. ఇప్పుడు చాలా బాధ పడ్తున్నాడు. అతనెన్నడైనా నిన్నింత గట్టిగా కోప్పడ్డాడా, చెప్పు? నువ్వు పొద్దున్న నుంచీ రాలేదని ఇంట్లోఅంతా ఆదుర్దా పడుతున్నారు. లేచిరా"

రాధ సుబ్బారావు మొగంలోకి ఒకసారి చూసి "నన్ను వదిలెయ్యండి. నేను మళ్ళీ ఆయింట్లోకి రాలేను. అన్నయ్య మొగం చూడలేను" అన్నాడు.

సుబ్బారావు అతని చేయి పట్టుకొని లేవదీస్తూ "నామాటవిను వెళ్దాంరా, వాళ్ళను బాధపెట్టకు వాళ్ళకునీమీద నిజంగా కోపంలేదు. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. ఈకొద్ది రోజులైనా గట్టిగా చదివితే పాసుకావచ్చు" అన్నాడు.

రాధ లేచాడు. సుబ్బారావుకూడా నడిచాడు. సుబ్బా రావు సైకిలు నడిపిస్తూనే సాగాడు.

ఇంటికి చేరుకున్నారు: రాధ గుమ్మములో నిలబడి తలవం చుకున్నాడు. శ్రీహరి కొన్ని క్షణాలు తమ్ముడికేసి చూసి "పొద్దుటినుంచీ ఏమైనా తిన్నావా?" అని అడిగాడు.

రాధ మాట్లాడలేదు. శ్రీహరి కళ్ళలో నీళ్లు నిలిచాయి. "అన్నంతిను" అన్నాడు. రాధ మెల్లగా లోపలికి నడిచాడు. వరలక్ష్మి అతనికి వెంటనే భోజనం వడ్డించి పెట్టింది.

సుబ్బారావు శ్రీహరి దగ్గరికి వెళ్ళి చెవిలో చెప్పాడు: "మీతమ్ముణ్ణి ఇంకేమీ అనకు శ్రీహరీ. ఆవయస్సులో అది సహజం అని చెప్పానుగా. రేపు అతనే తెలుసుకుంటాడు. మనంచెప్పనక్కర్లేదు.మరినేను వస్తాను"అని బయలు దేరాడు.

ఇవతలకు వస్తూంటే రామకృష్ణమూర్తి అతన్ని చూసి, "ఏమండోయి, ఇట్లా వచ్చారేం? ఏమిటి విశేషం?" అన్నాడు.

"ఆఁ ఏమీ లేదండీ" అన్నాడు సుబ్బారావు.

"మీ విప్లవం ఎంతవరకూ వచ్చిందేమిటి?" అని అడిగాడు రామకృష్ణమూర్తి నవ్వుతూ.

సుబ్బారావుకు చుర్రుమంది. ఉండబట్ట లేకపోయాడు. "విప్లవం సాగుతూనే ఉంటుందండి. కాని వెన్నుపోటుపొడిచే వాళ్ళవల్ల దెబ్బ తింటోంది" అన్నాడు.

రామకృష్ణమూర్తి మొగంమీద నవ్వు ఇగిరిపోయింది. "మేము వెన్నుపోటు పొడిచేవాళ్ళమా? మీరు న్యాయం కోసం

ధర్మంకోసం పోరాడే వీరులుగా మేము ఇతరుల రక్తమాంసాలు పీల్చుకు తినేరాక్షసుల దాసులమూనా—మీరు హద్దుమీరిపో తున్నారు "అంటూ గొంతుక రెట్టించసాగాడు రామకృష్ణ మూర్తి.

"నేనేమీ మిమ్మల్ని అనలేదండీ. ఎందుకు లేనిపోని ఆగ్రహం తెచ్చుకుంటారు?" అన్నాడు సుబ్బారావు.

"పైకిఅనకపోతే మాత్రం మీఅభిప్రాయం అదేకదా. చూద్దాం మీవిప్లవం ఎంతవరకు వస్తుందో! ఈజన్మలో కాదు గదా మరోజన్మలోకూడా మీరు చెప్పే విప్లవంరాదు. మీరు చేస్తున్న ప్రచారం గురించి పైవాళ్ళకు రిపోర్టు ఇస్తే మీగతి ఏమవుతుంది?" అన్నాడు రామకృష్ణమూర్తి.

"చెయ్యండి బాబూ—మీచేతిలో ఏమైనా ఉంది. ఉద్యోగం ఊడిపోతే భార్యాబిడ్డలతో మీపేరు చెప్పుకొని ముష్టెత్తుకు తిరుగుతాను.—నేనుప్రచారం ఏమీచేయడంలేదు. మిమ్మల్ని కమ్యూనిష్టులు కమ్మని నేను చెప్పడంలేదు. నేనే సరి యైనకమ్యూనిష్టును కానప్పుడు మరొకరినిక మ్యూనిష్టును ఎట్లా కమ్మని చెపుతాను?' అని,విసురుగా వెళ్ళిపోయాడు సుబ్బారావు.

రామకృష్ణమూర్తి సుబ్బారావుకేసి చురచురా చూసి ఒకసారి శ్రీహరి ఇంట్లోకిచూసి తనవాటాలోకి వెళ్ళిపోయాడు శ్రీహరి ఈమాటలు వింటూనే ఉన్నాడుకాని తను అక్కడ ఉండడం బాగుండదని తలచి తన గదిలోనే కూర్చున్నాడు.

ఆరోజునుంచీ మళ్ళీ శ్రీహరి తమ్ముణ్ణి నేమీ అనలేదు. ఏమీమాట్లాడలేదుకూడా. రాధ అన్నగారి మొగం చూడ లేకపోతున్నాడు. ఇంట్లో ఎవళ్ళతోకూడా మాట్లాడడంలేదు. అస్తమానూ పుస్తకాలలోమునిగి తేలుతున్నాడు. పట్టుదలతో చదువుతున్నాడు. రాత్రి పన్నెండూ ఒంటిగంటవరకూ చదువు తున్నాడు. తెల్లవారుగట్ల మూడునాలుగింటికి మళ్ళా లేస్తు న్నాడు. జాముర్రాత్రి వరకూ తలుపు సందుల్లోనుంచి దీపపు వెలుతురు రావడంచూసి వరలక్ష్మి వెళ్ళి తలుపుకొద్దిగా తెరచి చూసి భర్తతో చెప్పింది: "రాధతో చెప్పండి. మరీఅంత నిద్ర మానేసి చదవ వద్దని. రేపుఆరోగ్యం చెడితే మొదటికే మోసం వస్తుందే. శ్రీహరి లేచి చూచాడు. రాధ దీపం దగ్గర కూర్చుని చదువుతూ ముందుకు తూలుతున్నాడు. కళ్ళుగ్లాసులోనిచన్నీ ళ్ళతో తుడుచుకుంటున్నాడు. నెత్తిమీద వేళ్ళతో కొట్టుకుంటు న్నాడు. శ్రీహరి మాట్లాడకుండా తలుపువేసి మంచం మీదకు చేరాడు.

పరీక్షలు దగ్గరకు వచ్చేశాయి. రాధ చదువు మరీతీవ్ర మయిపోయింది. అన్నంకూడా సరిగా తినలేకపోతున్నాడు. కళ్లు ఎర్రబారి లోతుకి పోయాయి. మనిషి కొంచెం నల్లబడ్డాడు కూడా. తల్లి మాత్రం రోజూ పొద్దున్నే అతనిచేత పాలలో తోడువేసిన అన్నం తినిపిస్తోంది చలవ చేస్తుందని.

పరీక్షరోజు వచ్చింది. రాధగుండె దడదడ కొట్టుకుం టోంది. శ్రీహరి పరీక్షరోజుల్లో తమ్ముడిని తనసైకిలు తీసుకు వెళ్లమన్నాడు. రాధబయలుదేరబోయే ముందు తల్లి అతనిచేత దేవుడికి దండం పెట్టించింది. బయలుదేర బోతుంటే వరల

ఎదురుగా నడిచి వచ్చింది. రాధ పరీక్షకు వెళ్ళాడు పేపరు చేతి లోవణికి పోసాగింది. ఎట్లాగో కుదుట బరచుకొని చదివాడు. వ్రాయడం మొదలు పెట్టాడు. కొన్నికొన్ని జ్ఞాపకం రావడం లేదు — బాగాచదివినవే ఒకొక్కప్పుడు బుర్ర ఖాళీఅయి పోతున్నట్లుంది. కళ్లు అలుక్కు పోతున్నాయి. ఆదుర్దా పడు తున్న కొద్దీ తప్పులు ఎక్కువ కాసాగాయి ఎక్కువ పోమరచి సాగాడు. అయినా అట్లా రాస్తూ నే ఉన్నాడు. గంట గడిచిన కొద్దీ కళ్లుమూతలు పడిపోతాయని పిస్తోంది. ఎట్లాగో చివర నిమిషం వరకూ రాసి ఇంటికి వచ్చేశాడు.

ఆసాయంత్రం శ్రీహరి అడిగాడు భార్యని "ఎట్లా రాశాడో కనుక్కున్నావా?" అని,

"లేదండీ. కాని ఇంత ఇట్లా చదువుతూంటే చివరి వరకూ నిలబడగలడా?" అంది వరలక్ష్మి.

మర్నాడు రాధ పరీక్ష నుంచి తిరిగి రాగానే మరిది స్వయంగా చెప్తాడని ఆశించింది. కాని అతనేమీ చెప్పలేదు. తను అడగడానికి సాహసించలేక పోయింది. అన్నం వడ్డించింది. రాధ అన్నం తిని వెళ్ళిన తరువాత రమణకి చెవిలో చెప్పి పంపించింది. రమణ రాధ దగ్గరికి చేరి "బాబాయి పరీక్ష ఎట్లా రాశావు? బాగా మార్కులు వస్తాయా" అని అడిగాడు. రాధ ఏమీ మాట్లాడలేదు. పుస్తకాలు తెరిచాడు.

ఇంటికి రాగానే శ్రీహరి మళ్లీ అడిగాడు భార్యని "ఎట్లా రాశాడో కనుక్కున్నావా" అని.

"రమణ చేత అడిగించానండి. కాని మాట్లాడలేదు అతను" అంది వరలక్ష్మి నిరుత్సాహంగా.

"ఏం చెప్తాడు? ఎట్లాగైనా లాభంలేదు. లాభంలేని దానికి ఇంత ఒళ్లు పాడుచేసుకొని చదవడమెందుకు? ఈపరీక్షకి మానెయ్యమంటే మంచిదేమో. వచ్చే పరీక్షలకు చదువుతాడు" అన్నాడు శ్రీహరి నీరసంగా.

రాధనుచూసి "ఆరోగ్యం పాడు చేసుకోకు రాధా. జరిగిందేదో జరిగింది. అంత రాత్రివేళ వరకూ చదవకు" అన్నాడు. మానెయ్యమని చెప్పలేకపోయాడు.

రాధ పరీక్షలకు వెళ్ళి వస్తూనే ఉన్నాడు. నిరాశ ఎక్కువ అవుతున్నకొద్దీ పట్టుదలా ఎక్కువఅవుతోంది. ఒక్కొక్క రాత్రి ఒక్కగంటకూడా సరిగా నిద్రపోవడంలేదు. కాని ఇంత విపరీతంగా చదివినకొద్దీ మనస్సు మరికాస్త గజిబిజి అవుతోంది. చాలా మరచిపోతున్నాడు. చివరి పరీక్షరాసి, ఇంటికి వచ్చి చొక్కా విప్పకుండానే అట్లాగే మంచంమీద పడిపోయాడు. అన్నానికి లేవనన్నా లేవలేదు. ఆ పడక పడక మధ్యలో ఒకసారి అవసరం తీర్చుకోవడానికి తప్ప మర్నాటి పొద్దున్న వరకూ లేవలేదు.

## ౧౮

ఈ దెబ్బదెబ్బ రాధ మంచానపడిపోతాడేమోనని అందరూ భయపడ్డారుకాని అతను రెండు రోజుల్లోనే తల్లీ వదినగార్ల సంరక్షణలోనే కోలుకున్నాడు. మంచాన పడింది శ్రీహరే. అతనికి ఒకటే బెంగ. తాను చేయగలిగిందేమీ లేక పోయినా తన నెదుర్కొన్న సమస్యలను గురించి అస్తమానూ ఆలోచిస్తూ ఆందోళన పడిపోతాడు. నెలజీతం రాగానే ముందు ఇంటివారి అద్దె, బకాయీ తీర్చేశాడు. పాలమనిషికీ, పనిమనిషికీ – (వరలక్ష్మి చేసుకోలేక పాత మనిషినే మళ్ళీ పెట్టుకుంది – నాలుగు రూపాయిలకే) ఇచ్చేశాడు. కిరాణా కొట్టుమీద చాలా అప్పుంది. అవతల షావుకారు బాకీ. సుబ్బారావుతో చెప్పకుండా అతను షావుకారు దగ్గరికి తీసు కెళ్ళాడు. "పరవాలేదండీ. ఈ వాయిదాల పద్ధతి మీ సౌకర్యం కోసమే. మాకు ఎట్లాగైతేనేం మూడు నెలలకి మా డబ్బు వడ్డీతో సహా ముట్టాలి" అని చెప్పాడు షావుకారు. బ్రతుకు జీవుడా అనుకొని ఆ నెల షావుకారుకు ఇవ్వదలచిన డబ్బు పట్టుకువెళ్ళి కిరాణా కొట్టుమీదే ఇచ్చేసి ఆ నెలకు సరుకులు తెచ్చాడు. ప్రైవేట్ల డబ్బు చేతిలో పెట్టుకున్నాడు.

కాని అతనిని పెద్దసమస్యపీడిస్తూనే ఉంది. ఈ నెలకాక పోయినా మరో నెలయినా షావుకారు బాకీ తీర్చాలి గదా అంతసొమ్ము అప్పుడెట్లావస్తుంది? కిరాణా కొట్టుమీద ఇంకా

అరువు పూర్తిగా తీరలేదుగదా. ఈనెలతో ప్రైవేట్లుకూడా అయిపోతాయి. మళ్ళీ జూలైవరకూ దొరకవు. అప్పుడెట్లా గడపడం? ఇటుతమ్ముడిమీద ఆశలు పెట్టుకుంటే ఇట్లాఅయింది ఎప్పటికి పాసవుతాడో? ఆపైన ఎప్పటికి ఉద్యోగం దొరుకు తుందో వెంటనే దొరుకుతుందనేముంది? ఇట్లాంటి పరిస్థితిలో రాధకు పెళ్ళిచేస్తే మరోప్రాణి భారం నెత్తిమీద వేసుకోవడము వుతుంది గదా- అసలు రాధ పరీక్ష కానప్పుడు మంచి సంబ ధాలు వస్తాయా అని?

లోపల ఈసమస్యల వేడివల్ల, బయట వేడి గాడ్పులవల్లా అతని నీరసం మరీ ఎక్కువై చివరికి మంచాన పడేసింది. అయినా మొదటిరోజు అట్లాగే ప్రైవేట్లకూ బడికీ వెళ్ళి వచ్చాడు. కాని రెండోరోజున రాధా వరలక్ష్మి అతనిని వెళ్ళనివ్వలేదు. "ఇప్పుడు పరీక్షలురా. ఈసమయంలో వాళ్లని విడిచిపెడితే వాళ్ళేమవుతారు?" అన్నాడు అతను. "నువ్వేం కంగారు పడ కులే, అన్నయ్యా. నేను వెళ్ళి చెపుతానులే" అని చెప్పాడు రాధ. అట్లాగే అన్నగారి ప్రైవేట్లు తనే చెప్పసాగాడు.

ఈ సందడిలో నెలాపదిరోజులు క్రింద సిడదవోలునుంచి వచ్చిన సంబంధంవారు మళ్ళీవచ్చారు. పరీక్షలయ్యాయికదా ఒకసారి పిల్లను చూసి వెళ్ళమని చెప్పారు. శ్రీహరి తమ్ము డినీ భార్యనీ వెళ్ళి చూసి రమ్మన్నాడు. "ఇప్పుడెట్లా వెళ్తాం మీరిట్లా జ్వరంతో పడి ఉంటే" అంది వరలక్ష్మి.

"నాకేమీ పరవాలేదు. ఒకరోజు పని. అమ్మ ఉందికా. పాపం వాళ్ళు తొందర పడుతునారు." అని గొంతుక తగ్గించి

"రేపుపరీక్ష ఫలితాలు తెలుస్తే ఈసంబంధాలు కూడా రావేమో" అన్నాడు శ్రీహరి.

రాధ వరలక్ష్మి వెళ్ళివచ్చారు.

వరలక్ష్మి చెప్పింది. "అన్నీ బాగానే ఉన్నాయికాని పిల అంత నచ్చలేదండి."

"ఏం అంత నీసిగా ఉందేమిటే?" అని అడిగింది అత్త గారు.

"మరీ అంతకురూపి కాదు. నిజానికి తెల్లగానే ఉంది. కాని కన్నూముక్కూ తీరు అంత బాగుండలేదు. మొగంలో కళ లేదు. మల్లీ కళ్లజోడు పెట్టుంది, ఫాషన్లు అన్నీ తెలుసు, స్కూలుఫైనలు పాసయింది. ఏదయితేనేం రాధకు నచ్చనప్పుడు" అంది వరలక్ష్మి.

శ్రీహరి మనస్సులో మరింత ఆలోచన. రాధకు నచ్చిన సంబంధం సులభంగా దొరుకుతుందా? తీరా నచ్చిన సంబంధం వాళ్ళుతగిన కట్నాలూ లాంఛనాలూ ఇస్తారా?

శ్రీహరిక రెండు రోజుల్లో తగ్గవలసిన జ్వరం తగ్గలేదు సరికదా క్రమంగా పెరగనాగింది. పారా టైఫాయిడ్ లోకి మార్చింది. ఇంట్లో అందరూ కంగారుపడడం మొదలు పెట్టారు. రాధ అక్కగారికి ఉత్తరం రాశాడు. ఇరుగు పొరుగులూ, తోడి మాస్టర్లూ వాళ్ళూ వచ్చి చూస్తూన్నారు. రెండు రోజులకి రాజ్యం, భర్తా పిల్లలూ దిగారు. ఈమధ్య రాజ్యం భర్త శ్రీనివాసు కొంత లౌక్యం నేర్చాడు. రాధ దగ్గరనుంచి ఉత్తరం రాగానే తనే ఎక్కడలేని సానుభూతీ చూపి రాజ్యాన్ని తనే

ప్రయాణం చేశాడు. ఇక్కడకు వచ్చిన తరువాత అత్తగారినీ వరలక్ష్మినీ, రాధనీకూడా ఎంతో ఆప్యాయతతో పలకరిస్తున్నాడు. శ్రీహరితో ఏవో కబుర్లు చెపుతూ కాలక్షేపం చేస్తున్నాడు. శ్రీహరి చేతిలో డబ్బు పూర్తిగా అయిపోవచ్చింది. రాజ్యంవాళ్లుకూడా వచ్చారాయె. ఇంకా మందులకీ బత్తాయి పళ్లకీ వాటికీ డబ్బుకావాలి; ఎట్లా? రాధ రామకృష్ణమూర్తిని అడిగాడు. ఆయన చాలా వెనకముందాడుతూ చివరికి ముప్ఫై రూపాయిలిచ్చాడు.

శ్రీహరి జ్వరం తగ్గడం లేదు. డాక్టరు ధైర్యం చెపుతూనే ఉన్నాడుకాని ఇంట్లోవాళ్ళకుధైర్యం చేకూరడంలేదు. రాధా వరలక్ష్మి నిద్రాహారాలు మాని సేవచేస్తున్నారు. కాని ఈజ్వరం వచ్చినప్పటినుంచీ శ్రీహరిలో మార్పు వచ్చినట్లుంది. తమ్ముడు బయట ప్రైవేట్లు చెప్పి, వ్యవహారాలు చూస్తూ వాటికి తోడు వరలక్ష్మితో కలసి అతనిని ఎప్పుడూ జాగ్రత్తగా చూస్తున్నా శ్రీహరి గుర్తించడం లేదు. వాళ్ల సేవకు సంతోషించే బదులు మరింత చిరాకు పడుతున్నాడు. అస్తమానూ అది చెయ్యమనీ ఇది చెయ్యమనీ అంటూ ఉంటాడు. చెప్పిన వెంటనే చెయ్యకపోతే కేకలేస్తున్నాడు. అయినా రాధా వరలక్ష్మి నోరెత్తకుండా అట్లా అతనిని కనిపెట్టుకునే ఉన్నారు.

రెండురోజులు చాలా గాభరా పడ్డారుకూడా. శ్రీహరి రాత్రిళ్లే కాకపగలే పలవరింతలు ప్రేలాపనలూ మొదలెట్టాడు. ఆవేళ రాధ డాక్టరుని అర్ధరాత్రివేళ లేపి తీసుకు వచ్చాడు. డాక్టరు ఇంజక్షను ఇచ్చి "మరీ భయపడకండీ. ఈ ఇంజెక్షను

ఎఫెక్టు (ప్రభావం) చూదాం. చాలా శక్తివంతమైనది ఇచ్చాను, అని వెళ్ళిపోయాడు. సూరమ్మగారూ రాజ్యం శ్రీనివాసూ వెళ్లి పడుకున్నారు. రాధావరలక్ష్మి శ్రీహరి కేసి చూస్తూనే కూర్చున్నారు. ఎప్పుడు పట్టేసిందో వాళ్ళకు తెలియకుండానే నిద్రపట్టేసింది. శ్రీహరి మూలిగినా కదలలేదు. పిలిచినా పలకలేదు. "ఎక్కడ తగలడ్డారు" అంటూ పక్కకు తిరిగి చూశాడు శ్రీహరి. వరలక్ష్మి మంచం కోడు కానుకొని తూగుతోంది. రాధ ఎదురుగా కుర్చీలో కూర్చొని తల వెనక్కి వాల్చి నిద్రపోతున్నాడు. శ్రీహరి గ్లుకోజు నీళ్లు త్రాగుదామని గ్లాసు అందుకోబోయాడు. అది పక్కకు పడిపోయింది. వరలక్ష్మి రాధా ఉలిక్కిపడి లేచి దగ్గరకు పరుగెత్తుకు వచ్చారు, ఏమి కావాలంటూ—

శ్రీహరి చెపితే గ్లూకోజు నీళ్లు ఇచ్చారు.

"ఈరోగంతో మిమ్మల్ని చాలా బాధపెట్టున్నాను పాపిష్టిని" అన్నాడు శ్రీహరి.

వరలక్ష్మి రాధ కేసి భయంగా చూసింది. "మళ్లీ మొదలు పెట్టున్నారు. డాక్టరుని తీసుకువస్తే మంచిదేమో" అంది.

"ఏం మొదలు పెట్టున్నాను?" అన్నాడు శ్రీహరి.

వరలక్ష్మి "నిన్న పగలూ రాత్రి ఎంత పలవరించారు! ఏమిటేమిటో మాట్లాడేశారు. వింటూంటే మాగుండెలదరిపోతున్నాయి. మాట్లాడకుండా పడుకోండి బాబూ పుణ్యముంటుంది" అంది.

"నేను మాట్లాడానా? నాకు తెలియదే" అని ఆశ్చర్యపోయాడు శ్రీహరి. "కాని ఇప్పుడు తెలివిగానే ఉన్నాను. కొంచెం తేలికగా ఉన్నట్లుంది చూడు" అన్నాడు.

వరలక్ష్మి అతని నుదుటిమీదా రొమ్ముమీదా చేయి వేసి చూసింది. రాధనుకూడా చూడమంది. సూరమ్మగారూ రాజ్యంకూడా లేచి వచ్చారు. వీళ్ళ మాటలు విని. "ఏం. ఎట్లా ఉంది" అని కంగారుగా అడిగారు.

"కంగారేమీ లేదు. కొంచెం తేలికగానే ఉన్నారు" అని వరలక్ష్మి వాళ్ళతో చెప్పి భర్తవైపుకు తిరిగి "అయితే కళ్ళుమూసుకు పడుకోండి" అంది కొంచెం తెరిపిగా ఊపిరి పీలుస్తూ.

"నాకింకా నిద్ర రావడంలేదు. మీరు పడుకోండి. నాకోసం నిద్ర చెడగొట్టుకుంటున్నారు" అంటూనే శ్రీహరి మళ్ళీ నిద్రలోకి జారిపోయాడు.

మర్నాడు డాక్టరు చూసి, "క్రైసిస్ (విషమస్థితి) దాటిపోయింది. ఇక రెండుమూడు రోజుల్లో జ్వరం పూర్తిగా తగ్గిపోతుంది" అని చెప్పి మందులకు చీటీ వ్రాసి వెళ్ళిపోయాడు.

మర్నాటికి శ్రీహరికి జ్వరం బాగా తగ్గింది. శ్రీనివాసు తాము ఇంకా ఉండడానికి వీలులేదని చెప్పి జ్వరం తగ్గుతోంది కాబట్టి ఇక వెళ్తామనీ, వెంటనే ఉత్తరం రాస్తూ ఉండమనీ, చెప్పి భార్యనూ పిల్లలనూ తీసుకొని వెళ్ళిపోయాడు.

రెండు రోజులకి శ్రీహరి జ్వరం పూర్తిగా తగ్గిపోయింది నీరసం మాత్రం చాలా హెచ్చుగా ఉంది. డాక్టరు మొదటి రోజున పల్చటి జావ మాత్రమే ఇప్పించాడు. మర్నాడు అన్నం పెట్టిస్తానన్నాడు. ఏమైనా వారం రోజులవరకూ మంచంమీద నుంచి కదలడానికి వీలులేదన్నాడు.

ఇట్లాపనీ పాటా లేకుండా ఆఖరికి పుస్తకాలుకూడా చదువుకోకుండా మంచంమీదపడి రోజంతా ఊరికే ఉండడం చాలా కష్టంగా ఉంది. ఏమి తోచడంలేదు. శ్రీనివాసు ఉన్న న్నాళ్లూ ఏవోకబుర్లు చెప్పేవాడు. అతను లేడు. రాధ అన్న గారితో అంత చనువుగా మాట్లాడలేదు, పైగా బయట పను లతో, ఎండల్లో తిరుగుళ్లతో అతను ఇంటికివచ్చి నీరసంగా పడి ఉంటున్నాడు. వరలక్ష్మికి ఇంటిపనులతో ఖాళీయే లేదాయె. రామకృష్ణమూర్తిగారికి ఆఫీసు. ఇంటివారూ, రామకృష్ణ మూర్తి పొద్దున్నా సాయంత్రం మాత్రం పది నిమిషాలుండి వెళ్తున్నారు. సుబ్బారావు రెండురోజులకొకసారివచ్చి ఓపావు గంట కూర్చొని వెళుతున్నాడు.

పిల్లలే అతనికి కాలక్షేపంగా ఉన్నారు. బాబు ఇప్పుడు బాగా నడుస్తున్నాడు. వాడి నవ్వులూ వచ్చీరాని మాట లూ వింటూంటే శ్రీహరికి ఎంతో ఆనందం కలుగుతోంది. తల్లి చెప్పగా సూర్యావతి తన బొమ్మలు తండ్రికి చూపించి, వాటిని గురించి ఏవేవో కబుర్లుచెప్పి, తండ్రి గదిలోనే వాటిని పెట్టుకొని ఆడుకుంటోంది: రమణకు తండ్రి ఎన్నడూ ఇంత తీరికగా దొరకలేదు. అందువల్ల తండ్రి దగ్గరికిచేరి ప్రశ్నలడుగు

తున్నాడు. వాడి బుర్రలోనుంచి చిత్రవిచిత్రమైన ప్రశ్నలు వస్తున్నాయి. వాటికి ఆశ్చర్యపోతున్నాడు శ్రీహరి. కొన్నిటికి సమాధానం చెప్పలేక పోతున్నాడు. తండ్రి తనమాటలు ఇంత ఓపికగా వింటూండడం వల్ల వాడిలో కబుర్ల వరద కట్టలు తెంచుకుంది. శ్రీహరి వాడి కబుర్లువింటూ నవ్వుకుంటున్నాడు. రమణ తండ్రిని ఏవో కోరుతున్నాడు. శ్రీహరి అట్లాగే చూదాంలే అంటున్నాడు. రామకృష్ణమూర్తి తన పిల్లల కీఇస్తే పట్టాలమీద పరుగెత్తే రైలూ, పెట్టే కొని తెచ్చాడు. పిల్లలకు నడుంవగ్గర నొక్కిపట్టి ఎదర తెల్లని భాగం ఉండే అమెరికను ఫాషను షర్టులూ లాగులూ రెడీమేడ్ డ్రెస్ షాప్‌లో కొని తెచ్చాడు. రమణ రామకృష్ణమూర్తి ఆఖరి కుర్ర వాణ్ణి తనకూడా తీసుకువచ్చి తనతండ్రి ముందర రైలు నడిపించ మన్నాడు. రామకృష్ణమూర్తి కొడుకు పట్టాలు నేలమీద పెట్టి వాటిమీద రైలు పరుగెత్తించాడు. రమణా సూర్యావతీసంతో షంతో చప్పట్లుకొట్టారు. రమణ తండ్రి దగ్గరికి చేరి "నాన్నా నాకుకూడా అట్లాంటి రైలుకొనిపెట్టవూ? అట్లాంటి లాగూ చొక్కాకూడా కొనిపెట్టవూ" అని అడగసాగాడు. "జీతం వచ్చిన తరువాత కొందాములే" అన్నాడు శ్రీహరి. అదిమొదలుకొని "నాన్నా, జీతం ఎప్పుడు వస్తుంది? రైలు ఎప్పుడు కొంటావు?" అని అడుగుతున్నాడు. వాడి పోరు పడ లేక శ్రీహరి రాధతో చెప్పాడు "పట్టాలరైలు చాలా కనీ దవుతుంది. మామూలుగా పరుగెత్తే రైలుబండి కొనిపట్టు కురా" అని. రాధ అట్లాగే కొని తెచ్చాడు. రమణఅది చూసి

కొంచెం ఆశాభంగం చెందాడు "పట్టాలేవీ? వెనకాల పెట్టేది?" అని అడిగాడు. అయినా దానితోనే సంతృప్తి పడ్డాడు. ఇల్లంతా పరుగెత్తిస్తున్నాడు. రామకృష్ణమూర్తి పిల్లలు "ఓస్ అదేం రైలు, పట్టాలు లేందే రైలెట్లా అవుతుంది? మాదే గొప్ప రైలు" అని ఎగతాళి చేస్తే "మీ రైలే గొప్పది. మీ రైలు పట్టాలమీద గుండ్రంగా తిరగవలసిందే. మా రైలు ఎక్కడ బడితే అక్కడ తిరుగుతుంది. సూటిగా ఎక్స్‌ప్రెస్‌లా పరుగెత్తుతుంది" అని జవాబు చెపుతున్నాడు రమణ. వాడి వాదనవిని శ్రీహరి కొంచం బాధపడుతూనే సంతోషిస్తున్నాడు.

శ్రీహరి నాలుగు రోజుల్లో పూర్తిగా కోలుకున్నాడు. కాని అతనికి శాంతిమాత్రం దుర్లభమైపోయింది. రమణకు జ్వరం వచ్చింది. జ్వరం వచ్చిందన్న మాటేకాని వాడు మరింత ఆట లాడుతున్నాడు. వసపోసినపిట్టలా వాగుతున్నాడు. వాడిని మంచంమీద పడుకోబెట్టడమే కష్టమైంది. మామూలు జ్వరమై ఉంటుంది మర్నాటికి తగ్గిపోతుంది అని ఇంటివైద్యమే, మిరియాల కషాయం అదీ ఇచ్చారు. మర్నాటికీ తగ్గకపోయేసరికి డాక్టరుకు చూపించి మందు తెప్పించారు. వాడు అస్తమానూ రామకృష్ణ మూర్తి కొడుకుకు కొన్నలాగూ చొక్కా కావాలంటున్నాడు. శ్రీహరి ఎక్కడనుంచి కొనగలడు? చేతిలో డబ్బులు రామకృష్ణ మూర్తి దగ్గర చేసిన అప్పుకూడా పూర్తిగా అయిపోయాయి. రమణ పదేపదే జ్వరంలో ఒళ్ళు నొప్పులంటూ మూలుగుతూనే ఆదుస్తుల్ని గురించి అడగడంచూసి రాధ చాలా బాధ పడ్డాడు తన స్నేహితుల దగ్గరికి వెళ్ళి అడిగాడు. ఏవళ్ళూ లేదన్న

వా రే. ఒకసుమాత్రం మర్నాటి ప్రొద్దుటికి ఎట్లాగో సంపాదించి పెడ్తానన్నాడు. అట్లాగే మర్నాడు పొద్దున్న రాధ అతనిదగ్గర కు వెళ్ళి ఆడబ్బు తెచ్చి రెడీమేడ్ డ్రెస్ కొట్టుకు పోయి రమణకు సరిపోయేజత ఒకటి తీసుకొని ఇంటికి వచ్చాడు. కాని అప్పటికే రమణస్పృహలో లేడు. ఎన్నోసార్లు పిలవగా, మెల్లగా కదపగా వాడు కళ్ళు కొంచెం తెరిచాడు కాని ఆచూపులో గుర్తింపు లేదు. మళ్ళీ కళ్ళుమూసేశాడు.

డాక్టరుకోసం పరుగెత్తించారు. డాక్టరు వచ్చిచూశాడు. "ఇన్‌ఫ్లూయెంజా. దీనిలో న్యూమోనియా కాంప్లికేషన్ వచ్చింది. ఇప్పటికి ఈమందు వాడండి. ఈ ఇంజక్షన్లు కొనుక్కురండి. కొనుక్కురాగానే నాకు కబురంపించండి. వచ్చి చేస్తాను" అని వెళ్ళిపోయాడు. శ్రీహరి డాక్టరిచ్చిన చీటీ చూసుకున్నాడు. ఆఇంజక్షన్లు కొనాలంటే డబ్బుకావాలి. డబ్బు ఎక్కడనుంచి వస్తుంది? రామకృష్ణమూర్తి అడిగాడు. "మీకు ముప్ఫై రూపాయిలు ఇచ్చానుగదా. దగ్గరదంతా వాడేశాను. ఇప్పుడు నాకే అవస్థగా ఉంది. రెండుమూడు రోజుల్లో జీతం వస్తుంది కాని ఈ రెండుమూడు రోజులూ ఎట్లా గడపాలో బోధపడకుండా ఉంది" అన్నాడు. ఇంటివారిని అడగమని సలహా ఇచ్చాడు. కాని శ్రీహరికి ఇంటివారిని అడగడం ఇష్టం లేదు. ముందు ఇతరత్రా చూసి ఎక్కడా దొరకకపోతే అప్పుడు ఇంటివారి నడుగుదా మనుకున్నాడు. సుబ్బారావు వచ్చాడు. "ఏమిటి శ్రీహరీ మీవాడికి జ్వరం వచ్చిందట" అంటూ. శ్రీహరి డబ్బుకావాలని చెప్పాడు. సుబ్బారావు

ఆలోచించాడు. "ఎక్కడా దొరకదు. లాభంలేదు. ఇంటి వారినడగవలిసిందే – అన్నట్లు ఉండు, మన సుందరరావు లేడూ జల్సారాయుడు. వాడిస్తాడు, రా వెళ్దాం" అని శ్రీహరిని సుందరరావు ఇంటికి తీసుకువెళ్ళాడు. సుందర రావు వెంటనే మున్నూరూపాయలిచ్చాడు. "అంతతొందం రేమీ లేదండి. తీరికగానే వీలుకలిగినప్పుడే, తీర్చండి రోజుకు సిగరెట్లుకిందా, హోటలు బిల్లులకిందా రెండు మూడు రూపాయిలు ఖర్చు పెట్టేవాడికి ఇదొకలెక్కా" అన్నాడు. శ్రీహరి ఆడబ్బుతీసుకొని ఇంటికివచ్చాడు. రాధను డాక్టరును పిలుచుకు రమ్మని పంపాడు.

సమయానికి డాక్టరు ఇంటిదగ్గర లేడు. దగ్గర పల్లెటూరిలో ఏదో కేసువస్తే టాక్సీలో వెళ్ళాడుట మరోగంటకి కాని తిరిగి రాడని చెప్పారన్నాడు రాధ తిరిగి వచ్చి. డాక్టరింటి దగ్గరేఉండి, ఆయన రాగానే వెంటబెట్టుకొని తీసుకు రమ్మని మళ్లీ పంపాడు రాధని శ్రీహరి.

ఇరుగు పొరుగు వాళ్ళూవీళ్ళూ వచ్చి చూస్తున్నారు. అందులో ఒకాయన ఆయుర్వేదం తెలిసి నాడి చూడగల ఆయన. రమణ నాడి చూసి, ఏదో ఆలోచిస్తూ అవతలకు వెళ్లాడు. ఇంటి ఆయన పిల్లవాడి పరిస్థితి ఎట్లా ఉందని ఆయనిని అడిగాడు. పెదవి విరిచాడు ఆవైద్యుడు. ఇంటి ఆయన ఆవైద్యుడితో ఏదో చెప్పాడు. ఆవైద్యుడు వచ్చి రామకృష్ణమూర్తితో చెప్పాడు. రామకృష్ణమూర్తి శ్రీహరితో మెల్లగా చెప్పాడు. శ్రీహరి ఒక్కసారి అదిరి పడ్డాడు. వరలక్ష్మి అదిగ్రహించి

గొల్లుమంది. వైద్యుడూ రామకృష్ణమూర్తీ ఇంటి ఆయనా అన్నారు: "అప్పుడే అయిపోయిందని కాదమ్మా. ఎందుకైనా మంచిదని ముందు జాగ్రత్తకోసం చెప్పాం. నక్షత్రం మంచిది కాదు. కీడెంచి మేలెంచమన్నారు." శ్రీహరి నిరాశ చేసుకొని "మీయిష్టం" అన్నాడు. రామకృష్ణమూర్తే రమణ నెత్తుకొని వీధిలోకి నడిచాడు. వైద్యుడు కూడా ఒకచాపా, బొంతా పట్టుకు వెళ్ళాడు. వరలక్ష్మి, సూరమ్మగారూ కంటికిమింటికీ ఏకధారగా ఏడుస్తూనూడా వెళ్లారు. రామకృష్ణమూర్తీ వైద్యుడూ వీధిలో గేటు బయట చాపా బొంతా పరచి దానిమీద రమణను పడుకోబెట్టారు. శ్రీహరి ఇంట్లోనుంచి రాలేదు. రామకృష్ణమూర్తే అతనిని బలవంతాన బయటకు తీసుకు వచ్చాడు, "మీ వాళ్ళకు కాస్త ధైర్యం చెప్పండి" అంటూ. ఇంటి ఆయన తననౌకరుచేత రమణకూ వరలక్ష్మి వాళ్ళకు ఎండ తగలకుండా పైన బరకం కట్టించాడు.

మరికాసేపటికి డాక్టరు వచ్చాడు. రమణను వీధిలో పెట్టడం చూసి రాధ మూసుకుపోతున్న గొంతుకతో అడిగాడు: "అప్పుడే అయిపోయిందా?" అని "లేదు" అని చెప్పి రామకృష్ణమూర్తి అతనిని పక్కకు తీసుకుపోయి ఏదో చెపుతున్నాడు. రాధ ఏదో గట్టిగా అంటున్నాడు. శ్రీహరి తమ్ముడికేసి గొడవ చేయకు అన్నట్టు చూశాడు. డాక్టరు రమణకు ఇంజక్షను ఇచ్చాడు. వాడు కుంయి కంయి మనలేదు. రాధ దగ్గరికి పరు గెత్తుకు వచ్చాడు. కొద్దిసేపటికి రమణలో కొద్దిగా చలనం కని పించింది. ఒకసారి మూలిగాడు. శ్రీహరి వాళ్ళలో ఆశ తిరిగి

లేచింది. డాక్టరు అన్నాడు: " రియాక్షన్ బాగానే ఉంది. ఇది ఇట్లాగే నిలబడితే ప్రమాదం దాటిపోతుంది, " అని చెప్పి ఒక మందు తీసి నీళ్లలో కలిపించి రమణ గొంతుకలో పోయించాడు. రమణ రొమ్ములకు ఉప్పు కాపడం పెట్టమని చెప్పిమరో గంట తరువాతవచ్చి ఎట్లా ఉన్నదీ తనకు చెప్పమన్నాడు. అవసరమైతే మరో ఇంజక్షను ఇస్తానని చెప్పి వెళ్లాడు. శ్రీహరీ వాళ్ల గుండెలు కొంచెం కుదుటబడ సాగాయి.

కాని మరోగంటకి రమణ గొంతుకలోనుంచి గురక రాసాగింది. డాక్టరుకోసం పరుగెత్తారు. కాని డాక్టరు వచ్చేసరికి అంతా అయిపోయింది. రమణ ఇక లేడు.

## ౧౬

శ్రీహరి తోడి మాష్టర్లు, ఇరుగు పొరుగులూ వచ్చారు. సానుభూతి తెలియజేశారు. వారి రాకపోకలతో ఆవేళ శ్రీహరి వాళ్ళు ఏదో మైకంలో పడ్డట్లు ఉన్నారు. వరలక్ష్మి ఏడుపు మాత్రం వినేవాళ్ళగుండెలు దద్దరిల్లజేసింది. మర్నాడు ఆయింట్లో భయంకరమైన నిశ్శబ్దం— దానిని ఛేదిస్తూ మధ్యమధ్య వరలక్ష్మి సన్నని ఏడుపు. ఇప్పుడు శ్రీహరీ వాళ్ల బాధ మరింత భరింపరానిదిగా మారింది. పైపొంగు తగ్గి, గుండెల్లో గడ్డకట్టి, గిజగిజలాడేటట్లు చేస్తోంది వాళ్లను. శ్రీహరీ వరలక్ష్మీ ఎవ

రెన్ని చెప్పినా ఆరోజుకూడా అన్నంనీరూ ముట్టలేదు. శ్రీహరి ఏమీ కదలిక లేక ఒకమూలపడి ఉంటున్నాడు. రాధ అన్న, వదినలకోసం ఆదుర్దావల్ల తనబాధ కొంత మరచిపోయాడు. వాళ్లను నిత్యకృత్యాలకు పురికొల్పడానికి ప్రయత్నిస్తున్నాడు. రమణను జ్ఞాపకం చేసే పుస్తకాలు, బొమ్మలూ ఇతర వస్తువులూ అన్నీ తీసి దాచేస్తున్నాడు. రమణకి కొన్న రైలు బండితో సూర్యావతి ఆడుతోంది. ఆదృశ్యం చూడలేక రైలుబండి కూడా దాచెయ్య బోయాడు. కాని సూర్యావతిఇవ్వలేదు. రాధ గుంజాడు, కొట్టాడు అయినా సూర్యావతి వదల లేదు. చేసేది లేక రాధ దానిని వదలేశాడు. వదినగారు రమణ బట్టలు చూసుకొని ఏడుస్తూంటే, "ఏమిటిది, వదినా చిన్నపిల్లలా? ఇవన్నీ చూసుకొని ఏడిస్తేమాత్రం ఏం లాభం" అని కోపపడి ఆమె చేతుల్లోనుంచి బలవంతంగా రమణబట్టలన్నీ లాగేసి మూటకట్టి అటకమీద పెట్టేశాడు. ఇన్ని చేసినా రమణ జ్ఞాపకం రాకుండా ఉండడం లేదు. గదులూ గుమ్మాలే వాడిని జ్ఞాపకం చేస్తున్నాయి. ఇప్పటికీ రమణ ఎక్కడో ఉన్నట్లూ, సినిమా పాటలుపాడుకుంటూ గంతులేస్తూ ఇంటిలోకి వస్తాడేమోనని పిస్తోంది. వాడి ఆటలూ, చదువులూ, బడిలోవాడి నాటకం, ప్రైజులుపొందడం, రాజ్యం పిల్లలతో పేచీలోనూ, సపోటా కాయలవ్యవహారంలోనూ వాడు దెబ్బలుతినడం—ఆదృశ్యాలన్నీ వాళ్ల మనస్సులో పదేపదే మెదులుతూ కలచి వేస్తున్నాయి.

రెండురోజులలో రాజ్యం శ్రీనివాసూ వచ్చారు. వరలక్ష్మి అన్నలుకూడా వచ్చారు. లోపలబాధ పైకి చెప్పకో

గలగడంవల్ల శ్రీహరి వాళ్ళకు కొంత ఊరట. వరలక్ష్మి అన్నలు ఆమెను తీసుకొనివెళ్లి నాలుగు రోజులుంచుకొని పంపి స్తామన్నారు. మొదట్లో వరలక్ష్మి వెళ్లడానికి ఒప్పుకోలేదు. రాధ, రాజ్యం బలవంతం చేసి ఆమెను అన్నగార్లతో పంపిం చారు. రాజ్యం వాళ్లుకూడా వెళ్లిపోయారు.

ఇప్పుడు శ్రీహరి బలవంతంమీద నాలుగు మెతుకులు తింటున్నాడుకాని మిగతా అప్పుడంతా యథాప్రకారంగా కుర్చీలోనో, మంచంమీదో కంట తడిపెట్టుకుంటూ, బాహ్య ప్రపంచానికి సంబంధం లేకుండా పడిఉంటున్నాడు. రాధకు చాలా భయంగా ఉంది. మొన్ననే జబ్బుపడ్డవాడు ఈ బెంగవల్ల ఏమవుతాడో అని అతని ఆదుర్దా. అన్నగారిని మామూలు ప్రపంచలోకి తిరిగి తీసుకు రావటం ఎట్లాగో అతనికి తెలియడం లేదు. సమయానికి ఇంటి ఆయన రామలింగంగారూ, ప్రక్క ఆయన రామకృష్ణమూర్తిగారూ అతనికి సాయపడ్డారు.

ఆఊళ్లోకి ఒకస్వాములవారు వచ్చారు. ఆరోజు మొదలు కొని నెలరోజులవరకు భగవద్గీతోపన్యాసా లిస్తారట. ఆయన ఇదివరకు ఒకమారు వచ్చాడు. అప్పుడు ఇట్లాగే ఉపన్యాసాలి చ్చాడు. ఆయన ఉపన్యాసాలు చాలా బాగుంటాయిట. రామ లింగంగారూ, రామకృష్ణమూర్తిగారు మనస్సుకు శాంతి లభి స్తుందని ఎట్లాగో శ్రీహరిని ఒప్పించి ఉపన్యాసానికి తీసుకు పోయారు. శ్రీహరి ఉపన్యాసం శ్రద్ధగా విన్నాడు. ఉపన్యాస మైన తరువాత రామలింగంగారు శ్రీహరిని స్వాములవారి దగ్గ రకు తీసుకుపోయి అతనికి వచ్చిన కష్టం తెలియజేశారు. స్వాము లవారు కొంతసేపు శ్రీహరితో మాట్లాడారు. ఈజగత్తులో

మనమందరమూ ప్రయాణీకులమేనని, ఎప్పుడో అప్పుడు విడి పోక తప్పదనీ, తమ తమ గమ్యస్థానాలను బట్టి ముందూ వెనకా ప్రయాణాలు అయిపోతూంటాయనీ, మనకంటికి తోచేదల్లా కేవలం మాయఅనీ, అది పరివర్తనశీలమూ, క్షణభంగురమూ అనీ దానివెనుక మార్పుచెందని శాశ్వత వస్తువు ఉందనీ, ఈజీ వాత్మలన్నీ ఆ ఒకే ఒకపరమాత్మలో అంశాలుమాత్రమేననీ, ఇది తెలుసుకున్నవారు జనన మరణాల లీలనుకూడా అర్థం చేసు కొని సుఖదుఃఖాలకతీతులు కాగలరనీ తెలియ జెప్పారు. శ్రీహరిని దుఃఖం పోగొట్టుకొని ఈజన్మ సాగినంతకాలం నిరం తరం సత్యంకోసం అన్వేషిస్తూ, నిష్కామకర్మ చేస్తూ ఉండమని సలహా ఇచ్చారు. తనదగ్గర ఉన్న భగవద్గీత తెలుగు వ్యాఖ్యా నంతో ఉన్న ఒకప్రతి శ్రీహరికి ప్రసాదించారు. రోజూకొంత సేపు భగవద్గీత పారాయణం చేస్తూ, సహస్రగాయత్రి జపించి కొంతసేపు ధ్యానంలో గడపమని చెప్పారు. శ్రీహరి స్వాముల వారిదగ్గర సెలవు తీసుకొని ఇంటికి వచ్చాడు.

మర్నాడు పొద్దున్నే నాలుగు గంటలకు లేచాడు. స్నానంచేసి విభూతి, కుంకం పెట్టుకొని, పట్టు పంచ కట్టుకొని, భగవద్గీత పారాయణం చేయసాగాడు. అరగంట తరువాత కళ్లుమూసుకొని గాయత్రీ జపంచేసి కొంతసేపు ధ్యానంలో గడిపాడు. ఇదంతా అయ్యేటప్పటికి వెలుగువచ్చింది. ఇన్నాళ్లూ ముట్టని స్కూలుపని తిరిగి ప్రారంభించాడు. రాధ అన్నగారి ముఖంలోకి చూశాడు. అపూర్వమైన ప్రశాంతత కనిపించింది.

రాధకు కొంత ఊరట కలిగింది. కాని చిత్రమేమిటంటే ఇప్పుడు అన్నాగారికి శాంతి లభిస్తే అతనికి శాంతి లేకుండా పోయింది. ఇన్నాళ్లూ అన్నగారిని గురించి ఆదుర్దాలో తన బాధను గురించి తలుచుకోవడానికి అతని మనస్సుకు తీరిక లేకపోయింది. ఇప్పుడా తీరిక వచ్చింది. అతనిలో అణిగి ఉన్న ఆ వేదనంతా ఒక్కసారి పెల్లువలా పైకిఉబికింది. రమణ స్మృతులెన్నో అతనిని కలచివేస్తున్నాయి. బాధకోర్వలేక తల్ల డిల్లి పోతున్నాడు. ఇంట్లో ఉండలేక ఊళ్లోకి బయలుదేరాడు. అక్కడా బాధ మరచిపోయే బదులు మరింత ఉద్విగ్నత చెందు తున్నాడు. బజారులో జనం సరదాగా కబుర్లు చెప్పుకుంటూ పోతున్నారు. హోటళ్లు ఖాళీ లేవు, దుకాణాలు ఖాళీ లేవు. లౌడు స్పీకర్లలోనుంచి సినిమా పాటలు గింగురు మంటున్నాయి. పడుచువాళ్లు సైకిళ్ల మీద హుషారుగాపోతున్నారు. నవ్వులు వినవస్తున్నాయి. ఇదంతా చూస్తూంటే రాధలోకోపం మరింత ప్రజ్వరిల్ల సాగింది. 'రాతి గుండె ప్రపంచం! దీనినంతా తగల బెట్టేస్తే బాగుండున'నుకుంటున్నాడు.

రాధస్నేహితులు అతన్ని చూసి 'హల్లో రాధా' అంటూ అతని దగ్గరికి వచ్చి అతని మొగంచూసి స్తంభించిపో తున్నారు. "మారమణ — మాఅన్నయ్యకొడుకు పోయాడు. నామనస్సు ఏమీ బాగాలేదు" అని కదిలి పోతున్నాడు రాధ.

బజారులో ఒకచోట సుబ్బారావు తారసిల్లాడు. "ఏమ య్యా రాధాకృష్ణమూర్తీ, మీఅన్నయ్య రేపైనా బడికి వస్తాడా? నిన్నా మొన్నా నాకు రావటానికి వీలులేకపోయింది.

వీలైతే ఈసాయంత్రం వస్తాను. మీఅన్నయ్యకు కాస్త ధైర్యం చెప్పు. ఎంతకాలం దుఃఖిస్తే మాత్రం ఏమి ప్రయోజనం?" అని సుబ్బారావు అంటూంటే.

"మా అన్నయ్య రేపటినుంచి బడికి వస్తాడనుకుంటూనండి మాఅన్నయ్య మనస్సుకు కొంత శాంతి లభించినట్లు తోస్తోంది నాకు" అన్నాడు రాధ

"ఆఁ! అయితే ఎట్లా లభించింది?" అని అడిగాడు సుబ్బారావు రాధకూడా నడుస్తూ.

రాధ చెప్పాడు.

"పోనీలే ఏదోవిధంగా మనశ్శాంతి లభించింది. అదే చాలు. మనస్సుకు సమాధానం కుదరకపోతె బ్రతకడమే భారమైపోతుంది" అన్నాడు సుబ్బారావు. ఒక బీడీముట్టిస్తూ.

"మా అన్నయ్యకు మనశ్శాంతి లభించినట్లుంది కాని ఇప్పుడు నాకు లేకుండాపోయింది" అన్నాడు రాధ నిట్టూరుస్తూ.

"నీవుకూడా భగవద్గీతోపన్యాసాలకు వెళ్ళలేకపోయావు? ఆయన ఉపన్యాసాలు బాగానే ఉంటాయి. వెనకటిసారి వచ్చినప్పుడు నేనూ విన్నాను" అన్నాడు సుబ్బారావు.

రాధతల అడ్డంగా ఊపాడు. "నాకావిధంగా శాంతిలభిస్తుందని నమ్మకంలేదు. దేహం అశాశ్వతమనీ, ఆత్మకు నాశనం లేదనీ ఎప్పుడూ వింటున్నదే కదా. అది నిజమే కావచ్చు కాని రమణ శరీరం మాత్రమే నశించిందనీ, ఆత్మనశించలేదనీ కాబట్టి దుఃఖించ వలసిన పని లేదంటేమాత్రం బాధపడకుండా ఎట్లా

ఉండగలను? రమణమీదమేము ఎన్నో పెద్ద ఆశలు పెట్టుకున్నాము. నిజంగా వాడు పెరిగి పెద్దవాడై యుంటే చాలాగొప్పవాడయి ఉండేవాడని నాకు గట్టినమ్మకం. అట్లాంటివాడు ఇట్లా మొగ్గలోనే తుంచివేయబడడం ఏదోఅన్యాయ-మనిపిస్తోంది. వాడెందుకు బ్రతకకూడదు? వాడేపాపం చేశాడు? — ఇదేప్రశ్న నామనస్సును వేధిస్తోంది. తలచుకుంటున్న కొద్దీ బాధ ఎక్కువైపోతోంది. పోనీ తలచుకోకుండా ఉందామంటే మనస్సు లొంగడంలేదు.ఎట్లా ఈబాధనుంచి తప్పించుకోవడం?'' అని అడిగాడు రాధ కళ్ళనీళ్ళతో.

''కాలమే మాన్పుతుంది ఎంతటి బాధనైనా'' అన్నాడు సుబ్బారావు. ''కాని అది దీర్ఘచికిత్స. ఇంకొక ఉపాయం ఉంది. ఏదైనా మహోద్యమంలో కాని, పెద్దపనిలో కాని మనము లీనమైపోతే బాధను త్వరగా మరచిపోగలం. దేశసేవ వంటి వాటిలో లీనమైనవారు చూడు, కష్టాలనైనా తట్టుకో గలుగుతూంటారు సామాన్యంగా —''

''అయితే సన్న్యాసం చేయమంటారు? ఏపార్టీలోనైనా చేరమంటారా?''

''చెప్తాను. ఇక్కడ కాదు. అట్లా ఆతోటలోకి పోయి కూర్చుందాం'' అని సుబ్బారావు రాధను కొంచెం దూరంలో ఉన్న తోటలోకి తీసుకు వెళ్ళాడు. ఇద్దరూ వీలైన స్థలం చూసుకొని కూర్చున్నారు.

సుబ్బారావు ఇంకోబీడీ ముట్టించి, రెండు గుక్కలుపీల్చి వదలి, చెప్పడం మొదలుపెట్టాడు: ''చూడు నన్ను అందరూ

కమ్యూనిస్టంటారు. నువ్వుకూడా ఆవేళ నేను కమ్యూనిజం పేరెత్తేసరికి కమ్యూనిస్టనిలెక్క కట్టేశావుకాదూ. నిజానికి నాకు కమ్యూనిస్టు పార్టీతో ఏ సంబంధమూ లేదు. కమ్యూనిస్టు సాహిత్యంకూడా ఏమీ చదవలేదు. మామూలుగా పేపరు చదివే వాడికి కమ్యూనిజం గురించి ఏం తెలుస్తుందో నాకూ అంతే తెలుసు. అటువంటివాడిని తరుచు కమ్యూనిజం వస్తే మంచిదని ఎందుకంటానంటే అన్యాయంతోనూ పర పీడనతోనూ కూడిన ఈసమాజంమీద కోపంవల్లా కమ్యూనిజంలో ఇట్లాటివేమీ ఉండవని ఓ అభిప్రాయం వల్లా కమ్యూనిజం ఒక ఆదర్శంగా మాత్రమే చెప్తాను. అందరూ స్వర్గం కావాలని కోరుకుంటారు. స్వర్గంవస్తే ఏ బాధలూ బాదరబందీ ఉండవనీ, అంతా ఆనందమయంగా ఉంటుందనీ అనుకుంటారు చూడు, అట్లాగే నన్నమాట. నిజానికి స్వర్గమనేది ఉండకపోవచ్చు. అట్లాగే అసలు కమ్యూనిజం వస్తే నేననుకున్నది కాకపోవచ్చు. అప్పుడుకూడా ఒక అసంతృప్తి పోయి మరొక అసంతృప్తి ఏర్పడవచ్చు. ఇటువంటివాడిని పార్టీలలో చేరడాన్ని గురించి నీకేం సలహా ఇవ్వగలను చెప్పు? చేరితే చేరవచ్చు. అదినీకు నువ్వు వెనకా ముందూ బాగాఆలోచించుకొని నిదానంమీద నిర్ణయం చేసుకోవలసిన విషయం హఠాత్తుగా ఆవేశంతో తేల్చుకునేదికాదు——"

అని ఒక నిముషమాగి మళ్ళీ అన్నాడు సుబ్బారావు:"ఈ పార్టీలపట్లకూడా నాకో అసంతృప్తి ఉంది, రాధకృష్ణమూర్తి, అవి అన్నీ ఇంచుమించు రొటీన్ వ్యవహారాల్లోను ఎత్తులకు పైఎత్తుల్లోను పడిపోయి విప్లవస్ఫూర్తిని కోల్పోయాయి

గాంధీగారి కాలంలోచూడు ఆయన ఒకసందేశమిచ్చాడంటే దేశంలోని ప్రజలు ఉత్తేజితులైపోయి దేనికైనా సిద్ధపడి ముందుకు వచ్చేవారు. అటువంటి మహోద్యమాలు నడిపే శక్తి ఇప్పుడు ఏపార్టీకీఉన్నట్లు తోచదు. మహోద్యమం రావాలంటే ప్రజలలోచైతన్యం రావాలి. ఆలోచన రేకెత్తించాలి. అందుకే మనం ప్రయత్నించాలి. ప్రతివాడూ తన సంగతే ఆలోచిస్తూఉంటే అంతాభగవల్లీలగా, విధివ్రాతలా తోస్తుంది. అటువంటివాడు ప్రవాహంలో పుడకలా అప్పుడప్పుడు మునుగుతూంటాడు అప్పుడప్పుడు తేలుతూంటాడు. ఎక్కడికో ఎందుకో తెలుసుకోకుండా కొట్టుకుపోతూ ఉంటాడు. కాని ప్రతివాడూ తనస్వల్ప వ్యక్తిగత పరిధిని దాటి సమాజంలోని వ్యక్తులందరి దృష్టితో ఆలోచించడం మొదలుపెట్టితే అంతవరకూ మాయాజాలంలా ఉన్న సమాజపు నడక కొంత స్పష్టపడుతుంది. ఇప్పుడు జరుగుతున్న అన్యాయానికీ పరపీడనకీ మూలకారణాలు బోధపడతాయి. అప్పుడు విప్లవం సులభంగా వచ్చేస్తుంది. కావలసిందల్లా ప్రతివాడూ కేవలం తనదృష్టితోనే ఆలోచించుకోకుండా అందరి దృష్టితోనూ ఆలోచించాలి. ప్రజలలో ఈ ఆలోచన రేకెత్తించే పనికే నిన్ను పూనుకోమని చెపుతున్నాను. ఇంతపెద్దపని నేను చేయగలనా అంటావేమో నీశక్తినిబట్టే ఎంతవరకూ సాధ్యమైతే అంతవరకే చెయ్యి. నువ్వు చదువుకున్నవాడివి. సమాజపు సమస్యలను గురించి బాగా చదువు, ఆలోచించు. వ్యాసాలూ పుస్తకాలు రాయి.

ప్రజలను ఆలోచించేటట్లు చేయి. నేను ఇంతకబుర్లు చెపుతున్నాను. నేనేం జేస్తున్నానని అంటావేమో — నాలో ఈశక్తి లేదని ఇదివరకే చెప్పానుగదా. పైగా నామాట వినేవారు చాలా తక్కువ. లోపల ఆవేదనమాత్రముంది. అందుకే ఎప్పుడైనా తీరికవేళ నామాట కాస్త వినేవాడులా ఎవరైనా కనిపిస్తే చాలు. వాడిముందు వెళ్లగక్కుతాను. — ఏం నామాటలు విసుగు పుట్టిస్తున్నాయా? చెప్పు. అసలే బాధపడుతున్నవాడిని మరింత బాధపెట్టడం ఇష్టంలేదు. చెప్పు. వెళ్లిపోదాం."

"లేదు. మీమాటలు వింటూంటే నాబాధ కొంత మరచిపోతున్నాను. చెప్పండి" అన్నాడు రాధ.

ఇప్పుడు నీసమస్యే తీసుకుందాం. మీ అన్నయ్య కొడుకు పోవడం ఏదో అన్యాయంలా తోస్తోంది కాదూనీకు? రామాయణంలో ఒక కథ ఎప్పుడైనా విన్నావా? రాములవారు పద్నాలుగేళ్లు వనవాసం చేసి, రావణుణ్ణి సంహరించి, సీతతో కలిసి అయోధ్యకు తిరిగివచ్చి, రాజ్యంచేస్తూండగా ఒకనాడు ఒకచిన్న పిల్లవాడు చచ్చిపోయాడట. ఆపిల్లవాడి తండ్రి కొడుకు శవం తీసుకొని రాములవారి దగ్గరికి వచ్చి ఆయన మీదే పిల్లవాడి చావుకు బాధ్యత మోపాడట—"

"అవును కథ విన్నాను. దానికి కారణం శంబూకుడనే శూద్రుడు తనకులానికి కూడని తపస్సు చేయడమే కారణమని శ్రీరాముడు తెలుసుకున్నాడని శంబూకుణ్ణి వధించి, పిల్లవాడిని తిరిగి బ్రతికించాడని చెపుతారు—"

"శంబూకవధ వృత్తాంతమైనా కాక పోయినా, రామరాజ్యం అనే ఆదర్శంలో శిశుమరణాలనేవి జరగకూడదని కూడా ఉందని తెలుస్తోంది గదా. అంటే అటువంటివి సంభవిస్తే రాజు బాధ్యత వహించవలసి ఉంటుందని కూడా ఆనాడు భావించేవారన్నమాట. రాములవారిని ఆపిల్లవాడి తండ్రి అడిగినట్లు నువ్వు మాత్రం ఈనాడు ఈ సమాజాన్ని ఎందుకు అడగకూడదు? – సమాజం ఎందుకు అంటున్నానంటే ప్రభుత్వం సమాజంలో ఒక అంగం మాత్రమే. కాబట్టి అంతిమంగా బాధ్యత సమాజానిదే. అదేమిటి, జనన మరణాలమీద మన కేమధికారముంది, పిల్లలు చచ్చిపోతే దానికెవరేం చేయగలరు అనవచ్చు కాని ఇప్పుడు జరుగుతున్న మరణాలన్నీ జాగ్రత్తగా పరీక్షచేసి తెలుసుకుంటే ఇప్పటి మానవుడి శక్తి జ్ఞానాలను బట్టి వాటిలో సగానికి సగమేనా జరగకుండా ఆపుచేయ వచ్చునంటాను. పడమటి దేశాలలో పరిస్థితు లెట్లాఉంటాయి చెప్పు" అని అడిగాడు సుబ్బారావు.

"ఆదేశాలలో శిశుమరణాలు మనదేశంతో పోల్చి చూస్తే చాలా తక్కువ ఉంటాయ" న్నాడు రాధ.

"మరి అక్కడలేని పరిస్థితి ఇక్కడ ఎందుకుండాలి? డాక్టరు నడుగు, పిల్లవాడు ఆరోగ్యంగా పెరిగి పెద్దవాడు కావాలంటే వాడికెటువంటి తిండి కావాలో, ఎటువంటి పరిస్థితులు కావాలో, మన పిల్లలకీ పాలూ, పళ్లూ, కాడ్ లివర్ ఆయిల్ వంటివాటితో మంచి తిండి పెట్టూ, శుభ్రంగా ఉంచుతూ, మధ్యమధ్య డాక్టరుచేత పరీక్ష చేయించి తగు జాగ్రత్తలు తీసు

కొంటూంటే మనపిల్లలూ ఆరోగ్యంగానే ఉంటారు. రోగాలు వచ్చినా సులభంగా లొంగిపోక తట్టుకోగలుగుతారు. ఇవన్నీ మనం చేయవచ్చుకూ. కాని చేయలేక పోతున్నాం. కారణం ఈ సమాజం దేనిమీద ఆధారపడి ఉందో ఆడబ్బు మనచేతిలో చాలినంత ఉండదు కాబట్టి. ఒకవైపున ఒకడు వైద్యం చేయించ చక పిల్లవాడు చస్తూంటే కూడా చూస్తూ ఊరుకోవలసి ఉంటూండగా మరోవైపు మరొకడు తనకూతురు పెళ్ళికని పదివేలు బాణసంచా కాల్చడం, ఇద్దరు ముగ్గురుండడం కోసం రెండులక్షలమేడ కట్టడం అన్యాయం కాదూ? వ్యాపారంలో లాభాలార్జిస్తూ, మెడలూ మిద్దెలూ కట్టే లక్షాధికారి ఎవరో క్షత్రాడు చచ్చిపోతే నాకేం బాధ్యత, చేతనైతే ఆపిల్లవాడి తండ్రిని కూడా ఆర్జించి పిల్లలను సుఖపెట్టమనండి, నేనడ్డం పెట్టను, అంతగా కావలసి వస్తే నేనుకొంచెం దానధర్మాలు చేస్తానను వచ్చు. కాని అతను ఈసమాజంవల్లే తాను లక్షాధికారి కాగలుగుతున్నానని మరచిపోతున్నాడు. ఈ సమాజం ఆస్తుల పెంపకాన్ని అనుమతిస్తోంది కాబట్టే లక్షాధికారులూ ఏర్పడుతున్నారు; భిక్షాధికారులూ ఏర్పడుతున్నారు. రేపు సమాజం సొంత ఆస్తులు పెంచివేయడాన్ని అనుమతించక, సమాజంకోసం మనిషి చేసే కృషి విలువనుబట్టే ప్రతిఫలం ఇవ్వడం మొదలుపెడితే పరిస్థితులు వేరుగా ఉంటాయి. కాని మనం ఈ ఆస్తిపరుల సమాజానికి అలవాటు పడ్డాం. అందువల్ల ఆస్తుల పద్ధతి సృష్ట్యాది నుంచీ ఉన్నట్లుగా, దానిని తొలగించడం అపచారమన్నట్లుగా భావిస్తాం. ఒకనాడు రాజులులేని సమాజం ఊహిం

చడం కష్టంగా ఉండేది. అరాజకం మహాపాపంగా ఎంచేవారు. ఇప్పుడేమి చేస్తున్నాం? ఆ రాజుల్ని తీసిపారేయలేదూ? అట్లాగే ఆస్తులవ్యవస్థా తీసేయవచ్చు. సమాజంలో మార్పు రావాలి. సమాజం ఈ తీరుగా ఉన్నంత వరకూ ఈ అన్యాయాలు ఇట్లా జరుగుతూనే ఉంటాయి. ఇదేనయ్యా, రాధాకృష్ణమూర్తీ, నీముందు నేను పెట్టున్న సమస్య. ఆలోచించు. మంచిదని తోస్తే నేను చెప్పిన పనికి పూనుకో. నువ్వు కొంత త్యాగం చేయవలసి ఉంటుంది. తప్పదు. అందరూ పలకీ ఎక్కే వాళ్ళే అయితే మోసే బోయిలెవరు? నువ్విప్పుడు బాధలో ఉన్నావు. బాధే ఒక్కొక్కప్పుడు మనిషిని మార్చేస్తుంది. బాధ చాలా మందిని కుంగదీసేస్తే కొందరిని గొప్ప సంకల్పానికి పురికొల్పు తుంది. ఈవిధంగానే గొప్పనాయకులు తయారయ్యేది. నువ్వు కూడా రేపు ఒక గొప్ప నాయకుడి వవుతావేమో ఎవరు చెప్ప గలరు?" అన్నాడు సుబ్బారావు.

రాధ మెల్లగా తల అడ్డంగా ఊపాడు. "అట్లాంటి పెద్ద ఆశలేమీ పెట్టుకోకండి. నేనేమీ పెట్టుకోను. కాని నేను మీరు చెప్పిన విధంగానే నాశక్తి కొలదీ కృషి చేస్తాను. సమాజంలో మార్పు తేవడానికి సాగే సమరంలో ఒక సిపాయినను ఉంటాను" అన్నాడు.

అట్లాగే ఆవేళనుంచి రాధ లైబ్రరీలకి వెళ్ళి చరిత్ర, సాంఘిక విజ్ఞానం, ఆర్థిక విజ్ఞానం రాజనీతికి సంబంధించిన అనేక పుస్తకాలు చదవడం మొదలు పెట్టాడు. నోట్సు రాసుకుంటు న్నాడు. మధ్యమధ్య సుబ్బారావు కనిపిస్తే అతనితో తను తెలు

సుకున్న విషయాలను గురించి చెపుతున్నాడు; చర్చిస్తున్నాడు. అతనిలో ఒక కొత్త ఉత్సాహం, ఒక కొత్త ఆవేశం పొంగి పడుతోంది. లోపలి బాధ కొంత మరచి పోగలిగాడు. అస్త మానూ పుస్తకాలలో లీనమై ఉంటున్నాడు. అతను ఏమి చేస్తున్నదీ పట్టించుకునేవారు ఇప్పుడు ఎవరూ లేరు. శ్రీహరికి సెలవు లిచ్చేశారు. పరీక్ష పేపర్లు దిద్దడంవంటి కార్యకలాపా లన్నీ యథావిధిగా సాగిస్తున్నాడు. నాలుగు రోజులకు వరలక్ష్మి తిరిగి వచ్చింది. శ్రీహరి ఆమెనుకూడా స్వాములవారి దర్శనా నికి తీసుకు వెళ్లాడు. ఆమెలోకూడా భక్తిశ్రద్ధలు పొంగి వచ్చాయి. ఆమెకూడా ఇప్పుడు రోజూ విధిగా పూజ చేస్తోంది. పూజ చేస్తేనేకాని వడ్డనపని చూడడంలేదు. సాయంత్రం భర్తతో, అత్తగారితో, ఇరుగుపొరుగులతో కలసి స్వాముల వారి సభలకు వెళ్తోంది.

రాధ మనస్సులో కొత్త ఆలోచన లొక కొలికికి వస్తు న్నాయి. ప్రథమ ప్రయత్నంగా ఒక వ్యాసం రాశాడు. సుబ్బా రావుకు చూపించాడు. సుబ్బారావు కనుబొమలు అరంగుళం పైకి లేచాయి. వ్యాసం పేరు 'ఆస్తి ఒక విధమైన దొంగ సొత్తే' అని ఉంది. వ్యాసం ఈవిధంగా ప్రారంభమైంది: "అనాది నుంచీ దొంగతనం ఒకశిక్షార్హమైన నేరంగా భావించబడుతూ వచ్చింది. ఈభావనను ఈనాడెవడైనాప్రశ్నిస్తే పిచ్చివాడికింద జమకట్టబడతాడు. అంత పాతుకుపోయి ఉంది ఈ అభిప్రాయం. కాని కాలం మారుతోంది. దానితో బాటు సమాజపు విలు వలు కూడా మారు తూంటాయి. ఒక నాడు వడ్డీతీసుకోవడం

చాలా చెడ్డదిగా ఎంచబడేది. కాని ఈనాడు అది ఒప్పు గానే భావించ బడుతోంది. ఒకనాడు మనిషికి ముగ్గురు భార్యలున్నా తప్పులేదు. ఈనాడో శిక్షార్హమైన నేరం. అటువంటప్పుడు ఎంత సామాన్యమైన అభిప్రాయాన్నైనా ప్రశ్నించడంలో అనౌచిత్యం లేదు. దొంగతనం ఎందుకు చేయ కూడదు? పాపం కాబట్టి అంటారు. పాపం ఎందుచేత? పరాయి సొత్తును హరించడం అన్యాయం కాబట్టి అంటారు. ఈనాడు మనమెరిగిన లక్షాధికారులూ కోటీశ్వరుల ఆస్తులు పరాయిసొమ్ము ముట్టుకోకుండానే వచ్చినవా? అవి అన్నీ వారి సొంత శ్రమల ఫలమేనా? కాదని తేటతెల్లమే అవుతోంది. మరి ఈఆస్తుల పెరుగుదల ఒకవిధమైన దొంగతనం కాదూ? కాని సమాజం వాటిని దొంగతనంగా భావించడంలేదు కాబట్టి గౌరవనీయంగా చలామణీ అవుతున్నాయి. అంటే సమాజం ఆమోదముద్ర కనక పడితే చెడ్డదే మంచిదై పోతుందని మాట. ఒకనాడు రాజ్యాలెట్లా బయలుదేరాయి? కాస్త బలమున్న వాడూ తెగించిన వాడూ కత్తీ కర్రా పుచ్చుకొని, ఇంకో నలుగురిని తోడు చేసుకొని, పది మందినీ హడలకొట్టి, వాళ్ల దగ్గర డబ్బు వసూలు చేసి అధికారం చలాయిస్తే రాజు. ఆరాజే మరో పది ఊళ్లు జయిస్తే మహారాజు. తరువాత రాజులు దైవాంశ సంభూతులనీ, ధర్మరక్షకులనీ, ప్రజారక్షకులనీ సమర్థనలు వచ్చాయి. అంటే సమాజం ప్రజాభక్షకుల్ని ప్రజారక్షకులుగా ఆమోద ముద్ర వేసిందన్నమాట. తరువాత వాళ్లలో చాలామంది నిజమైన ప్రజా రక్షకులై తే కావచ్చు. కాని రాచరికపు ఉద్భవం గురించి

నేను చెప్పిన దానిని వ్యతిరేకించే వారు ఎక్కువమంది ఉండరనుకుంటాను. అందుకే మనమీనాడు అప్రజార(భ)తుకుల్ని తొలగించేశాం. అట్లాగే గౌరవనీయమైన ముసుగు కింద ఇతరుల శ్రమ ఫలాన్ని భుక్తం చేసుకనే వారిని కూడా—"

సుబ్బారావు పెదవి విరిచాడు. "ఇట్లారాస్తే లాభం లేదోయి. ఎవరూ చదవరు" అన్నాడు.

"ఎందుకు చదువరు? చదివి తీరుతారు. దృష్టినాకర్షించి తీరుతుంది వ్యాసం" అన్నాడు రాధ అమితమైన ఆత్మ విశ్వాసంతో.

"ముందు పత్రికల వాళ్ళు వేసుకోవద్దూ?"

"ఎందుకు వేసుకోరు? ఒకరు కాకపోతే మరొక పత్రిక వాళ్ళకి పంపుతాను. ఎవళ్ళో ఒకళ్ళు ప్రచురించకుండా ఉండరు"

"ఏమైనా మనం ప్రజలలో ఆలోచన రేకెత్తించాలనుకున్నప్పుడు వాళ్ళకు సౌమ్యంగా నచ్చజెప్పే విధంగా ఉండాలి. లేకపోతే ముందే కోపం వచ్చి అసలు చదవడం మానేస్తారు—" అని సుబ్బారావు అంటుండగా, "ఏం నేను రాసినది నిజం కాదంటావా?" అని అడిగాడు రాధ.

"నిజం కాదని నేననడం లేదు. కాని విధవని [illegible] ముండ అని పిలిస్తే ఎట్లా ఉంటుంది? అట్లాగే ఉంటుంది ఇక్కడ కూడా. నేనెందుకిట్లా చెపుతున్నానంటే ఈ పెట్టుబడి దారీ సమాజంలో ప్రతి వాడికీ కొద్దో గొప్పో సొంత ఆస్తి ఎర చూపించ బడుతోంది—"

"ఔననుకోండి. కాని చూడండి మొద్దు నిద్రపోయే వాణ్ణి ఎట్లా లేపడం? మొగంమీద చన్నీళ్ళు చల్లవలసి ఉంటుంది. ప్రజలలో స్తబ్ధత్వంపోయి చురుకు పుట్టాలంటే ఇట్లాంటి రచనలే కావాలి" అన్నాడు రాధ ధీమాగా.

"సరే ప్రయత్నించి చూడు అన్నాడు సుబ్బారావు చిరునవ్వుతో. "కాని చివరి వరకూ ఈఉత్సాహామే నువ్వు నిలుపుకుంటే అంతకన్న ఏమీ అక్కరలేదు."

## ౨౦

శ్రీహరికి పరీక్షల పేపర్లుకూడా దిద్ది ఇచ్చివేయడమై పోయింది. ఇప్పుడతనికి కావలసినంత తీరిక. కొద్దిగా వేసవి ప్రైవేట్లు దొరికాయి. వాటికిపోగా మిగతాసమయం భగవద్గీత పఠనంలోనూ, పురాణాది గ్రంథాలు చదవడంలోనూ గడుపు తున్నాడు. సాయంత్రం స్వాములవారి ఉపన్యాసాలకు ముందు పరుగెత్తుతున్నాడు.

రాధ తన వ్యాసం ఒక పత్రికకు పోస్టుచేశాడు. ఎప్పుడు పత్రికలో పడుతుందా అని ఎదురు చూడసాగాడు. పత్రికలో పడిన తరువాత అన్నయ్యకూ స్నేహితులకీ చూపించి, వాళ్ళ నాశ్చర్యంలో ముంచెత్తాలనుకున్నాడు. నాలుగు రోజులకు అతని వ్యాసం అతనికి తిరిగి వచ్చింది. కొంతసేపు అతని బుర్ర పని

చేయలేదు. తిరిగి వస్తుందేమో అని అతను కొంత భయపడు తూనే ఉన్నాడుకాని ఇంత త్వరగా వస్తుందనుకో లేదు. వ్యాసం పూర్తిగా చదవకుండానే తిప్పి పంపేసి ఉంటారని మాట! పత్రికల వాళ్ళమీద అతనికి అమితమైన కోపం వచ్చింది. వాళ్ళే అతని కంటిముందు ఉంటే భస్మమై పోయేవారే. పత్రికలు నడిపించేది ఎవరు? పెట్టుబడిదారులు కాదూ? వాళ్ళు ఇటువంటి వ్యాసాలు వేస్తారా తన వెర్రికానీ? అతను నిరాశలో మునిగి పోయాడు. ఆవేళ లైబ్రరీకి వెళ్ళలేక పోయాడు.

మర్నాడు అతను నిరాశనుంచి కొంచెం కోలుకున్నాడు. సుబ్బారావు చెప్పినమాటలు జ్ఞాపకం చేసుకున్నాడు. రెండు రోజులు కూర్చొని వ్యాసం మార్చి సౌమ్యంగా రాశాడు. పేరు 'ఆస్తి వ్యవస్థ—ఒక పరిశీలన' అని పెట్టాడు. ఈమారు మరొక పత్రికకు పంపాడు. మళ్ళీ తన అధ్యయనం సాగించాడు. ఈ మారు మొదటి ధీమాలేదు. పొంగులేదు. ఈసారి వ్యాసం తప్పక పత్రికలో పడుతుందనుకున్నాడు. కాని పదిరోజులకు అతని వ్యాసం వెనక్కి వచ్చేసరికి అతను పూర్తిగా నిరాశలో మునిగి పోయాడు. ఆత్మ విశ్వాసం సడలి పోయింది. ఇటువంటి పరిస్థితులలో తనేమి చేయగలడు? ఎవరైనా ఏమి చేయగలరు? ప్రజలు ఆలోచించే వాళ్ళే అయితే ఇప్పటికే ఎన్నో గ్రంథాలున్నాయి. మహానుభావులు అన్ని సమస్యలు కూలంకషంగా చర్చించి వదిలారు. మార్గం చూపించి ఉన్నారు. వాళ్ళను మించి తనేమి కొత్తసిద్ధాంతాలు ప్రతిపాదించగలడు? రాధ నిరాశతో లైబ్రరీకి వెళ్ళడం మానేశాడు. పుస్తకం ముట్ట డానికి

కూడా అతని మనస్సు ఒప్పడం లేదు. ఇంటి దగ్గరే కూర్చుండి పోయి తన ఆశాభంగాన్ని గురించీ, అశక్తతను గురించి తలపోస్తూ ఉండిపోతున్నాడు.

మర్నాడు రామకృష్ణమూర్తి శ్రీహరిని కేకేశాడు: "ఏమండోయి శ్రీహరిగారూ, పేపరులో బి. ఏ.బి.కాం. రిజల్టు పడ్డాయిట. ఎవడో కుర్రాడు పేపరు పుచ్చుకొని పరుగెత్తుతున్నాడు. మీ తమ్ముడి నంబరు నాకు జ్ఞాపకం లేదు. లేకపోతే చూద్దును. మీ తమ్ముడింట్లోనే ఉన్నాడా? అయితే వెళ్ళి రిజల్ట్సు చూసి రమ్మనండి" అన్నాడు.

రాధ కదలలేదు. అతనికి తెలుసు పేపరులో తన నంబరు ఉండదని. రాధ కదలకపోవడం చూసి శ్రీహరి ఎట్లాగైనా లాభం లేదని ఊరుకున్నాడు. మరి కాసేపటికి ఇంటివారికి పేపరు వచ్చింది. ఇంటి వారబ్బాయి మేడమీద కూర్చొని పేపరు చదువుతుండగా చూసి రామకృష్ణమూర్తి రిజల్ట్సు పేజీమాత్రం తెమ్మని కొడుకును పంపించి తెప్పించాడు. ఆ కాగితం పుచ్చుకొని శ్రీహరి వాటాలోనికి నడిచి, "ఏమోయి రాధాకృష్ణమూర్తీ, నీ నంబరు చెప్పు" అన్నాడు. రాధ తన కేమీ పట్టనట్టుగా కూర్చున్న చోటినుంచి కదలకుండానే రుబంన చెప్పాడు. రామకృష్ణమూర్తి నంబరు చూశాడు. "ఇదేమిటోయ్, నువ్వు పాసయితేనే!" అన్నాడు. రాధ ఒక్క గంతులో పేపరు అందుకున్నాడు. అవునన్నయ్యా, పాసయ్యాను' అని కాగితం అన్నగారికి అందిచ్చాడు. శ్రీహరి నంబరు చూసి "అమ్మా, రాధ పరీక్ష పాసయ్యాడు" అని కేకేశాడు. వరలక్ష్మీ, సూరమ్మగారూ పరుగెత్తుకువచ్చారు.

సూరమ్మగారు "నాతండ్రి పాసయ్యాడూ? భగవంతుడి దయవల్ల ఈగట్టెక్కాం. ఎంతభయపెట్టేశాడూ వాడు పాసవడని" అంటూ కొడుకు దగ్గర చతికిల బడింది. "నా నాయనే ఉంటే బాబయ్య పాసయ్యాడని ఎంత గంతులు వేసునో" అని మెల్లగా అనుకొంటూ కంటతడిపెట్టూ లోపలికి వెళ్ళిపోయింది వరలక్ష్మి.

ఇంటివారు కూడా అటువచ్చారు. రామకృష్ణమూర్తి వాళ్ళకు వార్త చెప్పాడు. వాళ్ళు అన్నారు: "బాగుంది. ఇన్నాళ్ళూ పడ్డకృషికి ఫలితం దక్కింది. ఇక తమ్ముడికి ఉద్యోగ ప్రయత్నంలో పడాలి శ్రీహరిగారూ" అన్నారు.

ఇక రోజూ 'హిందూ' చూస్తూ ఉండవోయి, రాధాకృష్ణమూర్తీ. కనిపించిన అడ్వర్టయిజ్ మెంటుకల్లా దరఖాస్తు పడెయ్యి" అన్నాడు రామకృష్ణమూర్తి.

తమ్ముడు పాసవడంలో శ్రీహరిలో మళ్ళీ కొంచెం చైతన్యం వచ్చింది. రామకృష్ణమూర్తీ, ఇంటివారూ పదేపదే చెప్పడంవల్ల అతను తమ్ముడికి ఉద్యోగం విషయం ప్రయత్నాలు చేయసాగాడు. తమ్ముడిచేత దరఖాస్తులు పెట్టిస్తున్నాడు. మొదటి దరఖాస్తు పెట్టేటప్పుడు రాధకొంచెం వెనుకముందాడాడు మనస్సులో. తన 'సమరం' ఏమయినట్టు? ఇప్పుడతనికి లైబ్రరీ కేసే వెళ్ళబుద్ధి వేయడం లేదు. ఉద్యోగం చేయాలనే సరదా మెల్లగా అతనిని ఆకర్షించడం మొదలు పెట్టింది. సుబ్బారావు ఎక్కడైనా కనిపిస్తే తప్పించుకు తిరుగు

తున్నాడు. "అప్పుడే ఉద్యోగం వచ్చికూర్చుందేమిటి? అంతగా వస్తే అప్పుడే ఆలోచించుకోవచ్చు– చేరడమో మానడమో. ముందు ప్రయత్నం మానెయ్యడ మెందుకు? " అని తన్ను తాను సమర్థించుకుంటున్నాడు. అన్నగారు చెప్పినట్లు దరఖాస్తులు పెట్టున్నాడు. ఇంటర్వ్యూలకు కూడా వెళ్లివస్తున్నాడు. పోనుపోను శ్రీహరికి తమ్ముడి ఉద్యోగాన్వేషణలో ఉత్సాహ మొచ్చింది. అస్తమానూ ఆ ఆలోచనలోనే పడిఉంటున్నాడు. వాళ్లనీ వీళ్లనీ కలుసుకొని వస్తున్నాడు. ప్రయత్నం చేస్తున్న కొద్దీ ఉద్యోగం సంపాదించడంలో ఉన్న కష్టాలు అతనికి అవగతం కాసాగాయి. ఇంటర్వ్యూలు కేవలం తతంగమనీ, పలుకుబడే ముఖ్యమనీ చాలామంది చెప్పారు.అయినా ఇబ్బందు లెదురౌతున్న కొద్దీ శ్రీహరిలో పట్టుదల ఎక్కువైంది. ఈసందడిలో పెళ్లి సంబంధాల గొడవ ఒకటి. నిడదవోలు సంబంధం వారు మళ్ళీ వచ్చారు. "మరోచోట ప్రయత్నం చేసుకోండి" అని పంపించేశాడు శ్రీహరి. ఇంకా ఏవో సంబంధాలు వస్తే తమ్ముడిని పంపిస్తున్నాడు. కాని అవి నచ్చడంలేదు.

ఒకరోజు వచ్చిన ఉత్తరం చూసి శ్రీహరి ఎగిరి గంతేసినంతపని చేశాడు. భార్యను కేకేశాడు "రాధకు ఉద్యోగం వచ్చింది. అమ్మతో చెప్పు అని. సూరమ్మగారు ఉరుకుకుంటూ వచ్చింది. మాట్లాడలేక ఆనంద బాష్పాలు రాలుస్తూ నుంచుంది. రామకృష్ణమూర్తి, ఇంటివారూకూడ వచ్చారు "ఈవూళ్లోనే ఉద్యోగం లైఫ్ ఇన్స్యూరెన్సు కార్పొరేషన్ ఆఫీసులో, నెలకు సుమారు నూటయాభై వస్తుంది" అని చెప్పాడు

శ్రీహరి. మరి కాసేపటికి రాధ ఇంట్లోకి రాగా " ఒరేయి రాధా, నీకు ఉద్యోగం వచ్చిందోయి" అని శ్రీహరి ఉత్తరం అతని చేతిలో పెట్టాడు. రాధ ఉత్తరం చూసుకున్నాడు. అతని కళ్లలో సంతోషం, గర్వం స్పష్టంగా తొణికిస లాడాయి. లోపల ఒకసారి మనసు పీకింది తాను సుబ్బారావు ముందు చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చి. అయినా ఉద్యోగంలో చేరాడు.

మర్నాడు అతనికి సుబ్బారావు కనిపించాడు. " ఏమోయి. ఈమధ్యన కనిపించనే లేదు. పరీక్ష పాసయ్యావుట. అప్పుడే ఉద్యోగం కూడా సంపాదించేశావుట. మీఅన్నయ్య చెప్పాడు" అన్నాడు చిరునవ్వుతో.

"అవునండీ, నాకంతగా ఇష్టం లేకపోయినా, మాఅన్నయ్యా వాళ్ళకోసం చేరవలసివచ్చింది" అన్నాడు రాధ సంజాయిషీ చెప్పు కుంటున్నట్టుగా.

సుబ్బారావు కొన్ని క్షణాలు నేలకేసిచూసి, తల ఊపుతూ " అవునులే. మీఅన్నయ్యా వాళ్లు నీమీద ఎంతో ఆశ పెట్టుకున్నారు. వాళ్ల ఆశ నెరవేర్చవలసిందే, మరి వస్తాను " అని మెల్లగా వెళ్లిపోయాడు.

రాధ ఉద్యోగంలో చేరి నాలుగురోజులు పోయేసరికి కొత్త జీవితానికి అలవాటు పడిపోయాడు. చాలా ఉత్సాహంగా ఉంటోంది అతనికి. మొదటి నెల జీతం రాగానే వదినగారి చేతిలో పెట్టాడు. ఆమె అది పట్టుకు వెళ్లి దేవుడి మందిరం ముందు పెట్టి పూజచేసి తరువాత డబ్బు పైకి తీసింది.

రాధకు మళ్లీ సంబంధాలు వస్తున్నాయి. రాధే చూసి వస్తున్నాడు. కాని ఏదీ సంతృప్తినివ్వడంలేదు. నిడదవోలు సంబంధం వాళ్లు ఆశ వదులుకోలేదు. ఇంకా రాధకోసం ప్రయత్నం చేస్తూనే ఉన్నారు. తెలిసిన బంధువులద్వారా చెప్పించసాగారు. ఇప్పుడు మరో ఐదువందలు పెంచి మొత్తం మూడు వేల ఐదువందలు కట్నం ఇస్తామనీ, పెళ్లికొడుక్కి రేడియో, సైకిలూ, వాచీ ఇస్తామనీ, ఆడబడుచుకి నూటపదహార్లు లాంఛనం ఇస్తామనీ, ఇతర లాంఛనాలన్నీ తీరుస్తామనీ ఆశపెట్టారు. కట్నం సొమ్ము ముందే ఇస్తామన్నారు. వాళ్లుపెట్టిన ఆశకు శ్రీహరి వాళ్లు మెత్తబడసాగారు. రాధమాత్రం త్వరగా మెత్తబడలేదు. కాని పదేపదే ఒత్తిడి చేయడం వల్లా, సైకిలూ రేడియో వాచీ తలచుకొని అతనుకూడా లొంగిపోయి ఊఁ అన్నాడు. నెలరోజుల్లో ముహూర్తం నిర్ణయించారు.

* * * * * * *

పెళ్లిరోజులు సమీపిస్తున్నాయి. ఇప్పుడున్న ఇల్లు బాగుండ లేదనుకున్నారు శ్రీహరి వరలక్ష్మి. రాధకూడా ఇప్పుడు ఉద్యోగం చేస్తున్నాడు. రేపు అతని భార్య వస్తుంది కాబట్టి తమ ఇద్దరి సంపాదాలకి కలిపి ముప్ఫైఅయిదు రూపాయలకు మరొక ఇంట్లో ఒక మంచి వాటా తీసుకొని అందులోకి మారారు.

పెళ్లికి పదిరోజులు ముందే రాజ్యం భర్తా వచ్చారు. ఇంకా మరికొందరు దగ్గరి చుట్టాలు వచ్చారు. పెళ్లి పనులు

సాగుతున్నాయి. ఆడపెళ్లి వారు ముందే కట్నం ఇచ్చి వెళ్లారు. అదిపెట్టి శ్రీహరి పెళ్లికూతురుకి నాలుగుపేటల గొలుసు చేయించాడు. నూటపాతిక పెట్టి ఒకటీ, ఏభైరూపాయిలు పెట్టి మరొకటీ చీరలు కొన్నాడు. రాధ బలవంతం మీద వరలక్ష్మి తనకుకూడా ఒకగాజుల జత చేయించుకుంది. రాజ్యం, వరలక్ష్మి, పిల్లలూ కొత్తబట్టలు కొనుక్కున్నారు. శ్రీనివాసు బజారు పనుల్లో బావగారికి చాలా సాయపడుతున్నాడు. శ్రీహరి పెళ్లివారం రోజులుందనగా బడికి సెలవు పెట్టేశాడు. శుభలేఖలు అచ్చయ్యాయి. బంధువులందరికీ పంపారు. ఊళ్లో వాళ్లకి పంచి పెట్టున్నారు. తనతోడి మాష్టర్లకి తనే పంచి పెడ్తానని శ్రీహరి కొన్ని తీసుకొని వెళ్లాడు.

ముందు సుబ్బారావు ఇంటికి వెళ్ళాడు. సుబ్బారావు ఇంటివద్దే ఉన్నాడు. లోపల ఎదురుగానే కుర్చీలో కూర్చొని ఉన్నాడు. శ్రీహరినిచూసి కదలలేదు. శ్రీహరి సందేహిస్తూ లోపలికి నడిచాడు. ఆగదిలోనే ఒకపక్క నేలమీద చాప పర చుకొని సుబ్బారావు భార్య పడుకొని వెక్కి వెక్కి ఏడుస్తోంది. పిల్లలు ఆమెచుట్టూ చేరి కూర్చున్నారు. ఈదృశ్యం చూసి శ్రీహరి స్తంభించిపోయాడు.

సుబ్బారావు తలెత్తి శ్రీహరికేసి చూశాడు. అతని కళ్ళ నుంచి కన్నీరు ధార కట్తోంది. శ్రీహరి అతని పక్కన ఉన్న మంచంమీద కూర్చొని మెల్లగా అడిగాడు: "ఏమిటిది? ఇట్లా ఉన్నావేం, సుబ్బారావు?"

సుబ్బారావు నిట్టూరుస్తూ "నీకింకా తెలియదా?" అన్నాడు.

"తెలియదే ఏమిటది?"

"అవును. నువ్వు నాలుగురోజులనుంచీ బడికి రావడం లేదు కాదూ — మా రెండోవాడు నిన్న పొద్దున్న మమ్మల్ని విడిచి పెట్టేశాడు శ్రీహరీ" అని పంచకొంగు నోటికి అడ్డు పెట్టుకున్నాడు సుబ్బారావు.

శ్రీహరి ఒక్కసారి అదిరిపడ్డాడు. "అయ్యో! నాకు తెలియనే లేదే! ఏమిటీ కష్టాలు!" అన్నాడు తనలోపల దాగిఉన్న బాధాకరమైన స్మృతులు కూడా పైకిరాగా తల్లడిలుతూ.

సుబ్బారావు భార్య వెక్కి వెక్కి పడుతూనే మధ్య మధ్య కొడుకుని గురించి ఏమిటో చెప్పుకుంటోంది.

కొంతసేపున్న తరువాత సుబ్బారావే అన్నాడు: "నీకు చెప్పానుకా మా ఆశలన్నీ మా రెండో వాడిమీదే పెట్టుకున్నామనీ, వాడు చాలా తెలివైన వాడనీ. వాడినే పొట్టన బెట్టుకుంది చావు. ఇప్పుడు నాకంతా అంధకారం అయిపోయింది. ఈ బ్రతుకులో ఆసక్తి చచ్చిపోయింది. అయినా నేను చచ్చిపోను. బ్రతుకుతాను. మిగిలిన వాళ్ళకోసం బ్రతికి తీరాలి—వాడికి సరియైన వైద్యం చేయించలేకపోయాను శ్రీహరీ వాడి ఆరోగ్యం అంత మంచిది కాదు. జబ్బుపడినప్పుడల్లా అప్పటి కప్పుడు ఏదో వైద్యం చేయించడం, తరువాత బలానికి మంచి

టానిక్కులూ అవీ ఇవ్వాలనుకోవడం, తీరావాడు కాస్త చులాగ్గా తిరిగేసరికి వాటివిషయంలో అశ్రద్ధచేయడం జరిగింది. ఆ అశ్రద్ధే ఇలా కొంపముంచింది. ఈసారీ జ్వరంవస్తే ఎప్పటి లాగే అనుకొని, మొదట ఏదోనాటు వైద్యం చేయించాను. చివరికి కంగారు పడి డాక్టరును పెట్టాను కాని చేయిదాటిపో యింది.—నావంటి వాళ్ళ జీవితంలో కష్టాలేరాసి ఉన్నాయి కాబోలు! మాగతి ఇట్లా ఎందుకుండాలి! మేముకూడా బ్రతక డానికి నోచుకోలేదా అంటే సమాజంబాగా ఉన్నవాళ్ళను చూపిస్తుంది. వాళ్ళలాగే పైకి రావడానికి ప్రయత్నం చేయు మంటుంది. కాని నేనెంత ప్రయత్నం చేసినా పైకి రాలేకపోతు న్నాను. అంతకంతకు అగాధంలో పడిపోతున్నాను. ఈప్రపం చంలో అన్ని సుఖాపేక్షలూ వదులుకున్నాను శ్రీహరీ. చావ లేక బ్రతుకున్నాను. అంతే.—సరే, నాఏడుపుకథ నీదగ్గర ఎందు కులే. నువ్వు గట్టునపడ్డావు. ఇక నీకు పరవాలేదనుకుంటాను. మీతమ్ముడు పెళ్ళటగా. ఎప్పుడు?"

శ్రీహరి తేరుకొని శుభలేఖ తీసి సుబ్బారావు కిచ్చాడు. "నామనస్సు పాడైపోయింది, సుబ్బారావు, " అన్నాడు.

"ఎవరి కష్టాల్ని ఎవరు తీర్చగలరు, శ్రీహరీ. సరే వెళ్ళిరా. నేను పెళ్ళికి రాలేను. గృహప్రవేశానికి రావడానికి ప్రయత్నిస్తాను" అన్నాడు సుబ్బారావు.

శ్రీహరి మెల్లగా అతనిదగ్గర సెలవు తీసుకొని బయలు దేరాడు. అతని మనస్సు అల్లకల్లోలమై పోయింది. ఇంటిదారి

పట్టి, సగంలో మిగిలిన శుభ లేఖలు ఇచ్చి రాకపోతే ఎట్లా అని, ఎవరికి అందజేయాలో వాళ్ళకు అందజేసి ఇంటికి చేరుకున్నాడు.

ఇంటికి చేరగానే వరలక్ష్మి ఓమూలా, రాజ్యం ఓమూలా శ్రీనివాసు ఓమూలా చుట్టుముట్టి పెళ్లి ఏర్పాట్లు గురించి మాట్లాడుతుండగా శ్రీహరి తన ఆలోచనలు మరచి పోయి పెళ్లి హడావుడిలో పడ్డాడు.

మర్నాడు పెళ్లివారు నిడదవోలు తరలి వెళ్లారు. రాధ పెళ్లి చాలా బాగానే జరిగింది.

## ౨౧

గృహప్రవేశం, మనుగుడుపులు వగైరా తంతులన్నీ కూడా పూర్తి అయ్యాయి. తరువాత లెక్క చూసుకుంటే రాధకిచ్చిన కట్నంలో వెయ్యిరూపాయిలు మాత్రం మిగిలాయి. శ్రీహరి ఆడబ్బు తమ్ముడిపేర బాంకులో వేశాడు. శ్రీహరీ వరలక్ష్మి తామిప్పుడు ఒడ్డెక్కినట్లే భావించుకుంటున్నారు. ఇప్పుడు రాధ బాధ్యత తీరిపోయిందికదా. అతనే సంపాదిస్తున్నాడు — బాగానే సంపాదిస్తున్నాడు కూడా. అయినప్పుడు తమకు పెద్ద ఇబ్బందులేమీ రావలసిన పనిలేదు. తామొకనాడు కలలుగన్న చక్కని సొంత ఇల్లు కాకపోయినా ఇప్పుడు ఇదివరకటికన్న విశాలమూ శుభ్రమూ అయిన అద్దెవాటాలో

ఉంటున్నారు. ఎలక్ట్రిసిటీ ఉంది. రాధమామగారు ఇచ్చిన రేడియోకూడా ఉంది. రేడియో ఆనందం ఇప్పుడు వాళ్లు పూర్తిగా అనుభవిస్తున్నారు. పొద్దున్నే కాలకృత్యాలు తీర్చుకొని, భగవద్గీతపారాయణ. సహస్రగాయత్రీ జపంకూడా చేసి భక్తిరంజనీ వార్తలూ విన్నతరువాత శ్రీహరి ప్రైవేట్లకు వెళ్లిపోతు న్నాడు. అప్పటికి రాధ తయారై వచ్చి సిలన్ ట్యూన్ చేస్తాడు. ఎనిమిదింటికి ఇంగ్లీషువార్తలు వింటాడు. మధ్యాహ్నం అన్ని పనులూ తీరికచేసుకొని వరలక్ష్మి, అత్తగారూ మహిళా కార్యక్రమాలూ ఎంతో శ్రద్ధగా వింటారు. రాత్రిళ్లు నాటకాలూ, పాటకచేరీలూ, హరికథలూ ఏవీ పోగొట్టు కోవటం లేదు. పిల్లల కార్యక్రమాలు పెట్టకపోతే సూర్యావతి ఊరుకోదు శ్రీహరి ఇప్పుడు మళ్లీ బి. ఏ. చదువు ప్రారంభించాడు.

రాధపని చాలాబాగుంది. మంచి బట్టలు కుట్టించు కున్నాడు. కొత్తసైకిలుమీద హుషారుగా ఆఫీసుకు వెళ్ళిపో తున్నాడు. సాయంత్రం స్నేహితుల్ని కలుసుకొని, ఆలస్యంగా ఇంటికి చేరుకున్నాడు. వీలైనన్ని సినిమాలు చూసేస్తున్నాడు. శ్రీహరి ఇదిచూసి 'అనుభవించనీ, ఇప్పుడుకాకపోతేమరెప్పుడు అనుభవిస్తాడు' అని చిరునవ్వుతో ఊరుకుంటున్నాడు.

రాధకు తెలిసింది సుబ్బారావు రెండోకొడుకు పోయాడని. వెళ్ళి పరామర్శ చేసి రావాలనుకున్నాడు కాని సుబ్బారావును చూడడానికి అతనికి మొగం చెల్లలేదు. సుబ్బారావు గృహప్రవేశానికి రాలేదు. ఇప్పుడాట్టే బజారులో కనిపించడం లేదుకూడా. ఆఖరికి ఒకరోజు రాధ వెళ్ళకపోతే బాగుండదని

తెగించి సుబ్బారావు ఇంటికి వెళ్ళేడు. సుబ్బారావు ఎక్కువగా మాట్లాడలేదు. ఇతను ఇదివరకు అతిగా మాట్లాడేవాడనీ, రాజకీయాల మీదా, ఆర్థిక విషయాలమీదా పెద్దచర్చలు చేసే వాడంటే ఇప్పుడు నమ్మడం కష్టంగా ఉంటుంది. అంత మార్పు వచ్చింది అతనిలో. చేతికందిబోయిన కొడుకు చేయి జారిపోవడం జీవితంలో మరేదీ వంగదీయనంతగా అతనిని వంగ దీసేసింది. బ్రతకక తప్పదుకాబట్టి బ్రతుకుతున్నాడు. పనిచేయక తప్పదుకాబట్టి పనిచేస్తున్నాడు. కొద్దిసేపుండి రాధవచ్చేశాడు. అతని మనస్సులో బాధ నిండిపోయింది. బాధ మరచిపో యేందుకు తిన్నగా సినిమాకు వెళ్ళిపోయాడు. మర్నాటికి మామూలు వాడైపోయాడు.

శ్రావణమాసం వెళ్ళగానే రాధ భార్య ఇందిరను కాపు రానికి తీసుకువచ్చాడు. ఇందిర వచ్చిన తరువాత ఆయింటికి ఒకకొత్త కళ వచ్చినట్లుంది. రాధ మొదట్లో నచ్చలేదని తోసే సిన ఆ ఇందిరంటేనే ఇప్పుడు మురిసి పోతున్నాడు. ఇందిర అంద కత్తె కాదుకాని పోకులు చేయడం ఆమెకు బాగా తెలుసు. మొగానికి స్నోరాసుకొని, తేలికగా పౌడరద్దుకొని, కళ్ళకు కాటుక దిద్ది, కళ్ళకొలికి గీతలూ ఇటూ అటూ ఒక అరంగుళం పెంచి, కొన్ని ముంగురులు మొగంమీద పడేటట్లు చేసుకొని, బంగారు ఫ్రేము కళ్ళజోడు పెట్టుకుంటే వరలక్ష్మికూడా అను కుంటోంది: 'ఇందిర బాగానే ఉందే. అప్పుడెందు కనుకున్నానో బాగాలేదని. శుభ్రమైన సంబంధం పోగొట్టేసి ఉందును. ఏదో అదృష్టవశాత్తూ మళ్లీ వచ్చింది కానీ,నాఅందానికి తోడు ఇంకో

కరికి వంక పెట్టబోయాను' అని. భార్య అలంకరించుకు రాగా, రాధ ఆమె మొగంకేసి ఆసక్తితో చూస్తూ ఉండిపోతున్నాడు. ఇందిర గర్వంతో కూడిన చిరునవ్వుతో అతని దగ్గర చేరి అతనికాలరు సరిగా లేకపోతే సర్దుతుంది. అతను భోజనం చేసి ఆఫీసుకు వెళ్ళబోయేముందు అతని చొక్కాకు బొత్తాములు పెట్టి, తమలపాకులు కిళ్ళీ చుట్టి అతని నోటిలో పెట్టుతుంది. సాయంత్రం అతని రాకకోసం ఎదురుచూస్తుంది. రాధకు సాయంత్రం భార్యకు మల్లెపూలు తెచ్చి ఇవ్వాలని సరదా. ఎవరేమనుకుంటారోనని సంకోచం. చివరికి ఒక ఉపాయంతోచి మల్లెపూలు తెచ్చి వదినగారికిచ్చాడు. "ఇదేమిటోయ్ నాకెందుకు? ఇవ్వవలసిన వాళ్ళకియ్యి" అంది వరలక్ష్మి నవ్వుతూ. "కాదులే నువ్వుతీసుకొని కొన్ని ఇయ్యి" అన్నాడు రాధ. "ఎవరికి?" అని అడిగింది వరలక్ష్మి నవ్వుతూ. రాధ మాట్లాడలేదు. వరలక్ష్మి మల్లెపూల పొట్లం అతని చేతిలోపెట్టి "నువ్వేపట్టుకెళ్ళి ఇయ్యి" అంది. "పోనీ ముందునీకు కావలసినవి తీసుకో" అన్నాడురాధ. "ఊహుఁ, ముందు అక్కడ ఇయ్యి" అని నవ్వి వెనక్కి వెళ్ళిపోయింది వరలక్ష్మి. రాధ పూలు పట్టుకు వెళ్ళి భార్యకు సమర్పించాడు. ఆమెకొన్ని పూలు పట్టుకు వెళ్ళి వరలక్ష్మి కిచ్చింది. మిగిలినవి దారానికి గుచ్చి పట్టుకు వచ్చి, రాధ దగ్గర నిలబడింది. ఏమిటన్నట్లు చూశాడు రాధ. మల్లెచెండు అతని చేతిలో పెట్టి, చిరునవ్వుతో అదోలా చూసి వెనక్కి తిరిగింది. రాధ ఆమెతలలో మల్లెపూలదండ పెట్టాడు........ ఇందిర రావడం వరలక్ష్మికి ఎంతో

సంతోషంగా ఉంది. శ్రీహరి రాధా పదిగంటలకు వెళ్ళిపో యిన తరువాత, భోజనాలుచేసి, పనులు ముగించుకొని ఇద్దరూ కబుర్లలో పడుతున్నారు. సూరమ్మగారుకూడా ఈచదువుకున్న కొత్తకోడలంటే పొంగిపోతూ వారిద్దరికబుర్లూ ఆసక్తితో వింటోంది. ఇందిర తనఊరి విశేషాలన్నీ చెపితే, వరలక్ష్మి ఈ ఊరి విశేషాలు చెపుతోంది. చెప్పుకుంటున్న కొద్దీ ఊరివస్తున్నాయి వాళ్ళ కబుర్లు. పిల్లలుకూడా పిన్నీ పిన్నీ అంటూ ఇందిరను పట్టుకొని పాకులాడుతున్నారు. రాధఅప్పుడే భార్యతోబాటు ఇంట్లెల్లపాదినీ రెండుసార్లు సినిమాకు తీసుకువెళ్లాడు.

పదిరోజులకు ఈ ముచ్చట్లూ అచ్చట్లూ కొంత తగ్గి ఇంట్లోవారు మామూలు దారిన బడ్డారు. పడడమే కాదు. పానకంలో అక్కడక్కడ మిరియపు పలుకు లున్నట్లుగా తెలుసుకోగలిగారు. పోనుపోను మిరియపు ఘాటే ఎక్కువ కానాగింది కూడా. దీనిప్రభావం ముఖ్యంగా వరలక్ష్మి ఇందిరల మధ్య సంబంధాలమీద పడింది. వరలక్ష్మి ఎంతో మొలకువతోనే వ్యవహరిస్తోంది. రెంపిచ్చూటలా వంటా, ఇంటిచాకిరీ అంతా తనే చేస్తోంది. ఇందిరకు పెందరాళే లేచే అలవాటులేదు. లేవగానే కాఫీకావాలి. శ్రీహరి ఇంట్లో ఎవళ్లకూ కాఫీ అలవాటు లేదు. అయినా వరలక్ష్మి ఇందిర లేచి మొగం కడుక్కునే టప్పటికి కాఫీ సిద్ధంగా ఉంచుతోంది. ఇందిర పోనీ తను తాగి ఊరుకోదు. భర్త దగ్గరకు వెళ్లి "మీరు కూడా కొంచెంతాగండి" అని బలవంతంచేసి తాగిస్తోంది. మొదట్లో రాధ భార్య ముచ్చటకోసం కొన్నాళ్లు తాగాడు. ఇందిరకొంచెం సూర్యవతికి

కూడాపోస్తోంది. కొన్నాళ్లు ఊరుకున్నతరువాత వరలక్ష్మి 'వద్దు ఇందిరా, దానికి అలవాటు చేయకు లేనిపోనిది" అంది. రాధ కూడాతనకు వద్దన్నాడు. "నేనొక్కత్తెనీ ఎట్లా తాగనండీ ఇంత ఇంట్లో ? మొగం చెల్లదు" అంది ఇందిర. "అయితే అసలు కాఫీ మానెయ్యి. అత్తవారింట అలవాట్లు అబ్బడమే మంచిద" న్నాడు రాధ నవ్వుతూ. ఇందిర రెండురోజులుమాని చూసింది. తలనొప్పితో మూలుగుతూ రోజంతా పక్కమీదే ఉండిపోసాగింది. "వద్దమ్మా, బాధపడకు. ఎప్పటినుంచో ఉన్న అలవాటు ఇట్టే పొమ్మంటే పోతుందేమిటి ? కాని పిల్లలకు మాత్రం అలవాటు చెయ్యకు" అంది వరలక్ష్మి. "పిల్లలు కొస్త కాఫీ తాగుతే ఏమయి పోతుందక్కా. కాఫీ ఖర్చుకూడా పెద్ద లెక్క వెయ్యాలా" అంది ఇందిర. మర్నాడు మళ్లీ యథాప్రకారంగా కాఫీ సేవిస్తూ. అదివిని వరలక్ష్మి మనస్సు కొంచెం చివుక్కుమంది. భార్యద్వారా విని శ్రీహరికూడా బాధ పడ్డాడు. తనకు కూడా కాఫీ ఇవ్వబోతే రాధ తోసెయ్య బోయాడుకాని మళ్ళీ అతనుకూడా భార్యను సంతృప్తి పరచడానికి కాఫీ తాగవలసే వచ్చింది. క్రమంగా అతనూ కాఫీ దాసుడై పోసాగాడు.

కొన్నాళ్లు పోయాక తోడికోడలు వంటచేస్తూంటే తను తింటూ కూర్చోవడం బాగుండలేదను కుందో ఏమో ఒక నాడు ఉదయం ఇందిర తను వంట చేస్తానంది. "నువ్వు చేస్తానంటే వద్దంటానా? కాని అత్తగారికి చాలా ఆచారం. మడిగా చేయాలి మరి" అంది వరలక్ష్మి చిరునవ్వుతో. "మడీగిడీ మాత్రం నాకు చేతకాదక్కా" అని స్పష్టంగా చెప్పేసింది

ఇందిర. ఆవిధంగా తన తప్పు లేదని నిరూపించుకుంది. తనవంట ప్రావీణ్యత చూపించడానికి మధ్యాహ్నమప్పుడు పత్రికలలో చదివిన కొత్త పిండివంటలు చేసి చూపెట్తానంది. అట్లాగే చేయమంది వరలక్ష్మి సంతోషంతో. కాని తాను వంట చేసేందుకు స్టౌ కావాలంది ఇందిర. బొగ్గుల కుంపటితో కానీ, కట్టెల పొయ్యితో కాని వంటచేయడమంటే తనకు చిరాకనీ, వాళ్ల ఇంట్లో తనెప్పుడూ స్టౌమీదే చేసేదాననీ చెప్పింది. "సరే, అయితే మీఆయనతో చెప్పమ్మా" అంది వరలక్ష్మి. ఇందిర చెప్పింది. రాధ కిరోసిన్ కుక్కర్ తెస్తానన్నాడు. అది మంచిది కాదు, అట్టే కాలం మన్నదు, ప్రెషర్ స్టౌవే కావాలంది ఇందిర. రాధా, శ్రీహరీ, వరలక్ష్మిమథన పడ్డారు. చివరికి రాధ ప్రెషర్ స్టౌ ఒకటి కొనుక్కు వచ్చాడు. మధ్యాహ్నం ఇందిర స్టౌ బిగించి, కిరోసిన్ నింపి, పిన్ చేసి, స్పిరిట్‌తో వెలిగించి గాలికొట్టూంటే వరలక్ష్మి, సూరమ్మగారూ ఆశ్చర్యంగా చూస్తూ కూర్చున్నారు. ఏదో మంచి పిండివంట నోట్లో పడ్తుందనే ఆశతో నోరు తెరచుకొని కూర్చున్నారు సూర్యం, బాబులు. ఇందిర చేసిన పిండివంటలు ఒక్కొక్కప్పుడు బాగానే ఉండేవి కాని, ఒక్కొక్కప్పుడు మింగుడు పడక బాధ పెట్టేవి. అది అట్లా ఉంచి ఇందిర చేసే ఈవంట'ఎక్స్‌పెరిమెంట్ల'కి తరచుగా కావలసినవి నెయ్యా, పంచదారా, శెనగపిండీ. వీటికి చాలా డబ్బు అవుతోంది. వరలక్ష్మి పని ఇరకాటంలో పడింది. ఆమెదే ఇంటి పెత్తనం కాబట్టి. రాధ తనకు వచ్చిన

జీతంలో ఏభై రూపాయిలు మాత్రం తనకుంచుకొని మిగిలినది వదినగారి చేతికిస్తాడు. ఏమి చేయాలో పాలుపోక వరలక్ష్మి భర్తను సలహా అడిగింది. శ్రీహరి ఏమి చెప్పగలడు? అతని కసలు తోచలేదు. కాస్త ఉన్న ఇంటి నుంచి వచ్చినదీ, గారాబంగా పెరిగినదీ, అవడం వలన ఇందిరకు డబ్బువిలువ అట్టే తెలిసినట్లు లేదు. ఏమన్నా మెల్లగా చెపుదామంటే ఏమి నొచ్చుకుంటుందో ఏమి రాద్ధాంతం చేస్తుందోనని భయం. పోనీ ఊరుకుందామంటే రాధ ఇచ్చేడబ్బును చాలామించి పోయేటట్లుంది ఇందిర చేసే ఖర్చు. అక్కడికీ పిల్లలకు అజీర్తిగా ఉందనో మరే వంకనో ఇందిర వంటల ప్రయోగాలను ఆపడానికి ప్రయత్నం చేస్తోంది వరలక్ష్మి. ఈ ఖర్చుతగ్గినా మరోఖర్చు పెరుగుతోంది. వీధిలో ఏ అమ్మకం కేక వినిపించినా పిలవకుండా ఊరుకోలేదు ఇందిర. రిబ్బన్లో జాకెట్టు గుడ్డలో ఏదో ఒకటి కొంటూనే ఉంటుంది. ఆమె ఖర్చులకు డబ్బు రాధ కొంచెమే ఇచ్చి, మిగతాది వదినగారి దగ్గర తీసుకోమని చెపుతున్నాడు కాబట్టి డబ్బుకు తోడికోడలు నడగడం ఇందిరకు నామోషీగా ఉంటోంది. ఆమెలో మెల్లగా తిరుగుబాటు లేవసాగింది. వినీ వినిపించనట్లుగా 'నాయింట్లోనే నాకు స్వాతంత్రం లేదు. నేనుత్త చేతగాని దాన్ని, నమ్మదగని దాన్నిగా కనిపిస్తున్నాను ఈ యింట్లో వాళ్ళకి' అని అప్పుడప్పుడనుకుంటూ కుంటోంది. ఇది వరకులా సూర్యాన్నీ, బాబునీ ఎప్పుడు పక్తే అప్పుడు చేర నీయడంలేదు. అప్పుడప్పుడూ " అట్లామీదపడకు, చీర నలిగి పోతుంది " అని కసిరి కొట్టోంది. ఇవన్నీ వింటున్నా వరలక్ష్మి

ఏమీ విననట్లుగా, తోడికోడలు ఎదుట చిరునవ్వుతూనే వ్యవహరిస్తోంది. కాని క్రమంగా చాటు కూడాపోయింది. ఇందిర ఇప్పుడు వరలక్ష్మితో సరిగా మాట్లాడడంలేదు. భోజనానికి రమ్మని రెండుమూడు సార్లు పిలిస్తేకాని లేచి రావడంలేదు. శ్రీహరీ వరలక్ష్మి పెద్ద సమస్యలో పడిపోయారు. రాధకు ఈ కొత్త పరిస్థితి చూచాయగా తెలిసినా ఆక్షేపట్టించుకోవడం లేదు. తన జలసాలేవో, తన సరదాలేవో, అంతే. ఇక సూరమ్మగారు తనకిటువంటి కోడలు దొరికినందుకు గర్వించినా ఆమె అంటే కొంచెం భయపడ్తోంది. దూరంగానే ఉంటోంది.

చివరికి పరిస్థితులు విషమించికలహానికే దారి తీశాయి. ఒక సాయంత్రంఇందిర రిబ్బన్లమ్మే కుర్రవాడిని చూసింది. కొత్త రిబ్బన్లు కనిపించాయి. పిలవకుండా ఉండలేకపోయింది. పిలిచి బేరమాడింది. నాలుగురిబ్బన్లుతీసుకుంది. డబ్బులివ్వడం కోసం వరలక్ష్మిని కేకేసింది. "అక్కా ఒక రూపాయిన్నర ఉంటే ఇయ్యి" అని. వరలక్ష్మి అటు వచ్చింది. ఎంతో సౌమ్యంగానే, కాని ఆలోచించకుండా అనేసింది. "అదేమిటమ్మా, మొన్ననే కదా నువ్వు కొన్ని రిబ్బన్లు తీసుకున్నావు. మళ్ళీ ఇవెందుకు?"

ఇందిర వరలక్ష్మికేసి అదోలా చూస్తూ, "నాకోసమే కాదు. సూర్యానికి కూడా ఉంటాయని కొన్నాను" అంది.

"ఎవరికోసమైతేనేం. ఇన్నెందుకు? ఉన్నవి చాలుకా. ఇప్పుడుడబ్బుకు కూడా ఇబ్బందిగా ఉందాయె" అంది వరలక్ష్మి.

ఇందిర రిబ్బన్లు కుర్రవాడివైపు గిరవాటువేసి "పట్టుకు పోలే అబ్బీ. ఇంకొకసారికొంటాను" అని చివాలున లేచి లోపలికి విసురుగా పోసాగింది. రిబ్బన్లమ్మేకుర్రవాడు తెల్లబోయాడు.

వరలక్ష్మి కొంచెం బాధ పడింది. "బేరం చేసేశావుకదా ఇప్పుడు పొమ్మనడం ఏం బాగుంటుంది? తీసుకో, అనవసరంగా ఇన్నెందుకన్నానుగాని" అంది మెల్లగానే.

ఇందిర రుసరుసలాడుతూ "అక్కర్లేదు. పోనియ్యొ అబ్బీ" అనిచెప్పి "నేనే డబ్బు తగలేసేదానిని మిగతా వాళ్లందరూ జాగ్రత్త తెలిసినవాళ్లు! నేనింకా చిన్నపిల్లని—నాకేం మంచివో తెలుసుకోవడానికి! ఈపెద్దలు చెప్పాలి, నేను వినాలి! వీధిలో వాళ్ళముందుకూడా అవమానపడలసి వస్తోంది ఏమి బ్రతుకు నాది ఛీ! ఛీ!" అనికొంచెం గట్టిగానే సణుగుతోంది తన గదిలోకివెళ్ళి, మంచంమీద పడి.

వరలక్ష్మి ఆ మొగది గుమ్మం దగ్గరకు వెళ్ళి అంది "నేనేమన్నానమ్మా అట్లాకోపం తెచ్చుకుంటావు? నెలాఖరు రోజులు కదా డబ్బు ఇబ్బందిగా ఉంటోంది. ఇప్పుడెందుకీ అనవసరపు—"

"నావే అనవసరపు ఖర్చులు! మీవే సరియైన ఖర్చులు! వెధవ రిబ్బన్లు కొనడానికి కూడా నెలాఖరు రోజులే! డబ్బు ఇబ్బందే! మాసంపాదన తింటూకూడా నాకుచెప్పేవారే!—"

ఈమాట వినేసరికి వరలక్ష్మి మనస్సు చివుక్కుమంది. కొంచెం కోపంకూడా వచ్చింది ఆమెకు. జవాబు చెప్పకుండా ఉండలేకపోయింది. "మీఆయన సంపాదన తినడానికే మేము కాచిపెట్టుకు కూర్చోలేదమ్మా. మీ ఆయన సంపాదన మీదే మేము బతుకుతూండలేదు— అని "ఆమె అంటూంటే రాధ వచ్చాడు. "ఏమిటి వదినా ఏమి జరిగింది?" అని అడిగాడు.

వరలక్ష్మి ఇంకా కోపంమీద ఉన్నా రాధతో ఇందిర మీద చెప్పడానికి జంకింది. "ఏమీ లేదులే, నాయనా" అంటూ వెనక్కి తప్పుకుపోసాగింది.

రాధ వెళ్లి ఇందిర నడిగాడు. ఇందిర మంచంమీదనుంచి విసురుగా లేచి, కళ్ల నీళ్లతో "నన్ను మాపుట్టింటికి పంపించే శెయ్యండి. ఈ అవమానం సహించలేను. నాయింట్లో నేను పరాయి దానినై పోతున్నాను" అని అరవసాగింది.

"ఏం జరిగిందంటే చెప్పవేం? ఎందుకీ గొడవ అంతా?" అని అడిగాడు రాధ కొంచెంగట్టిగా.

"ఏం జరగాలి? నాకింట్లో స్వతంత్రం లేదని ఎప్పుడో తేలిపోయింది

"ఏమిటా మాటలు! నిన్నెవరేమన్నారు?"

"ఎవరేమనాలి! ఆవిడగారే, మీ వదినగారు. అంత పెత్తనం ఆవిడ కప్పగించారుగా. ఆవిడ దయాభిక్షం మీద నేనాధారపడాలిట! –"

రాధకు కోపం వచ్చేసింది. "ఏమిటీ వాగుడు? ఏం జరిగిందంటే చెప్పవేం ఇంతకీ?"

"ఏమిటేముంది? సరదాపడి నాలుగు రిబ్బన్లు కొంటే ఆవిడగారు డబ్బుపాస్ చెయ్యలేదు –"

"నేనివ్వనన్నానా? మొన్ననే రిబ్బన్లు కొన్నావు మళ్లీ వెంటనే కొనకపోతే ఏంపోయింది నెలాఖరు రోజుల్లో కూడాను అన్నాను గాని" అంది వరలక్ష్మి మళ్లీ ఎదరకు వచ్చి.

" అహాఁ ఇప్పుడిలా తియ్యగా చెపుతావు. రిబ్బాన్నవాడి ముందు ఇట్లాంటిమాటలంటే అవమానం కాదూ ? రూపాయి న్నర ఖర్చుకు కూడా నాకు స్వతంత్రం లేదు. అందుకే నన్ను పుట్టింటికి పంపించెయ్య మంటున్నాను ఈ అవమానాల్లో ఒక్క క్షణం ఉండలేను" అంది ఇందిర.

" ఇవి అవమానాలా? " అని అడిగాడు రాధ " చదువు కున్న దానివి ఆమాత్రం తెలియదూ. మీావదిన ఏం తప్పో అంది ? అనవసరపు ఖర్చులెందుకంటే తప్పా ? నాకేం తెలు స్తుంది సంసారం నడిపే వాళ్లకు కానీ అనవసరపు ఖర్చులో కాదో "

" నాకు తెలియదు. సంసారం ఎలా చేయాలో ! నేను చిన్నపిల్లని. ఆవిడే ఆరిందా ! మావాళ్లు ఐదారువేలు ఖర్చు చేసి పెళ్లి చేసింది ఇందుకేనా ? నాకామాత్రం అధికారం లేదూ ? దమ్మిడీ కట్నం లేకుండా, లేనికుటుంబం నుంచి చేసుకున్న వాళ్లు నాకన్న ఎక్కువా ? వాళ్లు చెప్పినట్లు నేను నడుచుకోవాలే ! "

"ఏయ్, నోరుముయ్యి. ఇకముందు ఇట్లాంటి వాగుడు వాగావంటే—వదిన నేమన్నా అన్నావంటే పళ్లురాలగొట్టాను జాగ్రత్త. మావదినకీ నీకూ పోలిక ఏమిటి? ఆమెనుంచి నేర్చుకో వలసిందిపోయి—" అని రాధ కోపం పట్టలేక అంటూవుంటేగా

"నేనేం బానిసను కాను ఒకళ్ళ చేతికింద పడివుండేందుకు నాకీ నంగనాచి వేషాలు చేతకావు—" అంది ఇందిర.

"నోరు మూస్తావా ముయ్యవా" అంటూ మీాటికి వెళ్లాడు రాధ.

వరలక్ష్మి కంగారు పడింది. "ఆగు రాధా, నువ్వూరుకో. తెలియక ఏదో అంటే దానికి కోపం పెట్టుకోకూడదు" అని అంటోంది. ఇంతలో శ్రీహరి వచ్చాడు. వీధిలోనుంచే తమ్ముడి కేకలు విని కంగారు పడి లోపలకు పరుగెత్తుకు వచ్చాడు. ఇందిర మళ్ళీ మంచం మీదపడి ఏడవసాగింది. ఏడుస్తూనే అనసాగింది. నానోరే అందరూ నొక్కుతారు. నా సంసారం నేనే చేసుకొనే అదృష్టం నాకులేదు—"

శ్రీహరి తన భార్య రాధతో ఏదో చెప్పి ఉంటుందనీ, అందుకే రాధ మరదలిమీద కేకలేస్తున్నాడని అభిప్రాయపడి భార్యమీదికి కోపంగా లేచాడు : "నువ్వేనా దీనికి కారణం! ఇన్నేళ్ళు వచ్చాయి ఆమాత్రం జ్ఞానం లేదూ? ఇట్లాంటి కలహాలు తెచ్చుకొని ఏమిటి లాభం?" అన్నాడు.

భర్త మాటలు వినేసరికి వరలక్ష్మికి అభిమానం పొంగి వచ్చింది. కళ్లలో నీళ్ళుబికాయి. చేతుల్లో తల దాచుకొని లోపలికి వెళ్ళిపోయింది. రాధ అన్నగారిని చూసి కొంచెం తగ్గి ఇవతలకు వచ్చేశాడు. ఇందిర ఇంకా ఏడుస్తూనే ఉంది. శ్రీహరి మెల్లగా లోపలకి నడిచి, ఖండువా చొక్కా చిలక కొయ్యకు తగిలించి కాళ్ళు కడుగుకుందుకు స్నానాల, గది లోకి వెళ్ళి వచ్చాడు. శ్రీహరి పడక గదిలో వరలక్ష్మి కూర్చొని కళ్లొత్తుకుంటోంది. శ్రీహరి కొంతసేపు మౌనంగా ఉండి తరువాత మెల్లగా అడిగాడు "అసలు ఏమి జరిగింది?" అని, వరలక్ష్మి తలఎత్తి "మీరుకూడా అట్లా అంటారు అనుకోలేదు" అంటూ వెక్కి పడుతూ జరిగినదంతా చెప్పింది. శ్రీహరి ఒక నిట్టూర్పు విడిచాడు.

ఆరాత్రి చాలాసేపు భార్యాభర్తలు మధనపడ్డారు. మర్నాడు పొద్దున్న భోజనాల దగ్గర వరలక్ష్మి రాధతో అంది. "రాధా మేము వేరు కాపురం పెట్టాయాలనుకుంటున్నాము." రాధ ఉలిక్కిపడ్డాడు. వదినగారి కేసి చూసి "ఏమిటి?" అన్నాడు అర్థం కానట్లు. వరలక్ష్మి మళ్ళీ చెప్పింది. రాధ అన్నగారి కేసి చూసి "అట్లా ఎంత మాత్రం జరగడానికి వీలులేదు, వదినా. ఇందిర ఏదో వాగిందని భయపడి పోతారా? ఈసారి వాగనియ్యి. మళ్ళీ నోరెత్తకుండా చేస్తాను," అన్నాడు.

"కాదు రాధా ఆమె మనస్సు బాధపెట్టి మనం పొందుతునే సుఖం ఏమిటి? తేడాలు రాకుండానే వుండాలి కాని వచ్చినతరువాత ఎప్పుడో అప్పుడు బయటపడుతూనే ఉంటాయి వేరుగా ఉండడమే ఇద్దరికీ మంచిది"

"ఏమైనా సరే మన కాపురాలు వేరు చేయడానికి వీలు లేదు. ఇష్టం లేకపోతే పుట్టింటికి పొమ్మను. నేనేం అడ్డుపెట్టను" అన్నాడు రాధ.

శ్రీహరి మెల్లగా అన్నాడు: "మరదలు తన సంసారం తాను నడుపుకోవాలని కోరుకోవడంలో తప్పేమీలేదు. ప్రతివాళ్ళకు సహజంగా ఉండేకోర్కె. ఆమెను బాధపెట్టడం నాకెంతమాత్రం ఇష్టంలేదు. మేము వెళ్ళిపోక తప్పదు. మేము కోపంతో వెళ్ళదలచుకోవడం లేదు, రాధా. ఇద్దరి కాపురాల మంచి కోసమే ఇట్లా చేస్తున్నాం"

రాధ కొంతసేపు మాట్లాడలేకపోయాడు. తరువాత మళ్ళీ మెల్లగా అన్నాడు. "ఇటువంటి దూబరా మనిషికి సంసా అప్పజెప్పితే నేనేమవుతాను, వదినా?"

"పరవాలేదు. ఏమీగా భయపడనక్కర్లేదు. బాధ్యత నెత్తిమీద పడితే పొదుపు అదేవస్తుంది" అంది వరలక్ష్మి.

ఆ సాయంత్రంనుంచీ శ్రీహరి మళ్ళీ తనకోసం ఇల్లు అన్వేషణం మొదలుపెట్టాడు. అద్దెలుచాలా హెచ్చుగా ఉంటు న్నాయి. ఇంటిగొడవకు అన్నగారు విడిపోతే ఇంతఇల్లు అనవసరం. అద్దెభరించడం కష్టం కాబట్టి అతనుకూడా ఇల్లువెతకసాగాడు. చివరికి పాతికరూపాయిలకొక చిన్నవాటా దొరికింది. శ్రీహరికి రామలింగంగారి యింట్లో తాము వెనక ఉన్నవాటా మళ్ళీ ఖాళీ అయిందని తెలిసింది. రామలింగం గారితో మాట్లాడి వచ్చాడు ఒక్కరెండు రూపాయిలుమాత్రం అద్దెపెంచి ఆవాటా అతని కివ్వడానికి రామలింగంగారు ఒప్పుకున్నారు.

వరలక్ష్మి ఇందిరకు నచ్చచెప్పింది, జరిగిందంతా మరచి పొమ్మని, తమమీద కోపం పెట్టుకోవద్దనీ. "ఆవేళఏదో తెలియని కోపంతో అన్నానుకాని నేను మిమ్మల్ని ఇంట్లోంచి వెళ్లిపొమ్మంటానా. నాకొక్కర్తెకీమాత్రం ఏం తోస్తుంది" అంది ఇందిర . ఆమాట అన్నావు, అదేపదివేలు అనుకొని "మేమూవస్తూ ఉంటాంలే నువ్వూ మాయింటికి వస్తూఉండు" అనిచెప్పి వరలక్ష్మి తను సామాను సర్దే ఏర్పాటులో పడింది. సూరమ్మగారు కూడా పెద్దకొడుకుతోనే ఉంటానంది.

సామాను బండిమీద వేయించుకొని వరలక్ష్మి శ్రీహరి వాళ్లూ మరోబండిమీద రామలింగంగారి ఇంటికి చేరారు. రామలింగంగారు," వాటా శుభ్రం చేయించి, కడిగించి, తలుపులు తీసి పెట్టాము," అని చెప్పారు. బండివాడిని

సామాను ఒక్కటొక్కటే పట్టుకు రమ్మని చెప్పి శ్రీహరీ వరలక్ష్మి వెనకవైపుకు నడిచారు. పక్క రేవుల పెడ్డులో బిల్లు కలెక్టరు పోయిన తరువాత ప్రవేశించినవారే ఉన్నారు. వెనకవైపు వాటాల్లో ప్లీడరు గుమాస్తామాత్రం ఉన్నాడుకాని రామకృష్ణమూర్తి మరోపెద్ద ఇంట్లోకి మారి పోయాడుట. మరెవరో ఆయన ఉన్న వాటాలో ప్రవేశించారు. శ్రీహరీ వరలక్ష్మి తమ వాటాలోకి మళ్లీ మన ఇంటికే మనం వచ్చామనే ధోరణిలో – త్వరగా నడిచారు. ఎదరగదిలోకి ప్రవేశించి నలు మూలలా ఒకసారి కలయజూశారు. ఒక్కసారిగా శ్రీహరి మనస్సులో ఏవో స్మృతులు మెలిగాయి. కళ్లనీళ్లునిలిచాయి. భార్య వైపుకుతిరిగాడు. ఆమె కొంగు మొగానికడ్డంపెట్టుకొని ఏడ్పులో కరిగిపోయింది. "సామాను పట్టుకొచ్చానయ్యగారు, ఎక్కడ పెట్టమంటారు?" అన్నాడు బండివాడు వచ్చి. శ్రీహరీ వరలక్ష్మి గబుక్కున కళ్లు తుడుచుకొని "ఇట్లా పట్టుకురా" అన్నారు.

సమాప్తం

క్షమించాలి, అచ్చుతప్పులు దొర్లాయి. అర్థంచెడేవి క్రిందివిధంగా సవరించుకోవాలి.

మిగిలినవి (ఇక్కడ ఇవ్వలేదు) సందర్భంబట్టి సవరించుకోవచ్చు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 14 వ | పేజీ | 8 వ | లైనులో | ఎంతమంచివారు | అని ఉండాలి |
| 81 | ,, | 20 | | పుస్తకం తెరవండి | ,, |
| 98 | ,, | 16 | ,, | ముందు భార్యను | ,, |
| 101 | ,, | 9 | ,, | ఈనెల నాకుకూడా | |
| 104 | ,, | 18 | | "అమ్మాయి బాగుంటుందా | ,, |
| 127 | ,, | 16 | | మహిషీమహిషాల | ,, |
| 171 | ,, | 1 | | ప్రయత్నిస్తానులే | ,, |
| 185 | ,, | 2 | | సన్నిహితం | ,, |
| 197 | ,, | 7 | | పిల్చుకున్నారు | ,, |
| 212 | ,, | 15 | | ఆలస్యంగా | ,, |
| 213 | ,, | 2 | | వంతంగా | ,, |
| 229 | ,, | 15 | ,, | పి. డబ్ల్యు. డి | |
| 243 | ,, | 7 | ,, | సాగుతోందా | ,, |
| 271 | ,, | 6 | | తోటల్లో చదువుకొని తిరిగి వస్తున్న స్నేహితులు కనిపించారు. 'ఏరోయిరాధా... | ,, |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 285 వ | పేజీ | 7 వ | లైనులో | వంతులుకాని ప్రేమపెళ్లిళ్లను | ,, |
| 293 | ,, | 11 | ,, | చెప్పుకుంటే | ,, |
| 302 | ,, | 14 | ,, | రామకృష్ణమూర్తిని | ,, |
| 323 | ,, | 18 | ,, | నంబరు | ,, |
| 342 | ,, | 7 | ,, | మా వదిన | ,, |
| 342 | ,, | 8 | ,, | నీకేం | ,, |
| 344 | ,, | 24 | ,, | సంసారం | ,, |